ఓమ్ పరబ్రహ్మణేనమః

శ్రీ మదష్టాదశ పురాణాంతర్భూతంబగు



## శ్రీ స్కాంద పురాణాంతర్గత

# వైశాఖపురాణము.

ఈ గ్రంథము

కీ॥ శే॥ నా తండ్రిగారైన

చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి గారిచే

వ్రాయంబడి.

వారి ప్రథమ కుమారుడు

సుబ్బరాయశాస్త్రిచే

స్వకీయ

శ్రీ లక్ష్మీనరసింహ ముద్రాక్షరశాల యందు

ముద్రింపించి ప్రకటింపబడియె.

మచిలీపట్టణము.

తృతీయ ముద్రణము 750 ప్రతులు

 దీనివెల రు. 5-0-0

◆ గ్రంథము ప్రారంభించునప్పుడు పఠించదగినవి. ◆

శ్లో॥ యత్ర యోగీశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయోభూతి ర్ధ్రువానీతిమతిర్మమ॥
శ్లో॥ యస్మిన్నామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా ।
తయోస్సంస్మరణాత్పుంసాం సర్వతోజయమంగళమ్॥
శ్లో॥ లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః ।
యేషామిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః ॥
శ్లో॥ అగ్రతఃపృష్ఠతశ్చైవ పార్శ్వతశ్చ మహాబలౌ ।
ఆకర్ణపూర్ణ ధన్వానౌ రక్షేతాం రామలక్ష్మణౌ॥
శ్లో॥ సన్నద్ధః కవచీ ఖడ్గీ చాప బాణధరో యువా ।
గచ్ఛన్మమాగ్రతో నిత్యం రామఃపాతు సలక్ష్మణః॥

---

◆ పురాణమును దర్శించునపుడు పఠించునది ◆

శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం ।
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్॥
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం ।
వందేవిష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్॥

---

◆ పురాణములో పంక్తిని చూచునప్పుడు పఠించునది ◆

శ్లో॥ వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం।
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాంపతిం ।
వందే సూర్యశశాంకవహ్నినయనం వందే ముకుందప్రియం ।
వందే భక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరం॥

---

◆ పురాణము ప్రారంభించునప్పుడు పఠించునది ◆

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే ।

యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం।
విఘ్నం విఘ్నంతి సతతం విష్వక్సేనంతమాశ్రయే ।

---

♦ అక్షరపంక్తులను చూచునప్పుడు పఠించునది ♦

శ్లో॥ అగజానన పద్మార్కం గజాననమహర్నిశం ।
అనేకదంతంభక్తానా మేకదంతముపాస్మహే॥

♦ నూతనకథ ప్రారంభించునపుడు పఠించునది ♦

శ్లో॥ ఉల్లాసపల్లవితపాలిత సప్తలోకీ
నిర్వాహకోరకిత నేమకటాక్షలీలాం ।
శ్రీరంగ హర్మ్యతల మంగళదీపరేఖాం ।
శ్రీరంగరాజ మహిషీం శ్రియమాశ్రయామః ॥

శ్లో॥ వందేలక్ష్మీం పరశివమయీం శుద్ధజాంబూనదాభాం ।
తేజోరూపాం కనకవసనాం స్వర్ణభూషోజ్జ్వలాంగీం ।
బీజాపూరం కనకకలశం హేమపద్మం దధానా ।
మాద్యాంశక్తిం సకలజననీం విష్ణువామాంక సంస్థానమ్॥

---

♦ తుమ్ము సంభవించునప్పుడు పఠించునది ♦

శ్లో॥ ఓంకార పంజరశుకీ ముపనిషదుద్యాన కేళికలకంఠీం ।
ఆగమవిపినమయూరీ మార్యా మంతర్విభావయే గౌరీమ్॥

పురాణశ్రవణంబున రోదనము వినునప్పుడు పఠించునది

శ్లో॥ కుంకుమాంకితవర్ణాయ కుందేందుధవళాయచ ।
విష్ణువాహనమస్తుభ్యం పక్షిరాజాయతే నమః॥

---

♦ పిడుగుపడునప్పుడు పఠించునది ♦

శ్లో॥ అర్జునః ఫల్గునః పార్థః కిరీటీ శ్వేతవాహనః ।
భీభత్సుర్విజయః కృష్ణ సవ్యసాచీ ధనంజయః ॥

◆ సూర్యదర్శనము లేనప్పుడు పఠించునది ◆

శ్లో॥ బ్రహ్మస్వరూపముదయే మధ్యాహ్నేతు మహేశ్వరం ।
సాయంధ్యాయే త్సదావిష్ణుం త్రిమూర్తించ దివాకరమ్॥

◆ రాత్రిపూట పురాణము ప్రారంభించునపుడు పఠించునది ◆

శ్లో॥ దీపంజ్యోతిః పరబ్రహ్మ దీపస్సర్వతమోపహః ।
దీపేనసాధ్యతే సర్వం సంధ్యాదీపం నమోఽస్తుతే ॥

◆ ప్రత్యహం గ్రంథము ముగించునపుడు పఠించునది ◆

శ్లో॥ రామస్కందం హనూమంతం వైనతేయం వృకోదరం ।
శయనే యస్స్మరేన్నిత్యం దుస్స్వప్న స్తస్యనశ్యతి॥

◆ పురాణకోశము దాచునప్పుడు పఠించునది ◆

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే ।
అగ్రతశ్శివరూపాయ వృక్షరాజాయ తే నమః॥

◆ పురాణమునందుంచు తులసిమాలను గ్రహించునపుడు పఠించునది ◆

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతాః ।
యదగ్రే సర్వవేదాశ్చ తులసీంత్వాం నమామ్యహమ్ ।

◆ ప్రసాదం స్వీకరించునప్పుడు పఠించునది ◆

శ్లో॥ అగస్త్యం కుంభకర్ణంచ శమ్యంచ బడబానలం ।
ఆహారపరిణామార్థం స్మరామిచ వృకోదరమ్॥

◆ నివేదన తాంబూలము భక్షించునపుడు పఠించునది ◆

శ్లో॥ ధన్వంత్రిణం గరుత్మంతం ఫణిరాజంచ కౌస్తుభం ।
అచ్యుతం చామృతం చంద్రం స్మరేనౌషధకర్మణి॥

◆ తీర్థము స్వీకరించునపుడు పఠించునది ◆

శ్లో॥ శరీరేజర్ఝరీభూతే వ్యాధిగ్రస్తే కళేబరే ।
ఔషధం జాహ్నవీ తోయం వైద్యో నారాయణో హరిః॥



శ్రీ స్కాంద పురాణాంతర్గత

# వైశాఖ మాహాత్మ్యం.

ఓమ్,

పరబ్రహ్మణే నమః.

శ్రీ గణాధిపతయేనమః.

ప్రథమోఽధ్యాయః ప్రారంభః

సూతః॥ శ్లో॥ భూయోర్యంగభువంరాజా బ్రహ్మణః పరమేష్ఠినః ।
పుణ్యంమాధవమాహాత్మ్యం నారద పర్యపృచ్ఛత ॥

తా॥ సూతమహాముని చెప్పుచున్నాఁడు. సృష్టికర్తయగు బ్రహ్మయొక్క మానసపుత్త్రుండగు నారదమహామునివలన అంబరీషమహారాజు అనేకధర్మములను విని తిరిగి పుణ్యకరమైన వైశాఖమహాత్మ్యమునుగురించి నారదమునీశ్వరు నడిగెను.

అంబరీషః॥ శ్లో॥ సర్వేషామపిమాసానాం త్వత్తోమాహాత్మ్యమంజసా॥
శ్రుతంమయాపురాబ్రహ్మన్ యథాచోక్తంతథాప్యయా॥ ౨

తా॥ అంబరీష మహారాజు అడుగుచున్నాడు. ఓనారదా! మీరు చైత్రము మొదలగు పండ్రెండు మాసముల మాహాత్మ్యమును బాగుగా జెప్పితిరి గాన నేను శ్రద్ధతో వింటిని.

శ్లో॥ వైశాఖః ప్రవరోమాసో మాసేష్వే తేషునిశ్చితం ।
ఇతితస్మాద్విస్తరేణ మహాత్మ్యంమాధవస్యచ । 3
శ్రోతుంకౌతూహలంబ్రహ్మన్ కథంవిష్ణుప్రియోహ్యసౌ ।
కేచవిష్ణుప్రియాధర్మా మాసేమాధవవల్లభే । ౪

తా॥ పండ్రెండు మాసములలో వైశాఖమాసము శ్రేష్ఠమైనదిగా నిశ్చయించు కొంటినిగాన యీవైశాఖమాసముయొక్క మాహాత్మ్యమును వినుటకు కుతూహలము

గలవాడనైయున్నాను. కాబట్టి యోనారదా! ఈవైశాఖమాస మెట్లు విష్ణువునకు ప్రీతికరమైనది? వైశాఖమాసములో విష్ణుప్రీతికరములగు జేయవలసిన ధర్మములెవ్వి?

శ్లో॥ తత్రాప్యస్యతుకర్తవ్యాః కేధర్మావిష్ణువల్లభాః ।
కిందానం కింఫలంతస్య కిముద్దిశ్యాచరేదిమాన్ ॥ ౫
కైర్ద్రవ్యైః పూజనీయోఽసౌ మాధవోమాధవాగమే ।
ఏతన్మేవదవిస్తార్య మహ్యంశ్రద్ధావతేవద ॥ ౬

తా॥ వానిలో ముఖ్యముగా విష్ణుప్రీతికరములగు ధర్మములేవి? ఏమిదానము చేయవలయును? ఏమి ఫలము సంభవించును? విష్ణునిగురించి యేయేధర్మముల నేయు ద్రవ్యములతో జేయవలయును? వైశాఖమాసము రాగానే విష్ణుగూర్చి నేయేవస్తువు లతోఁ బూజించవలయును? ఓనారదా! దీనినంతయును వినుటకొఱకు మిక్కిలి శ్రద్ధగలవాడనై యున్నాను. కాబట్టి సవిస్తారముగా జెప్పుమని యంబరీష మహారాజు నారదముని నడిగెను.

నారదః॥ శ్లో॥ మయాపృష్టః పురాబ్రహ్మా మాసధర్మాన్పురాతనాన్ ।
వ్యాజహారపురాప్రోక్తం యచ్ఛ్రియైవరమాత్మనా ॥ ౭

తా॥ నారదమునీశ్వరుఁడు చెప్పుచున్నాఁడు. ఓయంబరీషమహారాజా! రహస్యములగు మాసధర్మములనుగురించి పూర్వమందు బ్రహ్మనడుగగా లక్ష్మీదేవికి విష్ణుమూర్తి చెప్పినట్లుగా బ్రహ్మ నాతోజెప్పెనుగాన దానినే చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ తతోమాసావిశిష్టోక్తాః కార్తికోమాఘఏవచ ।
మాధవస్తేషువైశాఖం మాసానాముత్తమంవ్యధాత్ ॥ ౮

తా॥ మాసములలో కార్తీకము, మాఘము, వైశాఖము శ్రేష్ఠములుగా జెప్పఁబడినవి. వానిలో వైశాఖమాసము మిక్కిలి శ్రేష్ఠమైనదిగా జెప్పఁబడెను.

శ్లో॥ మాతేవసర్వజీవానాం సదైవేష్టప్రదాయకః ।
దానయజ్ఞవ్రతస్నానైస్సర్వపాపవినాశనః ॥ ౯

తా॥ వైశాఖమాసములలోఁ జేయఁబడిన దానములు, యజ్ఞములు, వ్రతములు స్నానములు మొదలగువన్నియు సమస్తపాపములను నశింపఁజేయును. కాబట్టి యీవైశాఖమాసము సమస్తజీవులకు తల్లివలెనే యిష్టముల నొసంగుచుండును.

శ్లో॥ ధర్మయజ్ఞఃక్రియాసార స్తపస్సారస్సురార్చితః ।
విద్యానాంవేదవిద్యేవ మంత్రాణాంప్రణవోయథా ॥ ౧౦

తా॥ ఈవైశాఖమాసము సమస్తధర్మములగాను, యజ్ఞస్వరూపములగాను, క్రియలలో శ్రేష్ఠమైనదిగాను, శ్రేష్ఠమైన తపస్సుగాను, దేవతలచే పూజింపఁబడునది గాన చెప్పఁబడియె. మఱియు విద్యలలో వేదమువలెను, మంత్రములలో నోంకారమువలెను చెప్పఁబడియె.

శ్లో॥ భూరుహాణాంసురతరుర్ధేనూనాం కామధేనువత్ ।
శేషవత్సర్వనాగానాం పక్షిణాంగరుడోయథా ॥ ౧౧

తా॥ వృక్షములలో కల్పవృక్షమువలెను, ఆవులలో కామధేనువువలెను, సర్పములలో నాదిశేషువువలెను, పక్షులలో గరుత్మంతుడువలెను, శ్రేష్ఠముగా చెప్పఁబడెను.

శ్లో॥ దేవానాంతుయథావిష్ణు ర్వర్ణానాంబ్రాహ్మణోయథా ।
ప్రాణవత్ప్రియవస్తూనాం భార్యేవసుహృదాంయథా॥ ౧౨

తా॥ దేవతలలో విష్ణువుగాను, వర్ణములలో బ్రాహ్మణుఁడుగాను, యిష్టము గల వస్తువులలో ప్రాణమువలెను. స్నేహితులలో భార్యవలెను చెప్పఁబడియెను.

శ్లో॥ ఆపగానాం యథాగంగా తేజసాంతు రవిర్యథా ।
ఆయుధానాంయథాచక్రం ధాతూనాంకాంచనంయథా॥ ౧౩

తా॥ నదులలో గంగవలెను, తేజస్సులలో సూర్యునివలెను, ఆయుధములలో చక్రమువలెను, లోహములలో బంగారమువలెను చెప్పఁబడెను.

శ్లో॥ వైష్ణవానాం యథారుద్రో రత్నానాం కౌస్తుభోయథా ।
మాసానాం ధర్మహేతూనాం వైశాఖశ్చోత్తమస్తథా॥ ౧౪

తా॥ విష్ణుభక్తులలో సాంబమూర్తియు, మణులలో కౌస్తుభమణియు నెట్లు అధికమైనవో అప్రకారమే ధర్మమునకు కారణమైన మాసములలో వైశాఖమాసము శ్రేష్ఠమైనదిగా చెప్పఁబడియెను.

శ్లో॥ నానేనసదృశోలోకే విష్ణుప్రీతివిధాయకః ।
వైశాఖస్నాననిరతే మేషేప్రాగర్యమోదయాత్ ॥ ౧౫

తా॥ మేషసంక్రమణముతోఁగూడిన వైశాఖమాసమునందు సూర్యోదయమునకు ముందుగా స్నానము జేసినయెడల దీనితో సమానమైన విష్ణుప్రీతికరమైన ధర్మము వేరొకటిలేదు.

శ్లో॥ లక్ష్మీసహాయోభగవాన్ప్రీంతింతస్మిన్కరోత్యలం ।
జంతూనాం ప్రీణనంయద్వదన్నేనైవహిజాయతే॥ ౧౬

తా॥ లక్ష్మీదేవికి ప్రాణనాథుండగు విష్ణుమూర్తి వైశాఖస్నానమను ధర్మము నందభిలాషకలవాఁడు కాఁబట్టి యన్నదానముచే భూతములు తృప్తినొందునట్లు వైశాఖస్నానముచే భగవంతుఁడు సంతోషించును.

శ్లో॥ తద్వద్వైశాఖస్నానేన విష్ణుఃప్రీణాత్యసంశయః ।
వైశాఖస్నాననిరతాన్జనాన్ దృష్ట్వానుమోదతే॥ ౧౭

తా॥ వైశాఖస్నానము విష్ణుప్రీతికరముగావున వైశాఖస్నానమందాసక్తిగల జనుల ననుగ్రహించును సందేహములేదు. స్నానాసక్తుఁడే జ్ఞానాసక్తుఁడు.

శ్లో॥ తావతాపివిముక్తోఽఘైర్విష్ణులోకేమహీయతే ।
సకృత్స్నాత్వామేషసంస్థే సూర్యేప్రాతఃకృతాహ్నికః ।
మహాపాపైర్విముక్తోఽసౌ విష్ణోస్సాయుజ్యమాప్నుయాత్ ॥

తా॥ విష్ణుమూర్తి యనుగ్రహించిన మాత్రముననే పాపములవలన విడువఁబడినవాఁడై విష్ణులోకమునందు నివసించును. మఱియు సూర్యుఁడు మేషరాశియందుండఁగా ప్రాతఃకాలమునం దొక్కసారి స్నానముజేసి సంధ్యావందనాది క్రియలఁజేసినయెడల విశేషపాపములవలన విడువఁబడినవాఁడై విష్ణువునం దైక్యము జెందును.

శ్లో॥ స్నానార్థంమాసివైశాఖే పాదమేకంచరేద్యది ।
సోఽశ్వమేధాయుతానాంచ ఫలంప్రాప్నోత్యసంశయః॥ ౧౯

తా॥ వైశాఖమాసములో నాల్గవవంతు దినములలోనయినను స్నానముజేసినయెడల పదివేల అశ్వమేధములను జేసిన ఫలము లభించును. సందేహములేదు.

శ్లో॥ అథవాకూటచిత్తస్తు కుర్యాత్సంకల్పమాత్రకం ॥
సోఽపిక్రతుశతంపుణ్యం లభేదేవనసంశయః । ౨౦

తా॥ మఱియు స్నానముజేయుటకు శక్తిలేనియెడల స్థిరచిత్తుఁడై మనస్సునందు సంకల్పముజేసినట్టి మనుష్యుఁడును నూఱు యజ్ఞములనుజేసిన పుణ్యమును బొందును. సందేహములేదు.

శ్లో॥ యోగచ్ఛేద్ధనురాయామం స్నాతుంమేషగతేరవౌ ।
సర్వబంధవినిర్ముక్తో విష్ణోస్సాయుజ్యమాప్నుయాత్ ॥ ౨౧

తా॥ సూర్యుఁడు వైశాఖమాసములో మేషరాశియందుండఁగా నెవఁడు స్నానము జేయుటకొఱకు నొక ధనువు ప్రమాణము కలిగినంతదూరము నేగుచెంచునో వాఁడు సమస్తబంధములవలనను విడువఁబడి విష్ణుమూర్తియం దైక్యము నొందును.

శ్లో॥ త్రైలోక్యేయానితీర్థాని బ్రహ్మాండాంతర్గతానిచ ।
తానిసర్వాణిరాజేంద్ర సంతిబాహ్యేఽల్పకేజలే॥ ౨౨

తా॥ ఓయంబరీషమహారాజా! స్వర్గ మర్త్య పాతాళలోకములయం దేయే తీర్థములుగలవో, మఱియు బ్రహ్మాండమం దెక్కడనైన నేయేతీర్థములుగలవో, అవియన్నియు వెలుపలనుండు జలములయం దాసన్నమై యుండును. అనఁగా తటాకము, కాలువ మొదలగు వానియందుండు జలములయం దాసన్నమై యుండును.

శ్లో॥ తావల్లిఖితపాపాని గర్జంతియమశాసనాత్ ।
యావన్నకురుతేజంతు ర్వైశాఖస్నానమంభసి॥ ౨౩

తా॥ మనుష్యుఁడు వైశాఖమాసములో నెంతపర్యంతము చెఱువులు మొదలగు వానియందుండు నీటిలో స్నానము జేయఁడో అంతపర్యంతము యముని యాజ్ఞప్రకారము వానియొక్క పాపములు మొఱబెట్టుచుండును.

శ్లో॥ తీర్థాధిదేవతాస్సర్వా వైశాఖేమాసిభూమిప ।
బహిర్జలంసమాశ్రిత్య సదాసన్నిహితానృప॥ ౨౪

తా॥ ఓరాజా! తీర్థములకు నధిదేవతలగు దేవతలందఱు వైశాఖమాసమునందు తటాకాదులలోనుండు జలముల నాశ్రయించి యెల్లప్పుడు సన్నిహితులైయుందురు.

శ్లో॥ సూర్యోదయంసమారభ్య యావత్ షడ్ఘటికావధి ।
తిష్ఠంచాజ్ఞయావిష్ణో ర్నరాణాంహితకామ్యయా॥ ౨౫

తా॥ సూర్యోదయము మొదలాఱుఘడియల పర్యంతము మనుష్యులయొక్క మేలుకొఱకు విష్ణుమూర్తియొక్క యాజ్ఞప్రకారముగా దేవతలందఱు బాహ్యమందుండు జలముల నాశ్రయించి యుందురు.

శ్లో॥ తావన్నాగచ్ఛతాంపుంసాం శాపందత్వాసుదారుణం ।
స్వస్థానంయాంతిరాజేంద్ర తస్మాత్స్నానంసమాచరేత్॥ ౨౬

తా॥ ఓరాజా! వైశాఖమాసములో నాఱుఘడియలపర్యంతము నెవఁడు స్నానము జేయుటకు రాకపోవునో వానికి తీర్థాధిదేవతలు శాపంబిచ్చి స్వస్థానములకు

వెళ్ళును. కాఁబట్టి వైశాఖమాసములో ప్రాతఃకాలమందు ముఖ్యముగా స్నానము జేయవలయును.

ఇతి నారదాంబరీష సంవాదో ప్రథమోఽధ్యాయ సమాప్తః.

## అథ ద్వితీయోఽధ్యాయః.

నారదః॥ శ్లో॥ నమాధవసమోమాసో నకృతేనసమంయుగం ।
నచవేదసమంశాస్త్రం నతీర్థంగంగయాసమమ్॥ ౧

తా॥ నారదుఁడు చెప్పుచున్నాఁడు. వైశాఖమాసముతో సమానమైన మాసము. కృతయుగముతో సమానమైన యుగము వేదముతో సమానమైన శాస్త్రము. గంగతో సమానమైన తీర్థవిశేషము లేదు.

శ్లో॥ నజలేనసమందానం నసుఖంభార్యయాసమం ।
నకృషేస్తుసమంవిత్తం నలాభోజీవితాత్పరః ॥ ౨

తా॥ జలదానముతో సమానమైన దానము. భార్యవలనగలుగు సుఖముతో సమానమైన సుఖము. వ్యసాయమువలన గలిగెడు ధనముతో సమానమైన ధనము, జీవించుటకంటె నితరమైన లాభము లేదు.

శ్లో॥ నతపోఽనశనాత్తుల్యం నదానాత్పరమంసుఖం ।
నధర్మస్తుదయాతుల్యో నజ్యోతిశ్చక్షుషాసమమ్॥ 3

తా॥ ఉపవాసముతో సమానమైన తపస్సు, దానముకంటె నితరమగు సుఖము దయతో సమానమైన ధర్మము నేత్రములతో సమానమైన కాంతియు లేదు.

శ్లో॥ నతృప్తిరశనాత్తుల్యా నవాణిజ్యంకృషేస్సమం ।
నధర్మేణసమంమిత్రం నసత్యేనసమంయశః ॥ ౪

తా॥ భోజనతృప్తితో సమానమైన తృప్తియు వ్యసాయముతో సమానమైన వర్తకము, ధర్మముతో సమానమైన స్నేహితుఁడు, సత్యముతో సమానమైన కీర్తియు మఱియొకటి లేదు.

శ్లో॥ నారోగ్యసమముత్తానం నత్రాతాకేశవాత్పరః ।
నమాధవసమంలోకే పవిత్రంకవయోవిదుః ॥ ౫

తా॥ ఆరోగ్యముతో సమానమైన శరీరస్థితియు, విష్ణుమూర్తితో సమానమైన మఱియొక రక్షకుఁడు వైశాఖమాసముతో సమానమగు పవిత్రకరమైన మఱియొక మాసము లేదని కవీశ్వరులు చెప్పిరి.

శ్లో॥ మాధవఃపరమోమాసో శేషశాయిప్రియస్సదా ।
అవ్రతేనక్షిపేద్యస్తు మాసంమాధవవల్లభమ్ ।
తిర్యగ్యోనింసయాత్యాశు సర్వధర్మబహిష్కృతః॥ ౭

తా॥ ఈవైశాఖమాసము ఎల్లప్పుడు విష్ణుమూర్తికి ప్రియకరమైనది. కాబట్టి విష్ణుప్రీతికరమైన వైశాఖమాసమును వ్రతశూన్యముగా నెవఁడు వెళ్ళబుచ్చునో అట్టిపురుషుఁడు సమస్తధర్మములనుండి బహిష్కారము చేయఁబడినఁవాడై శీఘ్రముగా పశుజన్మంబెత్తును.

శ్లో॥ అవ్రతేనగతోయేషాం మాధవోమర్త్యధర్మిణాం ।
ఇష్టాపూర్త్యైవృధా తేషాం ధర్మోధర్మభృతాంవర॥ ౮

తా॥ ధర్మముచేయువారలలో శ్రేష్ఠుండవగు నో యంబరీషా! మనుష్యజన్మం బెత్తిన యేనరులు వైశాఖమాసమును వ్రతశూన్యముగా గడుపుచున్నారో అట్టివారు చేసిన యజ్ఞాది ధర్మములు వ్యర్థమగును.

శ్లో॥ పృవృత్తానాంతుభక్ష్యాణాం మాధవేనియమేకృతే ।
అవశ్యంవిష్ణుసాయుజ్యం ప్రాప్నోత్యేవనసంశయః ॥ ౯

తా॥ వైశాఖమాస వ్రతమును జేయుచున్నప్పుడు భుజించిన ఫలములు మొదలగువానికిగూడ ముఖ్యముగా విష్ణుసాయుజ్యము సంభవించును. సందేహము లేదు.

శ్లో॥ సతీహబహువిత్తాని వత్తానివివిధానిచ ।
దేహేయాసకరాణ్యేవ పునర్జన్మప్రదానిచ ।
వైశాఖస్నానమాత్రేణ నపునర్జాయతేభువి॥ ౧౦

తా॥ ఈలోకములో ననేకధనంబు లనేక చరిత్రములు కలవుగాని యవియన్నియు మఱల జన్మమును కలుగజేసి శరీరమునకు కష్టమనొసంగునవియై యున్నవి. కాఁబట్టి వైశాఖమాసములో ప్రాతఃకాలమందు స్నానము జేసినయెడల తిఱిగి భూలోకమునందు జన్మింపఁడు.

శ్లో॥ సర్వదానేషుయత్పుణ్యం సర్వతీర్థేషుయత్ఫలం ।
తత్ఫలంసమవాప్నోతి మాధవేజలదానతః ॥ ౧౧

తా॥ సమస్త దానములయందు నేపుణ్యముకలదో, గంగాది సమస్తతీర్థముల యందు నేఫలముకలదో అటువంటిఫలము వైశాఖమాసములో జలదానము జేసిన యెడల లభించును.

శ్లో॥ జలదానాసమర్థేన పరశ్యాపిప్రభోధసం ।
కర్తవ్యంభూతికామేన సర్వదానాధికంహితత్ ॥ ౧౨

తా॥ పుణ్యమనే యైశ్వర్యము పొంద నిశ్చయించినవాఁడై తాను జలదానము జేయుటకు సమర్థుఁడు కానియెడల అట్టి సమర్థుండగువాని నెవ్వనినయినను ప్రోత్సాహపఱచి చేయించవలయును. ఏల ననఁగా జలదానము అన్ని దానములలో శ్రేష్ఠంబై యున్నది.

శ్లో॥ ఏకతస్సర్వదానాని జలదానంహిచైకతః ।
తులామారోపితంపూర్వం జలదానంవిశిష్యతే॥ ౧౩

తా॥ పూర్వమందు త్రాసులో నొకప్రక్కను జలదానమును, మఱియొక ప్రక్కను ఇతరమైన సమస్తదానముల నుంచి తూచగా జలదానమే యెగ్గుగానుండెను.

శ్లో॥ మార్గేఽధ్వగానాంయోమర్త్యః ప్రపాదానంకరోతిహి ।
సంకోటికులముద్ధృత్య విష్ణులోకేమహీయతే॥ ౧౪

తా॥ అనేక బాటసారులు నడుచుచుండెడి మార్గమధ్యమునందు చలివేంద్రి నేర్పరచి వైశాఖమాసములో నెవఁడు జలము నిచ్చుచున్నాఁడో అట్టి సత్పురుషుఁడు తన వంశమునందు జనియించిన కోటితరములవారైనను నరకలోకములయం దున్నను విష్ణులోకమునకు వెళ్ళుదురు.

శ్లో॥ దేవానాంచపితౄణాంచ ఋషీణాంరాజసత్తమ ।
అత్యంతప్రీతిదంసత్యం ప్రపాదానం నసంశయః ॥ ౧౫

తా॥ ఓరాజశ్రేష్ఠుఁడా! చలివేంద్ర నేర్పఱచి జలదానముచేయుట దేవతలకు పితృదేవతలకు మునీశ్వరులకు మిక్కిలి సంతోషకరమై యున్నది. సత్యము. సందేహము లేదు.

శ్లో॥ ప్రపాదానేనసంతుష్టా యేనాధ్వశ్రమకర్శితాః ।
తోషితాస్తేనదేవాశ్చ బ్రహ్మవిష్ణుశివాదయః ॥ ౧౬

తా॥ మార్గాయాసము జెంది వచ్చినవారిని జలదానముచే తృప్తినొందించిన యెడల బ్రహ్మ, విష్ణువు, శివుఁడు మొదలగు సమస్తదేవతలు తృప్తినొందినవారగుదురు.

శ్లో॥ సలిలంసలిలాకాంక్షీ ఛాయాంఛాయానుపీచ్ఛతి ।
వ్యజనంవ్యజనాకాంక్షీ వైశాఖేమాసిభూమిప ।
జలంఛత్రించవ్యజనం దానంయేషాంవిష్యతే ॥ ౧౭

తా॥ ఓరాజా! జలమునం దభిలాషగలవాఁడు జలమును కోరును. నీడయం దభిలాషగలవాఁడు నీడను గోరును. విసనకఱ్ఱయం దభిలాషగలవాఁడు విసనకఱ్ఱను గోరును. కాఁబట్టి వైశాఖమాసములో జలము, గొడుగు, విసనకఱ్ఱ మొదలగు వానిలో నెవఁడు దేనిని కోరితే దాని నియ్యవలయును.

శ్లో॥ మాధవేమాసిసంప్రాప్తే బ్రాహ్మణాయకుటుంబినే ।
అదత్వోదకకుంభంచ చాతకోభువిజాయతే॥ ౧౮

తా॥ వైశాఖమాసము వచ్చినదగుచునుండఁగా కుటుంబవంతుఁడగు బ్రాహ్మణునకు నెవఁడు జలముతో నిండింపఁబడిన కలశమును దానముజేయఁడో అట్టివాఁడు భూమియందు చాతకపక్షిగా జనియించును,

శ్లో॥ యోదద్యాచ్ఛీతలంతోయం తృషార్తాయమహాత్మనే । ౧౯
తావన్మాత్రేణరాజేంద్ర రాజసూయాయుతంలభేత్॥

తా॥ ఎవఁడు దప్పిగకలిగిన మహానుభావునకు చల్లనైనజలము నిచ్చుచున్నాడో ఓరాజశ్రేష్ఠుడా! అట్టి మనుష్యుఁ డంతమాత్రముననే యనేక రాజసూయములను జేసినంత ఫలమును బొందును.

శ్లో॥ ఘర్మశ్రమార్తవిప్రాయ వీజయేద్వ్యజనేనయః ।
తావన్మాత్రేణనిష్పాపో విహగాధిపతిర్భవేత్॥ ౨౦

తా॥ ఎవఁడు గ్రీష్మముచే తపింపఁబడి యలసిన బ్రాహ్మణునకు విసనకఱ్ఱచే వీచునో వాఁడు అంతమాత్రముననే పాపరహితుఁడై గరుత్మంతునిస్వరూపము ధరించి త్రిలోకసంచారియగును.

శ్లో॥ అదత్వావ్యజనం భూప వైశాఖేతు ద్విజాతయే ।
వాతరోగశతాక్రాన్తో నరకానేనవిందతి॥ ౨౧

తా॥ ఓరాజా! వైశాఖమాసమునందు బ్రాహ్మణునకు విసనకఱ్ఱ నివ్వనియెడల ననేక వాయురోగములచే పీడింపఁబడినవాఁడై నరకములనే పొందుచుండును.

శ్లో॥ యోవీజయేత్పటేనాపి పథిశ్రాంతంద్విజోత్తమం ।
తావతాభువిముక్తోఽసౌ విష్ణుసాయుజ్యమాప్నుయాత్॥ ౨౨

తా॥ మార్గాయాసముచే నలసియున్న బ్రాహ్మణోత్తమునకు వస్త్రముచేనైన నెవఁడు విసరునో అంతమాత్రముననే వాఁడు భూమియందు సమస్త పాపములవలన విడువఁ బడినవాఁడై విష్ణుమూర్తియం దైక్యమునొందువాఁడగును.

శ్లో॥ యస్తాలవ్యజనం వాపి దత్త్వానుద్ధేనచేతసా ।
విహాయసర్వపాపాని బ్రహ్మలోకంసగచ్ఛతి॥ ౨౩

తా॥ ఎవఁడు పరిశుద్ధాంతఃకరణముగలవాఁడై తాటియాకులచే నిర్మింపఁబడిన విసనకఱ్ఱనైన నిచ్చుచున్నాఁడో వాఁడు సమస్తపాపములను పోఁగొట్టుకొని బ్రహ్మలోకమును బొందుచున్నాఁడు.

శ్లో॥ సద్యశ్శ్రమహరంపుణ్యం నదద్యాద్వ్యజనంనరః ।
నారకీం యాతనాంభుక్త్వా కశ్మలోజాయతేభువి॥ ౨౪

తా॥ ఇచ్చిన తక్షణమునందే ఆయాసమును బోఁగొట్టునటువంటిదియు పుణ్యాకరమైనదియు నగు విసనకఱ్ఱను ఏమనుష్యుఁడీయఁడో అటువంటివాఁడు నరకమున పాపము ననుభవించి భూలోకములో కలుషముగలవాఁడై జనియించును.

శ్లో॥ ఆధ్యాత్మికాదిదుఃఖానాం శాంతయేమనుజేశ్వర ।
ఛత్రందద్యాత్ప్రియత్నేన వైశాఖేమాసినాసకృత్॥ ౨౫

తా॥ ఓరాజశ్రేష్ఠుఁడా! అధ్యాత్మిక అధిదైవిక అధిభౌతికములనెడు దుఃఖములనివృత్తికొఱకు వైశాఖమాసములోసమస్తవిధములను గొడుగును దానమియ్యవలెను

శ్లో॥ అఛత్రదోనరోయస్తు వైశాఖేమాధవప్రియే ।
ఛాయాహీనోమహాక్రూర పిశాచోభువిజాయతే॥ ౨౬

తా॥ విష్ణుమూర్తికి ప్రీతికరమైన వైశాఖమాసమునందు గొడుగు దానము చేయనివాఁడు నీడలేనివాఁడై క్రూరమగు గొప్పపిశాచమై భూమియందు బుట్టును.

శ్లో॥ యోదద్యాత్పాదుకేదివ్యే మాధవేమాధవప్రియే ।
యమదూతాన్నిరాకృత్య విష్ణులోకంసగచ్ఛతి॥ ౨౭

తా॥ విష్ణుమూర్తికి ప్రీతికరమైన వైశాఖమాసమునందు చెప్పులదానమెవఁడు జేయునో అట్టి పుణ్యాత్ముఁడు యమభటులను తిరస్కరించి విష్ణులోకము నకు వెళ్ళును.

శ్లో॥ పాదత్రాణంతుయోదద్యాద్వైశాఖేమాధవేశ్వరే ।
నతస్యనరకోలోకో నక్లేశాఇహికాశ్చయే॥ ౨౮

తా॥ విష్ణుమూర్తికి ప్రియకరమైన వైశాఖమాసములో నెవఁడు చెప్పుల దానమిచ్చునో అట్టివానికి ఇహలోకమునందు కష్టములుగాని, పరలోకమునందు నరకముబొందుటగాని సంభవింపవు.

శ్లో॥ పాదుకేయాచమానాయ యోదద్యాద్బ్రాహ్మణాయచ ।
సభూపాలోభవేద్భూమౌ కోటిజన్మస్వసంశయః ॥ ౨౯

తా॥ పాదుకలను కావలయునని కోరినట్టి బ్రాహ్మణునకు నెవఁడు పాదుకల నిచ్చునో అట్టివాఁడు కోటిజన్మములపర్యంతము భూమియందు రాజుగా బుట్టుచుండును. సందేహములేదు.

శ్లో॥ అనాథమంటపంమార్గే శ్రీమహాంకరోతియః ।
తస్యపుణ్యఫలంవక్తుం బ్రహ్మణాపినశక్యతే। ౩౦

తా॥ దిక్కులేనివారికి నాయాసమును బోఁగొట్టుకొనఁదగినట్టి మంటపమును దారిలో నెవఁడు కట్టించునో అట్టివాని ఫలమును జెప్పుటకు బ్రహ్మదేవుండయినను సమర్థుఁడుకాఁడు.

శ్లో॥ మధ్యాహ్నేబ్రాహ్మణంప్రాప్త మతిథింభోజయేద్యది ।
నతస్యఫలవిశ్రాంతి ర్బ్రహ్మణాపినిరూపితా॥ ౩౦

తా॥ మధ్యాహ్నకాలమందు వచ్చినట్టి యతిథియగు బ్రాహ్మణునకు నెవఁడు భోజనంబిడునో అట్టివాని ఫలమున కంతము బ్రహ్మదేవుఁడైనను నిరూపించలేడు.

శ్లో॥ సద్యస్సాప్యాయనంనౄణా మన్నదానంనరాధిప ।
తస్మాన్నాన్నేనసదృశం దానంలోకేషువిద్యతే॥ ౩౨

తా॥ ఓరాజా! అన్నదానము తత్క్షణమునందే మనుష్యులకు తృప్తినిజేయును. కాఁబట్టి మూఁడులోకములయందు నన్నముతో సమానమైన దానము లేదు.

శ్లో॥ మార్గశ్రాంతాయవిప్రాయ ప్రశ్నదంప్రదదాతియః ।
తస్యపుణ్యఫలంవక్తుం బ్రహ్మణాపినశక్యతే॥ ౩౩

తా॥ మార్గమునం దలసివచ్చినట్టి బ్రాహ్మణునకు కుశలప్రశ్నజేసి మర్యాదపూర్వకముగా నన్నంబిడినట్లాయెనా అట్టివాని పుణ్యఫలమును జెప్పుటకు బ్రహ్మదేవుఁడయినను సమర్థుఁడుకాఁడు.

శ్లో॥ దారాపత్యగృహాదీని వాసోఽలంకారభూషణం ।
అసహ్యంనాశ్నతఃపుంస స్సంహ్యంభుక్తవతోధ్రువమ్॥ ౩౪

తా॥ భార్య, సంతానము, గృహము, వస్త్రము, అలంకారములు, ఆభరణములు నీ మొదలగువన్నియు ప్రేమకు నాస్పదమైనను భోజనముచేయక నాకలిచే బాధింపఁబడునట్టివాని సహ్యమైనదిగా దోచును. భుజించినవానికైతే యిష్టములుగా దోచును. నిశ్చయము.

శ్లో॥ తస్మాదన్నసమందానం నభూతంనభవిష్యతి॥ 3౫

తా॥ కాఁబట్టి యన్నదానముతో సమమగు దాన మిదివరలో గలుగలేదు. ముందు కలుగబోదు.

శ్లో॥ వైశాఖేయేనచాదత్తం మార్గశ్రాంతేచభూసురే।
సపిచాచోభవేద్భూమౌ స్వమాంసాన్యేపఖాదతి।
యథావిభూత్యాదాతవ్యం తస్మాదన్నంద్విజాతయే॥

తా॥ వైశాఖమాసములో మార్గాయాసముచే నలసివచ్చిన బ్రాహ్మణునకు నెవఁ డన్నబోసంగడో వాఁడు భూలోకములో పిశాచమైబుట్టి తన మాంసమును తానేభక్షించును. కాఁబట్టి తన శక్త్యనుసారముగా బ్రాహ్మణులకు నన్నదానమును జేయవలయును.

శ్లో॥ అన్నదోమాతృపిత్రాదీన్ విస్మారయతిభూమిప।
తస్మాదన్నంప్రశంసంతి లోకాస్త్రైలోక్యవర్తినః॥ 32

తా॥ ఓరాజా! అన్నము పెట్టినవాఁడు తల్లిదండ్రులనయినను మరపించును. అనఁగా భుజించిన సౌఖ్యముచే మఱచిపోవుదురు. అట్టి విశేషసౌఖ్యము నిచ్చునట్టిగి కాఁబట్టి మూఁడులోకములయం దుండునట్టి మనుష్యులు అన్నదానము నధికమైన దానముగా కొనియాడుచుండిరి.

శ్లో॥ మాతరఃపితరశ్చాపి కేవలంజన్మహేతవః।
అన్నదఃపితవంలోకే వదంతిచ మనీషిణః॥ 3౭

తా॥ లోకములో కేవలము పుట్టుకకు కారణమైన తల్లిదండ్రులు సామాన్యులనియు,అన్నంబిడిపోషించినట్టివాని నేయధికమైనతండ్రియనియువిద్వాంసులు చెప్పిరి

శ్లో॥ అన్నేదేసర్వతీర్థాని అన్నేదేసర్వదేవతాః।
అన్నేదేసర్వధర్మాశ్చ తిష్ఠంత్యరిధరాజయ॥ 3౯

తా॥ శత్రువులనుజయించునట్టి ఓయంబరీషా! అన్నదానము చేయువానియందు సమస్తతీర్థములు, సమస్తదేవతలు, సమస్తధర్మములు నివసించుచున్నవి.

ఇతి నారదాంబరీష సంవాదే ద్వితీయోఽధ్యాయ సమాప్తః.

---

## అథ తృతీయోఽధ్యాయః.

నారదః శ్లో॥ యోమర్త్యోద్విజవర్యాయ పర్యంకంతుశ్రమాపహం।
యత్రస్వపన్సుఖంశేతే శీతానిలనిషేవితః॥ ౧

తా॥ నారదుఁడు చెప్పుచున్నాఁడు. చల్లగాలి వీచుచుండఁగా నెటువంటి శయ్యయందు పరుండిన సుఖముగా నిద్రించునో ఆయాసమను పోఁగొట్టునటువంటి అట్టిశయ్యను బ్రాహ్మణునకు దానమిచ్చినయెడల స్వర్గలోకములోనుండి సౌఖ్యమనుభవించును.

శ్లో॥ ధర్మసాధనభూతోహి దేహోనిరుజమాసతే ।
తందత్వాసకలంతాపం నిరస్యగతకల్మషః ।
ఆఖండపదవీంయాతి యోగినామపిదుర్లభామ్॥ ౨

తా॥ "శరీరమాద్యంఖలుధర్మసాధనం" అనియున్నదికాఁబట్టి సమస్తధర్మములను చేయుటకు శరీరమే ముఖ్యసాధనమైయున్నది. అట్టి శరీరము నారోగ్యముగా నుంచుకొనవలయును. ఆరోగ్యమునకు మృదుశయ్యాదులే కారణములు. కాఁబట్టి అటువంటి శయ్యను నిర్మలమనస్సుగలవాఁడై యెవడిచ్చునో అట్టివాఁడు తాపత్రయమును బోగొట్టుకొని యోగీశ్వరులకైనను పొందరానిదియు, నాశనరహితమైనదియునగు వైకుంఠపదవిని బొందుచున్నాఁడు.

శ్లో॥ వైశాఖేఘర్మతప్తానాం శ్రాంతానాంతుద్విజన్మనాం ।
దత్వాశ్రీమాపహాందివ్యాం పర్యంకంమనుజేశ్వర ।
నజాతుసీదతేలోకే జన్మమృత్యుజరాదిభిః ॥ ౪

తా॥ వైశాఖమాసములో యెండచేతపింపఁబడి యలసియున్న బ్రాహ్మణులకు నాయాసమును బోఁగొట్టునట్టిదియై, శ్రేష్ఠమైన శయ్యాదానము చేసినయెడల నో రాజా! అట్టివాఁడు జన్మము, మృత్యువు, ముదిమి మొదలగువానిని విడిచి వైకుంఠమును జెందును.

శ్లో॥ గృహీత్వాబ్రాహ్మణోయత్ర ఏతేచాజీవమాస్థితః ।
ఆసీనేసకలంపాపం జ్ఞానతోఽజ్ఞానతఃకృతం ।
విలయంయాతిరాజేంద్ర కర్పూరఇవచాగ్నినా॥ ౫

తా॥ బ్రాహ్మణుఁడు శయ్యను గ్రహించి యెల్లకాలము సుఖించును కాఁబట్టి ఓరాజశ్రేష్ఠుఁడా! దానియందు కూర్చున్నను దానమిచ్చినవానిచే తెలిసియు తెలియకయు జేయఁబడిన యావత్పాపములు అగ్నిహోత్రముచే హారతికర్పూరమువలెనే నాశనము బొందును.

శ్లో॥ శయనేబ్రహ్మనిర్వాణం సనరోయాతినిశ్చితమ్॥ ౬

తా॥ దానియందు పరుండినయెడల దానమిచ్చినపురుషుఁడెన్నటికిని నాశనము లేని బ్రహ్మానందమును బొందుచుండును. నిశ్చయము.

శ్లో॥ యోదద్యాత్కశిపుంమాసే వైశాఖేస్నానవల్లభే । సర్వభోగసమాయుక్తస్తస్మిన్నేవహిజన్మని । సాన్వయోవర్తతేనూనం రోగాదిభిరనాహతః । ఆయుష్యంపరమారోగ్యం యశోధైర్యంచవిందతి॥ ౮

తా॥ ప్రాతఃకాల స్నానముచే పుణ్యఫలము నొసఁగునట్టి వైశాఖమాసములో నెవఁడు పరుపు నిచ్చుచున్నాఁడో అట్టివాఁడును అతని వంశమువారును రోగములు మొదలగు బాధలనుజెందక యీలోకమునందే సమస్తసౌఖ్యములనుజెంది దీర్ఘాయువు నుత్కృష్టమగు నారోగ్యమును, కీర్తి ధైర్యములను మొదలగువానిని బొందును.

శ్లో॥ నాధార్మికఃకులేతస్య జాయతేశతపౌరుషం ।
భుక్త్వాతుసకలాన్భోగాం స్తత్యపంచత్వమాగతః ॥ ౯

తా॥ వానియొక్క వంశములో నూఱుపురుషాంతరములవఱకు ధర్మశూన్యుఁడు పుట్టబోఁడు. పుట్టినవాఁడు సమస్తభోగముల ననుభవించి మరణించినపిమ్మట స్వర్గమును బొందువాఁడగును.

శ్లో॥ నిర్ధూతాఖిలపాపస్తు బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ।
శ్రోత్రియాయద్విజేంద్రాయ యోదద్యాదుపబర్హణమ్॥౧౦

తా॥ శ్రోత్రియుఁడగు బ్రాహ్మణునకు నెవఁడు తలగడదిండు నిచ్చుచున్నాఁడో వాఁడు సమస్తపాపములను బోగొట్టుకొని బ్రహ్మానందము ననుభవించును.

శ్లో॥ సుఖంనిద్రాంవినాయేన నన్నృణాంజాయతేక్వచిత్ ।
సర్వేషామాశ్రయోభూత్వా భువిసామ్రాజ్యమశ్నుతే॥ ౧౦

తా॥ మనుష్యులకు నిద్రలేక సుఖము కలుగదు కాఁబట్టి అట్టిశయ్య నిచ్చుటచే సమస్తజీవులకు నాధారభూతుఁడై భూమియందఖండసామ్రాజ్యము ననుభవించును.

శ్లో॥ పునస్సుఖీపునర్భోగీ పునర్ధర్మపరాయణః ।
ఆసప్తజన్మరాజేంద్ర జాయతేసర్వతోజయీ ।
పశ్చాత్సప్తకులైర్యుక్తో బ్రహ్మభూయాయకల్పతే ॥ ౧౨

తా॥ ఓరాజశ్రేష్ఠుఁడా! శయ్యాదాత మాటిమాటికి సుఖముగలవాఁడగుచును భోగముగలవాఁడగుచును ధర్మమునందాసక్తి గలవాఁడగుచు నేడుజన్మములపర్యంతము సమస్తదిక్కులయందు దిగ్విజయముగలవాఁడగుచునుండి జన్మాంతంబున నేడు

తరముల వారితోఁగూడి బ్రహ్మలోకమునందు నివసించును.

శ్లో॥ తాళంకటంతుయోదద్యా త్కటమవ్యదథాపివా ।
తత్రశేతేస్వయంవిష్ణుః ప్రీతస్థఃపరమేశ్వరః ॥ ౧౩

తా॥ ఎవఁడు తాటియాకులచే నిర్మింపఁబడిన చాప నిచ్చునో లేక మఱి యే చాపనైననిచ్చునో ఆట్టిచాపయందు భగవంతుండగు విష్ణుమూర్తి స్వతహాగా వచ్చి శయనించును కాఁబట్టి ఆట్టిచాప నిచ్చుటచే విశేషమైన పుణ్యమును బొందును.

శ్లో॥ యథాజలగతాచోర్ణా నజలైర్బధ్యతేక్వచిత్ ।
తథాసంసరతోజంతు స్సంసారేనచబధ్యతే ।
ఆసనేశయనే౽శక్తః కటదస్సర్వతస్సుఖీ ॥ ౧౪

తా॥ ఏప్రకారముగా గొఱ్ఱెబొచ్చు జలములయందుపడినను బంధింపకుండునో ఆప్రకారముగా శయ్యాదానము చేసినవాఁడు సంసారములో నున్నను సంసారముచే చిక్కుపడఁడు. అట్టి శయ్యనుగాని, ఆసనమునుగాని యిచ్చుటకు సమర్థుఁడు కాని యెడల చాపను దానమిచ్చినను సర్వకాలములయందును సుఖముకలవాఁడగుచుండును

శ్లో॥ ప్రశ్రియేశయనార్థాయ యోదద్యాత్కటకంబలం ।
తావన్మాత్రేణముక్తస్స్యా న్నాత్రకార్యావిచారణా ॥ ౧౫

తా॥ ఎవఁడైనను శయ్యకొఱకు యాచింపఁగా దృఢమగు చాపనైన నిచ్చునో వాఁడు అంతమాత్రముననే ముక్తినిబొందును. ఇందువిషయమై విచారింపకూడదు.

శ్లో॥ నిద్రయాహీయతేదుఃఖం నిద్రయాహీయతేశ్రమః ।
సానిద్రాకటసంస్థస్య సుఖంసంజాయతేధ్రువమ్॥ ౧౬

తా॥ నిద్రచే దుఃఖమునుపోఁగొట్టును. నిద్రచే అలసటనుపోఁగొట్టునుకాఁబట్టి అట్టినిద్ర చాపయందు పరుండినవానికి సుఖమునుగలిగించును. నిశ్చయము.

శ్లో॥ యోదద్యాత్కంబలంరాజన్ వైశాఖేమాధవాగమే ।
అపమృత్యోఃకాలమృత్యో ర్ముక్తోజీవతివైశతమ్॥ ౧౭

తా॥ ఓరాజా! వైశాఖమాసమురాగానే యెవఁడు కంబళిదానము జేయునో వాఁడపమృత్యువువలనను, కాలమృత్యువువలనను విడువఁబడి నూఱు సంవత్సరముల పర్యంతము జీవించును.

శ్లో॥ దద్యాద్వస్త్రంసూక్ష్మతరం ద్విజేంద్రేఘర్మకర్శితే ।
పూర్ణమాయుస్సమాప్నోతి పరత్రచతరాంగతిమ్॥ ౧౮

తా॥ ఎవఁడు యెండచే తపింపఁబడిన బ్రాహ్మణోత్తమునకు పలచనైన వస్త్రమును దానమిచ్చుచున్నాఁడో వాఁడు సంపూర్ణాయుర్దాయమును జన్మాంతంబున నుత్తమలోకమును బొందును.

శ్లో॥ అంతస్తాపహరందివ్యం కర్పూరంతుద్విజాతయే ।
దత్వామోక్షమవాప్నోతి దుఃఖశాంతించవిందతి॥ ౨౦

తా॥ లోపలనుండు వేడిని పోగొట్టునదియు శ్రేష్ఠమైనదియు నగు హారతి కర్పూరము నిచ్చినవాఁడు సర్వదుఃఖములను పోగొట్టుకొని మోక్షమును బొందును.

శ్లో॥ కుసుమానిచయోదద్యాత్కుంకుమంచద్విజాతయే ।
సార్వభౌమోభవేద్రాజా సర్వలోకవశంకరః ।
పుత్రపౌత్రాదిభోగాంశ్చభుక్త్వామోక్షమవాప్నుయాత్॥ ౨౧

తా॥ ఎవఁడుపుష్పములనుగాని, కుంకుమగాని బ్రాహ్మణునకునిచ్చుచున్నాఁడో అట్టివాఁడు చతుస్సముద్రపర్యంతఁబగు భూమి నేలునట్టి ప్రభువగుచు లోకము నంతయు తాను స్వాధీనము చేసికొనినవాఁడగును. పుత్రులు పౌత్రులు మొదలగు భోగముల ననుభవించి మోక్షమునుబొందును.

శ్లో॥ త్వగస్థిగతసంతాపం సద్యోహరతిచందనం ।
తాపత్రయవినిర్ముక్త స్తద్దత్వామోక్షమాప్నుయాత్॥ ౨౨

తా॥ మంచిగంధము శరీరమందుగాని, యెముకలయందుగాని యుండునట్టి తాపమును పూసికొనిన తక్షణమునందే హరించును. కాఁబట్టి చందనము నిచ్చువాఁడు తాపత్రయములవలన విడువఁబడి మోక్షమునుబొందును.

శ్లో॥ ఔశీరంచంపకంకోశం యోదద్యాజ్జలవాసితం ।
సర్వభోగేషురాజేంద్ర సతుదేవసహాయవాన్ ।
పాపహీనందుఃఖహీనం ప్రాప్యనిర్వాణమాప్నుయాత్। ౨౩

తా॥ ఓరాజా! ఎండచే తపింపఁబడినవానికి వట్టివేరు, సంపంగి, తుంగవేళ్ళు మొదలగువానిచే మిశ్రితంబగు జలమునిచ్చి స్నానమ్మెవఁడుజేయించునో అట్టివాఁడు సమస్త భోగములయందు దేవతల సహాయమును పొందుచు పాపమును, దుఃఖమును పోగొట్టుకొని మోక్షసుఖమును పొందును.

శ్లో॥ గోరోచనమ్మృగనాభించ దద్యాద్వైశాఖధర్మవిత్ ।
తాపత్రయవినిర్ముక్తః పరంనిర్వాణమృచ్ఛతి॥ ౨౪

తా॥ వైశాఖ మహాత్మ్యమును తెలిసినవాఁడు గోరోచనమును కస్తూరిని దాన మిచ్చినట్లాయెనా తాపత్రయములను పోఁగొట్టుకొనినవాఁడై యుత్తమమగు బ్రహ్మా నంద సౌఖ్యమును జెందును.

శ్లో॥ తాంబూలంచసకర్పూరం యోదద్యాన్మేషగేరవౌ ।
సార్వభౌమసుఖంభుక్త్వా పరంనిర్వాణమృచ్ఛతి॥ ౨౬

తా॥ సూర్యుఁడు మేషరాశియందుండఁగా కర్పూరసహితముగా తాంబూలము నెవ్వఁడిచ్చునో అట్టివాఁడు జగత్తునకంతయు ప్రభువగుచు సర్వసౌఖ్యముల ననుభ వించి యుత్తమమగు బ్రహ్మానందమును బొందును.

శ్లో॥ శాతపత్రీంచయూథీంచ మేషమాసేదదన్నరః ।
ససార్వభౌమోభవతి పశ్చాన్మోక్షంచవిందతి। ౨౭

తా॥ మేషసంక్రమణమునందు పద్మముల దండనుగాని, అడవిమల్లెపుష్పముల దండనుగాని యిచ్చినట్టి పురుషుఁడు చతుస్సముద్రపర్యంతము భూమి నేలువాఁడై జన్మానంతరమున మోక్షమునుబొందును.

శ్లో॥ కేతకీంమల్లికాంవాపి యోదద్యాన్మాధవాగమే ।
సతుమోక్షమవాప్నోతి మధుశాసనశాసనాత్॥ ౨౮

తా॥ వైశాఖమాసము ప్రవేశించగానే యెవఁడు మొగలిపుష్పముల దండను గాని, మల్లిపుష్పముల దండనుగాని యిచ్చుచున్నాఁడో యట్టివాఁడు విష్ణుమూర్తి యొక్క యాజ్ఞపరికారముగా మోక్షమునుబొందును.

శ్లో॥ పూగీఫలంతుయోదద్యా త్సుగంధంతుద్విజాతయే ।
నారికేళఫలంరాజన్ తస్యపుణ్యఫలంశృణు॥ ౨౯

తా॥ పోకచెక్కలను మఱియు పరిమళద్రవ్యము నెవఁడు బ్రాహ్మణునికొఱకు నిచ్చునో యోరాజా! మఱియు కొబ్బరికాయలను దానమిచ్చుచున్నాఁడో యట్టి వారికి కలుగు పుణ్యఫలమును జెప్పుచున్నాను. వినుము.

శ్లో॥ సప్తజన్మభవేద్విప్రో ధనాఢ్యోవేదపారగః ।
పశ్చాత్సప్తకులైర్యుక్తో విష్ణులోకంసగచ్ఛతి॥ ౩౦

తా॥ పూర్వమందు చెప్పినట్లుగా దానమిచ్చినవాఁడు యేఁడుజన్మముల పర్యం తము బ్రాహ్మణుఁడుగా బుట్టును. వేదశాస్త్రసంపన్నుడై జన్మానంతరమున యేఁడు తరములవారితోఁగూడ వైకుంఠమునుబొందును.

శ్లో॥ విశ్రామమంటపంయస్తు ప్రకుర్యాద్ద్విజమందిరే ।

తస్యపుణ్యఫలంవక్తుం నాహంశక్తోస్మిభూపతే॥ 31

తా॥ ఓరాజా! బ్రాహ్మణగృహమునందలసట దీర్చుకొనుటకు తగిన మంటపము నెవడు కట్టించుచున్నాడో వానియొక్క పుణ్యఫలమును జెప్పుటకు నేను సమర్థుడను కాను.

శ్లో॥ సచ్ఛాయామంటపయస్తు సికతాకీర్ణమంజసా ।
సప్రపంకారయేద్యస్తు సతులోకాధిపోభవేత్॥ 32

తా॥ ఎవడు నీడతోగూడినదియు ఇసుకతిన్నెలు గలదియు, చలివేంద్రగలదియునగు మంటపమును కట్టించుచున్నాడో వాడీలోకమునకంతకు ప్రభువగును.

శ్లో॥ మార్గోద్యానందటాకంవా కూపంమంటపమేవచ ।
యఃకరోతిసధర్మాత్మా తస్యపుత్రైస్తుకింఫలమ్॥ 33

తా॥ మార్గమునకు సమీపమునందు తోటవేయించుట, చెఱువును త్రవ్వించుట నుయ్యికట్టించుట, మంటపమును కట్టించుట మొదలగు కార్యము నెవడు చేయుచున్నాడో యట్టి ధర్మాత్మునకు పుత్రులతో ప్రయోజనములేదు.

శ్లో॥ కూపస్తటాకముద్యానం మంటపంచప్రపాతథా ।
సద్ధర్మకరణంపుత్రః సంతానస్సప్తధోచ్యతే॥ 34

తా॥ నుయ్యికట్టించుట, చెఱువుత్రవ్వించుట, తోటవేయించుట, మంటపము కట్టించుట, చలివేంద్రనేర్పఱచుట, మంచి ధర్మములనుజేయుట, పుత్రుడును నగు నివి యేడువిధములుగా సంతానమేర్పడియున్నది.

శ్లో॥ ఏతేష్వన్యతమాభావే నోర్ధ్వంగచ్ఛంతిమానవాః ॥

తా॥ ఈయేడింటిలో నేదిలేకపోయినను వానికి పరలోకసుఖము కలుగదు.

శ్లో॥ సచ్ఛాస్త్రశ్రవణంతీర్థ యాత్రాసజ్జనసంగతిః ।
జలదానంచాన్నదాన మశ్వత్థారోపణంతథా ।
పుత్రశ్చేతిచసంతానం సప్తవేదవిదోవిదుః ॥ 36

తా॥ మంచిశాస్త్రములను వినుట, పుణ్యతీర్థములకు వెళ్ళుట, సత్పురుషులతో సహవాసముజేయుట, జలమునిచ్చుట, అన్నమునిచ్చుట, రావిచెట్టును ప్రతిష్ఠించుట పుత్రుడుఅని యేడువిధములుగా సంతానమేర్పడియున్నదని వేదవేత్తలగు మఱికొందఱు పెద్దలు చెప్పిరి.

శ్లో॥ నాసంతతిర్లభేల్లోకాన్ కృత్వాధర్మశతానపి ।

తస్మాత్సంతానమన్విచ్ఛే త్సంతానేష్వేకతో వ్రజేత్॥ ౩౭

తా॥ సంతానములేనివాఁడు నూఱుధర్మములను జేసినప్పటికి పుణ్యలోకములను బొందలేఁడు, కాఁబట్టి యీ యేఁడుసంతానములలో నొక సంతానముగలవాఁడైనను పుణ్యలోకములను బొందువాఁడగును.

శ్లో॥ పశూనాంపక్షిణాంచైవ మృగాణాంచైవభూరుహాం।
ఊర్ధ్వలోకసుఖంయాతి మనుష్యాణాంతుకాకథా॥ ౩౮

తా॥ పాపపుణ్యవివేకములేని పశువులు, పక్షులు, మృగములు, చెట్లు మొదలగునవి ఊర్ధ్వలోక సుఖమును బొందలేవు. పుణ్య పాప విభాగములు తెలిసిన మనుష్యులు సద్ధర్మములను జేయనియెడల పుణ్యలోకముల నెట్లు పొందగలరు.

శ్లో॥ పూగీఫలసమాయుక్తం నాగవల్లీదలైర్యుతం।
కర్పూరాగరుసంయుక్తం దదంస్తాంబూలముత్తమం।
శారీరైస్సకలైఃపాపై ర్ముచ్యతేనాత్రసంశయః॥ ౩౯

తా॥ పోకచెక్కలు, తమలపాకులు, కర్పూరము, అగరు మొదలగు వస్తువులతోఁగూడిన తాంబూలము నిచ్చినవాఁడు శరీరసంబంధమైన సమస్తపాపములచేతను విడిచిపెట్టఁబడుచున్నాఁడు. ఇందువిషయమై సందేహములేదు.

శ్లో॥ తాంబూలదోయశోధైర్యం శ్రియమాప్నోతినిశ్చితమ్॥ ౪౦

తా॥ తాంబూలము నిచ్చినవాఁడు కీర్తిని, ధైర్యమును, సంపత్తును నిశ్చయముగా పొందుచున్నాఁడు.

శ్లో॥ రోగీదత్వావిరోగస్స్యా దరోగీమోక్షమాప్నుయాత్॥ ౪౧

తా॥ రోగముగలవాఁడు తాంబూలదానము చేసినయెడల రోగములేనివాఁడగును. రోగములేనివాఁడు చేసినయెడల మోక్షమును బొందును.

శ్లో॥ వైశాఖేమాసియోదద్యా త్తక్రంతాపవినాశనం।
విద్యావాన్ధనవాన్భూమౌ జాయతేనాత్రసంశయః॥ ౪౨

తా॥ వైశాఖమాసమునందు తాపమును పోఁగొట్టునట్టి చల్లని మజ్జిగనిచ్చినవాఁడు విద్య గలవాడును, ధనము గలవాఁడునై భూమియందు పుట్టుచున్నాఁడు, సందేహములేదు.

శ్లో॥ నతక్రసదృశందానం ధర్మకాలేషువిద్యతే।
తస్మాత్తక్రంప్రదాతవ్య మధ్వశ్రాంతద్విజాతయే॥ ౪౩

తా॥ ధర్మమును జేయఁదగిన కాలములయందు మజ్జిగతో సమానమైన దానము లేదు. కాఁబట్టి సూర్యాయాసముచే నలసియున్న బ్రాహ్మణునికొఱకు మజ్జిగ నియ్యవలయును.

శ్లో॥ జంబీరసురసోపేతం లసల్లవణమిశ్రితం ।
యస్తక్రమరుచిఘ్నంతు తత్వామోక్షమవాప్నుయాత్ ॥౨౨

తా॥ మజ్జిగలో నిమ్మపండ్ల రసమును ఉప్పును కలిపి దాహము పుచ్చుకొనిన యెడల నాలుకయందు రుచిలేకపోవుటయనెడి దోషమున్నయెడల కొట్టివేయును. కాఁబట్టి యటువంటి మజ్జిగ నిచ్చినయెడల మోక్షమును బొందును.

శ్లో॥ యోదద్యాద్దధిఖండంతు వైశాఖేఘర్మశాంతయే ।
తస్యపుణ్యఫలంవక్తుం నాహంశక్నోమిభూమిప ॥ ౨౩

తా॥ వైశాఖమాసములో నెవఁడు పెరుగును. ఘర్మముచే తపించుచున్న బ్రాహ్మణునికొఱకు నిచ్చుచున్నాఁడో ఓరాజా! వానియొక్క పుణ్యఫలమును చెప్పుటకు నేను సమర్థుఁడనుకాను.

శ్లో॥ యోదద్యాత్తండులాన్దివ్యాన్ మధుసూధనవల్లభే ।
సలభేతూర్ణమాయుష్యం సర్వయజ్ఞఫలంలభేత్ ॥ ౨౬

తా॥ విష్ణుమూర్తికి ప్రీతికరమైన వైశాఖమాసమునందు శ్రేష్ఠమైన బియ్యమును దానమిచ్చినయెడల వాఁడు సంపూర్ణాయుర్దాయమునుబొంది సమస్తయజ్ఞములు జేసిన ఫలమును బొందును.

శ్లో॥ యోఘృతం తేజసోరూపం గవ్యందద్యాద్ద్విజాతయే ।
సోశ్వమేధఫలంప్రాప్య మోదతేవిష్ణుమందిరే ॥ ౨౭

తా॥ తేజస్వరూపమైన ఆవునెయ్యి బ్రాహ్మణునకు దానమిచ్చినవాఁడు అశ్వమేధముచేసిన ఫలమునుబొంది జన్మాంతరమున వైకుంఠమునుబొందును.

శ్లో॥ ఉర్వారుగుడసమ్మిశ్రం వైశాఖేమేషగేరవౌ ।
సర్వపాపవినిర్ముక్తః శ్వేతద్వీపేవసేద్ధ్రువమ్ ॥ ౨౮

తా॥ సూర్యుఁడు మేషసంక్రమణమునందున్న వైశాఖమాసములో బెల్లము కలిపిన దోసకాయ విచ్చినవాఁడు సమస్తపాపములను విడిచినవాఁడై శ్వేతద్వీపమునందు నివసించును. నిశ్చయము.

శ్లో॥ యశ్చేక్షుఖండంసాయాహ్నే దివాతాపోపశాంతయే ।

బ్రాహ్మణాయచయోదద్యాత్తస్యపుణ్యమనంతకమ్॥ ౪౯

తా॥ పగటియందుగలిగిన వేడిమిచే తపింపఁబడిన బ్రాహ్మణునకు తాపము పోవుటకొఱకు సాయంకాలమందు చెఱకుగడ చెవఁ డిచ్చుచున్నాఁడో యాట్టివాని యొక్క పుణ్య మమితమైనది.

శ్లో॥ వైశాఖేపానకందత్వా సాయాహ్నే శ్రమశాంతయే ।
సర్వపాపవినిర్ముక్తో విష్ణోస్సాయుజ్యమాప్నుయాత్॥ ౫౦

తా॥ వైశాఖమాసములో సాయంకాలమం దాయాసమును పోగొట్టుటకొఱకు పానకమిచ్చినయెడల సమస్తపాపములవలన విడువఁబడి విష్ణుమూర్తియం దైక్యము నొందువాఁడగును.

శ్లో॥ నఫలంపానకంమేష మాసేపాయంద్విజాతయే ।
దద్యాత్తేనపితౄణాంతు సుధాపానంనసంశయః॥ ౫౧

తా॥ మేషసంక్రమణముతోఁ గూడిన వైశాఖమాసమునందు బ్రాహ్మణునకు పండ్లను పానకము నిచ్చినయెడల పితృదేవ లమృతపానము జేసినట్లుగా సంతోషింతురు. సందేహము లేదు.

శ్లో॥ వైశాఖేపానకంచూత సుపక్వఫలసంయుతం ।
తస్యసర్వాణిపాపాని వినాశంయాంతినిశ్చితమ్॥ ౫౨

తా॥ వైశాఖమాసములో చక్కఁగా పండిన మామిడిపండ్లరసమును కలిపినట్టి పానకమిచ్చినయెడల వానియొక్క సమస్తపాపములు నశించుచున్నవి సందేహము లేదు.

శ్లో॥ యోదద్యాచ్చైత్రదర్శేతు కుంభంపూర్ణంతుపానకైః ।
గయాశ్రాద్ధశతంతేన కృతమేవనసంశయః॥ ౫౩

తా॥ చైత్ర బహుళ అమావాస్యయందు పానకముతో నిండింపఁబడిన కలశము నిచ్చినట్టి పురుషుఁడు గయలో నూఱుపర్యాయములు శ్రాద్ధమును పెట్టిన ఫలమును పొందుచున్నాఁడు. సందేహము లేదు.

శ్లో॥ కస్తూరీకర్పూరోపేతం మల్లికోశీరసంయుతం ।
కలశంపానకైఃపూర్ణం చైత్రదర్శేతుమానవః ।
దద్యాత్పితౄన్సముద్దిశ్య షణ్ణవతిదోభవేత్॥ ౫౪

తా॥ కస్తూరి కర్పూరము మల్లెపువ్వులు వట్టివేళ్ళు మొదలగువానితో మిశ్రితమైనట్టి పానకముచే నిండింపఁబడిన కలశమును చైత్ర బహుళ అమావాస్యయందు నిచ్చినట్టి పురుషుఁడు పితృదేవతలకొఱకు షణ్ణవతిశ్రాద్ధములను జేసినవాఁడగును.

దాననిరూపణంనామ తృతీయోఽధ్యాయ స్సమాప్తః

## అథ చతుర్థోఽధ్యాయః.

నారదః॥ శ్లో॥ తైలాభ్యంగందివాస్వాపం తథావై కాంస్యభోజనం।
ఖట్వానిద్రాంగృహేస్నానం నిషిద్ధస్యతుభక్షణమ్ ।
వైశాఖేవర్జయేదష్టౌ ద్విభుక్తంనక్తభోజనమ్॥ ౧

తా॥ నూనెతో తలయంటికొనుట, పగలు నిద్రించుట, కంచుపాత్రమునందు భుజించుట, మంచముమీఁద పరుండుట, గృహమునందే స్నానముజేయుట, నిషేధింపఁబడిన పదార్థమును భుజించుట, రెండుపర్యాయములు భుజించుట, పగలుమాని రాత్రియందు భుజించుట అను నీయెనిమిదింటిని వైశాఖమాసములో విడిచిపెట్టవలయును

శ్లో॥ పద్మపత్రేతుయోభుఙ్క్తే వైశాఖేవ్రతసంస్థితః
సతుపాపవినిర్ముక్తో విష్ణులోకంసగచ్ఛతి॥ ౨

తా॥ ఎవఁడు వైశాఖమాస సంబంధమైన వ్రతము నాచరించుచున్నాఁడో వాఁడు తామరాకునందు భుజించినయెడల సమస్తపాపములవలన విడువఁబడి వైకుంఠమును పొందును.

శ్లో॥ వైశాఖేమాసిమధ్యాహ్నే శ్రాంతానాంతుద్విజన్మనాం।
పాదావనేజనంకుర్యాత్తద్వ్రతంసువ్రతోత్తమమ్॥ 3

తా॥ వైశాఖమాసములో మధ్యాహ్నకాలమునం దలసినబ్రాహ్మణులకు పాదప్రక్షాళనము చేసినయెడల దీని నన్ని మంచివ్రతములలో నుత్తమమైనదానినిగా చెప్పిరి.

శ్లో॥ అధ్వశ్రాంతంద్విజంయస్తు మధ్యాహ్నేస్వగృహాగతం।
ఉపవేశ్యాసనేరమ్యే కృత్వాపాదావనేజలమ్॥
ధృత్వాశిరసితాశ్చాపో విధ్వస్తాఖిలబంధనః।
గంగాదిసర్వతీర్థేషు స్నాతోభవతినిశ్చితమ్॥ ౫

తా॥ మార్గాయాసముచే నలసి తనయింటికివచ్చిన బ్రాహ్మణుని మంచిపీటయందు గూర్చుండబెట్టి పాదప్రక్షాళనముజేసి యాజలమును శిరస్సున ధరించినయెడల సమస్తబంధములవలన విడువఁబడినవాఁడును గంగ మొదలగు సమస్తతీర్థములయందు స్నానముజేసినవాఁడు నగును. సందేహములేదు.

శ్లో॥ అస్నాయీవాప్యపత్రీ వైశాఖంతులయేద్యది।
రాసభీంయోనిమాసాద్య పశ్చాదశ్వతరీభవేత్॥ ౬

తా॥ వైశాఖమాసములో ప్రాతఃకాలమునందు స్నానమునుజేయకయు, ఆకులనుభక్షింపంయు నెవఁడు గడుపునో వాఁడు గాడిదయోనియందు తిరిగి కంచరగాడిదెయందు జనియించువాఁడగును.

శ్లో॥ దృఢాంగోరోగహీనశ్చ తథాస్వస్థోపిమానవః ।
వైశాఖేతుగృహేస్నాత్వా చాండాలీయోనియాప్నుయాత్ ॥

తా॥ దృఢమైన శరీరముగలిగి రోగములేక ఆరోగ్యముగానున్నట్టి మనుష్యుఁడు వైశాఖమాసములో చెఱువు మొదలగువానియందు స్నానముజేయక నింటిలో బిందెలయందుండు నీటితో స్నానముజేసినవాఁడు చండాలుఁడై జనియించును.

శ్లో॥ వైశాఖేమాసిరాజేంద్ర మేషసంస్థేదివాకరే ।
నకరోతిబహిస్స్నానం శ్వానయోనిశతంవ్రజేత్ ॥ ౮

తా॥ ఓ రాజశ్రేష్ఠుడా! వైశాఖమాసములో సూర్యుఁడు మేషసంక్రమణమునందుండఁగా నెవఁడు చెఱువు మొదలగు వానియందు స్నానముజేయనివాఁడు నూఱు జన్మంబులపర్యంతము కుక్కగాబుట్టుచుండును.

శ్లో॥ అస్నాత్వాచాప్యదత్వాచ వైశాఖోయేననీయతే ।
సపిశాచోభవేన్స్నాన మాసైశాఖాదధోవ్రజేత్ ॥ ౯

తా॥ ఎవఁడు ప్రాతఃకాలమందు స్నానముజేయకయు, దానములనీయకయు వ్యర్థముగా వైశాఖమాసమును గడుపునోవాఁడు పిశాచజన్మంబెత్తి వైశాఖమహాత్మ్య ఫలమును పొందుపర్యంతము దుర్గతిని పొందుచుండును.

శ్లో॥ యోనదద్యాజ్జలంచాన్నం వైశాఖేలోభమానసః ।
పాపహానిందుఃఖహానిం నైవాప్నోతినసంశయః ॥ ౧౦

తా॥ లోభియై వైశాఖమాసమునందు అన్నమునుగాని, జలమునుగాని యివ్వనివాఁడు పాపమును దుఃఖమును పోగొట్టుకొనలేఁడు. సందేహము లేదు.

శ్లో॥ నదీస్నానంతుయఃకుర్యా ద్వైశాఖేవిష్ణుతత్పరః ।
జన్మత్రియార్జితాత్పాపా న్ముచ్యతేనాత్రసంశయః ॥ ౧౧

తా॥ వైశాఖమాసములో విష్ణుభక్తిగలవాఁడై ప్రాతఃకాలమందు నదిలో స్నానముజేసినవాఁడు మూఁడుజన్మంబులయందు జేయఁబడిన పాపమును పోగొట్టుకొనును. సందేహము లేదు.

శ్లో॥ సముద్రగానదీస్నానం కుర్యాత్ప్రాతర్భగోదయే ।
సప్తజన్మార్జితైఃపాపై స్తత్క్షణాదేవముచ్యతే ॥ ౧౨

తా॥ సముద్రములో ప్రవహించునట్టి నదిలో సూర్యోదయమగుచుండఁగా ప్రాతఃకాలమునందెవఁడు స్నానము జేయునో వాఁడు యేఁడు జన్మంబులనుండి యుం జేయఁబడిన పాపములవలన శీఘ్రముగా విడువఁబడును.

శ్లో॥ కుర్యాదుపసియస్స్నానం సప్తగంగాసుమానవః। కోటిజన్మార్జితాత్పాపా న్ముచ్యతేనాత్రిసంశయః॥ జాహ్నవీవృద్ధగంగాచ కాళీదీచసరస్వతీ। కావేరీనర్మదావేణీ సప్తగంగాఃప్రకీర్తితాః ॥ ౧౪

తా॥ జాహ్నవి, వృద్ధగంగ, కాళింది, సరస్వతి, కావేరి, నర్మద, కృష్ణవేణి యని గంగానది యేఁడువిధములైనది. ఆయేఁడువిధములగు గంగలయందు ప్రాతఃకాలమునందు స్నానము జేసినట్టి మనుజుఁడు కోటిజన్మంబులయందు జేయఁబడిన పాపములనుండియు విడువఁబడును. సందేహము లేదు.

శ్లో॥ దేవఖాతేషుయఃకుర్యా త్ప్రాంతర్వైశాఖమజ్జనం ।
జన్మారభ్యకృతాత్పాపా న్ముచ్యతేనాత్రసంశయః ॥ ౧౫

తా॥ దేవతలచే త్రవ్వఁబడిన సముద్రము మొదలగు వానియందు వైశాఖమాసములో ప్రాతఃకాలంబున స్నానముజేసినవాఁడు తాను జన్మంబెత్తినది మొదలు జేసిన పాపములవలన విడువఁబడును. సందేహము లేదు.

శ్లో॥ వైశాఖేమాసేసంప్రాప్తే యోవాపీష్వవగాహనం ।
ప్రాతర్వ్యంతిమహారాజ మహాపాతకసంచయమ్ ॥ ౧౬

తా॥ వైశాఖమాసము రాగానే ప్రాతఃకాలమునందెవఁడు దిగుడు బావులయందు స్నానముజేయునో వానియొక్క సమస్తపాపములు నశించిపోవును.

శ్లో॥ అపిగోష్పదమాత్రేషు బహిస్థేషుజలేషుచ ।
తిష్ఠంతుసరితస్సర్వా గంగాద్యాఇతినిశ్చయం ।
ఇతిజానన్సమాప్నోతి సర్వతీర్థాధికంఫలమ్ ॥ ౧౭

తా॥ గోవును కట్టివేయు స్థలమెంతయుండునో అంతప్రదేశమందున్నప్పటికిని బాహ్యజలములయందు (అనఁగా కొద్దిప్రదేశమందున్నను) గంగ మొదలగు నదులన్నియు నుండునని యెవఁడు తెలిసికొనునో వాఁడు సమస్తతీర్థములయందుండు పుణ్యమునకంటె నధికమగు ఫలమును బొందుచున్నాఁడు.

శ్లో॥ క్షీరంరసాధికంక్షీరా దధికందధిభూమిపః ।
దధ్నోఽప్యధికంఘృత యద్వందూర్జోమాసాధికస్తథా॥ ౧౮

తా॥ ఓరాజా! యేప్రకారముగా రసద్రవ్యములలో పాలధికమైనవో, పాల కంటె పెరుగధికమైనదో, పెరుగుకంటె నెయ్యి అధికమైనదో ఆప్రకారముగా మాసములలో కార్తీకమాస ముత్తమమైనది.

శ్లో॥ కార్తికాదధికోమాఘో మాఘాద్వైశాఖఉత్తమః ।
తస్మిన్మాసేకృతోధర్మో వర్ధతేవటబీజవత్ ॥ ౨౦

తా॥ కార్తికమాసముకంటె మాఘమాస ముత్తమమైనది. మాఘమాసము కంటె వైశాఖమాస ముత్తమమైనది. కాఁబట్టి ఆ వైశాఖమాసములో జేయఁబడిన ధర్మము మఱ్ఱివిత్తుఅలెనే వృద్ధిపొందును.

శ్లో॥ ఆఢ్యోవాతిదరిద్రోవా పరతంత్రోధవానరః ।
యద్వస్తులభ్యతేయేన తద్దాతవ్యంద్విజాతయే॥ ౨౧

తా॥ ధనవంతుఁడుగాని, దరిద్రుఁడుగాని, స్వతంత్రుఁడుగాని, స్వతంత్రము లేనివాఁడుగాని యెవఁడైనను యెవనికి యేవస్తువు లభ్యమగునో ఆవస్తువును బ్రాహ్మణునకు దానమియ్యవల్లయును.

శ్లో॥ కందమూలఫలంశాకం లవణంగుడమేవచ ॥
కోలంపత్రంజలంతక్రం మానంత్యాయోపకల్పతే॥ ౨౨

తా॥ మనుష్యులు భుజించతగిన దుంపలు, వేళ్ళు, పండ్లు, కూర, ఉప్పు, బెల్లము, రేగుపండ్లు, ఆకు, జలము మొదలగునవియైనను యేయియు శక్తిలేనివారిచ్చిన యెడల అమితఫలము కలఁగుచున్నది.

శ్లో॥ నాదత్తంలభ్యతేక్వాపి బ్రహ్మాద్యైస్త్రిదశైరపి ॥

తా॥ బ్రహ్మ మొదలగు ముప్పదిమూఁడుకోట్ల దేవతనకయినను పూర్వజన్మంబున మంచి ధర్మములను జేయనియెడల నీజన్మమందు మంచికలుగదు.

శ్లో॥ దానేనహీనస్సభవేదకించనో నిష్కించనత్వాచ్చకరోతి పాపం । పాపా దవశ్యం నరకం ప్రయాతి దాతవ్య మస్మా చ్చుక మిచ్ఛదా సదా ॥ ౨౩

తా॥ దానము చేయనియెడల దరిద్రుఁడగును. దరిద్రత్వమువలన పాపము చేయును. పాపము చేయుటవలన నరకమును బొందును. కాఁబట్టి సుఖమునుపొందగోరువాఁడెల్లప్పుడు ధర్మమును జేయవలయును.

శ్లో॥ యథాగృహం సర్వగుణోపపన్నం పరిచ్ఛదైర్హీనమశోభ

నంతథా । మాసేషు ధర్మ స్సకలే ష్వనుష్ఠితో వైశాఖ హీనస్తు । వృథైవయాతి ॥ ౨౪

తా॥ గృహము ననేక చిత్తరువులచే నలంకరించి యందముగానుండురీతి చేసినను పైఁ పైలేక ప్రకాశించనట్లుగా నన్ని మాసములయందు సమస్తమైన ధర్మములను జేసినను వైశాఖమాసవ్రతము లేనిది వ్యర్థమగును.

శ్లో॥ యథైవ కన్యా సకలైశ్చలక్షణై ర్యుక్తాపి శీలత్వతి లక్షణాపి । ప్రియాసు రాగా కలితాపి రాజన్ వైశాఖహీనాతు వృథైవతాం విదుః ॥ ౨౫

తా॥ ఆడుది సమస్త స్త్రీలక్షణములు గలదైనను, దీర్ఘసుమంగలిగ్రైనను, పెనిమిటిచే ప్రేమించినదైనను వైశాఖమాస వ్రతమును జేయునిని వ్యర్థురాలని చెప్పిరి.

శ్లో॥ దయావిహీనాస్తు యథాగుణా వృథా వైశాఖధర్మేణ వినా తథా క్రియాః ॥ ౨౬

తా॥ సమస్తసుగుణములున్నను దయలేనియెడల నేప్రకారము వ్యర్థమగునో వైశాఖమాసవ్రతమును సలుపక జేసిన యితరవ్రతములన్నియు వ్యర్థమగును.

శ్లో॥ శాకంతు యద్వ ల్లవణేన హీనం నరోచనే సర్వగుణోపసన్నం । వైశాఖ హీనం తు తథైవ పుణ్యం న సాధు సేవ్యం న ఫలాప్తి హేతుః ॥ ౨౭

తా॥ అన్నిరుచులుగలదియైనను కూర ఉప్పులేనిది యేప్రకారము రుచింపదో వైశాఖమాస వ్రతములేని పుణ్యము సత్పురుషులచే కొనియాడతగినదికాదు. ఫలము కొసంగునదియును కాదు.

శ్లో॥ యద్వద్విభూషా సుకృతా నశోభతే వస్త్రేణహీనాలలనా సురాజన్ । క్రియాకలాప స్సుకృతోపి పుంభి ర్నభాసతే మాధవ మాస హీనమ్ ॥ ౨౮

తా॥ ఓరాజా! వనిత అనేక అలంకారములు, సౌందర్యము గలదియైనను వస్త్రమును ధరింపనట్లు ప్రకాశింపదో యట్లే పురుషునిచే ననేక సుకృతములు చేయఁబడినను వైశాఖమాస వ్రతమును జేయనియెడల ప్రకాశింపవు.

శ్లో॥ తస్మాత్సర్వప్రయత్నేన యేనకేనాపిజంతునా ।
ధర్మోవైశాఖమాసేతు కర్తవ్యఇతినిశ్చయః ॥ ౨౯

తా॥ చుఁబట్టి యేజంతువుకైనను సమస్త ప్రియత్నములచే వైశాఖమాసములో ధర్మము చేయవలయునని ధర్మవేత్తల యభిప్రాయము.

శ్లో॥ మధుసూధనముద్దిశ్య మేషసంస్థేదివాకరే ।
ప్రాతస్స్నాత్వార్చయేద్విష్ణు మన్యథానరకంవ్రజేత్॥ 30

తా॥ విష్ణుమూర్తి ప్రీతినిమిత్తమై సూర్యుఁడు మేషరాశియందుండఁగా ప్రాతఃకాలంబున స్నానముజేసి విష్ణుమూర్తి పూజింపవలయును. లేనియెడల నరకమును బొందును.

శ్లో॥ వైశాఖస్సఫలోమాసో మధుసూధనదైవతః ।
తీర్థయాత్రాతపోయజ్ఞ దానహోమఫలాధికః॥ 31

తా॥ విష్ణుమూర్తి అధిదేవతయగు వైశాఖమాసము ఫలమునిచ్చునది యగును. మఱియు తీర్థయాత్ర, తపస్సు, యజ్ఞము, దానము, హోమము మొదలగువాని ఫలములకంటె నధికఫలమిచ్చును. (ప్రార్థనా మంత్రః.)

శ్లో॥ మధుసూదనదేవేశ వైశాఖేమేషచేరవౌ ।
ప్రాతస్స్నానంకరిష్యామి నిర్విఘ్నంకురుమాధవ॥ 32

తా॥ దేవతలకు ప్రభువగు నో మధుసూదనా! వైశాఖమాసములో సూర్యుఁడు మేషరాశియందుండఁగా నేను ప్రాతస్స్నానమును చేయుచున్నాను. కాబట్టి విఘ్నమును కలుగనీయకుము అను అర్ఘమిచ్చునట్టి మధుసూదన అనెడు శ్లోకము చదివి ప్రార్థించవలయును. (అర్ఘ్య మంత్రః.)

శ్లో॥ వైశాఖేమేషగేభానౌ ప్రాతస్స్నానపరాయణః ।
అర్ఘ్యంతేఽహంప్రదాస్యామి గృహాణమధుసూదన॥ 33
గంగాద్యాస్సరితస్సర్వా స్తీర్థానిచహ్రదాశ్చయే ।
ప్రగృహ్ణంతుమయాదత్త మర్ఘ్యంసమ్యక్ప్రసీదథ॥ 34
ఋషభఃపాపినాంశాస్తా త్వంయమస్సమదర్శనః ।
గృహాణార్ఘ్యంమయాదత్తం యథోక్తఫలదోభవ ।
ఇతిచార్ఘ్య సమర్ప్యాథ పశ్చాత్స్నానంసమాచరేత్॥ 35

తా॥ ఓవిష్ణుమూర్తి! వైశాఖమాసములో సూర్యుఁడు మేషరాశియందుండఁగా ప్రాతస్స్నానమందాసక్తిగలవాఁడనై నీకొఱకర్ఘ్యమిచ్చుచున్నాను. గ్రహించుము. గంగ మొదలగు నో నదులారా! ఓతీర్థములారా! ఓసరస్సులారా! మీకొఱకు నేను శ్రద్ధతో నర్ఘ్యమిచ్చుచున్నాను. గ్రహించి అనుగ్రహింపుఁడు. ఓవిష్ణుమూర్తి!

నీవందరిలో శ్రేష్ఠుడవు, పాపాత్ములను శిక్షించువాఁడవు, సమస్తజీవులను నియమించువాఁడవు. సమస్త భూతములయందు సమదృష్టిగలవాఁడు గాన నేనిచ్చునట్టి యర్ఘ్యమును గ్రహించి నేను చేసిన వ్రతమునకు తగినఫలమునిమ్ము అను నర్థమిచ్చు వైశాఖే, గంగాద్యాః, ఋషభః అను మూడు మంత్రములను చదివి యర్ఘ్యమిచ్చి తిఱిగి స్నానము జేయవలయును.

శ్లో॥ వాససీపరిధాయాథ కృత్వాకర్మాణిసర్వశః ।
మధుసూధనమభ్యర్చ్య ప్రసూనైర్మాధవోద్భవైః ॥ ౩౬
శ్రుత్వావిష్ణుకథాందివ్యాం మేతన్మాసప్రశంసినీం ।
కోటిజన్మార్జితాత్పాపా న్ముక్తోమోక్షమవాప్నుయాత్ ॥ ౩౭

తా॥ అనంతరమున ఉతికిన శుభ్రవస్త్రములనుధరించి సంధ్యావందనాది సమస్తకర్మముల నెఱవేర్చి వైశాఖమాసమునందు పూచిన పుష్పములచే విష్ణుమూర్తిని పూజించి వైశాఖమాసమును ప్రశంసించునదియు, శ్రేష్ఠంబైన విష్ణుకథను వినినయెడల కోటిజన్మంబులనుండియు చేయఁబడినపాపమువలన విడువఁబడి మోక్షమునుబొందును.

శ్లో॥ నజాతుఖద్యతేభూమౌ నస్వర్గే నరపాతలే ।
నగర్భేజాయతేక్వాపి నభూయ స్తనపోభవేత్ ॥ ౩౮

తా॥ స్వర్గలోకమునఁదుగాని, భూలోకమునందుగాని, పాతాళలోకమునందుగాని యొకప్పుడు నేవిధమైన దుఃఖమును పొందడు. గర్భనరక మనుభవించుటగాని శిశువుగా జన్మంబెత్తుటగాని సంభవింపదు.

శ్లో॥ వైశాఖేకాంస్యభోజీయ స్తథానశ్రుతసత్కథః ।
నస్నాతోనాపిదాతాచ నరకానేవగచ్ఛతి॥ ౩౯

తా॥ వైశాఖమాసములో నెవఁడు కంచములో నన్నముతినునో, సత్కథలను వినఁడో, ప్రాతఃకాలమునందు స్నానముజేయఁడో, దానమియ్యఁడో అట్టివాఁడు నరకములనే పొందుచుండును.

శ్లో॥ బ్రహ్మహత్యాసహస్రస్య పాపంశామ్యేత్కథంచన ।
వైశాఖేయేననస్నాతం తత్పాపంనైవగచ్ఛతి॥ ౪౦

తా॥ వెయ్యి బ్రహ్మహత్యలవలన గలిగినపాపము నేదోయొకవిధముగా పోఁగొట్టుకొనవచ్చునుగాని వైశాఖమాసములో స్నానముజేయనివాని పాపము పోగొట్టుకొనుటకు శక్యముగాదు.

శ్లో॥ స్వాధీనేనచకాయేన హ్యాప్సుస్వాతంత్ర్యవర్తిషు ।

స్వాధీనజిహ్వాయోశ్చార్యం హరిరిత్యక్షరద్వయమ్॥ ౪౧

తా॥ తనశరీరము జబ్బులేక ధర్మమాచరించుటకు స్వాధీనమైయుండఁగా స్వాధీనమంగున్న జలములయందు స్నానముజేసి నాలుక స్వాధీనమై యుండగానే హరి యను భగవన్నామస్మరణ జేయవలయును. అనఁగా వృద్ధాప్యముచే నింద్రియపటుత్వము చెడకమునుపే భగవద్ధ్యానము జేయవలయును.

శ్లో॥ నకుర్యాద్యదివై శాఖే ప్రాతస్స్నానం నరాధమః ।
జీవన్నేనచపంచత్వ మాగతోనాత్రసంశయః ॥ ౪౨

తా॥ ఏదుర్మార్గుఁడు వైశాఖమాసములో ప్రాతఃకాలమున స్నానముజేయఁడో వాఁడు బ్రతికియుండఁగానే (జీవన్మృతుఁడు) మరణించువాఁడగును. సందేహములేదు

శ్లో॥ యేనకేనాప్యుపాయేన మాధవేమధుసూదనం ।
నార్చయేద్యదిమూఢాత్మా సౌకరీంయోనిమాప్నుయాత్ ॥

తా॥ వైశాఖమాసములో నేవిధముగానైనను విష్ణుమూర్తిని పూజించని మూఢుఁడు పందియోనియందు పుట్టును.

శ్లో॥ యోర్చయేత్తులసీపత్రై ర్వైశాఖేమధుసూదనం ।
నృపోభూత్వాసార్వభౌమః కోటిజన్మసుభోగవాన్ ।
పశ్చాత్కోటికులై ర్యుక్తో విష్ణోస్సాయుజ్యమాప్నుయాత్ ॥౪౩

తా॥ వైశాఖమాసములో విష్ణుమూర్తిని తులసీదళములచే పూజించినవాఁడు చతుస్సముద్రపర్యంతము నేలునట్టి ప్రభువగుచు కోటిజన్మములపర్యం మైశ్వర్యము గలవాఁడై అనంతరమున కోటి పురుషాంతరములవారితోఁగూడ విష్ణులోకమునుబొంది విష్ణునం దైక్యముజెందును.

ధర్మప్రశంసోనామ చతుర్థోఽధ్యాయ సమాప్తః ॥

---

## అథ పంచమోఽధ్యాయః.

నారదః॥ శ్లో॥ వైశాఖస్సర్వధర్మేభ్య స్తపోధర్మేభ్యఏవచ ।
కథంససర్వమాసేభ్యో దానేభ్యోప్యధికోఽభవత్ ॥ ౧
తద్వక్ష్యామిమహాప్రాజ్ఞ శృణుచైకమనాభవ ॥

తా॥ విశేషముగా తెలిసిన యోరాజా! సమస్త పవిత్రధర్మములకంటెను, తపోధర్మములకంటెను, అన్నిమాసములకంటెను, అన్నిదానములకంటెను వైశాఖమాస

మెట్లధికమైనదో ఆవిషయమునుగుఱించి చెప్పుచున్నాను. సావధాన మనస్సుగల వాఁడవై వినుము.

శ్లో॥ కల్పాంతే దేవరాడ్విష్ణు శ్శేషశాయీమహాప్రభువః ।
కుక్షిస్థలోకసంఘోయం సంశేతేప్రలయార్ణవే ।
అనేకోహ్యేకతాంప్రాప్య భూతిభిర్యోగమాయయా॥ 3

తా॥ పూర్వము సృష్టియొక్క చివరను (అనఁగా సంహారకాలమందు) దేవతలలో శ్రేష్ఠుండును ఆదిశేషునియందు శయనించువాఁడును, గొప్ప ప్రభువునగు విష్ణుమూర్తి అష్టైశ్వర్యముల శక్తిచేతను, యోగశక్తిచేతను యీలోకములను జీవులను తనయం దైక్యముచేసికొని ప్రళయకాలమందంతటను వ్యాపించియున్నట్టి సముద్రమునందు పరుండెను.

శ్లో॥ నిమేషస్యావసానేతు శ్రుతిభిర్బోధిత స్తతః ।
కుక్షిస్థజీవసంఘానాం రక్షాంచక్రేదయానిధిః ॥ ౪

తా॥ నిద్ర పూర్తియైనపిమ్మట వేదములచే మేలుకొలుపబడినవాఁడై దయాసముద్రుఁడగు విష్ణువు తనగర్భమందున్నట్టి జీవులను రక్షించెను.

శ్లో॥ తత్తత్కర్మఫలప్రాప్త్యై సృజ్యాన్ స్రష్టుంమనోదధే ।
తస్యనాభేరభూత్పద్మం సౌవర్ణంభువనాశ్రయమ్॥ ౫

తా॥ తనగర్భమందిమిడియున్న జీవులను తిఱిగి ఆయాజీవులకు తగిన కర్మఫలమునకు తగినట్లుగా సృజించవలయునని నెడి కోరికయుద్భవించగానే ఆభగవంతుని నాభివలన సమస్తలోకములతో నిండియున్న బంగారునికొరమైన యొక పద్మము ప్రభవించెను.

శ్లో॥ బ్రహ్మాణంజనయామాస వైరాజంపురుషాహ్వయం ।
తస్మింత్ససర్జ భగవాన్భువనాని చతుర్దశ॥ ౬

తా॥ భగవంతుఁడైన విష్ణుమూర్తి ఆపద్మమువలన పురుషుఁడు అనే పేరుగల ప్రకాశించుచున్న బ్రహ్మదేవుని పదునాలుగులోకములను సృజించెను.

శ్లో॥ భిన్నకర్మాశ్రయప్రాణి సంఘాంశ్చవివిధాన్ బహూన్ ।
త్రిగుణాన్ప్రకృతింలోకే మర్యాదాశ్చాధిపాం స్తథా ।
వర్ణాశ్రమవిభాగాంశ్చ ధర్మాన్ క్లృప్తించసోఽకరోత్॥ ౭

తా॥ వేలువేలుకర్మల నాశ్రయించియున్న జీవరాసులను ఆయాకర్మఫలములకు ననుకూలముగా ననేకవిధములుగాను త్రిగుణములను, మాయను లోకమునందు

ప్రభువులను వారికి తగిన పాలనావిషయమగు పద్ధతులను బ్రాహ్మణాది వర్ణముల యొక్కయు బ్రహ్మచర్యాద్యాశ్రమములయొక్కయు విభాగములను ధర్మనిర్ణయము చేయువిధముల జేయవలయునో ఆభగవంతుడట్లుచేసెను.

శ్లో॥ వేదైశ్చతుర్భిస్తంత్రైశ్చ సంహితాస్మృతిభిస్తథా ।
పురాణైరితిహాసైశ్చ స్వాజ్ఞారూపైర్మహేశ్వరః ।
ఋషీన్ప్రవర్తకాంశ్చక్రే ధర్మగుప్త్యై మహాప్రభుః ॥ ౯

తా॥ గొప్పప్రభువగు విష్ణుమూర్తి ధర్మమును కాపాడుటకొఱకు నాలుగు వేదములను, తంత్రములను, సంహితలను, స్మృతులను, పురాణములను తన ఆజ్ఞ ననుసరించి యున్న ఇతిహాసముల నభ్యసించి యాచరించునట్లుగా మునీశ్వరులను ప్రవర్తింపజేసెను.

శ్లో॥ తైః ప్రవర్తితధర్మాస్తు వర్ణాశ్రమవిభాగజాః ।
ప్రజాశ్శ్రద్ధధిరే సర్వా స్స్వోచితాన్ విష్ణుతోసదా ॥ ౧౦

తా॥ ఆమునీశ్వరులచే నాచరింపఁబడినవియు వర్ణాశ్రమ విభాగ రూపమైన ధర్మములను సమస్తప్రజలాచరించుచు తమకు తగినవియు విష్ణుప్రీతికరములగు ధర్మముల నాచరించుచుండిరి.

శ్లో॥ తాంస్తు ప్రవర్తమానాంస్తు స్వాశ్రమాన్ ద్రష్టుమీశ్వరః ।
హృదిస్థోప్యవ్యయస్సాక్షా ద్విభీష్టార్థం పరీక్షయా॥ ౧౧

తా॥ నాశరహితుండగు విష్ణుమూర్తి జీవుల హృదయమందుండినను తనచే నేర్పఱుపబడిన ధర్మము లెట్లుజరుగుచున్నవో పరీక్ష చేయవలయునను తలంపుతో తనసంబంధమగు నాశ్రమములను జూచుటకు వచ్చెను.

శ్లో॥ అనూనాన్ కుశలాత్యత్ర ధర్మాన్ కుర్వంతి వై ప్రజాః ।
సకాలః కోభవేద్విద్వ న్నితి తం చింతయన్ ప్రభుః ॥ ౧౨

తా॥ ప్రభువగు విష్ణుమూర్తి విశేషమైనవియు యోగ్యమైనవియునగు ధర్మముల నేకాలమందు ప్రజలు జేయగలరో అట్టి తగినకాలమును విచారించుచున్నాడు.

శ్లో॥ వర్షాకాలోమయాస్సృష్టి స్సీదంత్యస్త్రాణమాః ప్రజాః ।
తత్రానూనా న్నకుర్వంతి ధర్మాన్ పంకాద్యుపద్రుతాః॥ ౧౩

తా॥ వర్షాకాలము నాచే సృజింపఁబడినదిగదా, ధర్మమాచరించుటకు వీలుగా నుండునాయనిన యీప్రజలు బురద మొదలగు కష్టములనుబొంది ధారాళముగా విశేషమైన ధర్మములను చేయజాలకుండిరి.

శ్లో॥ [illegible]పవనస్నా త్రేషుతుష్టిర్నమేభవేత్ ।
[illegible]తాంకేదంతు తస్మాత్తానవలోకయే॥ ౧౪

తా॥ [illegible] అవస్థాకాలమును జూచితే నాకు కోపమువచ్చుచున్నది వర్షాకాలమందు [illegible] చేసినవారియందును నాకు అంతగా ప్రేమలేదు, కాబట్టి [illegible] చేసిన [illegible] వలయునుగాన వారిని జూడకుండుటయే మంచి [illegible].

శ్లో॥ [illegible]త్రపూర్తిః కర్తుంనాన్నైవజాయతే ।
కేచిత్[illegible]ఫలాసక్తాః కేచిద్దృష్టిభిరాదిరితాః ॥
కేచిచ్ఛీతార్దితాస్తస్మా త్తాందృష్ట్వారోషఏవమే ।
నై[illegible]మాసస్య నమేతోషోభిజాయతే ॥ ౧౬

తా॥ ఇంకను శరత్కాలమువిషయమై విచారింతుమనిన కృషివలన గలుగు ఫలితము సంపూర్తిగా కానేరదు. కొందఱు బాగుగా పండినపండ్లను తినుటయందే వాంఛగలవారలైయుందురు. మఱికొందఱు నేత్రవ్యాధులచే పీడింపబడుచుందురు. మఱికొందఱు చలిచే బాధపడుచుందురు. కాబట్టి వారిని జూచితినేని కోపము సంభవించును. ఇట్టి దుర్గుణములు వారియందు కలుగుచుండగా నాకు ప్రేమయెట్లుకలుగును.

శ్లో॥ ఉత్థాపనంతునేచ్ఛంతి ప్రాతశ్శీతార్తమంతఆగతే ।
కోపమేఽనుత్థితాందృష్ట్వా ప్రాతస్సూర్యోదయేసతి ॥ ౧౭

తా॥ హేమంతఋతువులో చలిబాధ యధికమగుటచే నుదయమునలేచుటయందెంతమాత్రి మిష్టముండదు. అట్లు సూర్యోదయమైనను ప్రాతఃకాలమునందు లేవని వారియందు నాకు కోపముకలుగును.

శ్లో॥ శిశిరేపితథావార్తాః ప్రాతఃకాలేఇమాఃప్రజాః ।
తథాపక్వఫలాదాన సక్తాహ్యానిశమంజసా ॥ ౧౮

తా॥ శిశిరఋతువునందును జనులు ప్రాతఃకాలమందు చలిచే బాధింపఁబడినవారలగుచుందురు. మఱియు నెల్లప్పుడు పండిన పండ్లను తినుటయం దాశక్తి కలిగియుందురు.

శ్లో॥ ప్రసక్తీతార్దితాఃప్రాత స్స్నానార్థమితిచింతితాః ।
తేషాంతుకర్మలోపస్స్యా న్నైవపూర్తిఃకథంచన ॥ ౧౯
ప్రీతిహ్యాయాస్సమయోనాయ మితిచింతాకులోవిభుః ।
వసంతసమయంమేనే సర్వాంప తినివారకమ్ ॥ ౨౦

తా॥ ఈ శీతకాలములో స్నానముచేసిన తిఱిగి విశేషముగా చలి బాధించు నని స్నానముజేయ నిచ్ఛగించరు. అట్టివారికి కర్మ లోపమేగాని కర్మ పూర్తి యె ట్లగును? కాఁబట్టి వర్షఋతువు మొదలు శిశిరఋతువుపర్యంత ముండుకాలము ధర్మ యోగ్యమైనది కాదుగాన నిప్పుడు నేను జూచుటకు సమయముకాదని భగవంతుఁడు విచారించి వసంతఋతువునం దేవిధములగు కష్టములు సంభవించవుగాన నదియే ధర్మ యోగ్యమైన కాలమని తలఁచెను.

శ్లో॥ స్నానేదానేతథాయాగే క్రియాయాంభోగ ఏవచ ।
నానాధర్మవిధానేచ హ్యనుకూలోహ్యయంఋతుః ॥ ౨౧

తా॥ ఈవసంతఋతువు స్నానముజేయుటయందును. దానమిచ్చుటయందును యజ్ఞముజేయుటయందును మఱియు సౌఖ్యముల ననుభవించుటయందును, మఱియు నివిగాక ననేకధర్మముల జేయుటయందును యోగ్యమైనకాలము.

శ్లో॥ అప్రయాసేనలభ్యాని ద్రవాణ్యసుభృతాంధ్రువం ।
యేనకేనచద్రవ్యేణ తుష్టిస్తనుభృతాంభవేత్ ॥ ౨౨

తా॥ ప్రాణముగల సమస్తజీవరాసులకు వసంతఋతువునందు సులభముగా పదార్థములు సంభవించును. ఏపదార్థముచేతనయినను దేహధారులకు తృప్తికలుగును.

శ్లో॥ విష్ణోరాధారభూతానాం తద్ద్రవ్యంధర్మసాధనం ।
వసంతేసకలంద్రవ్యం ప్రాణినాంతుసుఖావహమ్ ।
దానయోగ్యంధర్మయోగ్యం భోగయోగ్యంతుసర్వశః॥ ౨౩

తా॥ వసంతఋతువునందు జీవులకు సమస్త పదార్థములు సులభముగా సంభ వించును. అట్టి ద్రవ్యముచే విష్ణుసంబంధమగు నన్నివ్రతములును జేయఁదగును. మఱి యును అట్టిద్రవ్యము యెల్లప్పుడు దానమునకు ధర్మమునకు అనుభవించుటకు యో గ్యమయినదగును.

శ్లో॥ నిర్ధనానాంతుపంగ్వాది వికలానాంమహాత్మనాం ।
ద్రవ్యాణిచసులభ్యాని జలాదీనినసంశయః ।
ద్రవ్యైరేతైస్స్వాత్మహితం ధర్మ కుర్వంతిమత్ప్రియాః॥ ౨౪

తా॥ కుంటివాఁడు మొదలగు వికలాంగులకు, ధనములేనివారికి, మహానుభావు లకు, మఱియు నందఱికిని జలము మొదలగు పదార్థములన్నియు సులభముగా లభిం ముగా లభించును. నాభక్తులైనవారు యీ ద్రవ్యములచే నాకిష్టమగు ధర్మమును జేయుచుందురు.

శ్లో॥ పత్రైః పుష్పైః ఫలైరన్యైశ్శాకైశ్చాపి ప్రియోక్తిభిః ।
సత్తాంబూలైశ్చందనాద్యైః పాదప్రక్షాళనాదిభిః ॥ ౨౫
ప్రశ్రయాద్యైరహం తేషాం వరదోహమితీరయన్ ।
సంచింత్య భగవాన్ విష్ణుః ప్రతస్థేరమయాసహ ॥ ౨౬

తా॥ వసంతఋతువునందు అతిథిగావచ్చిన బ్రాహ్మణులను దళములచేతను పుష్పములచేతను, పండ్లచేతను, ఇతరమైన కూరగాయలచేతను, ప్రియమైన మాటల చేతను, మాలికలచేతను, తాంబూలములచేతను, మంచిగంధము మొదలగువానిచేతను. కాళ్ళనుకడుగుట మొదలగువానిచేతను, ప్రార్థనావాక్యములచేతను గౌరవించినవారి కిష్టములగు వరముల నిచ్చుచున్నానని భగవంతుఁడగు విష్ణుమూర్తి పలుకుచు లక్ష్మీదేవితోఁగూడ ప్రయాణమై వెడలెను.

శ్లో॥ వనానిసర్వతః పశ్యన్ వికసత్కుసుమానిచ ।
హృష్టపుష్టజనాకీర్ణం మత్తాళిద్విజసేవితమ్॥ ౨౭
ఆశ్రమాణాంమహార్హాణాం వనగ్రామనివాసినాం ।
ప్రాంగణాదీనిరమ్యాణి హృద్యాన్యానిస్థలానిచ॥ ౨౮
రమాయైదర్శయన్విష్ణుస్సహాదేవైర్మునీశ్వరైః ।
సిద్ధచారణగంధర్వకిన్నరోరగరాక్షసైః । ౨౯
స్తూయమానోభ్యగాద్గేహాన్వర్ణాశ్రమనివాసినామ్॥ 3౦

తా॥ వికసించిన పుష్పములుగలవియు, సంతోషబలములు గలిగిన మనుష్యులు గలవియు, పూజనీయములు గొప్పవియునగు నాశ్రమములతోఁగూడిన వనముల నంతట జూచుచు గ్రామములయందు గృహములకు ముందుగానుండు రమ్యమైన వాకిలిప్రదేశములను, మనోహరమైన తోటలను విష్ణుమూర్తి లక్ష్మీదేవికి చూపించుచు దేవతలు మునీశ్వరులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, కిన్నరులు, ఉరగులు, రాక్షసులు మొదలగు దేవయోని విశేషులచే నుతింపఁబడుచు బ్రాహ్మణాది వర్ణములయొక్కయు బ్రహ్మచర్యాద్యాశ్రమములయొక్కయు స్థానములను జూచుచు వెళ్ళుచుండెను.

శ్లో॥ మీనాదికర్కటాంతంవై సతిష్ఠన్ రమయాసురైః ।
నాస్తంప్రతీక్ష్యపురుషాన్ కృతాకృతసమర్పణాన్ ।
తత్రైవసర్వతాంపుంసాం దదాతీష్టాన్మనోరథాన్ ॥ 3౧

తా॥ ఆవిష్ణుమూర్తి లక్ష్మీదేవితోడను, ఇంద్రుఁడు మొదలగు సమస్తదేవతల తోడను గూడి మీనరాశిమొదలు కర్కటకరాశి యంతముపర్యంతము (అనఁగా చైత్ర

వైశాఖ జ్యేష్ఠాషాఢములయందు) భూలోకంబున సంచరింపుచు తనసంబంధమగు సత్క
ర్మలను జేయువారిని చేయనివారిని జూచుచు తనవ్రతముజేయు భక్తులగు మనుష్యు
లకు కోరిన కోరికల నిచ్చుచున్నాఁడు.

శ్లో॥ మత్తాన్ జనసహాతేప్పుంసో హరత్యాయుర్ద్రిసాదికం ।
యదికుర్వంతి వైశాఖే సపర్యాంపరమాత్మనః ॥ ౩౨
తత్రాపిచలమూర్తీనాం సాధునాంయత్రివైవిభుః ।
మాసేష్వన్యేషుయజ్జాతం కర్మలోపంసహిష్యతి॥ ౩౩

తా॥ మదించి తన సంబంధమగు వ్రతములు సలుపనివారియందు నసహ్యము గలిగి వారిసంబంధమగు నాయుర్దాయమును హరించుచున్నాఁడు. వైశాఖమాసములో పరమేశ్వరునియొక్కయు, లేక విగ్రహములయొక్కయు, సత్పురుషులయొక్కయు పూజజేసినవాఁ డితరమాసములయందు యేకర్మలోపము సంభవించినను దానినంతయు ప్రభువైన విష్ణుమూర్తిని సహించును.

శ్లో॥ యథాదేశాగతంభూపం దృష్ట్వాజానపదాఃప్రజాః ।
యదితంచోపతిష్ఠంతి ప్రశ్రియాద్యైర్మహార్హణైః ॥ ౩౪
తదాకరాదికంన్యూనం పూర్ణంజానాతిపార్థివః ।
పునరప్యధికంచేష్టం తుష్టోదాస్యతినిశ్చితమ్ ।
తదాత్వాకృతపూజానాం దండంతేషాంకరోతిచ॥ ౩౫

తా॥ ఇతరదేశములనుండి వచ్చుచున్న రాజునకు ప్రజలెదురుగావెళ్ళి కానుకలను సమర్పించి స్తోత్రవాక్యములను పలుకుట మొదలగు మర్యాదలను జేసినయెడల యారాజు సంతసించి వారియందనుగ్రహము గలవాఁడై వారిచ్చుపన్ను స్వల్పమైనను అధికమైనదానిగా దలఁచి తిరిగి వారికిష్టమైన కోరికల నెట్లొసంగునో తనకు మర్యాదజేయనివారి నెట్లు దండించునో.

శ్లో॥ తథావిష్ణుస్స్వకీయానాం వైశాఖేమాధవాగమే ।
సపర్యాంకుర్వతాంపుంసాం దదాతీష్టాన్ మనోరథాన్ ।
అకుర్వతాంతథాపుంసాం ధనాదీనిహరత్యలమ్॥ ౩౬

తా॥ ఆప్రకారముగానే వైశాఖమాసములో తనసంబంధమగు పూజను సలుపుచున్న భక్తులకు వారు కోరిన కోరికల నిచ్చుచున్నాఁడు. తన పూజను జేయనివారియొక్క ధనము ఆయుష్షు మొదలగువానిని హరించుచున్నాఁడు.

శ్లో॥ ధర్మగోప్తుర్మహావిష్ణో ర్దేవదేవస్య శార్ఙ్గిణః ।
పరీక్షాకాలపర్యాయం తస్మాన్మాసోత్తమోహ్యయమ్॥ 32

తా॥ ధర్మమును రక్షించువాఁడును, దేవతలకు దేవుఁడును శార్ఙ్గమును ధరించినవాఁడును మహానుభావుఁడునగు విష్ణుమూర్తిచే పరీక్షజేయఁబడు కాలము కాఁబట్టి వైశాఖమాసము మాసములన్నిటిలో శ్రేష్ఠమైనదానిగా జెప్పిరి.

శ్రేష్ఠత్వనిరూపణంనామ పంచమోధ్యాయ సమాప్తః ॥

---

అథ షష్ఠోఽధ్యాయః.

నారదః॥ శ్లో॥ వైశాఖేఽధ్వనితప్తానాం తృషార్తానాంమహీపతే ।
జలదానమకుర్వాణ స్తిర్యగ్యోనిమవాప్నుయాత్॥ ౧

తా॥ నారదుఁడు చెప్పుచున్నాఁడు. ఓరాజా ! వైశాఖమాసమునందు మార్గములో నెండచే తపింపజేయఁబడి నలసి దాహముగొన్న వారికి జలము నీయనివాఁడు పశుజన్మంబెత్తును.

శ్లో॥ అత్రైవోదాహరంతీమ మితిహాసంపురాతనం ।
విప్రస్యగృహగోధాయా స్సంవాదంపరమాద్భుతమ్॥ ౨

తా॥ ఈజలదానము విషయమై పూర్వంబున జఱిగినదియు, మిక్కిలి యాశ్చర్యము కలిగించునదియు, బ్రాహ్మణునకు బల్లికి జఱిగిన వృత్తాంతరూపమైన యొక్క కథను దృష్టాంతముగా జెప్పుచున్నాను.

శ్లో॥ పురాచేక్ష్వాకువంశేఽభూ ద్ధేమాంగ ఇతిభూమిపః ।
బ్రహ్మణ్యశ్చవదాన్యశ్చ జితామిత్రోజితేంద్రియః॥ 3

తా॥ పూర్వకాలమందు బ్రాహ్మణభక్తి గలవాఁడును, త్యాగము గలవాఁడును, శత్రువులను జయించినవాఁడును, ఇంద్రియములను జయించినవాఁడు నగు హేమాంగుడను రాజు ఇక్ష్వాకువంశమునందు జనియించెను.

శ్లో॥ యావంతోభూమికణికా యావంతోజలబిందవః ।
యావంత్యాకాశనక్షత్రా స్తావతీరదదాత్సగాః॥ ౪

తా॥ ఆ హేమాంగుఁడనే రాజు భూరేణువు లెన్నిగలవో, జల బిందువు లెన్నిగలవో, ఆకాశంబున నక్షత్రము లెన్నిగలవో అన్ని గోదానములనుజేసెను.

శ్లో॥ యేచేష్టంయజ్ఞదక్షైభిశ్చ భూమిర్భ్రమిష్మతీశుభా ।
గోభూతిలహిరణ్యాద్యై స్తోషితాబహవోద్విజాః॥ ౫

తా॥ ఆరాజుచే జేయఁబడిన యజ్ఞములయందు పఱచబడిన దర్భలచే భూమి యంతయు నిండియుండెను (అనఁగా ననేక యజ్ఞములను జేసెను) గోదాన భూదాన తిలదాన సువర్ణదానము మొదలగు షోడశమహాదానములచే ననేక బ్రాహ్మణులు తృప్తినొందింపఁబడిరి.

శ్లో॥ తేనాదత్తాని దానాని సవిద్యంత ఇతిశ్రుతం ।
తేనాదత్తంజలంచైకం సుఖలభ్యధియానృప ॥ ౭

తా॥ ఓరాజా! ఆయనచే నీయఁబడని దానములు లేవని వింటినిగాని అందఱికి సులభముగా దొరకుననెడి బుద్ధిచే నొక్క జలదానముమాత్రము జేయఁబడలేదు.

శ్లో॥ బోధితో బ్రహ్మపుత్త్రేణ వసిష్ఠేన మహాత్మనా ।
అమూల్యం సర్వతోలభ్యం తద్దాతుఃకింఫలంలభేత్ ॥ ౮

తా॥ బ్రహ్మదేవుని మానసపుత్రుఁడగు వసిష్ఠమహామునిచేత వైశాఖమాసములో జలదానము జేయవలయునని చెప్పఁబడినను జల మంతటను దొరకునదియే యిదియేమి ఖరీదుకలది? దీనినిచ్చినవానికి నేమిపుణ్యము సంభవించును.

శ్లో॥ దుర్బుద్ధిహేతువాదైశ్చ నజలందత్తవాన్విభుః ॥

తా॥ ఈప్రకారముగా కుయుక్తులను ప్రయోగించుచు దుర్బుద్ధిగలవాఁడై యారాజు జలమునిచ్చినవాఁడు కాఁడాయెను.

శ్లో॥ అలభ్యదానేపుణ్యంస్యా దితివాక్యంసుయుక్తిమత్ ।
సహోనర్చ్యద్విజాన్వ్యంగాన్ దరిద్రాన్వృత్తికర్శితాన్ ।
నార్చయచ్ఛ్రోత్రియాన్విప్రాం స్తత్వజ్ఞాన్బ్రహ్మవాదినః

తా॥ ఏదయినను దొరకనివస్తునిచ్చినను యెవరును పూజించనివారిని పూజించినను పుణ్యముకలుగునను యుక్తిచే ఆరాజు వికలాంగులైన బ్రాహ్మణులను, దరిద్రులను, అనాచారులనుపూజించుచు శ్రోత్రియులును, బ్రహ్మవేత్తలును, యథార్థజ్ఞానముగల వారునగు బ్రాహ్మణులను పూజించకపోయెను.

శ్లో॥ ప్రఖ్యాతాన్పూజయిష్యంతి సర్వేలోకామహర్షణాః ।
అనాథానామవిద్యానాం వ్యంగానాంచద్విజన్మనామ్ ॥ ౧౦
దరిద్రాణాంగతిఃకావా తస్మాత్తేమేదయాస్పదాః ।
ఇతిదుర్దినపాత్రేషు దత్తవాన్కిమపిన్వయమ్ ॥ ౧౧

తా॥ ఈ మనుష్యులందఱు ప్రసిద్ధిగల సత్పురుషులనే పూజించవలయునని

[illegible] లేనివారును, చదువులేనివారును, వికలాంగులును, దరిద్రులు నగు బ్రాహ్మణులను పూజించుము. అట్టి వారిని పూజించనియెడల వారికి [illegible] మొదలగువారియందే నాకు ప్రేమకలుగుచున్నదని [illegible] అయోగ్యులనే పూజించుచుండెనుగాని సత్పాత్రులగు బ్రాహ్మణులకు [illegible] దానమియ్యలేదు.

శ్లో॥ తేన దోషేణ మహతా చాతకత్వం త్రిజన్మసు ।
ప్రతిజన్మని గృధ్రత్వం శ్వాభవత్సప్తజన్మసు ॥ ౧౨

తా॥ ఆ హేమాంగద మహారాజు సత్పురుషులగు బ్రాహ్మణులను పూజింపక [illegible] వైశాఖమాసమునందుగాని మరి యెప్పుడుగాని జలదానము చేయకుండుట అనెడు గొప్ప దోషములచే మూడుజన్మంబులవఱకు వానకోయిలగాపుట్టి [illegible] యొకజన్మమునందు గ్రద్దగాజన్మించి యనంతరం మేడు జన్మంబులవఱకును కుక్కగా జన్మించెను.

శ్లో॥ పశ్చాత్ నృపగృహేజాతో భూపోయంగృహగోధికా ।
శ్రుతకీర్త్యాఖ్యభూపస్య మిథిలాధిపతేర్నృప ॥ ౧౩

తా॥ ఓరాజా! అటుపిమ్మట నా హేమాంగుడను రాజు మిథిలా దేశమునకు ప్రభువగు శ్రుతకీర్తియను రాజుయొక్క గృహమునందు బల్లిగా జనియించెను.

శ్లో॥ గృహద్వారాగ్రతోభ్యాంచ వర్తతే కీటకాశనా ।
సప్తాశీతి తువర్షేషు స్థితా తేనమురాత్మనా ॥ ౧౪

తా॥ మురాత్ముండను యారాజు శ్రుతకీర్తి మహారాజుయొక్క వాకిటియుం [illegible] పెద్దతిద్దికి సమీపములోనుండు గోపుర ద్వారమందుండి యక్కడనుండు [illegible] మొదలగు పురుగులను తినుచు ఎనుబదియేడు సంవత్సరములుండెను.

శ్లో॥ విదేహాధిపతేర్గేహే కదాచిన్నృపసత్తమః ।
శ్రుతదేవ ఇతిఖ్యాత శ్శ్రాంతో మధ్యాహ్న ఆగతః ॥ ౧౫

తా॥ ఇట్లుండగా ఒకానొక సమయమునందు విదేహదేశములకు ప్రభువగు ఆ శ్రుతకీర్తియొక్క గృహమునకు శ్రుతదేవుండను మునిశ్రేష్ఠుడు మార్గాయాసము చెంది మధ్యాహ్నకాలమునందు వచ్చెను.

శ్లో॥ తం దృష్ట్వా సహసోత్థాయ జాతహర్షో నరాధిపః ।
మధుపర్కాదిభిః పూజ్య తస్యపాదావనేజనీః ॥ ౧౬

ఆపోమూర్ధ్నావహాత్ క్షిప్రం తతోత్సైక్తైశ్చబిందుభిః ।
దైవోపదిష్టకాలేన ప్రోక్షితాగృహగోధికా ॥ ౧౭

తా॥ అట్లు వచ్చిన బ్రాహ్మణుని జూచి యా శ్రుతకీర్తి మహారాజు మిక్కిలి సంతోషముగలవాఁడై శీఘ్రముగా లేచి యెదుర్కొని ఆసనమిచ్చి కూర్చుండఁబెట్టి మధుపర్కము మొదలగు పూజాద్రవ్యములచేఁ బూజించి యా బ్రాహ్మణుని పాదములను కడిగి యాజలమును తన శిరస్సున శీఘ్రముగా జల్లుకొనెను. ఆరాజు శిరస్సునందు చిమ్ముకొనిన సమయమందు కొన్ని జలబిందువులు యెగిరి దైవవశముచే పైన గోడయందుండు బల్లిపై బడినవి.

శ్లో॥ సద్యోజాతస్మృతిరభూ త్స్మృతకర్మాదిదుఃఖితా ।
త్రాహిత్రాహీతిచుక్రోశ బ్రాహ్మణంగృహమాగతమ్॥ ౧౮

తా॥ అప్పుడు జలబిందువులు పైనబడినంతమాత్రముననే యజ్ఞానము తొలఁగి పోయి తత్ క్షణమే దివ్యజ్ఞానము కలిగి తనకు పూర్వము సంభవించిన హీనజన్మములను దెలిసికొని దుఃఖించి యాబ్రాహ్మణుని జూచి రక్షింపుము, రక్షింపుము అని మొఱబెట్టెను.

శ్లో॥ తిర్యగ్జంతురవంశ్రుత్వా బ్రాహ్మణోవిస్మితోఽవదత్ ।
కుతఃక్రోశసిగోధేత్వం దశేయం కేనకర్మణా ॥ ౧౯

తా॥ అప్పుఁడా బ్రాహ్మణుడు తిర్యగ్జంతువైనను మనుష్యవాక్కుచే పలికిన యాబల్లిపలుకులను విని యాశ్చర్యముతోంది యోబల్లీ! ఏకర్మముచే నీకిట్టి యవస్థసంభవించినది. ఎందుకు మొఱబెట్టుచున్నావు.

శ్లో॥ త్వందేవఃపురుషఃకశ్చి న్నృపోవాథ ద్విజోథవా ।
కస్త్వంబ్రూహిమహాభాగ త్వానఁద్యాహంసముద్ధరే॥ ౨౦

తా॥ నీవు దేవతవా? పురుషుఁడవా? ఒకానొక రాజువా? లేక బ్రాహ్మణుడవా? ఓ మహానుభావా! ఎందుకు నీకిట్లు కష్టము సంభవించునో చెప్పుము. ఇప్పుడే యాపదనుండి తొలగించెదను.

శ్లో॥ ఇత్యుక్తస్సృణిపఃప్రాహ శ్రుతదేవంమహామతిం ।
అహామిక్ష్వాకుకులజో వేదశాస్త్రవిశారదః ॥ ౨౧

తా॥ ఈప్రకారమడుగఁగా విశేషజ్ఞానసంపన్నుండగు యా శ్రుతదేవునితో నిట్లు బల్లి చెప్పుచున్నది. నేను ఇక్ష్వాకువంశమునందుఁ బుట్టినవాఁడను. వేదశాస్త్రములయందు విశేషమైన ప్రజ్ఞగలవాఁడను.

శ్లో॥ యావంత్యో భూమికణికా యావంతస్తోయబిందవః ।
యావంత్యస్తారకాగగనే తావతీర్దదంస్మగాః ॥ ౨౨

తా. భూమియందెన్ని కణికలుగలవో, యెన్ని జలబిందువులుగలవో, ఆకాశమునందు నెన్ని నక్షత్రములుగలవో అన్ని గోదానములను జేసితిని.

శ్లో॥ సర్వేయజ్ఞామయాచేష్టాః పూర్తాన్యాచరితానిమే ।
దానాన్యపిచ దత్తాని ధర్మరాజ్యం త్వనుష్ఠితమ్ ॥ ౨౩

తా. నేను సమస్తయజ్ఞములను జేసితిని. చెఱువులు త్రవ్వించుట, తోటలు వేయించుట మొదలగు సత్కర్మములను జేసితిని. మఱియు నివిగాక నాచే సమస్త దానములు చేయబడినవి. కాబట్టి ధర్మప్రకారముగానే నేను రాజ్యము నేలితిని.

శ్లో॥ తథాపిమద్గతిర్జాతా మమచోర్ధ్వగతింవినా ।
త్రివారంచాతకత్వంమే గృధ్రత్వంచైకజన్మని ।
సప్తజన్మసుశ్వానత్వం ప్రాప్తంపూర్వంమయాద్విజ ॥ ౨౪

తా॥ ఓబ్రాహ్మణుడా! ఈప్రకార మెల్లప్పుడు సత్కర్మములనే జేయుచు ధర్మప్రకారముగా రాజ్యపరిపాలన జేసినను పుణ్యలోకములేక పాపము ననుభవించుచు మూడుపర్యాయములు వానకోయిలగాను, ఒక పర్యాయము గ్రద్దగాను, ఏడుపర్యాయములు కుక్కగాను జన్మించి యిప్పుడు బల్లిగా జన్మించితిని.

శ్లో॥ సించతానేనభూపేన త్వపఃపాదవనేజనీః ।
బిందవోదూరముత్క్షిప్తా స్తైక్షిప్తోహంకథంచన ।
తేనజన్మ స్మృతిరభూ త్సర్వపాపాన్మ హృతశ్చమే ॥ ౨౫

తా॥ ఇప్పుడీరాజు మీ పాదప్రక్షాళనమును జేసిన యుదకమును జల్లుకొనుటకు పైకి చిమ్మగా వానిలో కొన్ని బిందువులు నాపై బడుటచే నాపాపము యజ్ఞానము తొలగిపోయి పూర్వజన్మస్మృతి గలదాననైతిని.

శ్లో॥ గోధాజన్మానిభావ్యాని వ్యష్టావింశతిమేద్విజ ।
దృశ్యంతేదైవసృష్టాని బిభ్యేతై ర్జన్మభిర్భృశమ్ ॥ ౨౬

తా॥ ఓబ్రాహ్మణుడా! ఇకముందు నాకు యీబల్లిజన్మమందు యిరువది యెనిమిదిపర్యాయములు పుట్టవలసినట్లు యీశ్వరసృష్టి యున్నట్లుగా నాకు కనుపించుచున్నది. కాబట్టి ఆజన్మములనెల్లు తప్పించుకొందునాయని భయపడుచున్నాను.

శ్లో॥ నకారణంప్రపశ్యామి తస్మాద్విస్తరతోవద ।

ఇత్యుక్తస్సద్విజః ప్రాహ జ్ఞాత్వావిజ్ఞానచక్షుషా ॥ ౨౮

తా॥ ఈజన్మములను పొందుటకును కారణమును తెలిసికొన సమర్థురాలను కాను కాబట్టి అట్టికారణమును నాకు సవిస్తరముగా జెప్పుమని బల్లి పలుకఁగా నా బ్రాహ్మణుఁడు దివ్యజ్ఞానముచే తెలిసికొని యిట్లు చెప్పదొడంగెను.

శ్లో॥ శృణుభూపప్రవక్ష్యామి తవ దుర్యోనికారణం ।
నజలంతుత్వయాదత్తం వైశాఖేమాధవప్రియే ॥ ౨౯

తా॥ ఓరాజా! నీకు నీదురవస్థ సంభవించుటకు హేతువును జెప్పుచున్నాను. వినుము. నీవు పూర్వమందు రాజువై యుండఁగా విష్ణుమూర్తికి ప్రీతికరమైన వైశాఖ మాసములో నొక్కనికయిన జలదానమును జేసియుండలేదు.

శ్లో॥ తజ్జలంసులభంమత్వా హ్యమూల్యమితినిశ్చితం ।
నాధ్వగానాంద్విజాతీనాం ధర్మకాలేప్యజానతా ॥ ౩౦

తా॥ ఆజలము ప్రతిస్థలమందును సులభముగా దొరకుననియు, విశేషఖరీదుగల వస్తువుగాదనియు నిశ్చయముగా దలంచి మార్గాయాసముచే నలసి వచ్చిన బ్రాహ్మణులకైనను ధర్మముచేయఁదగిన కాలమని విచారింపక జలదానము చేసితివికావు.

శ్లో॥ తథాపాత్రింసముత్సృజ్య హ్యపాత్రేప్రతిదత్తవాన్ ।
జ్వలంతమగ్నిముత్సృజ్య నహిభస్మనిహూయతే ॥ ౩౧

తా॥ అగ్నిహోత్రమును జేయదలఁచినవాఁడు మండుచున్న యగ్నిహోత్రమును విడిచి బూడిదెయందు హోమముజేసినట్లువలెనే నీవు ధర్మముజేయదలఁచియు సత్పాత్రులగు బ్రాహ్మణులకు దానమీయక అపాత్రులైనవారికే దానమిచ్చితివి.

శ్లో॥ బహుధావర్ణితస్యాపి సౌగంధ్యాదియుతస్యచ ।
కంటకాన్వితవృక్షస్య నకుర్వంతిసమర్చనమ్ ॥ ౩౨

తా॥ అనేకవిధములుగా వర్ణింపఁబడినదైనను పరిమళము మొదలగు సుగుణములు గలవియైనను ముండ్లకంపచే నావరింపఁబడిన వృక్షమునకు నెవరును పూజను జేయరుగదా.

శ్లో॥ విశిష్టానాంపాదపానా మశ్వత్థస్సర్వతాంగతః ।
తులసీంతుసముత్సృజ్య బృహతీపూజ్యతేచకిం ॥ ౩౩

తా॥ వృక్షములన్నిటిలోను రావిచెట్టు శ్రేష్ఠంబైనది. అట్టి రావిచెట్టును పూజింతురు. లేక తులసిని పూజింతురుగాని నాకుడుచెట్టు నెవరుపూజింతురు.

శ్లో. అనాశక్త్యాంపూజ్యతాయాం నప్రయోజకతామియాత్ ।
సంగ్రాహ్యాస్తేప్యనాథాహి దయామాత్రంహి కేవలమ్ ॥ 34

తా॥ దిక్కులేకపోవుట పూజించుట కారణముగాదు. కాబట్టి దిక్కులేని వంటివారు మొదలగువారిని దయచే పోషింపవలయునేగాని పుణ్యము సంపాదించు కొనుటకు కారణములేదు.

శ్లో॥ తపోనిష్ఠా జ్ఞాననిష్ఠా శ్రుతిశాస్త్రవిశారదాః ।
విష్ణురూపాస్సదాపూజ్యా నేతరేతుకదాచన ॥ 35

తా॥ తపస్సునందు జ్ఞానమునందు నిష్ఠగలవారును, వేదములయందును శాస్త్రములయందును నేర్పరులైనవారును విష్ణుస్వరూపులుగాన అట్టివారినే యెల్లప్పుడు పూజింపవలయునుగాని యితరులను బూజించిన ప్రయోజనములేదు.

శ్లో॥ తత్రాపిజ్ఞానినోత్యర్థం విప్రావిష్ణోస్సదైవహి ।
జ్ఞానినామపిభూపాల విష్ణురేవసదాప్రియః ॥ 36

తా॥ వారిలో జ్ఞానముగలవారు ముఖ్యముగా విష్ణుస్వరూపులై యున్నారు. విష్ణుమూర్తియు జ్ఞానముగలవారియందు నెల్లప్పుడు ప్రియముగలవాఁడు.

శ్లో॥ తస్మాత్ జ్ఞానీసదాపూజ్యః పూజ్యాత్పూజ్యతరస్స్మృతః ।
అవజ్ఞాసాధువృత్తానా మిహాముత్రచదుఃఖదా ॥ 37

తా॥ ఆకారణమువలన జ్ఞానముగలవాఁడు యెల్లప్పుడు పూజింపతగినవాఁడు. పూజ్యులందరిలోను మిక్కిలి పూజింపదగినవాఁడు. అట్టి సచ్చరిత్రుల నవమానము జేయుట ఇహలోక పరలోకములయందు దుఃఖము కలుగజేయుచుండును.

శ్లో॥ సేవాహ్యైమహతాంపుంసాం పుమర్థానాంహికారణం ।
కోటయోప్యంధజాతీనాం నపశ్యంతియథాయథమ్ ॥ 38

తా॥ మహానుభావులగు పురుషులను సేవించుట పురుషార్థములగు ధర్మార్థకామమోక్షములకు సాధనము. అజ్ఞానముచే నంధులగు వారెవ్వండైనను యథార్థవిషయమును తెలిసికొనలేరు.

శ్లో॥ ఏవంమందాయుతానాంతు సంగతిర్నార్థదాభవేత్ ॥ 39

తా॥ కాబట్టి మూఢులైనవారి ననేకుల సహవాసముజేసినను పురుషార్థములు కలుగవు.

శ్లో॥ నహ్యమ్మయానితీర్థాని నదేవామృచ్ఛిలామయాః ।

తేషునం త్వ్యకాలేన దర్శనాదేవసాధవః ।
నసాధుసేవనాత్కాఽపి సీదంత్యేతైస్సుశిక్షితాః ॥ ౪౦

తా॥ జలమయములగు తీర్థములను, మట్టిచేగ్రహములను, రాతిరగ్రహములను సేవించినయెడల బహుకాలమునకు తరింతురు. సత్పురుషులను జూచినంతమాత్రము ననే తరింతురు. కాబట్టి సత్పురుషులను సేవించినయెడల వారిచే మంచివిషయము లను బోధింపఁబడినవారలై కష్టములను బొందరు.

శ్లో॥ జన్మమృత్యు జరాద్వైర్వా సుధయాప్యాయితా యథా ।
సజలంతుత్వయాదత్తం సాధవోవా నసేవితాః ॥ ౪౧

తా॥ అమృత పానమును జేసినయెడల జన్మను, మృత్యువు, ముదిమి పోవు రీతిగా సమస్త పాపములను బోగొట్టునట్టి జలదానమును జేసితివికావు. సత్పురుషుల నయినా సేవించితివికావు.

శ్లో॥ తేనతేదుర్గతి శ్చేయం ప్రాప్తాచేక్ష్వాకునందన ।
వైశాఖేమత్కృతంపుణ్యం తుభ్యందాస్యామిశాంతయే॥ ౪౨
భూతంభవ్యంభవేద్యేన కర్మజాతంవిజేష్యసి ।
ఇత్యుక్త్వాపఉపస్పృశ్య దదౌపుణ్యమనుత్తమమ్ ॥ ౪౩

తా॥ ఇక్ష్వాకువంశమందు బుట్టిన నో హేమాంగుడా! ఆకారణంబున నీకు యిట్టి దుర్గతికలిగినది. అట్టి నీదుర్గతి పోవుటకు నేను వైశాఖమాసంబున జేసిన పుణ్య మును నీకిత్తును దానిచే నాగామిసంచిత ప్రారబ్ధస్వరూపములగు కర్మములను జయించ గలవు. అనిపలికి యామునీశ్వరుఁడు జలమును స్పృశించి శ్రేష్ఠంబగు వైశాఖమాసపవిత్ర సంబంధమైన పుణ్యము నిచ్చెను.

శ్లో॥ యదాదత్తంబ్రాహ్మణేన స్నానంకతిదినేకృతం ।
తేనధ్వస్తాఖిలాఘాస్తు త్యక్త్వాతాంగృహగోధికామ్ ॥ ౪౪
దివ్యంవిమానమారుహ్య దివ్యస్రగ్వస్త్రభూషణః ।
పశ్యతామేవభూతానాం మైథిలస్యగృహాంతరే ॥ ౪౫
బద్ధాంజలిపుటో భూత్వా పరిక్రమ్య ప్రణమ్యచ ।
అనుజ్ఞాతోయయౌరాజా స్తూయమానోఽమరైర్దివమ్ ॥ ౪౬

తా॥ ఆమునీశ్వరుఁడు వైశాఖమాసములో కొన్ని దినములయందు స్నానమును జేసిన పుణ్యము నిచ్చినవెంటనే యా బల్లిస్వరూపముగానుండు రాజు తన పూర్వజన్మ పాపమంతయు నశించిపోవుటచే బల్లిరూపమును విడిచి యా శ్రుతకీర్తిమహారాజు

[illegible] అంపఁజు చూచుచుండఁగా దేవతాసంబంధమైన వస్త్రము [illegible] ధరించినవాఁడై [illegible] యామునీశ్వరుని చుట్టు [illegible] హేమాంగమహారాజు దేవతా [illegible] స్వర్గమునుగూర్చి వెళ్లెను.

శ్లో॥ తత్ర స్వర్గే మహాభోగాన్ వర్షాయుతమతంద్రితః ।
[illegible] కాకుత్స్థో భూన్మహాప్రభుః ॥ ౪౭

తా॥ ఆ స్వర్గలోకమునందు పదివేలసంవత్సరములు గొప్ప భోగములననుభ [illegible] వాఁడై పిమ్మట హేమాంగుడే ఇక్ష్వాకువంశమందు కాకుత్స్థుఁడను గొప్ప ప్రభువుగా జన్మించెను.

శ్లో॥ సప్తద్వీపవతీపాలో బ్రహ్మణ్యస్సాధుసంమతః ।
దేవేంద్రస్య సఖా విష్ణో రంశ ఏవ మహాప్రభుః ॥ ౪౮

తా॥ ఆరాజు యేఁడుద్వీపముల పర్యంతము రాజ్యము నేలువాఁడును, బ్రాహ్మణ భక్తిగలవాఁడును, సత్పురుషులకు నిష్టుఁడును, దేవేంద్రునకు స్నేహితుఁడును విష్ణువుయొక్క అంశము సంక్రమించినవాఁడునై యుండెను.

శ్లో॥ బోధితస్తు వసిష్ఠేన వైశాఖోక్తాన్ మనోరమాన్ ।
అనుష్ఠాయాఖిలాన్ ధర్మాన్ తేనధ్వస్తాఖిలాశుభః ॥ ౪౯
దివ్యంజ్ఞానంసమాసాద్య విష్ణోస్సాయుజ్యమాప్నుయాత్ ।
వైశాఖశ్శుభదస్తస్మా త్పుంభిస్సర్వైరనుష్ఠితః ॥ ౫౦

తా॥ ఆరాజు వసిష్ఠమహామునివలన తెలిసికొనఁబడి వైశాఖమాస సంబంధమైన వియు, సొల్లోదకరమైనవియు నగు సమస్తధర్మములను జేసి వానివలన సమస్త పాపములను బోఁగొట్టుకొని శ్రేష్ఠమైన యాత్మజ్ఞానమును బొంది జన్మానంతరమున విష్ణుమూర్తియం దైక్యమునొందెను. కాఁబట్టి వైశాఖమాసము శ్రేష్ఠమైనదిగా జెప్పఁబడినదిగాన సమస్తమైనవారిచే వైశాఖమాససంబంధమైన వ్రతమును జేయఁదగినది.

శ్లో॥ ఆయుష్యశ్శ్రీపుష్టిదోఽయం మహాపాపౌఘనాశనః ।
పురుషార్థానాంనిదానంచ విష్ణుప్రీతికర స్తథా ॥ ౫౧

తా॥ ఈ వైశాఖమాసవ్రతము ఆయుస్సును, కీర్తిని, బలమునిచ్చును. మహాపాపముల నన్నిటిని పోఁగొట్టును. పురుషార్థములగు ధర్మార్థకామమోక్షములకు కారణమైనది. ఈవ్రతముచే విష్ణుమూర్తియు సంతోషించును.

శ్లో॥ హాతస్స్వర్ణ్యనరైస్సర్వై శ్చతురాశ్రమవర్తిభిః ।

అనుష్ఠేయోమహాధర్మో వైశాఖేమాధవాగమే ॥ ౫౨

తా॥ బ్రాహ్మణాది నాలుగువర్ణములవారును, బ్రహ్మచర్యాది నాలుగాశ్రమములవారును, యావజ్జనులును వసంతఋతువు సంబంధమగు వైశాఖమాస వ్రతమును జేయవలయును.

గృహగోధికాఖ్యంనామ షష్ఠోఽధ్యాయ సమాప్తః॥

---

అథ సప్తమోఽధ్యాయః.

నారదః॥ శ్లో॥ రాజాతదద్భుతందృష్ట్వా మైథిలోధర్మవిత్తమః ।
కృతాంజలిస్సుఖాసీనం విస్మితోవాక్యమబ్రవీత్ ॥ ౧

తా॥ నారదుఁడు చెప్పుచున్నాఁడు. మిథిలకు నధిపతియు, ధర్మమును దెలిసిన వాఁడునగు యాశ్రుతకీర్తిమహారాజు అప్పుడు జఱిగిన వృత్తాంతమునంతయు జూచి ఆశ్చర్యమునొంది నవ్వుచు దోసిలియొగ్గి సింహాసనమున సుఖముగా గూర్చుండియుండిన యామునీశ్వరునితో నిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ దృష్టమేతన్మహాశ్చర్యం సాధూనాంచరితంతథా ।
యేనధర్మేణముక్తోభూ ద్రాజాచేక్ష్వాకునందనః ॥ ౨
తంధర్మంవిస్తరేణైవ శ్రోతుం కౌతూహలంహిమే ।
మహ్యంశ్రద్ధావతేవిద్వన్ కృపయావిస్తరాద్వద ॥ ౩

తా॥ ఓమునీశ్వరుఁడా! సత్పురుషుల చరిత్రను జూచిన మిక్కిలి యాశ్చర్యముగానుండును. ఈ హేహయుంగు డేధర్మముచే ముక్తినొందునో ఆధర్మమును సవిస్తరముగా వినుటకు మిక్కిలి కోరికగలవాఁడనై యుంటిని గాన శ్రద్ధతోగూడిన నాకు సవిస్తరముగా జెప్పుము.

శ్లో॥ ఇతిరాజ్ఞాసుసంపృష్టః శ్రుతదేవోమహామునిః ।
సాధుసాధ్వితిసంభాష్య వ్యాజహారనృపోత్తమమ్ ॥ ౪

తా॥ ఈప్రకారముగా శ్రుతకీర్తిమహారాజుచే నడుగబడినవాఁడై శ్రుతదేవుండను మహాముని నీచే నడుగబడిన ప్రశ్న మిక్కిలి బాగుగానున్నదని ప్రశంసించి యా రాజుతో నిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ సమ్యగ్వ్యవసితాబుద్ధి స్తవరాజర్షిసత్తమ ।
వాసుదేవప్రియాన్ధర్మాన్ శ్రోతుంయస్మాన్మతిస్తవ ॥ ౫

తా॥ ఓ రాజశ్రేష్ఠుఁడా! విష్ణుప్రీతికరమైన ధర్మములను వినవలయునని

[illegible]

శ్లో॥ జన్మాంతరసహస్రేషు పుణ్యం వినాకస్యాపి దేహినః ।
నారాయణకథాలాపే మతిర్నైవోపజాయతే ॥ ౬

తా॥ వేలకొలఁది అనేక పూర్వజన్మములయందు పుణ్యమును జేయని మానవుని బుద్ధి నారాయణసంబంధమగు కథలను స్మరించుట యందాసక్తికలుగదు.

శ్లో॥ యతో నో రాజాధిరాజాయ జాతేయంమతిరీదృశీ ।
తస్మాద్భాగవతం మన్యే తేన త్వాం సాధుసత్తమ ॥ ౭

తా॥ రాజశ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడా! నీవు రాజులకందఱికి రాజువైయుండి రాజ్యభోగము ననుభవించుచున్నట్టి యౌవనదశయందుండిన వాఁడవైనప్పటికి నీకిట్టి బుద్ధి కలుగుటవలన నిన్ను పరమభాగవతోత్తమునిగా దలఁచుచున్నాను.

శ్లో॥ తస్మాత్తుభ్యం బ్రువే సౌమ్య ధర్మాన్ భాగవతాన్ శుభాన్ ।
యాన్ శ్రుత్వా ముచ్యతే జంతుర్జన్మసంసారబంధనాత్ ॥ ౮

తా॥ ఓ శాంతస్వభావుఁడా! నీవు భాగవతోత్తముఁడవుగాన మనుష్యుఁ డేధర్మములను తెలిసికొని జన్మమృత్యురూపమైన సంసారబంధమును విడిచిపెట్టఁగలఁడో అట్టి శుభకరంబులగు భగవత్సంబంధమైన ధర్మములను నీకొఱకు చెప్పుచున్నాను.

శ్లో॥ యథాశౌచం యథాస్నానం యథాసంధ్యాచ తర్పణం ।
అగ్నిహోత్రం యథా శ్రాద్ధం తథా వైశాఖసత్క్రియాః ॥ ౯

తా॥ శుచిగానుండుట, స్నానముజేయుట, సంధ్యావందనముజేయుట, తర్పణముజేయుట, అగ్నిహోత్రములనుజేయుట యెట్లు పుణ్యకరములో అటులనే వైశాఖమాసంబున జేసిన ధర్మములు పుణ్యకరములైనవి.

శ్లో॥ వైశాఖే మాధవే ధర్మాన్ అకృత్వా నోర్ధ్వగో భవేత్ ।
న వైశాఖసమో ధర్మో ధర్మజాతేషు విద్యతే ॥ ౧౦

తా॥ విష్ణుప్రీతికరమైన వైశాఖమాసములో ధర్మములను జేయనివాఁడు స్వర్గాది పుణ్యలోకములను బొందనేరఁడు. కావున ధర్మములలో వైశాఖమాస ధర్మముతో సమానధర్మము మఱియొకటి లేదు.

శ్లో॥ సంత్యేవ బహవో ధర్మాః ప్రజాశ్చైవ రాజకా ఇవ ।
ఉపద్రవైశ్చ లుప్యంతే నాత్ర కార్యా విచారణా ॥ ౧౧

తా॥ రాజుచే పరిపాలింపఁబడని ప్రజలవలెనే యనేకధర్మము లున్నవిగాని

యవియున్నియు సుఖకరములైనవి. ఇంకనుపట్లు నెంతమాత్రము విచారింప నగత్యము లేదు.

శ్లో॥ సులభాన్సకలాన్ధర్మాన్ కథయంతే శాఖచోదితాన్ ॥ ౧౨

తా॥ వైశాఖ మాసములో సులభముగా జేయఁదగిన సమస్త ధర్మములను జెప్పుచున్నాను.

శ్లో॥ ఉదకుంభం ప్రపాదానం పథిచ్ఛాయాసువిస్తృతం ।
ఉపానత్పాదుకాదానం ఛత్రవ్యజనయోస్తథా ।
తిలయుక్తమధోర్దానం గోరసానాం శ్రమాపహమ్ ॥ ౧౩

తా॥ జలసహితమైన కలశమును మార్గమధ్యమందు చెట్లనీడలయందు చలివేంద్ర నేర్పఱచి జలము నిచ్చుటయు, చెప్పులను, పావుకోళ్ళను, గొడుగులను, విసనకఱ్ఱల నిచ్చుటయు, తిలసహితమైన తేనెను, ఆయాసమును పోఁగొట్టునట్టి గోసంబంధమగు మజ్జిగ మొదలగువాని నిచ్చుటయును జేయవలయును.

శ్లో॥ వాపీకూపతటాకాది కరణం పథికాశ్రయం ।
నారికేళేక్షుకర్పూర కస్తూరీదానమేవచ ॥ ౧౪

తా॥ మార్గములమధ్యమందు మార్గస్థుల కుపయోగకరమగునట్లుగా నూతులను దిగుడుబావులను, చెఱువులను నిర్మించుట, కొబ్బరికాయలను, చెఱకుగడలను, కర్పూరమును, కస్తూరి మొదలగువాని నిచ్చుటయును జేయవలయును.

శ్లో॥ గంధానులేపనం శయ్యా ఖట్వాదానం తథైవచ ।
తథాచూతఫలం రమ్యం ముర్వారువరసాయనమ్ ॥ ౧౫

తా॥ మంచిగంధమును పూయుటయు, పఱుపు మంచము మొదలగువాని నిచ్చుటయు రుచికరములైన మామిడిపండ్లను దోసపండ్ల నిచ్చుటయు జేయవలయును.

శ్లో॥ దానం దమనపుష్పాణాం తథాసాయంగుడోదకం ।
చిత్రాణ్యన్నాని పూర్ణాయాం దధ్యన్నం ప్రత్యహం తథా ॥ ౧౬

తా॥ దమనమును, పుష్పముల నిచ్చుటయు, సాయంకాలమునందు పానక మిచ్చుటయు, పూర్ణిమదినమునందు పులిహోర మొదలగు చిత్రాన్నముల నిచ్చుటయు ప్రతిదినంబున పెరుగుసహితమైన యన్నము నిచ్చుటయు జేయవలయును.

శ్లో॥ తాంబూలస్యసదాదానం చైత్రదర్శైకరీరకం ।
రవావనుదితే పూర్వం ప్రాతస్స్నానం దినేదినే ॥ ౧౭

తా॥ చల్లనినీరు తాంబూలముల నిచ్చుటయు చైత్రబహుళామావాస్యయందు చెరుకుగొట్టెల నిచ్చుటయును ప్రతిదినమందును సూర్యుఁ డుదయింపక పూర్వ మందు ప్రాతఃస్నానము నాచరించుటయు జేయవలయును.

శ్లో॥ మధుసూదనపూజాచ కథాయాః శ్రవణంతథా ।
అభ్యంగవర్జనంచైవ తథావైపత్రభోజనమ్ ॥ ౧౮

తా॥ విష్ణుసంబంధమగు పూజను విష్ణుకథను వినుటయు తలయంటికొనుట మానుటయు విస్తరిలో భుజించుటయు జేయవలయును.

శ్లో॥ మధ్యేమధ్యే శ్రమార్తానాం వీజనంవ్యజనేనచ ।
సుగంధైః కోమలైః పుష్పైః ప్రత్యహంపూజనంహరేః ॥ ౧౯

తా॥ మార్గాయాసముచే నలసియున్నవారికి అప్పుడప్పుడు విసనకఱ్ఱతో విసరుటయు, సువాసనగలవియు మృదువైనవియునగు పుష్పములతో నిత్యము విష్ణుమూర్తిని పూజించుటయు జేయవలయును.

శ్లో॥ ఫలందధ్యన్ననైవేద్యం ధూపదీపైర్దినేదినే ।
గోగ్రాసంవృషపత్నీనాం ద్విజపాదావనేజనమ్ ॥ ౨౦

తా॥ ప్రతిదినమందు విష్ణుమూర్తిని పూజించి ధూపదీపములనిచ్చి ఫలములను పెరుగుసహితమైన యన్నము నైవేద్యము జేయవలయును. ఆంబోతులకు, గోవులకు నాహారమిచ్చుటయు, బ్రాహ్మణుల పాదప్రక్షాళనమును చేయుచుండవలయును.

శ్లో॥ గుడనాగరదానంచ ధాత్రీపిష్టప్రదాపనం ।
పథికానాంప్రశ్రయంచ దానంతండుంశాకయోః ॥ ౨౧

తా॥ బెల్లము శొంఠి నిచ్చుటయు నుసిరికపప్పు నిచ్చుటయు మార్గస్థులను కుశలప్రశ్నలజేసి యడుగుట బియ్యమును, కూరగాయలనిచ్చుట జేయవలయును.

శ్లో॥ ఏతేధర్మాః ప్రశస్తాహి వైశాఖేమాధవప్రియే ॥

తా॥ ఓరాజా! ఈచెప్పఁబడిన ధర్మములన్నియు విష్ణుప్రీతికరమైన వైశాఖ మాసములో ముఖ్యముగా జేయదగినవిగా జెప్పఁబడినవి.

శ్లో॥ తథాచ విష్ణోః కుసుమార్పణం హరేః పూజాచ కాలోచిత పల్లవాద్యైః । దధ్యన్న నైవేద్య నివేదనంచ సమస్త పాపౌఘ వినాశహేతుః । ౨౨

తా॥ విష్ణుమూర్తికి పుష్పములను సమర్పించుటయు, ఆయా కాలములయం

దుండునట్టి చిగుళ్ళు మొదలగువానిచే విష్ణుని పూజించుటయు, పెరుగుసహితమైన యన్నమును నివేదనజేయుటయు సమస్తపాపరాసులను పోగొట్టుకొనుటకు కారణమై యున్నది.

శ్లో॥ నారీ పృష్ట్వా ద్విజాఖ్యాతం మందిరేవా గృహేవా। పుత్రం సౌఖ్యం క్వాపి నాప్నోతి హంతీ చాంతం వా భర్తుస్వాత్మనోనా మహాత్మన్ ॥ ౨౩

తా॥ ఓమహానుభావుడా! యేస్త్రీ బ్రాహ్మణోత్తములచే ప్రకటింపజేయం బడుచుండెడి విష్ణుమూర్తిని దేవాలయమందుగాని, తన గృహమునందుగాని పూజిం పకుండునో అట్టి స్త్రీ పుత్రాది సంతానమును గాని, సౌఖ్యమునుగాని యెప్పుడును పొందనేరదు. మఱియు పెనిమిటికిని సంతోషమును కలిగించలేదు. తానయినను సంతోష చిత్తురాలై యుండనేరదు.

శ్లో॥ రమాసహాయే మాధవేమాసి విష్ణౌ పరీక్షార్థమై ధర్మసంస్థాం ప్రజానాం। గృహంయాతే మునిభి ర్దైవతైశ్చ కాలేష్వేతం నార్చయేద్యస్సుమూఢః॥ సమూఢాత్మా రౌరవంప్రాప్య పశ్చాద్యాయా ద్యోనిం రాక్షసీం పంచవారం। జలం చాన్నం సర్వదా దేయమస్మిన్ క్షుధార్తానాం ప్రాణినాం ప్రాణహేతుః ॥ ౨౬

తా॥ వైశాఖమాసమందు విష్ణుమూర్తి భూలోకమునమనుష్యులేమైన ధర్మమాచరించు చుండిరో లేదోయని పరీక్షించుటకొఱకు లక్ష్మీదేవితోడను, మునీశ్వరులతోడను, దేవతలతోడను గూడివచ్చి ప్రతిగృహమందు నుండును. కాబట్టి యేమూఢుడు ఆ విష్ణుమూర్తిని పూజింపడో అట్టివాడు రౌరవమను నరక మనుభవించి యనంతరమున అయిదు జన్మంబులపర్యంతము రాక్షసయోనియందు పుట్టుచుండును, కాబట్టి ప్రతి మనుష్యుడును వైశాఖమాసములో విష్ణుమూర్తినిపూజించుచు నాకలిచే పీడింపబడు వారికి ప్రాణధారమైనట్టి జలమునన్నము నెల్లప్పుడు నిచ్చుచుండవలయును.

శ్లో॥ తిర్యగ్జంతు ర్జాయతే నైవ్యదానా దన్నాదానా జ్జాయతేవై పిశాచః। అన్యాదానే చానుభూతాం కథాంతే చాహం వక్ష్యే చాద్భుతాం భూమిపాల ॥ ౨౭

తా॥ జలదానము నియ్యనియెడల పశువుగా జనియించుచున్నాడు. అన్న దానము జేయనియెడల పిశాచమై పుట్టుచున్నాడు. ఓ రాజా! అన్నదానము జేయని

సమయములో ప్రత్యక్షముగా నాచే చూడఁబడినదియు నాశ్చర్యకరమగునదియు నైన యొక కథను జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ రేవాతీరే మత్పితా భూత్పిశాచ స్స్వమాంసాశీ క్షుత్తృషాశ్రాంతగాత్రః। ఛాయాహీనే శాల్మలీవృక్షమూలే హ్యన్నాభావా న్నష్టచైతన్యరూపః ॥ ౨౮

తా॥ పూర్వమందు నా తండ్రి మృతిఁబొందిన పిమ్మట పిశాచశరీరము గలవాఁడై రేవానదీ సమీపమందు తిరుగుచు నాకలి దప్పికలచే నలసినవాఁడై తన మాంసమునే భక్షించుచు నాహారము లేకపోవుటచే శుష్కించిన శరీరముగలవాఁడై నీడలేని బూరుగచెట్టుక్రింద నివసించుచుండెను.

శ్లో॥ క్షుధాతృషా కర్మజాతస్య ముఖస్య సూక్ష్మంఛిద్రం కంఠనాలస్యచాసీత్ । మాసం చాంతఃకంఠమధ్యే నిషణ్ణాం కుర్యాత్పీడాం ప్రాణపర్యంతమేవ ॥ జలం స్పృష్ట్వా కాలకూటప్రకల్పం సుశీతంవాపీహ కాసారసంస్థమ్ । ౨౯

తా॥ ఆకలి దప్పికలచేతను పూర్వము జేసిన దుష్కృతములచేతను పీడింపఁబడుచుండఁగా నా పిశాచముయొక్క కంఠమునందు సూక్ష్మరంధ్రమేర్పడి గాయమై కంఠమధ్యమందు బాధనొందుచున్నవాఁడై దగ్గర సరస్సులో చల్లని యుదకమున్నను కాలకూటవిషమునువలె గ్రహింపక ప్రాణాంతకమైన బాధను పడుచుండెను.

శ్లో॥ తస్యాస్తీరే చాగతోదైవయోగా ద్గంగాయాత్రాకారణా న్మార్గమధ్యే । దృష్ట్వాద్భుతం శాల్మలి వృక్షసంస్థం తృట్వా తృట్వా భక్షయంతం స్వమాంసం । క్రోశంతం తం బహుధా శోచ్యమానం క్షుధాతృషావ్యథితం శర్మభిస్స్వైః ॥ ౩౦

తా॥ అటువంటి సమయములో నేను కాశీయాత్రను జేయుటకు బయలుదేరి యా రేవానదీమార్గముననే వచ్చుచుండి మార్గమధ్యమందు బూరుగవృక్ష సమీపమున తన మాంసమును మాటిమాటికి కోసికొని భక్షించుచున్న వాఁడును ఏడ్చుచున్న వాఁడును పూర్వదుష్కృత కర్మములచేతను ఆకలి దప్పికలచేతను పీడింపఁబడి దుఃఖించుచున్న నాతండ్రి పిశాచమును జూచితిని.

శ్లో॥ సమాం హంతుం ప్రాద్రవత్ పాపకర్మా మత్తేజసానిహ తోఽభూన్నిరీహ । తంచాబ్రువ న్కృపయా క్లిన్నచిత్తో మాభైష్టత్వం హ్యాగమం తేహం త్రాతుమ్ ॥ ౩౧

తా॥ అప్పుడా పాపాత్ముఁడు నన్ను చంపుటకొఱకు వచ్చినవాఁడనై నాతేజస్సుచే కొట్టఁబడి పాఱిపోయెను. అంతట దయచే మెత్తబడిన మనస్సుగలవాఁడనై నీకు భయములేదు అభయము నిచ్చితినని యాపిశాచమునితో బలికితిని.

శ్లో॥ కస్త్వంతాత ! బ్రూహి సద్యోన్న హేతుం కృచ్ఛ్రాదస్మాన్మోచయేమావిషీద । ఇత్యుక్తో మాంపాహి పుత్రం త్వజానన్పూర్వస్థే భూవరాఖ్యే పురేచ । నామ్నామైత్రిస్సకృతేర్గోత్రజోఽహం తపోవిద్యాదానయజ్ఞాదినిష్ఠః । మయాధీతాధ్యాయితా సర్వవిద్యాః కృతోమయాసర్వతీర్థావగాహః ॥ ౩౪

తా॥ మఱియు ఓతండ్రీ ! నీవెవరవు (ఇక్కడ తండ్రీ యను పదము మర్యాదార్థము) నీవు దుఃఖింపకుము. ఆహారములేక దుఃఖించుటకు కారణమేమైయుండునో చెప్పినయెడల యేవిధముగానైనను అట్టికష్టమును దొలఁగించెదనని నేపలుకఁగా నన్ను కుమారునిగా తానెఱుఁగక నిట్లు పలుకుచున్నాఁడు. పూర్వకాలంబున భూవరమను పట్టణంబున నివసించుచుండువాఁడను మైత్రుండను పేరుగలవాఁడను, సంకృతి యను గోత్రమున జనించినవాఁడను. తపస్సు, విద్య. దానము, యజ్ఞము మొదలగు నానియమం దాసక్తిగలవాఁడను. సమస్త విద్యలను నేను చదివితిని. ఇతరులకు చెప్పితిని. సమస్త తీర్థయాత్రలను సేవించితిని.

శ్లో॥ దత్తంనాన్నం మాసివై శాఖసంజ్ఞే లోభాద్భిక్షామాత్రిమప్యంగకాలే । శోచేచాహం ప్రాప్యపైశాచయోనిం నాన్యోహేతుస్సత్యమేవోక్తమంగ ॥ ౩౫

తా॥ లోభినగుటచే వైశాఖమాసములో అన్నదానమును జేయనైతిని. సకాలమందు వచ్చినవారికి భిక్షమునైనను బెట్టనైతిని ఓ. బ్రాహ్మణుఁడా! అందువలన పిశాచజన్మమును బొందితిని. కాఁబట్టి దుఃఖించుచున్నవాఁడను. ఇంతకంటె వేఱొక కారణము లేదు. నిజమునే జెప్పితిని.

శ్లో॥ పుత్రోఽధునా వర్తతే మద్గృహేచ భోరిఖ్యాతి శ్రుతదేవాభిధానః । వాచ్యాత్వస్మై మద్దశా చాత్మజాయ వైశాఖాన్నాదానతోఽభూత్పిశాచః ॥ ౩౬

తా॥ మఱియు విశేష కీర్తిగలవాఁడును శ్రుతదేవుండను పేరుగల కుమారుఁడు నాగృహమునందుండెను. కాఁబట్టి యచ్చటికేగి వైశాఖమాసములో నన్నదానము జేయక పోవుటచే నేను పిశాచజన్మంబును బొందుటను నా కుమారునితో జెప్పుము,

శ్లో॥ దృష్టస్త్వేకే తేపితా సర్వదాయా నోర్ధ్వంగతో వర్తతే. వృక్షమూలే । ఖాదన్మాంసం స్వీయమేవా సుఖిస్యత్పితురుక్తే మాసి వైశాఖసంజ్ఞే । ప్రాతస్స్నాత్వా పూజయిత్వాచ విష్ణుం నిర్వ్యాజాన్మా తర్పయిత్వా జలైశ్చ । దేయంచాన్నం ద్విజవర్యే గుణాఢ్యే ౩౯
ముక్తోఽహమోనేద్యాని విష్ణోః పదంచ ॥

తా॥ మఱియు నీతండ్రిని సర్వదాతీరమునందు జూచితిననియు నూర్ధ్వలోకమును బొందలేదనియు, బూరుగవృక్షముక్రింద నుండెననియు, తనమాంసమును తానే భక్షింపుచుండెననియు, అట్టి నీతండ్రి ముక్తినిపొందుటకు వైశాఖమాసములో ప్రాతఃకాలమునందు స్నానముజేసి నిష్కల్మషమనస్సుగలవాఁడవై విష్ణుమూర్తిని పూజించి జలముచే నాకొఱకు పితృతర్పణముజేసి సర్వగుణసంపన్నుఁడగు బ్రాహ్మణునకన్నదానముజేసినయెడల నేను ముక్తుఁడనై యనాదిమధ్యాంతరహితుండైన విష్ణువుయొక్క స్థానమునుబొందగలనని యని చెప్పెను.

శ్లో॥ ఇత్థం-ప్రోక్తం త్వత్పురస్తాద్వదేతి దయాచైషా మత్కృతే నాత్రశంకా । భద్రంభూయాత్సర్వతోమంగళంతే శ్రుత్వాచాహం భాషితంమే పితుశ్చ । దుఃఖార్తః కాయం దండవత్పాతయిత్వా భృశార్తోహం పాదయో ర్భూరికాలం । నిందన్నిందన్ భార్యహం బాష్పనేత్రః పుత్రోహం తేతాతదైవాగతోహమ్ ॥ ౪౦

తా॥ ఈప్రకారముగా నీయెదుట చెప్పిన వృత్తాంతమునంతయు నాయందు దయయుంచి చెప్పవలయును. ఇందువిషయమై సందేహింపవలదు. నీకు సర్వకాలములయందు శుభమగునని చెప్పిన మాతండ్రిమాటలను విని విచారముగలవాఁడనైయాయనయొక్క పాదములయందు సాష్టాంగముగా పడి విశేషదుఃఖముగలవాఁడనై చాలా కాలమువఱకు లేవక తనను నిందించుకొనుచు కండ్లనుండి బాష్పములను విడుచుచు ఓతండ్రీ! నేను నీపుత్రుఁడను. దైవవశమువలన నేనిచ్చటకు వచ్చితిని.

శ్లో॥ కర్మభ్రష్టోభూసురాణాంవినింద్యో నాభూద్యన్మాత్లేకేశ మోక్షః పితౄణాం । ఆఖ్యాహిత్వం కర్మణా కేన ముక్తో భవితావై తత్కరోమి ద్విజేంద్ర ॥ ౪౧

తా॥ ఓబ్రాహ్మణశ్రేష్ఠుఁడా! ఏకర్మనుచేసిన పితృదేవతలకు మోక్షముకలుగ నేరదో యట్టి భ్రష్టకర్మమునుజేసినను బ్రాహ్మణులకు నింద్యమేగాని యోగ్యతకాదు..

కాఁబట్టి యేకర్మమునుజేసిన నీవు ముక్తిని జెందెదవో అట్టి కర్మమును జెప్పినయెడల చేసెదనని కుమారుఁడు చెప్పెను.

శ్లో॥ తతః పాత్రిహ ప్రీత సర్వాంతరాత్మా యాత్రాంక్రత్వా శీఘ్రమాగత్య గేహం । ప్రాప్తే మాసే మేషసంస్థేచ భానౌ నివేద్యాన్నం విష్ణవే త్వంగుణాఢ్య ।౪౩॥ దానం దేహి ద్విజవర్యే మహాత్మన్ తస్మాన్మోక్షో భవితాసాన్వయవ్య ॥

తా॥ ఈప్రకారముగా శ్రుతదేవుండను తన కుమారుండు యిచ్చటికిచే దైవ వశమున వచ్చుటచే సంతోషయుక్తమైన యావత్తుదేహముగలవాఁడై ఓకుమారుఁడా! నీవు యాత్రలను సేవించి శీఘ్రముగా నింటికివచ్చి సూర్యుఁడు మేషరాశియందు ప్రవే శించినప్పుడు విష్ణువునకు నన్నమును నివేదనముజేసి మహానుభావుండగు బ్రాహ్మణునకు నన్నదానము జేసినయెడల అట్టివానియొక్క యావత్తువంశము తరించి మోక్షమును బొంగుచున్నాఁడు.

శ్లో॥ పితాద్రిదిష్టః కృతయాత్రః స్వ గేహే పాత్రిహ్యాకర్తం మాధవేచాన్నదానమ్ ॥తస్మాన్ముక్తో మత్పితా మ్యాం సమేత్య ధ్యానారూఢో హ్యాభినం ద్యాశిషాచ । గతోలోకం శ్రీపతే ర్దుర్విభావ్యం యస్మిన్గతా ననివర్తంతిభూయః ॥ ౪౪

తా॥ ఈప్రకారము నా తండ్రిచే నాజ్ఞాపింపఁబడి తీర్థయాత్రలను సేవించి తిరిగి నాగృహమునకు వచ్చి వైశాఖమాసములో నన్నదానమును జేసితిని. అందు వలన నాతండ్రి పిశాచశరీరమునుండి విడువఁబడి నావద్దకువచ్చి నన్నుకొనియాడియా శీర్వదించి దివ్యవిమానము నెక్కి యేవిష్ణులోకమునుబొంది తిరిగి జన్మమునుబొందరో అట్టి దుర్లభమైన విష్ణులోకమునుబొందెను.

శ్లో॥ తస్మాద్దానం సర్వశాస్త్రేషు చోక్తం తుభ్యం ప్రోక్తం ధర్మసారం సధర్మ్యం । కిమన్యత్తే శ్రోతు మిచ్ఛా వదస్వ శ్రుత్వా సర్వంతే వదామీతిసత్యమ్ ॥

తా॥ ఓ,రాజా! అటువంటి విశేషఫలము కలదికాఁబట్టి ధర్మములలో శ్రేష్ఠమైనదియు, ధర్మయుక్తమైనదియు సమస్త శాస్త్రములలో జెప్పఁబడిన యన్నదాన మాహాత్మ్యమును నీకొఱకు జెప్పితిని. తిరిగి నీవు దేనిని వినవలయు ననుకొంటివో దానిని చెప్పితినేని యాధర్మములనన్నియు నీకు నిశ్చయముగా చెప్పుచున్నాను.

ఇతిస్కాందే నారదాంబరీషసంవాదే

విశేషకీర్తిగల యా శ్రుతదేవుండను బ్రాహ్మణుఁడు విని సంతసించి యో రాజా! వు చక్కఁగా ప్రశ్న చేసితివని కొనియాడి తాను చెప్ప నారంభించెను.

శ్రుతదేవః॥ శ్లో॥ శృణురాజన్ ప్రవక్ష్యామి యన్మాంపృష్టంతు త్వయా నఘ । శివాభ్యాంచ శివేనోక్తం కైలాసశిఖరేఽమలే ॥ ౭

తా॥ ఓ రాజా! నీవు దేనినడిగితివో దానిని నే జెప్పుచున్నాను వినుమని పుణ్యకరమైన కైలాసపర్వమందు నివసించియుండి సాంబమూర్తి పార్వతీదేవితో జెప్పిన రీతిగా చెప్ప నారంభించెను.

శ్లో॥ సృష్ట్వేమాన్సకలాన్లోకా న్ప్రశాస్తేత్తే షామవస్థితిం ।
ఆముష్మికీమైహికీంచ ద్వివిధాం పర్యకల్పయత్ ॥ ౮

తా॥ భగవంతుఁడు సమస్తలోకములను సృజించి పిమ్మట వానియొక్క స్థితిని ఇహలోక సంబంధమైనదనియు, పరలోకసంబంధమైనదనియు రెండువిధములుగా నేర్పఱచెను.

శ్లో॥ హేతుత్రయంచ ప్రత్యేకం భూతస్థిత్యై మహాప్రభుః ।
జలసేవాన్న సేవాచ సేవాచై వౌషధస్యచ ॥ ౯

తా॥ ప్రభువగు భగవంతుఁడు సమస్త ప్రాణులకు విషంగలుగుటకు త్రాగుటకు జలమును, తినుటకు అన్నమును, రోగముసంభవించినప్పుడు ఔషధము పుచ్చుకొనుట యని మూఁడుకారణముల నేర్పఱచెను,

శ్లో॥ యథాప తేమహాభాగ హ్యైహికస్థితి హేతవః ।
ఏవమాముష్మికే రాజన్ త్రయఏవోత్తాత్రుతౌ ॥
సాధుసేవా విష్ణుసేవా సేవాధర్మపథస్యచ ।
పురాసంపాదితా హ్యేతే పరలోకస్య హేతవః ॥ ౧౦

తా॥ ఓ రాజా! ఈ లోకస్థితినిగుఱించి యేవిధముగా మూఁడుకారణములేర్పడి యున్నవో ఆవిధముగానే పరలోకగతినిగుఱించి సత్పురుషులను సేవించుటయనియు, విష్ణుమూర్తిని సేవించుటయనియు, ధర్మమార్గము నాచరించుటయనియు మూఁడు కారణములను పూర్వమందు భగవంతుఁ డేర్పఱచినట్లుగా శ్రుతియందు జెప్పఁబడుచున్నది.

శ్లో॥ గృహేసంపాదితంయద్వ త్పాథేయంపథగౌ యథా ।
ఐహికాహేతవోరాజన్ సద్యస్సంపాదితాస్సదాః ॥ ౧౧

తా॥ గృహమందుండి సంపాదించిన పదార్థమును మార్గమున ప్రయాణముజేయు

నష్టములెల్లను పారిశ్రత్యముగా తీసికొని వెళ్ళుచున్నా అతియగానే ఓరాజా! ఇహలోకమునందే యిక్కడ సంపాదించిన ప్రయోజనములు పరలోకమునుగుఱించియు కారణము లగుచున్నవి.

శ్లో॥ కించేష్టమపిసాధూనాం మనసోయదిదుస్సహం ।
కుతశ్చిత్కారణాద్రాజన్ తచ్చానర్థాయకల్పతే ॥ ౧౩

తా॥ ఓరాజా! ఒకానొక కార్యము కొంచెము కిష్టమైనప్పటికి సాధువులకు నయిష్టమైనయెడల నట్టి కార్యమొకానొక కారణమువలన తనకు ననర్థము గలిగించునదియే యగుచున్నది.

శ్లో॥ అప్రియంకిముపక్తవ్యం దుఃఖహేతురితిస్ఫుటమ్ ॥ ౧౪

తా॥ అయిష్టకార్యమునే చేసినయెడల దుఃఖమునకు కారణమని చెప్పవలసినదియేలేదు. (అనగా ముఖ్యముగా దుఃఖమును గలిగించును)

శ్లో॥ అత్రైవోదాహరంతీమ మితిహాసంపురాతనం ।
పాపఘ్నంమహదాశ్చర్యం శ్రోతౄణాంరోమహర్షణమ్ ॥ ౧౫

తా॥ దీనినిగుఱించి పాపమును బోగొట్టునదియు, వినువారికి నాశ్చర్యము కలిగించునదియు, ఆనందముచే పులకాంకురమును జేయునదియు నగు పూర్వచరిత్రమును దృష్టాంతముగా జెప్పుచున్నాను.

శ్లో॥ యజ్ఞదీక్షాముపగతః పురాదక్షఃప్రజాపతిః ।
ఆహ్వానార్థంభూతపతేరగమద్రజతాచలమ్ ॥ ౧౬

తా॥ పూర్వకాలమందు దక్షప్రజాపతి యజ్ఞమును జేయదలంచి తనయల్లుండగు సాంబమూర్తిని పిలుచుటకొఱకు కైలాసమునకు వెడలెను.

శ్లో॥ తందృష్ట్వానోత్థితశ్శంభుః స్వస్యైవహితకామ్యయా ।
సర్వామరగురుశ్చాహం ఛందోగమ్యస్సనాతనః ।
భృత్యాహితేబలిహరాశ్చంద్రేంద్రాద్యాస్సురేశ్వరాః ॥ ౧౭

తా॥ అప్పుడు సాంబమూర్తి తాను సమస్తదేవతలకు పూజ్యుఁడననియు, వేదములచే నిర్ధారణజేయఁబడువాఁడననియు, సమస్తభూతములకంటె ప్రాచీనుండననియు, చంద్రుఁడు ఇంద్రుఁడు మొదలగు సమస్తదేవతలు తనకు కానుకలు తెచ్చి యిచ్చునట్టి భృత్యులు కాబట్టి అట్టివారు వచ్చినయెడల తాను లేచి మర్యాదజేయ నవసరము లేదనియు ననియెడి మంచియుద్దేశ్యముతో దక్షప్రజాపతి రాఁగానే ఆయన మేలుకొఱకు లేచి మర్యాద జేయలేదు.

శ్లో॥ స్వామిాభృత్యాయనో త్తిష్ఠే త్స్వభార్యామైపతి స్తథా ।
గురుశ్శిష్యాయనో త్తిష్ఠే దితిశాస్త్రవిదాంమతమ్ ॥ ౧౮

తా॥ భృత్యుఁడు వచ్చెనేని ప్రభువు లేవకూడదు. భార్య వచ్చినయెడల పెనిమిటి లేవకూడదు. శిష్యుఁడువచ్చిన గురువు లేవకూడదు అని శాస్త్రముల దెలిసినవారి మతమైయున్నది.

శ్లో॥ నసంబంధోగురుత్వేచ కారణంత్వితినై! శ్రుతిః ॥ ౧౯

తా॥ అయితే దక్షుఁడు మామగారు, సాంబమూర్తిఁ యల్లుఁడుగనుక మామగారియందు పూజ్యత యుండును. కాఁబట్టి లేవవలయునని ప్రశ్న జేసితిరేని చెప్పుచున్నాఁడు. పూజించుటయందు చుట్టరికము కారణముగాదని శ్రుతులు చెప్పుచున్నవి.

శ్లో॥ బలంజ్ఞానంతపశ్శాంతి ర్యత్రచైవాధికంభవేత్ ।
నగురుశ్చేతరేషాంచ నీచాఃయుశ్చ ప్రేష్యతామ్ ॥ ౨౦

తా॥ బలము, జ్ఞానము, తపస్సు, ఓర్పు మొదలగునవి యెవనియందధికముగా నుండునో వాఁడితరులకు గురువనఁదగును. తక్కువవారు యెక్కువవారిచే నియోగింపఁబడుదురు.

శ్లో॥ ఉత్తిష్ఠంతిచస్వామ్యాద్యా భృత్యాదీన్యదిచాగ్రహాత్ ।
ఆయుర్విత్తంయశ స్తేషాం సద్యోనశ్యతిసంతతిః ॥ ౨౧

తా॥ ప్రభువు, పెనిమిటి, గురువు మొదలగువారు భృత్యుండు భార్య, శిష్యుడు మొదలగు వారినిగూర్చి కోపము మొదలగు నానావిధ కారణముచే లేచిరేని భృత్యుఁడు మొదలగువారియొక్క ఆయుస్సు ఐశ్వర్యము, కీర్తి, సంపత్తు మొదలగునవి నశించిపోవును. కాఁబట్టి తనకంటె తక్కువవారినిగూర్చి యెక్కువవారు లేవగూడదు.

శ్లో॥ తస్మాదహంతునో త్తిష్ఠే ప్రియో౽యంశ్వశురో౽మమ ।
ఇతితస్యహితాన్వేషో నోచ్చచాలాసనాద్విభుః ।
నోత్థితంతుమృడందృష్ట్వా కుపితోభూత్ప్రజాపతిః ॥ ౨౨

తా॥ ఆకారణమువలన నాకుమామగారైనను దక్షునిగుఱించి నేను లేవగూడదు. లేచినయెడల ఆయనసంపత్తు హరించును. అను యూహచే సాంబమూర్తి సింహాసనమునుండి లేవలేదు, అప్పుడు దక్షప్రజాపతి తాను వచ్చియుండఁగా తనకు నల్లుఁడైయుండి సాంబమూర్తి లేచినవాఁడుగాఁడని కోపముగలవాఁడాయెను.

శ్లో॥ అనిందద్బహుధా తస్య పురతో గిరిజాపతేః ।
అహోదర్ప్రమహోదర్పం దరిద్రిస్యాకృతాత్మనః ॥ ౨౩

తా॥ అప్పుడు దక్షప్రజాపతి సాంబమూర్తి యెదుటనే ముందు జెప్పఁబోవు విధమున విశేషముగా నిందించెను. అది యెట్లనంగా దరిద్రుండును, దుర్మార్గుఁడునగు యీతనికి యెంతగర్వము కలిగినది? ఎంత యాశ్చర్యము!

శ్లో॥ యస్యవిత్తంబహువయో వృషశ్చర్మావశేషితః ।
అతఏవ కపాలాస్థి ధరః పాషండగోచరః॥ ౨౪

తా॥ ఇతనియొక్క భాగ్యమును విచారించితిమేని యెక్కుటకు తగిన వాహనములేక చర్మావశిష్టమైన ముక్కిలి ముసలియెద్దు నెక్కెడివాఁడు. అటువంటి దరిద్రుఁడుగనుకనే యెముకలను తలపుర్రెలను ధరించువాఁడు. మఱియు వేదబాహ్యులచే నారాధింపఁబడువాఁడునై యున్నాఁడు.

శ్లో॥ వృథాహంకారిణోహ్యైవం కుతోదాస్యతిమంగళం ।
లోకేకృత్యేనచర్మాణి సుచీసీతివిదోవిదుః ॥
ధత్తేదరిద్రశ్శీతార్తోఽపవిత్రంచగజాజినం ।
వేశ్మశ్మశానంయస్యాస్య ద్భుజగఃకిలభూషణమ్ ॥ ౨౬

తా॥ వృథాగా నహంకారిగా నుండువానికి భగవంతుఁ డెట్లు శుభములను కలుగజేయును? లోకములో నేకార్యమునందైనను చర్మములను ధరించుట శుచి గాదని సెలిసినవారెఱుంగుదురు. లేక దరిద్రుఁడుగాని, చలిచే పీడింపఁబడు వాఁడుగాని అపవిత్రమైన గజచర్మమును ధరించుచున్నాఁడు. ఇఁక ఇల్లుచూతుమనిన శ్మశానములో నివసించుచుండును. పాములను కిరీటము మొదలగు నాభరణములనుగా ధరించుచుండును.

శ్లో॥ నధీరతాపిచజ్ఞానం వృకాత్తస్మాత్పలాయితః ॥
భూత ప్రేతపిశాచాది దుర్జనైస్సంగతోఽనిశమ్ ॥ ౨౭

తా॥ ధైర్యమువిషయ మాలోచించిన యొకప్పుడు తోడేలును జూచి పారిపోయెను. సహవాస మెట్టిదనిన భూతములు ప్రేతములు పిశాచములు మొదలగు దుర్మార్గులతో సహవాస మెల్లప్పుడు జేయుచుండెడివాఁడు.

శ్లో॥ నకులంగోత్రియతేక్వాపి నాఽసావైసాధుసంమతః ॥

తా॥ ఎక్కడ విచారించిన నీతనికి కులగోత్రములే లేవు. ఇతని ప్రవర్తనను విచారించిన పెద్దలెవరు నీతని మెచ్చరు.

శ్లో॥ వృథావిజృంభిదః పూర్వం నారదేన దురాత్మనా ।
యేనాహంబోధితః ప్రాదాం కన్యాంచైతాంసతీంమమ ॥

తా॥ పూర్వమందు దుర్మార్గుండగు నారదుఁడు వచ్చి సాంబమూర్తి మహా గొప్పవాఁడు. మహామంచివాఁడు. అని వ్యర్థమైన పొగడ్తలను నాతో జెప్పఁగా వానిమాటలను నమ్మి యితనికి నాకుమార్తెయగు సతీదేవి నిచ్చి వివాహము జేసితిని.

శ్లో॥ వృథర్గర్మగతాచైషా సుఖంవసతు తద్గృహే ॥

తా॥ ధర్మానుకూలియగు సతీదేవియు సాంబమూర్తి యొక్క గృహమునందే యుండి పెనిమిటిని సేవించుచు సుఖముగా నుండుగాక.

శ్లో॥ నాస్మాభిశ్లాఘనీయో౽సౌ మత్సుతాపికదాచన ।
యథాకులాలకలశ శ్చండాలస్యవశంగతః ॥ 3౦

తా॥ మాబోటివారికి నితఁడు కొనియాడదగినవాఁడు కాఁడు. కుమ్మరవాని దగ్గఱ నుండినప్పుడు కలశము పవిత్రమైనను మాలవాఁడు తాకినపిమ్మట మన కెట్లు స్పృశింపఁదగినది కాదో ఆప్రకారముగానే నాకుమార్తెయు స్వతస్సిద్ధముగా యోగ్యురాలయినను యీదుర్మార్గున కిచ్చుటచేత నయోగ్యురాలాయెను.

శ్లో॥ ఇతిదక్షోవిమూఢాత్మా హ్యుమాంనాహూయతంమృడం ।
బహుధాతం వినిర్భర్త్స్య తూష్ణీమేవగృహం యయౌ ॥ 3౧

తా॥ ఈప్రకారముగా మూఢుఁడగు దక్షప్రజాపతి అనేక విధములుగా సాంబ మూర్తిని నిందించి యల్లుని కూతురిని పిలువక నూరకయే యింటికివెళ్ళెను.

శ్లో॥ యజ్ఞవాటం తతోగత్వా ఋత్విగ్భిర్మునిభిస్సహ ।
ఈజేయజ్ఞవిధానేన నిందన్నేవమహాప్రభుమ్ ॥ 3౨

తా॥ అనంతరము యజ్ఞముజేయు ప్రదేశమునకు వెళ్ళి ఋత్విక్కులు మునీశ్వ రులు మొదలగువారితో గూడినవాఁడై యీశ్వరుఁడగు సాంబమూర్తిని నిందించుచు యజ్ఞమును చేయవలసినవిధిగా జేయుచుండెను.

శ్లో॥ బ్రహ్మావిష్ణూ వినాయేన సర్వేదేవాస్సమాగతాః ।
సిద్ధచారణగంధర్వా యక్షరాక్షసకిన్నరాః ॥ 33

తా॥ ఆయజ్ఞప్రదేశమునకు బ్రహ్మ విష్ణువు లిద్దఱుతప్ప మినిలిన సిద్ధులు చార ణులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, కిన్నరులు వీరు వారని జెప్పనేల సమస్త దేవతలు వచ్చిరి.

శ్లో॥ తదాదేవీసతీప్రాజ్ఞా స్త్రీచాంచల్యాత్ప్రలోభితా ।
దక్షస్యకాహోత్సవంద్రష్టుం బంధూంస్తత్రసమాగతాన్ ॥ ౩౪

తా. అప్పుడు సౌభాగ్యవతియగు పార్వతీదేవి తండ్రి పిలువకపోయినను స్త్రీ స్వభావముచే చంచలచిత్తురాలై యజ్ఞమహోత్సవమును, యజ్ఞమునకువచ్చిన బంధుజనుల జూచుటకు కోరికగలదాయెను.

శ్లో॥ నివార్యమాణాపిరుద్రేణ తరలా స్త్రీస్వభావతః ।
ప్రత్యుక్త్వాపిపునశ్చైవ గంతవ్యమితినిశ్చితా ॥ ౩౫

తా. సాంబమూర్తి అనేకపర్యాయములు వెళ్ళవద్దని చెప్పినప్పటికి వానిమాటలకన్నిటికిని సమాధానము జెప్పి స్త్రీ స్వభావముచే వాంఛగలదియై వెళ్ళుటకే అనుచితముగ నిశ్చయించుకొనెను.

శ్లో॥ సనిందతి సభామధ్యే సదామాం సరవర్ణిని ।
తచ్ఛ్రుత్వాసహ్యంచత్వంసంత్యక్త్వా కాయంసత్యంజహాసివై ॥
అసహ్యమపిసోఢవ్యం త్వయాపిగృహమిచ్ఛతా ।
మయా యథాకృతం దేవి తథాత్వం నైవవర్తసే ॥
తస్మాన్మాగచ్ఛశాలాంవై నశుభంతుభవేద్ధ్రువం ।
ఇత్యేవంబోధితా దేవి చాపల్యాత్పునరాగమత్ ॥ ౩౬

తా॥ అప్పుడు సాంబమూర్తి యిట్లు బోధించుచున్నాడనఁగా ఓ పార్వతీ! నీవు యజ్ఞప్రదేశమునకు వెళ్ళగానే ఆ సభలో దక్షుఁడు నన్ను విశేషముగా నిందించును. వినశక్యముగాని యాదూషణములను విని నీవు శరీరమును విడిచిపెట్టగలవు. యెప్పుడు కష్టమైనప్పటికిని గృహస్థాశ్రమధర్మము నాలోచించి సహించవలయును. అట్లు దక్షుడు నాయెదుట నన్ను దూషించినప్పుడు సహించితిని. అట్లు నీవు యోర్చియుండలేవు. కాఁబట్టి నీవు సమస్తవిధములచేతను యజ్ఞప్రదేశమునకు వెళ్ళుట మానుకొనుము. అట్లు వెళ్ళితివేని నీకు శుభముగలుగదు. అని యీ ప్రకారముగా సాంబమూర్తి యెన్నివిధముల బోధించినను వినక యా పార్వతీదేవి స్త్రీ స్వభావముచే యజ్ఞమును జూడ వాంఛగలదియై యుండెను.

శ్లో॥ నిశ్చక్రామసతీగేహా దేకాకీ పాదచారిణీ ।
తాందృష్ట్వావృషభస్తూర్ణం పృష్ఠే దేవిమువాహసః ॥ ౩౭

తా॥ అప్పుడు పార్వతీదేవి తానొక్కతెయే బయలుదేరి నడచివెళ్ళుచుండఁగా

నాపార్వతీదేవిని చూచి వృషభవాహనము వచ్చి తన వీపుమీద పార్వతీదేవి నెక్కించుకొని వెళ్ళుచుండెను.

శ్లో॥ కోటిశోభూతసంఘాశ్చ హ్యనుజగ్ముస్సతీంతదా ।
యజ్ఞవాటంతు సాగత్వా సతీ శాలాంయయౌపురా ॥ ౪౦

తా॥ పిమ్మట సాంబమూర్తికి ననుచరులగు భూతసమూహములుగూడ బయలుదేరి పార్వతీదేవికి సహాయముగా వెళ్ళినవి. ఇట్లు పార్వతీదేవి భూతసమూహములతోగూడ బయలుదేరి యజ్ఞప్రదేశమునకు వెళ్ళి భూతసమూహములను బయట నిలిపి తాను ముందుగా యజ్ఞమునుజేయు స్థలమునకు వెళ్ళినది.

శ్లో॥ తూష్ణీమాసన్సతీందృష్ట్వా ఖేదాత్తస్మాద్వినిర్గతా ।
పతివాక్యంతుసంస్మృత్య జగామోత్తరవేదికామ్ ॥ ౪౧

తా॥ అట్లువెళ్ళగా నక్కడనుండెడి బంధువులు మొదలగువారుచూచి మర్యాదనుజేయక నూరకుండిరి. అందువలన విచారముగలదియై పినిమిటిచెప్పిన హితమును వినకపోతినని తలంచుచు తండ్రివద్దకు వెళ్ళినయెడల ఆయన యేమైనను గౌరవించునను భావముతో ఉత్తరవేదికయను హోమప్రదేశమునకు వెళ్ళెను.

శ్లో॥ పితాసభ్యాశ్చ తాందృష్ట్వా స్థితాస్తూష్ణీం హతాశిషః ।
సారుద్రాహుతిపర్యంతం పశ్యతీపితృచేష్టితమ్ ॥
త్యక్త్వారుద్రంచజుహ్వాం మువాచాశ్రుకులేక్షణా ॥

తా॥ అప్పుడు నిర్భాగ్యులగు నామె తండ్రియు నక్కడ నుండు సభ్యులును ఆమెనుజూచి యూరకుండిరి. ఆపార్వతీదేవియు రుద్రునికి నివ్వతగిన యాహుతి వచ్చువఱకు తనతండ్రి నడవడి యెట్లుండునోయని చూచుచుండెను. పిమ్మట హోమము లన్నియును జేయుచు రుద్రాహుతిమాత్రము విడిచి మిగిలిన హోమములను జేయుటంజూచి విచారముగలదియై నేత్రములందు కన్నీరువ్యాపించియుండ నిట్లు పలుకుచున్నది.

శ్లో॥ మహాపుల్లంఘనంప్రాంసాం నప్రాయ శ్శ్రేయసేభవేత్ ॥
లోకకర్తా లోకభర్తా సర్వేషాం ప్రభురవ్యయః ।
ఏవంభూతస్యరుద్రస్య కథంనోదీయతేహవిః ॥ ౪౪

తా॥ ఓతండ్రీ ! మహాపురుషులను తిరస్కరించినవారికి తలచుగా శుభము కలుగనేరదు. కావున లోకములను సృజించినవాడును, లోకములను పోషించు

నాఁడును, సమస్త ప్రాణులకు ప్రభువగు మహానుభావుడైన సాంబమూర్తి నెంగు వలన హవిస్సు నిచ్చితివి కావు!

శ్లో॥ జాతాంనకింతే దుర్బుద్ధిం హరంత్యన్యే సమాగతాః ।
నచేద్వైశామహాత్మ్యనః కిమేషాంవిముఖోవిధిః ॥ ౭౫

తా॥ ఇటువంటి దుర్బుద్ధి నీకు పుట్టియుండఁగా తెలిసినవా రెవరైనను వచ్చి నీకు నీవు తగినదికాదని చెప్పినవారులేరే ? ఇక్కడుండు సభికులైనను చెప్పలేదా? వీరికి తెలియదా? అని పార్వతీదేవి పలికెను.

శ్లో॥ ఇత్యేవంభాషమాణాంతాం పూషాదేవోజహాసహ ।
శ్మశ్రూణాంచాలనంచక్రేభృగుర్ధూతకుభస్తథా ॥ ౭౬

తా॥ ఈప్రకారము పార్వతీదేవి పలికినదనుచుండఁగా పూషుఁడను సూర్యుఁడు నవ్వెను. భృగుమహాముని చెడుస్వభావంగలవాఁడై గడ్డమును మీసములను సవరించుకొనెను.

శ్లో॥ భుజపాదోరుకక్షాణాం స్ఫాలనంచక్రిరేపరే. ।
బహుధానిందనం చక్రే తత్పితా హతభాగ్యవాన్ ॥ ౭౭

తా॥ మఱియు నితరమైన సభికులలో కొందఱు భుజములను చఱచువారును కొందఱు పాదములను చఱచువారును, కొందఱు చంకలు కొట్టుకొనువారునై యుండి. పార్వతీదేవి తండ్రియగు దక్షుఁడు కష్టమును బొందువాఁడుగనుక నే యనేకవిధములుగా నాపార్వతీదేవిని నిందించెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వారుద్రభార్యాసా కోపాకులితమానసా ।
ప్రాయశ్చిత్తంత్రుతేఃకర్తుం దేహంతత్యాజనాసతీ ॥
హోమాగ్నౌ వేదికామధ్యే సర్వేషామేవపశ్యతామ్ ।

తా॥ సాంబమూర్తి యొక్క భార్యయగు పార్వతీదేవి దక్షుని దూషణలను విని మిక్కిలి కోపముగల మనస్సుగలదియై తన పెనిమిటిని నిందించిన దక్షుని దూషణ వాక్యములను వినినందుకు తన శరీరమును విడిచిపెట్టుటయే ప్రాయశ్చిత్త మనుకొని సభికులందఱును జూచుచుండఁగా హోమమును జేయుచుండెడి యగ్నిగుండములో బడి మృతి నొందెను.

శ్లో॥ హాహాకారోమహానాసీ ద్రుద్రుదుపుః ప్రమధాద్రుతమ్॥
ఉచఖ్యుస్తేవదేవాయ వర్తాంతమఖిలంతదా ॥

తా॥ ఇట్లు పార్వతీదేవి మృతినొందఁగా ప్రమథగణంబులు మిక్కిలి రోదనము జేయుచు శీఘ్రముగా సాంబమూర్తి యొద్దకు వెళ్ళి దేవతలకు దేవుండగు నా యీశ్వరునితో దక్షుని యజ్ఞప్రదేశమునందు జరిగిన వృత్తాంతమంతయు జెప్పిరి.

శ్లో॥ తచ్ఛ్రుత్వా సహసోత్థాయ రుద్రః కాలాంతకోపమః ।
జటాముత్పాట్య హస్తేన భూతలే తామతాడయత్ ॥

తా॥ ఇట్లు చెప్పిన ప్రమథగణవాక్యములను సాంబమూర్తి విని సంహారకాలము నందుండు యమునివలెనే భయంకరాకారుఁడై శీఘ్రముగా లేచి తన శిరస్సునందుండు జటలలో నొకటి పెరికి దానిని నేలమీఁద కొట్టెను.

శ్లో॥ తతోభవన్మహాకాయో వీరభద్రో మహాబలః ।
సహస్రబాహురభవత్కాలాంతకసమప్రభః ॥
బద్ధాంజలిపుటోభూత్వా వ్యాజహారహరంతదా ॥ ౫౨

తా॥ అనంతరము పెద్దశరీరముగలవాఁడును, విశేషబలముగలవాఁడును, వేయి చేతులుగలవాఁడును, ప్రళయకాలమునితో సమానమైన కాంతిగలవాఁడు నగు వీరభద్రుఁడు పుట్టి దోసిలిపట్టుకొని సాంబమూర్తితో నిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ మహత్సృష్టిస్తుయదర్థంతే తదర్థంమాంనియోజయ ।
ఇత్యుక్తఃప్రాహతంక్రుద్ధో ధూర్జటి స్తంపురస్థితమ్ ॥ ౫౩

తా॥ ఓస్వామీ! ఏకార్యమునిమిత్తము నన్ను సృజియించితిరో అట్టికార్యము నుడివితిరేని చేయుదుననఁగా రౌద్రాకారముతో నున్నట్టి యా సాంబమూర్తి తన యెదుటనున్నట్టి వీరభద్రునితో నిట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ హనత్వంనిందకందక్షం యదర్థేమత్ప్రియాహతా ।
భూతసంఘాస్తుగచ్ఛంతు సహైతేనమహాబలాః ॥ ౫౪

తా॥ ఓవీరభద్రా! నాప్రియురాలైన పార్వతీదేవి యేదక్షునికారణమున మృతి నొందెనో అట్టి దక్షుని సంహరింపవలయును. విశేషబలముగల భూతసమూహములను నీకు సహాయకారిగా రాగలవు.

శ్లో॥ ఇత్యాదిష్టాభగవతా యయుర్యజ్ఞసభాంతదా ।
జఘ్నుస్సర్వాన్మహావీరా న్దేవాసురనరాదికాన్ ॥ ౫౫

తా॥ ఈప్రకారముగా భగవంతుఁడగు సాంబమూర్తిచే నాజ్ఞాపింపఁబడి ప్రమథగణము లప్పుడు వీరభద్రసహితులై దక్షుఁడు యజ్ఞమును జేయు ప్రదేశమునకు

వెళ్ళి అక్కడనుండు దేవతలు, అసురులు, నరులు మొదలగువారిని మఱియు విశేష పరాక్రమముగల వారిని కొట్టెను.

శ్లో॥ పూష్ణశ్చప్రహసతోదంతాన్ జటాభూశ్చబభంజహ ।
శ్మశ్రూణ్యుత్పాటయాంచక్రే భృగోస్తస్యదురాత్మనః ॥ ౫౬

తా॥ పూషుఁడను సూర్యుఁడు పూర్వము నవ్వుటవలన యాయన దంతములను వీరభద్రుఁడూడగొట్టెను. దురాత్ముఁడగు భృగుమహర్షి గడ్డము మీసములను సవరించుకొనుటచే గడ్డము మీసములను పెరికివేసెను.

శ్లో॥ యస్యదానస్ఖలితంప్రాణాం తత్తచ్ఛిచ్ఛేదవీర్యవాన్ ।
తతోదక్షశిరోహంతుం బహుద్యోగం చకారహ ॥ ౫౭

తా॥ పార్వతీదేవి వెళ్ళినప్పుడు పూర్వము మొదట దేవతలు యే యవయవము చేత ఆక్షేపణ కలుగునట్లు కొనెనో, పరాక్రమవంతుండైన వీరభద్రుఁడు వారి వారి యంగములను కొట్టి పిమ్మట దక్షుని శిరసు ద్రుంచవలయునని విశేష ప్రయత్నములను జేసెను.

శ్లో॥ మునిమంత్రపరిగుప్తంతు నైవకృంతతితద్బలం ।
హరోజ్ఞాత్వాతుచిచ్ఛేద స్వయమేత్యదురాత్మనః ॥ ౫౮

తా॥ మునీశ్వరుల మంత్రములచే సంరక్షింపఁబడినదైనది కావున దక్షుని శిరస్సును ద్రుంచలేకపోయెను. అప్పుడు సాంబమూర్తి దక్షునిశిరస్సు నితఁడు ద్రుంచలేఁడని తెలిసికొని తాను స్వయముగా వచ్చి యాదురాత్ముని యొక్క శిరస్సును ద్రుంచివేసెను.

శ్లో॥ ఏవంమఖగతాన్హత్వా సానుగస్స్వాలయంయయౌ ॥
హతావశిష్టాః కేచిత్తు బ్రహ్మాణంశరణంయయుః ॥ ౫౯

తా॥ ఈప్రకారముగా సాంబమూర్తి వీరభద్రుఁడు మొదలగువారు యజ్ఞప్రదేశమునందుండు దుర్మార్గులను జంపి ప్రమథగణసహితులై స్వస్థానమగు కైలాసమునకు వెళ్ళిరి. అంతట నక్కడ చంపఁబడఁగా మిగిలినవారు కొందఱు బ్రహ్మదగ్గఱకు వెళ్ళి రక్షింపుమని వేడుకొనిరి.

శ్లో॥ తైరన్వితో యయౌబ్రహ్మా కైలాసంతుశివాలయం ।
తతోరుద్రంసాంత్వయిత్వా వచోభిర్వివిధైరపి ॥
తేనైవసహితఃప్రాగా ద్యజ్ఞవాటంమహాప్రభుః ।
తేనైవోజ్జీవయామాస సర్వాన్యజ్ఞసభాగతాన్ ॥ ౬౦

తా॥ అప్పుడా బ్రహ్మదేవుండు ఆదేవతలతోఁగూడి శివునిలోకమగు కైలాసమునకు వెళ్ళి యనేక ప్రియవాక్యములను జెప్పి సాంబమూర్తిని శాంతపఱచి యాసాంబమూర్తిసహితముగా దక్షుని యజ్ఞప్రదేశమునకువెళ్ళి అక్కడ మృతినొందిన వారినందఱిని యాసాంబమూర్తి చేఁబ్రతికింపజేసెను.

శ్లో॥ ఖ్యాత్యైపాద్రిదాదజముఖం దక్షస్యతుతదాశివః ।
అజశ్మశ్రూణ్యదాచ్ఛంభు ర్భృగవేతుమహాత్మనే ॥ ౬౨

తా॥ సాంబమూర్తిలోకములలో ప్రసిద్ధిగా నుండుకొఱకు మేకయొక్క శిరస్సునుదెచ్చి యతికించి దక్షుని బ్రతికించెను. మేకయొక్క గడ్డమును దెచ్చి మహానుభావుండగు భృగువునకిచ్చెను.

శ్లో॥ పూష్ణశ్చదంతాన్నప్రాదా త్పిష్టాదంచచకారవా ।
తదంగానాంవ్యతికరం కేషాంచిదపిత్రైశివః ॥ ౬౩

తా॥ పూష్ణుఁడనువానికి దంతములనియ్యక పిండిమాత్రమే తినునట్లుగాఁ జేసెను. మఱియు నెవరెవరికి నేయే యవయవములు పోయెనో ఆయా యవయవములనిచ్చెను. కొందఱికి వ్యతిరేకముగా నిచ్చెను.

శ్లో॥ శివమాపృచ్ఛ్యతేసర్వే బ్రహ్మణాచశివేనచ ।
పునఃప్రవర్తితోయజ్ఞో యథాపూర్వంమహాత్మనః ॥ ౬౪

తా॥ ఆబ్రహ్మదేవునిచేతను శివునిచేతను వారందఱు మేలుపొంది పూర్వమందెట్లు యజ్ఞమునుజేయుచుండిరో ఆరీతిగా తిఱిగి యజ్ఞమునుజేయ ప్రారంభించిరి.

శ్లో॥ యజ్ఞాన్తేసర్వదేవాశ్చ జగ్ముస్తేస్వంస్వమాలయం ।
నైష్ఠికంబ్రహ్మచర్యంతు కృత్వారుద్రోమహాతపాః ।
తేపేగంగాతటేరుద్రః పున్నాగతరుమూలతః ॥ ౬౫

తా॥ అప్పుడా దేవతలందఱు యజ్ఞమును సంపూర్తినొందించి యెవరిగృహములకు వారు వెళ్ళిరి. అనంతరము సాంబమూర్తియు భార్యావియోగముచే గృహమునందుండుట మాని నిష్ఠతో బ్రహ్మచర్యము నవలంబించి గంగానదీ సమీపమందు పున్నాగవృక్షముక్రింద తపస్సు జేయుచుండెను.

శ్లో॥ దక్షాత్మజాసతీదేవీ త్యక్తదేహాపతివ్రతా ।
జజ్ఞేహిమాద్రేర్మేనకాయాం వప్రధేతస్యవేశ్మని ॥ ౬౬

తా॥ అనంతరము దక్షునికుమార్తెయు సాంబమూర్తిభార్యయు పతివ్రతయు

నగు సతీదేవియు దేహత్యాగముజేసిన పిమ్మట హిమవంతునివలన మేనకయందు జని యించి ఆ హిమవంతునయొక్క గృహమునందే పెరుగుచుండెను.

శ్లో॥ ఏతస్మిన్నేవకాలేతు తారకాఖ్యోమహాసురః। సుతీవ్రతపసా
రాధ్య బ్రహ్మాణంపరమేష్ఠినం। అవధ్యత్వంవరంవవ్రే దేవాసుర
నరోరగైః॥ ఆయుధైరస్త్రసంఘైశ్చ సర్వైరేవమహాబలైః।
సదాశివసుతంవినాదైత్యో హ్యవధ్యసకలైరపి॥ ౧౯

తా॥ ఇట్టిసమయములో తారకుఁడను గొప్పరాక్షసుఁడు తీక్ష్ణమైన తపస్సును జేసి సృష్టికర్తయగు బ్రహ్మను మెప్పించి దేవతలు, అసురులు, నరులు, సర్పములు, ఆయుధములు, అస్త్రములు, మఱియు నితరమను గొప్పబలముగలవారు యీ మొదలగు వారచే తాను జంపఁబడకుండునట్లు వరమును కోరఁగా సాంబమూర్తి కుమారుని వలన తప్ప మఱియెవరివలనను నీవు జంపఁబడవనియెను.

శ్లో॥ ఇతితస్మైవరం ప్రాదా ద్బ్రహ్మాలోకపితామహః। అస్త్రీకత్వా
దపుత్రత్వా దస్మాదైత్యస్తథాస్త్వితి॥ వరంగృహీత్వాసహసా
గృహంప్రాప్యలోకాన్బబాధహ॥ ౨౦

తా॥ ఈప్రకారము బ్రహ్మదేవుఁడు వరమియ్యఁగా సాంబమూర్తికి యిదివరకు సంతానమే లేదు. ఇఁకముందు కలుగుననుకొందు మనిన భార్యయు మృతి నొందెను. కాఁబట్టి అట్టిభయము తనకు లేదని యనుకొనినవాఁడై బ్రహ్మదేవుఁ డిచ్చినప్రకార మువరమునుగ్రహించి యింటికివెళ్ళి మూఁడులోకములను బాధింప మొదలుపెట్టెను.

శ్లో॥ దాసాదేవామార్జనాదౌ దాస్యోదేవ్యశ్చతద్గృహే।
తతస్తత్తాడితాదేవా బ్రహ్మాణంశరణంయయుః।
తైఃపీడాంజ్ఞాపితాంశ్రుత్వా వేధాఃప్రాహసురానిదమ్॥ ౨౧

తా॥ దేవతలను తనకు నౌకరులుగను, వారిభార్యలను తన గృహమునందు కసువు నూడ్చుట మొదలగు పనులుచేసెడి దాసీలుగను జేయుంచి తనను యెదిరించినవారిని కొట్టుచు యిట్లు తారకాసురుఁడు బాధించుచుండఁగా, దేవతలు వానిబాధ కోర్వ జాలక సత్యలోకమునకు వెళ్ళి బ్రహ్మదేవునితో విన్నవింపఁగా వారి విన్నపమాల కించి బ్రహ్మదేవుండు దేవతలతో యిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ మయాకదానకాలేహం రుద్రపుత్రంవినాసురాః।
నాన్యైర్వధ్యఇతిప్రాదాం వరంతస్మైదురాత్మనే॥ ౨౩

తా॥ ఓ దేవతలారా! నేను దుర్మార్గుండగు తారకాసురునకు వరమిచ్చినప్పుడు

సాంబమూర్తియొక్క కుమారునివలనతప్ప మఱియొకరివలనను నీవు చంపఁబడవని వరమిచ్చితిని.

శ్లో॥ ప్రజాపతీరుద్రపత్నీ సతీత్యక్తకళేబరా ।
జాతాహిమవతః పుత్రీ పార్వతీతిచనామవిమః ॥ ౭౮

తా॥ సాంబమూర్తి భార్యలేనివాఁడు గదా సంతానము కలుగుటెట్లని ప్రశ్న జేసితివేని కారణమును జెప్పుచున్నాను. పూర్వమందు సాంబమూర్తి భార్యయగు సతీదేవి దక్షుని యజ్ఞకాలమునందు మృతినొందినదియై హిమవంతునకు కూతురుగా జనియించి పార్వతీయను పేరుగలదియై యున్నది.

శ్లో॥ రుద్రోహిమవతఃపృష్ఠే తపశ్చరతిదుశ్చరం ।
యోజయధ్వంచపార్వత్యా రుద్రంలోకేశ్వరంప్రభుమ్ ॥ ౭౯

తా॥ సాంబమూర్తియు హిమవత్పర్వత శిఖరమునందు విశేషమైన తపస్సును జేయుచుండెను. కాన లోకములకు నధిపతియు ప్రభువునగు నాసాంబమూర్తిని పార్వతీదేవితో కలియునట్లుగా నూరుచేయుఁడు.

శ్లో॥ పునర్దేవేంద్రసదనే సంగతైరమరేశ్వరైః ।
ధిషణేనాపిసంమంత్య దేవేంద్రఃపాకశాసనః ॥
సస్మారచస్వకార్యార్థంనారదంస్మరమేవచ ।
తతాగతౌతతస్తౌతు బలభిద్వాక్యమబ్రవీత్ ॥ ౭౨

తా॥ ఈప్రకారము బ్రహ్మదేవుఁడు చెప్పి తనలోకమునకు వెళ్ళెను. అనంతరము దేవేంద్రుని సభలో దేవేంద్రుఁడు, దేవతలు, బృహస్పతియు కలసి యాలోచించి దేవేంద్రుఁడు తాహూలోచించిన కార్యసిద్ధికొఱకు నారదుని మన్మథుని స్మరియించెను. అటుపిమ్మట వారిద్దఱచ్చటికిరాఁగా నారదునితో నిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ హిమవంతంభవాన్గత్వా వచసాతన్నిబోధయ । పుత్రీతవ ప్రాగ్దక్షస్య హరపత్నీ సుతాసతీ ॥ తపశ్చరతితేశృంగే వియుక్తోదక్షకన్యయా । మృడస్తస్యసపర్యాయై వినియోజయతత్ప్రియామ్ ॥ తస్యైవ పత్నీభవితా సపేవభవితాపతిః । ఇత్యాదిష్టో మఘోనాచ నారదోపేత్యతంగిరిమ్ ॥ తద్వైవకారయామాస దేవేంద్రే చోదితంయథా । పశ్చాత్కామంసమాహూయ మఘవానిదమాహచ ॥ ౮౦

తా॥ ఓ నారదా! నీవు హిమవత్పర్వతమునకు వెళ్ళి హిమవంతునితో నేను నీతో జెప్పినట్లు కార్యమును జేయించుము. అతివేగిరముగా నీ మహాత్మురాలగు పార్వతీదేవి గుణాధిక్యంబున యత్నశీలమహాత్మ్యము. సాంబమూర్తికి భార్యగానుండు సతీదేవి. ఆ దేవి యిప్పుడు జన్మించగానే సాంబమూర్తి వైరాగ్యము వహించి నీ యొక్క శిఖరమునందు తపస్సు జేయుచున్నాడు. కాబట్టి యీ జన్మమునందైనను నీ మహాత్మురాలు సాంబమూర్తికే వివాహమగును. సాంబమూర్తికి నీ మహాత్మయే భార్యయగును కాబట్టి నీవు సాంబమూర్తికి శుశ్రూష జేయుటకు నీ మహాత్మురాలగు పార్వతీదేవిని నియోగింపుమని హిమవంతునితో జెప్పి జేయింపుమనగా నారదుం డాప్రకారమే వెళ్ళి జేయించెను. అనంతరము దేవేంద్రుని మన్మథుని బిలచి యిట్లు చెప్పుచున్నాడు.

శ్లో॥ దేవానాంచహితార్థాయ తథామృడహితాయచ । వసంతేన
సమాయుక్తో గత్వా రుద్రతపోవనమ్ ॥ గుణాన్విజృంభ
యిత్వాతు వాసంతాన్హృద్యయావహాన్ । యదా సనిహితా
దేవీ పార్వతీతు మృడస్యతు ॥ తదాప్రయుజ్యత్వంబాణా న్మోహ
యస్వమహాప్రభుం । తయోస్తుసంగమేజాతే కార్యసిద్ధి
ర్భవిష్యతి ॥ ౮౧

తా॥ దేవతల హితముకొఱకును, సాంబమూర్తి హితముకొఱకును నీవు వసంతునితోఁగూడి రుద్రుఁడు తపస్సుజేసెడి వనమునకు వెళ్ళి మనోహరమైన వసంతఋతుధర్మములను నచ్చట ప్రకాశింపఁజేసి పార్వతీదేవి సాంబమూర్తి సమీపములోనుండు సమయమున సాంబమూర్తియందు పుష్పబాణములను ప్రయోగించి పార్వతీదేవియందు మోహముగలుగునట్లుగా జేసితివేని వారిద్దఱు కలియుటవలన మన కార్యసిద్ధి కాగలదు.

శ్లో॥ ఇత్యాదిష్టస్స్మరస్తూర్ణం ప్రతస్థేబాఢమిత్యథ ।
సవసంతస్సరతిక స్సానుగస్త్ర్యంబకం యయౌ ॥ ౮౨

తా॥ ఈప్రకారము దేవేంద్రుఁడాజ్ఞాపించగా నాలాగే చేయుదునని యంగీకరించి మన్మథుఁడు వసంతునితోడను, రతీదేవితోడను, అనుచరులతోడను గూడి శీఘ్రముగా బయలుదేరి సాంబమూర్తి తపస్సుజేయు వనమునకు వెళ్ళెను.

శ్లో॥ అకాలేఋవసంతస్తు జృంభయిత్వాస్వశక్తితః ।
తిస్మోదేపర్వతోరమ్యో మందానిలనిషేవితే ॥ ౮౩

తా॥ అప్పుడు మన్మధుఁడు మలయమారుతముచే వీవఁబడునదియు, అంతటను మనోహరముగానున్న దియు నగు నావనమందు తన సామర్ధ్యమువలన సమయముగాక పోయినను వసంతఋతుధర్మములను వ్యాపింపజేసెను.

శ్లో॥ కదాచిద్దేవదేవోపి పార్వత్యాశ్చ సవర్యయా ।
ప్రీతస్స్వాంకంసమారోప్య కించిద్వ్యాహర్తుమారభత్ ॥ ౮౭

తా॥ సాంబమూర్తియు పార్వతీదేవిచేసిన శుశ్రూషకు సంతసించి యొకప్పుడు తనసమీపమందు గూర్చుండబెట్టుకొని యేదోకొంచెము మాట్లాడుటఁ బ్రారంభించెను.

శ్లో॥ ప్రాణప్రియాసంగమస్యకాలోయమితినిశ్చితః ।
పేశలం ధనురాదాయ సతస్థౌహరపృష్ఠతః ॥ ౮౮

తా॥ పార్వతీదేవియందు మోహమును కలిగింపజేయుటకు నిదేసమయమని నిశ్చయించినవాఁడై మన్మధుఁడు మృదువైన ధనుర్బాణములను గ్రహించి సాంబమూర్తి యొక్క వెనుక దాఁగియుండెను.

శ్లో॥ కృత్వాజవనికాంవృక్షం బాణమేకంముమోచవహ ।
ద్వితీయమపిసంధాయ చక్రేమోక్తుంమహోద్యమమ్ ॥ ౮౯

తా॥ అప్పుడు మన్మధుఁడు నొకచెట్టును చాటుగాజేసికొని యొకబాణమును ప్రయోగించి వ్యర్ధముగాని మఱియొక బాణమునుగూడ ప్రయోగించుట కుద్యుక్తుఁడాయెను.

శ్లో॥ అథక్షుబ్ధమనాభూత్వా మృడశ్చింతామవాపహ ।
నమేమనశ్చలే త్క్వాపి కేనవా కశ్మలీకృతం ।
ఇతిచింతాకులోవామే పార్శ్వేకామం దదర్శహ ॥ ౯౦

తా॥ అనంతరము సాంబమూర్తి చలించిన మనస్సుగలవాఁడై యేమి నామనస్సు యెప్పుడు చలింపదే. అట్టిమనస్సు యెవనిచే చలింపజేయబడినది అని విచారించి నలుదిక్కుల కలియజూచి యెడమభాగమందు మన్మధునిజూచెను.

శ్లో॥ క్రుద్ధోల్మల్యలలాటక్షం స్వాంకాద్దేవీమపాస్యచ ।
తస్యాస్యక్షస్సముభూదగ్ని స్త్రిక్ష్ణోలోకభీషణః ।
జేనదగ్ధోభవత్సద్యో మన్మధస్సశరాసనః ॥ ౯౧

తా॥ అప్పుడు సాంబమూర్తి కోపముగలవాఁడై పార్వతీదేవిని తనసమీపము నుండి త్రోసి మూఁడవనేత్రమును తెఱవగా నా నేత్రమువలన లోకమునకు భయం

కరమగు తీక్ష్ణమైన యగ్ని బయలుదేరఁగా దానివలన నప్పుడే ధనుర్బాణములతో కూడ మన్మథుఁడు భస్మమాయెను.

శ్లో॥ కార్యసిద్ధించపశ్యంతో మునిపుణ్యామరాదివం । శంకమానా స్వదండంచ వసంతోరతిరేవచ ॥ నిమీల్యలోచనేభీతా దేవిమారం ప్రమ్రమవే । సన్నిధానం స్త్రియోహార్త్వం మృడో ష్యఃతరధీయత ॥ ౯౪

తా॥ దేవతలు మనకార్యసిద్ధి యగునా కాదాయని యాలోచించుచు స్వర్గము నకు పోయిరి. వసంతుఁడు, రతీదేవియు తమకును శిక్షకలిగించునేమోయని భీతుపడుచుండిరి పార్వతీదేవియు కండ్లుమూసికొని అక్కడనుండి దూరముగా పోయెను. సాంబమూర్తియు స్త్రీలయెదుట నుండగూడదని యంతర్ధానమయ్యెను.

శ్లో॥ రుద్రస్యేష్టం ప్రకుర్వాణో దేవానాంమనసోహితం ।
వేధేనర్ధమనిర్వృత్తం విప్రియంకుర్వతస్తుకిమ్ ॥ ౯౫

తా॥ మన్మథుఁడుచేసిన కార్యము సాంబమూర్తికిని దేవతలకు నిష్టమైనదైనప్పటికి మన్మథునకు అనర్థమే సంభవించినది. ఇఁక అప్రియమునే చేసినయెడల అనర్థము సంభవించునని చెప్పవలసినది యేమున్నది?

శ్లో॥ తస్మాదిష్టోకుతనయ స్సాధూనామప్రియస్సదా ।
తస్మాదాత్మహితాం సేవాం నాకరోన్మన్మదధీస్సతామ్ ॥ ౯౬

తా॥ ఆకారణమువలన హేమాంగుఁడు యెల్లప్పుడు సత్పురుషులకు నయిష్టుఁడనియే చెప్పఁదగును. సత్పురుషులను సేవించుట లేకుండుటచే నాకు ప్రియకరమగు సేవ జేసినవాఁడు కాకపోయెను.

శ్లో॥ అనుభూతంమహద్దుఃఖం తస్మాద్గురోర్వినిరేవచ ।
తస్మాత్కుర్యాత్తుసాధూనాం సేవాసర్వార్థసాధినీ ॥ ౯౭

తా॥ సత్పురుషులసేవ లేనికారణముచేత నన్నుకాదిహీనజన్మములనెత్తి విశేషమైన దుఃఖ మనుభవింపఁబడెను. కావున సమస్త ప్రయోజనములను సిద్ధింపఁజేయు నట్టి సత్పురుషులసేవను ముఖ్యముగా జేయవలయును.

శ్లో॥ సద్భిస్సాప్రియకారిత్వా త్స్మరో వావినిజన్మని ।
దుఃఖంతుబహులంలేభే జన్మకాలేమహాప్రభుః ॥ ౯౮

తా॥ మహానుభావుఁడగు మన్మథుఁడు సాంబమూర్తికి నిష్టముగాని తపోభంగ

మొనరించుటచే తిఱిగి యుత్తరజన్మమునందు పుట్టిన కాలమునందే విశేషమైన దుఃఖ మనుభవించెను.

శ్లో॥ ఇతిహాసమిదం పుణ్యం యేశృణ్వంతిదివానిశం ।
జన్మమృత్యుజరాదిభ్యో ముచ్యంతేనా౽త్రసంశయః ॥ ౯౯

తా॥ పుణ్యకరమగు నిట్టి యితిహాసము నెవరు రాత్రిగాని పగలుగాని విను చుందురో అట్టివారు పుట్టుక ముదిమి మరణము లేనివారగుదురు. ఇందువిషయమై సం దేహ మేమియు లేదు.　ఇతిస్కాందే నారదాంబరీష సంవాదే,

కామదహనోనామ అష్టమోధ్యాయ స్సమాప్తః ॥

---

## అ థ న వ మో౽ ధ్యా యః.

మైథిలః॥ శ్లో॥ తస్యదగ్ధస్యకామస్య కస్మాజ్జన్మా౽భవద్విభో ।
కిందుఃఖమభవత్తస్మి న్కర్మణస్సహలంఘనాత్ ।
ఏతదాచక్ష్వమేబ్రహ్మ న్ శ్రోతుంకౌతూహలంహిమే ॥

తా॥ మిథిలాధిపతి యడుగుచున్నాఁడు. మహాసుభావుండవగు నో బ్రాహ్మ ణుఁడా! ఆమన్మథునకు సాంబమూర్తిచే దహింపఁబడినప్పటికి తిఱిగి యెందువలన జన్మముకలిగెను? చేయఁబడినకర్మము కూడవచ్చునదగుటచే నా జన్మంబున నేమి దుఃఖమునుబొందెను? ఇదియంతయు సవిస్తరముగా నఁగో తీకగలవాఁడనై యుంటిని గాన నానతీయమని శ్రుతదేవు నడిగెను.

శ్లో॥ కుమారజన్మవక్ష్యామి శ్రవణాత్పాపనాశనం ।
యశస్యపుత్రిదంధర్మ్యం సర్వరోగవినాశనమ్ ॥ ౨

తా॥ వినుటతోడనే పాపములను బోఁగొట్టునదియు, కీర్తినిచ్చునదియు, పుణ్యములనిచ్చునదియు, ధర్మకరమైనదియు, సమస్తరోగములను బోఁగొట్టునదియు నగు మన్మథుని జననమును సావధానముతో జెప్పెదను వినుము.

శ్లో॥ శంభునాతుహతేకామే తత్పత్నీరతిసంజ్ఞికా ।
ముమోహాపురతోదృష్ట్వా పతింభస్మావశేషితం ।
జాతసంజ్ఞాముహూర్తేన విలాలాపహాచిత్రిధా ॥ ౪

తా॥ అప్పుడు మన్మథుఁడు సాంబమూర్తిచే దహింపఁబడఁగా నాతని భార్య యగు రతీదేవియు తనపెనిమిటి శరీరమును తనముందరనే భస్మీభూతమైనదానిగా జూచి మూర్ఛనొంది కొంతతడవునకు తెలివితెచ్చుకొని యనేకవిధములుగా దుఃఖిం చుచుండెను.

శ్లో॥ యద్విలాపాద్ధ్వనోపి సమదుఃఖ ఇభూత్తదా ॥

తా॥ ఆ విలాపమును వినిన పక్షులందును వెన్నుచున్న వానికైనను విచారము కలుగునట్లు అతిదీనముగా విలపించుచుండెను.

శ్లో॥ తస్మిన్ తాన్మన్యకాయం తు త్యక్తుకామా ధవం ।
పత్యుస్సహాయం సంస్మార కర్తుంతాత్కాలికీం క్రియామ్॥ ౬

తా॥ ఈప్రకారము రతీదేవి విలపించి పెనిమిటియొక్క దహనాగ్నియందు తనశరీరమును దహింపజేయుటకు నుద్యుక్తురాలై యప్పుడు తగిన క్రియలను జేయుటకై పెనిమిటికి మిత్రుఁడగు వసంతఋతువును స్మరించెను.

శ్లో॥ సఆగతశ్చిత్రింకస్థం వీరపత్న్యా మహాప్రభుః ।
సతు తత్తస్య ఖేదం దృష్ట్వా క్షణం మూర్ఛాపరోభవత్ ।
రతింతు సాంత్వయామాస సాంత్వైర్బహువిధైరపి ॥ ౭

తా॥ మహానుభావుండైన యావసంతుఁడు శూరుఁడగు మన్మథుని భార్యకు చితి పేర్చుటకు వచ్చినవాఁడై భయపడి స్నేహితుని భార్యయగు నారతీదేవిని జూచి మహాశోకపరవశుఁడై యనేకవిధములగు ప్రియవాక్యములచే సహగమనమును నివారింప జేయువాఁడై యిట్లు చెప్పఁదొడంగెను.

శ్లో॥ పుత్రితుల్యాస్మిభద్రే తే స్థితేమయిచనార్హసి । కాయంత్యక్తుంధర్మహేతు మిత్యాద్యైర్బహుధాపిసా ॥ నైవస్థాతుం మనశ్చక్రే తేనసంస్తంభితారతిః । దృష్ట్వాత్రుష్టా వసంతోపి చితించక్రేసరిత్తటే॥ ౯

తా॥ ఓమంగళప్రదురాలా! నీకు కుమారునితో సమానుండనయిన నేనుండఁగా నీవు శరీరము విసర్జించుట కూడదు. అని యీప్రకారము ధర్మహేతువులగు వాక్యములను జెప్పి యనేకవిధముల ప్రార్థించి నివారించినను యా రతీదేవిని జీవించుటయందు నిచ్ఛలేనిదానిగా జూచి వసంతుఁడు యానదీతీరమునందు చితి పేర్చెను.

శ్లో॥ సావగాహ్యాద్యనద్యాంచ కృత్వా కార్యాణి సర్వశః ।
సన్నియమ్యేంద్రియగ్రామం నివేశ్యాత్మవివై మనః ॥
చితిమారోఢుమారేభే తతోజాతాఽశరీరవాక్ ।
మా ప్రవేశయకల్యాణి? వహ్నింపతిపరాయణా ॥ ౧౧

తా॥ ఆ రతీదేవి ఆకాశగంగలో స్నానముచేసి పైత్రకకృత్యముల నన్నింటిని నెఱవేర్చి పంచేంద్రియములనిగ్రహించి మనస్సు నాత్మయందు నిలిపి శరీరమును దహింపజేయుటకు కాష్ఠము నధిష్ఠించబోవుచుండఁగా నోమంగళప్రదసాధ్వీ! నీవు పెనిమిటియందు భక్తిగలదాన వగుదువు అగ్నియందు ప్రవేశింప వలదనియొక యశరీర వాక్కు వినఁబడెను.

శ్లో॥ భవిష్యతిచ తేపత్యుర్ద్వారావిష్ణోశ్చయాదవాత్ । జన్మద్వ
యంక్రమేణైవ తత్రచోత్తరజన్మని ॥ భైష్మ్యాంకృష్ణాన్మహా
విష్ణోః ప్రద్యుమ్నాఖ్యోభవిష్యతి । వసిష్యసిత్వంచశాపా ద్బ్రహ్మణశ్శంబరాలయే ॥ ప్రద్యుమ్నాఖ్యేపతేపత్యా సంగతిశ్చ
భవిష్యతి । ఇత్యుక్త్వారరామాథ వాణీచాకాశగోచరా ॥ ౧౪

తా॥ ఓ రతీదేవి! మన్మథుఁడు సాంబమూర్తివలనను యదు వంశమునందు కృష్ణావతారముగ జనియించిన విష్ణుమూర్తివలనను పుట్టి నీకు పెనిమిటి కాఁగలఁడు. అదియెట్లనఁగా నీ పెనిమిటి యగు మన్మథుఁడు నిరువురందు రెండు జన్మంబులెత్తును. అందులో నొత్తరజన్మంబునందు శ్రీ మహావిష్ణువగు కృష్ణునివలన రుక్మిణీదేవియందు ప్రద్యుమ్నుఁడను పేరుగలవాఁడై పుట్టి బ్రహ్మశాపమువలన శంబరాసురుని గృహమునందుండఁగా నీవు నీ పెనిమిటితో కలిసికొని స్వేచ్ఛగా మీరు మీస్థానమును బొందగలరని యశరీరవాక్కు పలికి చాలించెను.

శ్లో॥ శ్రుత్వాతాంతునివృత్తాభూ స్మరణేకృతనిశ్చయా । తతోదే
వాస్సమాజగ్ము స్స్వార్థేకామేమహతేహరాత్ ॥ రత్యాదృష్టం
ప్రికుర్వాణా గుర్వింద్రాగ్నిపురోగమాః । తాంతేనివర్తయా
మాసు ర్వరేణమహతారతిమ్ ॥ ౧౫

తా॥ ఈప్రకారముపలికిన యశరీరవాక్కును విని యా రతీదేవి మరణించుటకు నిశ్చయముగలదై యున్నప్పటికిని చాలించెను. అనంతరమందు బృహస్పతి, ఇంద్రుఁడు అగ్నిహోత్రుఁడు మొదలగు దేవతలు తమ ప్రయోజనకొఱకు మన్మథుఁడు సాంబమూర్తివలన దహింపఁబడఁగా రతీదేవివద్దకువచ్చి యామెకు ప్రత్యక్షమై విశేషమైన వరములనిచ్చి యామెను మరణప్రయత్నమువల్లనుంచి మాన్పించిరి.

శ్లో॥ అనంగోపిభవేత్సాంగో మృతస్సోప్యక్షిగోభవేత్ ।
ఇతితాంతువినిర్వృత్య ధర్మంచోపదిదేశిరే ॥ ౧౬

తా॥ ఆమన్మథుఁడు మృతుఁడయ్యెను కాని నష్టుఁడు కాఁడు. శరీరము లేనివాఁడయి నను శరీరము లేనివాఁడుగానే నీకు కనిపించును అని యూరడించి యామెతో జెప్పి యాపై సూ శ్లోకములనుండి విచారించి మఱియు ననేకవిధములగు ధర్మములనుపదేశించిరి.

శ్లో॥ పూర్వస్మిన్ జన్మని యం రాజా సుందరాఖ్యో మహాప్రభుః । త్వమేవ
తస్య పత్నీ త్వాపి రజస్సంకరకారిణీ ॥ తేనేయం చ దశా భూత్తే కుర్వి
దార్చిదారించ విస్మృతిం । మందాకిన్యాంతు వైశాఖే ప్రాత
స్నానం కరిష్యసి ॥ ౧౯

తా॥ ఓ రతీదేవీ! నీ యొక్క పూర్వవృత్తాంతమును జెప్పెద వినుము. పూర్వమందు నీ పెనిమిటి సుందరుఁడనెడు పేరుగల గొప్పప్రభువుగా నుండెను. నీవును ఆతని భార్యగా నయియుండి యొకానొకప్పుడు బహిష్టయి వెలుపల నుండక గృహమునందే యుండి యాచారసంకరము నాచరించితివి. అందువలన నీకిట్టి కష్టమిప్పుడు సంభవించెను గాన వైశాఖమాసమునందు ప్రాతఃకాలమునందు నాకాశగంగయందు స్నానముజేసి యాపాపమునకు తగిన ప్రాయశ్చిత్తమును జేసికొనుము.

శ్లో॥ మధుసూదనమభ్యర్చ్య కథాందివ్యాంతథా శ్రుణు ।
అశూన్యశయనంనామ వ్రతమారభ భామిని ॥ ౨౦
ధర్మేణానేన తే భద్రే వ్రతేనాపి చ మాధవే । నూనం తే భవితా
పత్యు రుపలబ్ధిర్న సంశయః ॥ ఇతి తస్యై వరం దత్వా దేవా జ
గ్ముర్యథాగతాః ॥ ౨౧

తా॥ ఆపార్వతి సర్వసత్తమెట్లనఁగా, ఓ చిన్నదానా! విష్ణుమూర్తిని పూజించి దేవతాసంబంధమగు కథను విని అశూన్యశయనమనెడు వ్రతమారంభించి చేసినయెడల పుణ్యాకరమగు ఆవ్రతముచేతను నీ పెనిమిటి నీకు తిరిగి సంభవించగలఁడు. నిశ్చయము. ఎంతమాత్రము సందేహము లేదు. అనిపలికి యామెకు కోరినవరముల నిచ్చి యాదేవతలు వారివారి స్థానములకు నేగిరి.

శ్లో॥ తతః కృచ్ఛ్రాన్నివృత్తా సా దేవి కామసతీ తథా ।
గంగావగాహనం చక్రే మేషసంస్థే దివాకరే ॥
అశూన్యశయనంనామ వ్రతంచాపి మహామనాః ॥ ౨౩

తా॥ మన్మథుని భార్యయగు రతీదేవి యనంతరమున యతికష్టముగా దుఃఖము నివారించుకొని సూర్యుఁడు మేషరాశియందుండఁగా గంగానదియందు స్నానముజేసి పతిప్రాప్తిని యాశించుచు అశూన్యశయనమనెడు వ్రతము నారంభించి చేసెను.

శ్లో॥ తేనపుణ్యప్రభావేన సద్యఃకామోఽక్షిగోచరః ।
అభూత్తస్యైమహారాజ లోకేచానాఖ్యపీర్తవాన్ ॥ ౨౪

తా॥ ఓ మహారాజా! ఆపుణ్యమహత్తుచే అప్పుడే మన్మథుఁడు రతీదేవికి కంట్లఁ బడినవాఁడై విశేషమైన పరాక్రమముగలవాఁడై రతీదేవితో క్రీడించుచుండెను.

శ్లో॥ పూర్వకల్పేప్యయమపి రాజాధర్మపరాయణః ।
వైశాఖోక్తాన్మహాధర్మాన్నచకే్రతేసనైష్టరః ॥ ౨౫

తా॥ పూర్వమందు సుందరుఁ డనెడు పేరుగల రాజు యనేకములగు ధర్మములను చేసినవాఁడైనను వైశాఖస్నానమునందు జేయఁదగిన మహాధర్మములలో నొక్కటియైనను జేయలేదు.

శ్లో॥ దేహహానింప్రపేదేసా పుత్రోపిపరమాత్మనః ।
వృథాపీతేతు వైశాఖే మేషసంస్థే దివాకరే ॥ ౨౬

తా॥ ఆరాజు అప్పుడుజేసిన పుణ్యవశమున విష్ణుమూర్తికి మనథుఁడను పేరుగల తనయుఁడుగా పుట్టినవాఁడైనను సూర్యుఁడు మేషసంక్రమణమును బొందియున్న వైశాఖస్నానము వ్యర్థముగా విడలబుచ్చుటచేత దేహనాశనము సంభవించెను.

శ్లో॥ అవస్థేయంచదేవానాం మనుష్యాణాంతుకాకథా ॥

తా॥ దేవతలకే యిట్టికష్టదశ సంభవించుచున్నప్పుడు వైశాఖమాసములోధర్మములను జేయకున్న మనుష్యులకు కష్టము సంభవించునని చెప్పనక్కరయేలేదు.

శ్లో॥ త్ర్యంబకేంతర్హితేపశ్చాన్నిరాశాగిరికన్యకా ॥
తూష్ణీంస్థితాంతదాభ్రాంతాం తాందృష్ట్వాహిమవాన్గిరిః ।
చకితస్స్వగృహాన్నిన్యే దోర్భ్యాంతాంపరిరభ్యచ ॥ ౨౮

తా॥ ఈప్రకారము మన్మథుఁడు దహింపఁబడిన పిమ్మట సాంబమూర్తి మాయమైపోయెను. అనంతరము పార్వతీదేవి తన కోరిక వ్యర్థమాయెనని విచారము నొందుచుండఁగా నక్కడకు ఆమెతండ్రియగు హిమవంతుఁడు వచ్చి వ్యాకులచిత్తురాలగు నామెనుజూచి తాను భయపడి యామెను కౌగలించుకొని చంకయందునిడుకొని తన గృహమునకు తీసికొనివెళ్ళెను.

శ్లో॥ రూపౌదార్యగుణాన్దృష్ట్వా హరస్యైవమహాత్మనః । సఏవ
మేపతిర్భూయా దితితన్నిష్ఠమానసా ॥ గంగోపకూలమాపేదే
తపస్తప్తుందృఢవ్రతా । నివారితాపిసాదేవీ పితామాత్రా
స్వకైర్జనైః ॥ 30

తా. అనంతరము పార్వతీదేవి మహానుభావుండగు సాంబమూర్తియొక్క సౌందర్య ఔదార్యాదు లెుదలగు గుణములను జూచి యీసాంబమూర్తియే నాకు తగిన పెనిమిటికాని మరియొకడు కాడని యా సాంబమూర్తి యందే నిశ్చలమైన మన స్సుగలదై తల్లిదండ్రియు చెల్లియు మరియు నితరులగు బంధుజనులు నెంత నివారించినను వినక సాంబమూర్తియే నాకు భర్తయగువరకు వ్రతమునవలంభించి గంగానదియొద్దను తపస్సును జేయుటకు ప్రారంభించెను.

శ్లో॥ అన్నాయంతీ మహాలింగం నిరాహారా జటాధరా ।
దివ్యవర్ష సహస్రాంతే ప్రత్యక్షో భూన్మ హేశ్వరః ॥ 3౧

తా॥ ఆ పార్వతీదేవి యాహారము విసర్జించి కేశములను జడలనుగా జేసికొని మహాలింగ స్వరూపమగు సాంబమూర్తి నిట్లు కఠినవ్రతముతో బూజించుచుండగా నాసాంబమూర్తి దేవతా సంవత్సరములు వెయ్యి గడచినపిమ్మట నా పార్వతీదేవికి ప్రత్యక్షమాయెను.

శ్లో॥ భూత్వావర్ణ్యపిసా హ్యూహ్నే పర్ణశాలాముఖేవిభుః । స్వనిష్ఠ మనసోదార్ఢ్య వాక్యైర్నానావిధైరపి ॥ జ్ఞాత్వా వద ద్వరం భద్రే వరయేతి మహాప్రభుః ॥ సావ్రవేధపతింరుద్రం త్వాంభ వేతివరాననా ॥ 33

తా॥ సర్వశక్తివంతుండగు యా సాంబమూర్తి బ్రహ్మచారివేషమును ధరించి సాయంకాలమునందు యాపార్వతీదేవియుండు పర్ణశాలవద్దకు వచ్చి తనయందు గట్టి యభిప్రాయమున్నదో లేదో తెలిసికొనుటకు సాంబమూర్తివిగ్రహార్చ తాను కొన్ని నిందోక్తులాడినను వానిని విని సహింపకుండుటచే తనయందు నిశ్చలమైన మనస్సుగల దానిగా నెంచి యప్పుడు మహానుభావుండగు సాంబమూర్తి నిజస్వరూపముగనపడిచి నీకు వరమును కోరుమిచ్చెదనని పల్కగా శోభనంబగు ముఖముగల యాపార్వతీదేవి నీవు నాకు పెనిమిటివగుమని సాంబమూర్తిని కోరెను.

శ్లో॥ సతథైవవరందత్వా ఋషీన్ సస్మారస ప్తచ ।
ఆజగ్ముస్తేపిమునయ స్సిద్ధాః ప్రాంజలయఃపురః ॥ 3౪

తా॥ సాంబమూర్తి అట్లప్రకారమేయని పార్వతీదేవికి వరమిచ్చి సప్తమునీశ్వరులను స్మరించెంపగా నాయేడుగురు మునీశ్వరులు వచ్చి దోసిలిపట్టుకొని సాంబమూర్తియెదుటకు వచ్చి నిలబడిరి.

శ్లో॥ ఋషీనాజ్ఞాపయామాస కన్యాంప్రష్టుంహిమాలయం । తతఆదిష్టాభగవతా కన్యార్థంహిమవద్గృహమ్ ॥ ప్రాపుర్విహాయసా సర్వే ద్యోతయంతోదిశోదశ । ప్రత్యుజ్జగామసగిరి స్సప్తైతాన్ బ్రహ్మవిత్తమాన్ ॥ ౩౬

తా॥ అప్పుడు భగవంతుఁడగు సాంబమూర్తి పార్వతీదేవిని తన కిచ్చుటకు హిమవంతుని యడుగుటకు వెళ్ళవలయునని చెప్పఁగా నా యేడుగురు మునులు కన్యక నడుగుటకు పదిదిక్కులను తమ శరీరకాంతిచే ప్రకాశింపఁజేయుచున్నవారలై యాకాశ మార్గమున హిమవంతుని గృహమునకు రాగా నాహిమవంతుఁడు బ్రహ్మవేత్తలగు నా మునీశ్వరులకు నెదురుగావెళ్ళి తీసికొనివచ్చెను.

శ్లో॥ సంపూజ్యవిధివత్సర్వాన్ సుఖాసీనానపృచ్ఛత ।
ధన్యోఽస్మికృతకృత్యోఽస్మి యద్భవంతోగృహాగతాః ॥ ౩౭

తా॥ ఆమునీశ్వరులకు శ్రేష్ఠంబులగు నాసనములనిడి కూర్చుండఁబెట్టి యథావిధిగా పూజించి యిట్లు కుశలప్రశ్న జేయుచున్నాఁడు ఓమునీశ్వరులారా! మీరు నాగృహమునకు దయచేయుటచే నేను ధన్యుఁడనైతిని. సఫలమైన కార్యములుగలవాఁడనైతిని.

శ్లో॥ భవతాగమనం మన్యే మమజన్మఫలంత్వితి ।
నకార్యంవిద్యతేస్మాభిః పుణ్యార్థానాంమహాత్మనామ్ ॥ ౩౮

తా॥ మీరు పుణ్యాత్ములును, మహానుభావులును గాబట్టి నాతో మీకు యేపనియును లేదు. అందువలన మీయొక్క రాకను నాజన్మమును సఫలముజేయుటకొఱకే కాని మఱియొక కారణములేదని తలఁచెదను.

శ్లో॥ తథాపిబ్రూతకార్యంవో యత్కర్తవ్యమయాధునా ।
ఇత్యుక్తాస్తేతథాప్రోచుః హిమవంతంమహాగిరిమ్ ॥

తా॥ అయినను యేకొంచెమైనను నేను జేయవలసిన కార్యముండెనేని చెప్పినయెడల చేతునని హిమవంతుఁడు పలుకఁగా నా యేడుగురు మునీశ్వరులు హిమవంతునిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ త్వయాతే సదృశంవాక్య ముక్తం గిరిపతేదృఢం ।
అస్మదాగమనేహేతుంవక్ష్యామస్తేమహోదయ ॥ ౪౦

తా॥ సమస్తపర్వతములకు నధిపతియు మహానుభావుఁడవు నగు నో హిమవం

తుఁడా ! నీవు విన్న మాటను పరీక్షింపుము. మాయొక్క రాకనుగుఱించి హేతువును చెప్పెదము వినుము.

శ్లో॥ త్వత్కన్యా పార్వతీనామ పూర్వం దక్షాత్మజా సతీ । జాతా తవ కుమారీ సా యజ్ఞే త్యక్తకళేబరా ॥ అస్యాః పాణిగ్రహే దక్షః శంభురన్యో జగత్త్రయే । దేయా సా శంభవే దేవీ భవతా నందమిచ్ఛతా ॥ ౮౨

తా॥ ఓ హిమవంతుఁడా ! పూర్వమందు దక్షుని కుమార్తెయగు సతీదేవి దక్ష యజ్ఞమునందు తండ్రియందు కోపముచే దేహమును చాలించి నీకు కుమార్తెగా పుట్టి పార్వతియను పేరుగలదియై యుండెను. ఆమెను వివాహమాడుటకు మూఁడులోకములయందును సాంబమూర్తికంటె సమర్థుండగు మఱియొక పురుషుఁడు లేడు కాఁబట్టి నీవు విశేషముగు మేలును బొందదలఁచితివేని ఆపార్వతీదేవిని సాంబమూర్తికిచ్చి వివాహము చేయుము.

శ్లో॥ పూర్వజన్మసహస్రేషు భవతా సుకృతం కృతం ।
ఇదానీం తవదిష్ట్యా తు పరిపాకముపాగతమ్ ॥ ౮౩

తా॥ నీవు పూర్వజన్మముల నేమిపుణ్యమును జేసినావో నీయొక్క అదృష్టమువలన అట్టిపుణ్యము పరిపాకముపొంది ఫలించినది.

శ్లో॥ తేషాం తద్వచనం శ్రుత్వా సంహృష్టాత్మా మహాగిరిః । వ్యాజహార పునర్వాక్యం పుత్రీ వల్కలధారిణీ ॥ గంగాతీరే నిరాహారా తపశ్చరతి దుశ్చరం । కాంక్షమాణా పతిం శంభుం తస్యా ఇష్టమిదం త్వితి ॥ ౮౪

తా॥ పర్వతశ్రేష్ఠుండగు యాహిమవంతుఁడు ఆమునీశ్వరులు చెప్పిన మాటలను విని సంతుష్టహృదయుఁడై యో మునులారా ! నా కుమార్తెయగు పార్వతి నారచీరెలను ధరించి యాహారమును విడిచి సాంబమూర్తి తనకు పెనిమిటి యగుటకుగాను గంగానది యొద్దను కఠినతపస్సును జేయుచున్నది. కాఁబట్టి యీ కార్యము ఆమెకు నిష్టమియైనదియే.

శ్లో॥ దత్తా కన్యా మయా తస్మై త్ర్యంబకాయ మహాత్మనే ॥
శీఘ్రం గత్వా భవంతస్తు యత్ర శంభుర్మహాప్రభుః ॥

పీ్రత్యాహిమవతాదత్తాం గృహాణేతిని వేద్యచ ।
భవంతఏవకుర్వంతు చైతద్వైవాహికీంక్రియామ్ ॥ ४८

తా॥ పార్వతీదేవికి సాంబమూర్తియందు నపేక్షగలుగుటచేసి మహానుభావుండగు సాంబమూర్తికి పార్వతి యింతకు పూర్వమే యివ్వఁబడియున్నది. కావున్ ఓ మునులారా! మీరు సాంబమూర్తియున్న ప్రదేశమునకు శీఘ్రముగావెళ్ళి హిమవంతుఁడు సంతుష్టాంతరంగుఁడై పార్వతీదేవిని పూర్వమే మీకు యిచ్చియున్నాఁడని చెప్పి మీరే యీ వివాహవిధిని నెఱవేర్పవలయును.

శ్లో॥ ఇత్యుక్తాస్తేహిమవతా తమామంత్ర్యశివంయయుః ।
లక్ష్మ్యాద్యాయోషితస్సర్వా విష్ణ్వాద్యాదేవతాఅపి ।
మణ్మాతరోథమునయో ద్రష్టుంజగ్ముర్మహోత్సవమ్ ॥

తా॥ ఈప్రకారము హిమవంతుఁడు చెప్పఁగా విని మునీశ్వరులు హిమవంతుని యొద్ద ననుజ్ఞతీసికొని సాంబమూర్తియొద్దకు వెళ్ళిరి. పిమ్మట నిట్టి మహోత్సవమును జూచుటకు లక్ష్మీదేవి మొదలగు స్త్రీలును, విష్ణు మొదలగు దేవతలును, మణ్మాతృకలును, మునీశ్వరులును వచ్చిరి.

శ్లో॥ శివస్సర్వామరగణై ర్మునిభిర్మాతృభిస్తథా । అన్వితోవృషభారూఢః ప్రమథానాంగణైర్వృతః ॥ భేరీశంఖమృదంగాద్యైః కహాళాపటహాదికైః । బ్రహ్మఘోషైర్బంధుభిశ్చ ప్రావిశద్ధిమవత్పురీమ్ ॥

తా॥ సాంబమూర్తి వృషభవాహనము నెక్కి సమస్త దేవతాసమూహముతోడను, మునీశ్వరులతోడను, మణ్మాతలతోడను, ప్రమథగణములతోడను గూడినవాఁడై భేరి, శంఖము, మృదంగము, ఢంక, నవభత్ మొదలగు వాద్యములు మ్రోగుచుండఁగాను, బ్రాహ్మణులు వేదములను పఠియించుచుండఁగాను బంధువులతో గూడినవాఁడై హిమవంతుని పట్టణమునకు వెళ్ళెను.

శ్లో॥ సుముహూర్తేశుభేలగ్నే శుభగ్రహనిరీక్షితే ।
వివాహమకరోచ్ఛైలః ప్రహృష్టేనాంతరాత్మనా ।
మహోత్సవస్తదాచాసీ త్త్రిలోక్యాంప్రాణినాంనృప ॥ ४१

తా॥ అనంతరము హిమవంతుఁడు సంతోషించిన మనస్సుగలవాఁడై శుభగ్రహములచే జూడఁబడుచుండిన శ్రేష్ఠమగు లగ్నమందు పార్వతిని సాంబమూర్తికిచ్చి

వివాహముజేసెను. ఓరాజా! అప్పుడు మూఁడులోకములయందుండు సమస్తప్రాణు లకును మిక్కిలి యానందమాయెను.

శ్లో॥ వివాహోత్సవేనివృత్తేతు శంకరో లోకశంకరః ॥
రేమేస్వచ్ఛందయాదేవ్యా లోకధర్మాననువ్రితః ॥ ౫౩

తా॥ ఈప్రకారము వివాహమహోత్సవము సంపూర్తినొందిన పిమ్మట లోక మునకు శుభముజేయు సాంబమూర్తి లోకములోనుండు ధర్మముల నవలంభించి స్వేచ్ఛగా పార్వతీదేవితో క్రీడించుచుండెను.

శ్లో॥ బుద్ధిమద్ధిమవద్గేహే దేవేంద్రభవనోపమే ॥ సర్వార్యాం నంది పీఠే నవరాజిషు శంకరః ॥ మత్తాళిద్విజసన్నాద మయూర రవమండితే। దివ్యవర్ష సహస్రాణి రేమేస్వచ్ఛందయావిభుః॥ ౫౪

తా॥ సమస్తసంపత్తులు కలది గనుక దేవేంద్రుని గృహముతో సమానమైన హిమవంతుని గృహమునందును, నదులయందు ఆనందకరమైన సరస్సులతీరమందును వనపంక్తులయందును, మదించిన తుమ్మెదలు, పక్షులు, నెమళ్ళు మొదలగు జంతువుల ధ్వనులతోగూడిన ప్రదేశమునందును ప్రభువగు సాంబమూర్తి యనేకవేల దివ్యసం వత్సరములు స్వేచ్ఛగా పార్వతితోగూడి క్రీడించుచుండెను.

శ్లో॥ స్త్రీణామింద్రవరాభావా త్తస్మిన్కాలేనృపోత్తమ ।
పుంసంసర్గాత్ప్రసర్గర్భో నారీణాంపరివర్తితః ॥ ౫౬

తా॥ ఓ రాజా ! ఆ కాలమునందు దేవేంద్రునియొక్క వరము లేకుండుటచే స్త్రీలకు పురుషులతో సంభోగము కలిగినప్పటికిని తిరిగి గర్భము ప్రసవించుటయే కాని గర్భోత్పత్తి జరుగుటలేదు.

శ్లో॥ పరిత్యహంరమణాద్దేవ్యాం నాభూద్గర్భో మహాద్భుత ।
దేవానామభవచ్చింతా పుత్రలాభాద్వరాద్విభో ॥ ౫౭

తా॥ ఓ రాజా ! కాఁబట్టి సాంబమూర్తి పార్వతీదేవితో నిత్యము సంభోగించు చున్నప్పటికి గర్భోత్పత్తి గలుగలేదు. ఎంతయాశ్చర్యము అని యీప్రకారము దేవతలాలోచించి సాంబమూర్తివలన కుమారుఁ డెట్లు కలుగునో యని యుపాయ మాలోచించుచుండిరి.

శ్లో॥ సర్వేసంగత్యసంమంత్ర్య మిథఏవంబభాషిరే ।
కామినాభూద్రతౌనిత్యం సక్తోదేవ్యాహరస్స్వరాట్ ॥ ౫౮

తా॥ దేవత లందఱు నొకరి నొకరు పిలచుకొని యొకచోట గూడినవారై

వారితో వారు రహస్యముగా నిట్లు చెప్పుకొనిరి. స్వయంప్రకాశమానుఁడైన సాంబమూర్తి సంభోగమునందు కోరికగలవాఁడై నిత్యము పార్వతీదేవితో సంభోగించుచున్నాఁడు.

శ్లో॥ నాస్మాకంసిద్ధ్యతేకార్యం నిత్యందర్భస్యసంప్రవాత్ ॥
పునారతిర్యథానాభూ త్తథాస్మాభిర్విధీయతామ్ ॥ ౫౯

తా॥ నిత్యము గర్భము స్రవించుటచే మనయొక్క కార్యసిద్ధి కాలేదు. ఇప్పుడు సభోగంము పూర్తికాని యెడల తిరిగి సంభోగము చేయకుండునట్లుగా మనము ప్రయత్నము చేయవలయును.

శ్లో॥ మిధఏవంతుసంభాష్య విచిన్వ్యక్షణమాత్రహి ।
అగ్నింకర్తవ్యేవినిశ్చిత్వ హూయ్యాచుర్మానపురస్సరమ్ ॥

తా॥ ఈ ప్రకారము రహస్యముగా మాట్లాడుకొని క్షణకాలము యాలోచించి యీకార్యమును సాధించుటయందు నగ్నియే తగినవాఁడని నిశ్చయించి యాయగ్నిహోత్రునిబిలచి మర్యాదజేసి యిట్లు చెప్పిరి.

శ్లో॥ త్వముఖోఽగ్నేహి దేవానాం త్వంబంధుర్గతిరేవచ । ఇదానీమపిగచ్ఛత్వం రమతేయత్రవై హరః ॥ రత్యంతేదర్శయాత్మానం పునారతిర్యథానవై। త్వాందృష్ట్వాపిడితాదేవీతత శ్చ్యపరేద్ధ్రువమ్॥ ౬౦

తా॥ ఓయగ్నిహోత్రుఁడా । నీవు దేవతల కందరికిని ముఖస్వరూపముగా నుండువాఁడవు నీవే బంధువు. నీవేగతి. కాఁబట్టి నీవిప్పుడు సాంబమూర్తి సంభోగించుచున్న ప్రదేశమునకు వెళ్ళి సంభోగముపూర్తియైనపిమ్మట వారియెదుటకు వెళ్ళినయెడల పార్వతీదేవి నిన్నుజూచి సిగ్గుపడి యచ్చటనుండి లేచివెళ్ళును. కాఁబట్టి తిరిగి సంభోగము సంభవింపదు. నిశ్చయము.

శ్లో॥ శిష్యోభూత్వాతురత్యంతే పృచ్ఛతత్వంస్మరాంతకం।
తత్వనంప్రశ్నవ్యాజేన కాలంబహునయప్రభో ॥

తా॥ సంభోగసమయమందు వెళ్ళుట యెట్లంటివేని సంభోగాంతమందు శిష్యుడవుగా వెళ్ళి మన్మథసంహారకుండైన యా సాంబమూర్తిని వేదాంతమునుగురించి ప్రశ్న చేయుము. ఓ పార్వతీ మీఁ। ఇట్లు వేదాంత సంభాషణయను కపటవ్యాపరము చే కాలముసుగడుపుము.

శ్లో॥ బహుకాలేగతే దేవీ కుమారం ప్రసవిష్యతి ।
దేవైరేవంప్రార్థితోగ్ని రోమిత్యుక్త్వాహరంయయౌ ॥ ౬౨

తా॥ విశేషకాలముగడచిన యాపార్వతీదేవి కుమారుని కనగలదు. అని యీ

ప్రకారము దేవతలు ప్రార్థించగా నగ్నిహోత్రుఁడు యాతీరుగానే జేయుదునని యొప్పుకొని సాంబమూర్తి యుండు ప్రదేశమునకు వెళ్ళెను.

శ్లో॥ వీర్యోత్సర్గాత్పూర్వమేవ గతోవహ్నీ రతాంతరే ।
తం దృష్ట్వా వ్రీడితా దేవీ వివస్త్రా విమనాయయా ॥ ౬౭

తా॥ అప్పుడు సంభోగము పూర్తికాకుండుటచే పార్వతీదేవియందు సాంబమూర్తిచే వీర్యము విడువఁబడలేదు. అట్టి సమయములో నెదుటనుండు నగ్నిహోత్రుని జూచి యాపార్వతి వస్త్రరహితముగా నుండినందున సిగ్గుపడి వెలవెలబోయి చాటునకు వెళ్ళెను.

శ్లో॥ రతింవిహాయత్వరయా తత్రోమహోత్రికోపితః । వహ్నింప్రాహ గృహాణేద మవిసృష్టం మర్మతే॥ మద్వీర్యం మస్సహంపాప రతివిఘ్న స్త్వయాభవత్ ।ఉత్సృజామిచ మద్వీర్యం త్వన్ముఖే హవ్యవాహన॥ ౬౮

తా॥ పార్వతీదేవి సంభోగమునువిడిచి శీఘ్రముగా లేచిపోవుటచే నగ్నిహోత్రునియందు మిక్కిలి కోపముగలవాఁడై యాపనితో నిట్లు పలుకుచున్నాఁడు. దుష్టబుద్ధిగలవాఁడవును, పాపుఁడవునగు నో యగ్నిహోత్రుఁడా! మాసంభోగమునకునీవు విఘ్నమును గలిగించితివి. నాచే పార్వతియందు వీర్యముంచిబడలేదు. కాబట్టి యట్టి దుస్సహమైన వీర్యమును నీముఖమునందు విడిచెదను. దీనిని నీవే మోసికొనిపొమ్ము.

శ్లో॥ ఇత్యుక్త్వోత్సృష్టవాన్ వీర్యం హవ్య వాహముఖే హరః ।
తద్ధృత్వా దహ్యమానస్సన్ స్వోదరే వీర్యముల్బణమ్ ॥
చింతయానోయయౌధమ దేవానాం యజ్ఞపూరుషః ।
కథంచిత్ప్రాణతోముక్తో దేవేభ్యస్తన్న్యవేదయత్ ॥ ౬౯

తా॥ ఈప్రకారము సాంబమూర్తి పలికిన తనవీర్యమును అగ్నిహోత్రునియందు విడిచెను, ఆయగ్నిహోత్రుఁడు దుర్భరమైన యారేతస్సును తనహృదయమందుధరించి తపింపఁబడుచుండినవాఁడై ప్రాణముతో విడువఁబడితినని తలఁచి యాభారమును పోఁగొట్టుకొనుట యెట్లుగునో యని మనస్సున విచారించి దేవతలయొద్దకు వెళ్ళి జరిగిన వృత్తాంతమునంతయును వారితో జెప్పెను.

శ్లో॥ దేవావహ్నేరితం శ్రుత్వా హర్షశోకాసమీయయుః। స్థితవీర్యమితిహ్లాదం కథంతు ప్రసవోభవేత్॥ ఇతిదుఃఖంతదాచాసీద్వహ్నేః కుక్షౌతుశాంభవం। వవృధే తేజసోక్షిప్రం దశమాసాగతాస్తదా॥ ౭౦

తా॥ ఇట్లు అగ్నిహోత్రునిచే జెప్పఁబడినమాటనువిని దేవతలు సంతోషమును

దుఃఖమునుగూడ బొందిరి. ఎంగాతల్లనవంగా వీర్యము సంభవించుటచే సంతోషమును ఈవీర్యము పిండమై పుత్రుడుగా జనించునెట్లోయని దుఃఖమును బొందిరి. ఇట్లగ్ని హోత్రుని గర్భమందుంచబడిన సాంబమూర్తివీర్యము వృద్ధిపొందు చుండంగా పదిమాసములు శీఘ్రముగా నే గడచెను.

శ్లో॥ నావశ్యత్ప్రసవోపాయం బహుదుఃఖపరాయణః ।
దేవాన్వైశరణంప్రాప గర్భమోచన హేతవే ॥ ౭౨

తా॥ ఆయగ్నిహోత్రుడుయెన్ని దినములకును ప్రసవించకుండుటచే విశేష దుఃఖముగలవాడై యీగర్భప్రసవమునకు తగినయుపాయమును దెలిసికొనుటకు దేవతలను శరణుబొందెను.

శ్లో॥ తేదేవా వహ్నినాసాకం ప్రాప్తుర్గంగాం యశస్వినీం ।
గంగాంస్తోత్రేణ తేస్తుత్వా ప్రార్థయామాసురంజసా ॥ ౭౩

తా॥ ఆదేవతలు అగ్నిహోత్రునితోగూడి లోకప్రసిద్ధిగలిగిన గంగానదియొద్ద కు వెళ్ళి యామె ననేకవిధములదు స్తోత్రములఁజేసిరి.

శ్లో॥ త్వంమాతా సర్వదేవానాం త్వమేవ జగతాంపతిః ।
దేవతార్థమత్వంభద్రే ధత్స్వతేజస్తుశాంభవమ్ ॥ ౭౪

తా॥ ఓగంగాదేవి! సమస్త దేవతలకు నీవేతల్లివి. మూఁడులోకములకు నీ వధి పతివి. కాఁబట్టి దేవతల యుపయోగముకొరకు నగ్నిహోత్రునియందుండు సాంబ మూర్తి సంబంధమైన వీర్యమును నీవు భరింపుము.

శ్లో॥ తదగ్నేహ్నిర్వర్థతేగర్భే నస్త్రీత్వాత్ప్రసవోస్యచ ।
తస్మాద్దేవంచనస్సర్వాన్ సముద్ధరదయాంకురు ॥ ౭౫

తా॥ అగ్నిహోత్రునియందు గర్భము వృద్ధిపొందుచున్నదికాని యాతను పురుషుఁడగుటచే ప్రసవించుట సభవించదు. కాబట్టి యావీర్యమును నీవు భరియించి మాయందు దయయుంచి యగ్నిహోత్రుని మమ్మలను రక్షింపుము.

శ్లో॥ ఇత్యేవంప్రార్థితాదేవీ తథా స్తితివచోబ్రవీత్ ।
దేవాస్తువహ్నయేప్రాహు ర్మంత్రంగర్భవిమోచనమ్॥ ౭౬

తా॥ ఈప్రకారము యాగంగాదేవి దేవతచేప్రార్థింపఁబడి యట్లాగేచేయుదు నని యొప్పుకొనెను. అనంతరము దేవతలు అగ్నిహోత్రునికి గర్భము వదిలిపోవునట్టి మంత్రముపదేశించిరి.

శ్లో॥ తన్మంత్రాద్గర్భమాకృష్య వ్యసృజద్ధవ్యవాహనః ।

గంగాయాంశాంభవం తేజో భాస్వల్లోకసుదుస్సహమ్॥ ౨౮

తా॥ వాయు వుపదేశించిన మంత్రమువలన గర్భమందున్నట్టియు, లోకము లోకసహించ శక్యముకానట్టియు, ప్రకాశించుచున్నట్టి సాంబమూర్తి తేజస్సును తీసి ల గంగానదియందుంచెను.

శ్లో॥ సాచోష్ణ్యాకతిచిన్మాసాన్ సా శశాక తతః పరం॥ నిర్జలా తత్ప్రభావేన స్ఫుటదిక్షైకకళేబరా॥ బహుదుఃఖాతురా దేవీ పాతివ్రత్యప్రభావతః॥ఉజ్జహారస్వోదరస్థం గర్భం లోకైకపావనీ ॥ ౨౯

తా॥ ఆగంగానదియు కొన్ని మాసములు ఆగర్భమును భరియించి యటుపిమ్మట భరించలేనిదై యా తేజస్సుయొక్క వేడిమిచేనింకిపోయిన జలముకలదియై జలము లేని శరీరముగలది యగుచు లోకమును పవిత్రమును జేయు యానది విశేషదుఃఖమును బొంది తన పాతివ్రత్యమహిమ చే తనగర్భమందుండి పిండమును బయటకుతీసెను.

శ్లో॥. శరకాండేతుచిక్షేప దహ్యమానం సమంతతః ।
శరకాండైస్తు సంభేదో షోడాభిన్నో బభూవవా ॥ ౩౦

తా॥ అంతటను త పించుచున్న సాంబమూర్తి రేతస్సును రెల్లుపొదయందుం చగా రెల్లుదంట్లచే నారేతస్సు యారువిభాగములుగా నేర్పడెను.

శ్లో॥ షట్కృత్తికాస్సమాజగ్ము ర్బ్రహ్మణాచోదితా స్తథా ।
శరకాండేవినిర్భిన్నం షోడాసంధాయ శాంభవమ్ ॥
షణ్ముఖం పురుషం కృత్వా త్వేకదేహమితిస్ఫుటం ।
కృత్తికావిధినాజ్ఞప్తా స్తంతథాచక్రిరేదృఢమ్ ॥ ౩౧

తా॥ అనంతరము బ్రహ్మచే ప్రేరేపింపబడినవారై షట్కృత్తికలచ్చటికి వచ్చి రెల్లుపొదయందు యారు విధములుగా నేర్పబడియున్న యాసాంబమూర్తి తేజస్సును యారుముఖములుగల యొక్క దేహమునుగల పురుషునిగా దృఢమైన ప్రయత్నముతో బ్రహ్మయొక్క యాజ్ఞానుసారముగా షట్కృత్తికలు చేసిరియు.

శ్లో॥ తద్దేహం పురుషాకారం షణ్ముఖం శరకాండగం ॥
అరక్ష్యమాణమేవాసీ చ్ఛరకాండేషు వైచిరమ్ ॥ ౩౨

తా॥ ఆరుముఖములుగలిగి పురుషాకారమైన యాదేహము రెల్లుపొదయందుం చబడి బహుకాలము వరకు నెవరిచేతను రక్షింపబడనిదై యుండెను.

శ్లో॥ ఏకదా వృషభారూఢౌ పార్వతీపరమేశ్వరౌ ।
శ్రీశైలం గంతుమనసౌ తత్స్థలం పరిజగ్మతుః ॥ ౩౩

తా॥ ఇట్లు కొంతకాలము గడువఁగా నొకప్పుడు పార్వతీపరమేశ్వరులు వృషభవాహనము నెక్కి శ్రీశైలమునుగురించి వెళ్ళుచు నాప్రదేశమునకు వెళ్ళిరి.

శ్లో॥ తదాసీత్పార్వతీదేవీ సద్యస్స్నుతపయోధరా ।
విస్మితావచనంరుద్రం సుస్రితౌకస్మాత్పయోధరా ॥
కారణంబ్రూహివిశ్వాత్మన్నిత్యుక్తస్సుహరోఽబ్రవీత్ ।
శృణుదేవి ప్రవక్ష్యామి పురోద్ధో వర్తతేతవ ॥ ౮౬

తా॥ అప్పుడు పార్వతీదేవి కుచములవలన క్షీరములు స్రవించఁగా నాశ్చర్యమునుబొంది యాపార్వతి స్తనములు స్రవించుటకు కారణమేమని సాంబమూర్తిని నడుగాఁగ ప్రపంచమునంతయు వ్యాపించి యుండు సాంబమూర్తి యోదేవీ! వినుమని యిట్లు చెప్పెను. నీకుమారుండు యీదిగుహప్రదేశమునం దుండెను.

శ్లో॥ త్వయివీర్యమనుత్సృష్టం ప్రాగేవాగాద్ధవిర్వహః ।
తందృష్ట్వా వ్రీడితాత్వంవై ప్రవిష్టాచస్థలాంతరమ్ ॥ ౮౭

తా॥ అదియేతీరు ననఁగా పూర్వమందు నీతో నేను సంభోగించుచుండఁగా నీయందు వీర్యమును విడువకపూర్వమే యచ్చటికి నగ్నిహోత్రుఁడు వచ్చెను. అప్పుడు నీవాయగ్నిహోత్రునిఁజూచి సిగ్గుపడి మఱియొకచోటునకు వెళ్ళి దాగితివి

శ్లో॥ మయాకోపాద్వహ్నిముఖే విసృష్టం వీర్యముల్బణం ।
దేవానాంచప్రసాదేన గంగాయాంవిసృజద్విభుః ॥ ౮౮

తా॥ అప్పుడు నేను వహ్నిహోత్రునియందు కోపముగలవాఁడనై దుస్సహమగు నావీర్యమును అతనిముఖమునందు విడువఁగా నతండు కొంతకాలముధరియించి పిమ్మట దేవతల యనుగ్రహమువలన గంగానదియందు విడిచెను.

శ్లో॥ గంగాచదహ్యమానాసా చిక్షేపశరాంతరే ।
తత్రిషోఢాప్రభిన్నంతు మాతృభిశ్చదృఢీకృతమ్ ॥ ౮౯

తా॥ ఆగంగానదియు వీర్యతాపముచేతపింపఁబడి రెల్లుపొదయందుంచగా నావీర్యము ఆఱువిభాగములాయెను. అప్పుడు షట్కృత్తికలు వచ్చి యా యాఱుపిండములను దృఢముగా నుండునట్లు కూర్చిరి.

శ్లో॥ పురుషాకృతిమాపేదే తందృష్ట్వాతే స్తనోస్నుతౌ ।
పాలనీయంమహావీర్యం విష్ణునాసమవిక్రమమ్ ॥ ౯౦

తా॥ ఆపిండములు ఒక్కదేహముకలిగి పురుషాకారమును బొందెను. ఆపురు

గను ఆ చూచుటచే ఈ స్తనములు స్రవించుచున్నవి. కాబట్టి నావీర్యము వలనసంభవించినట్టియు విష్ణువితో సమానమైన పరాక్రమముగల యీపిల్లవానిని నీవు రక్షించుము.

శ్లో॥ అయమేవౌరసఃపుత్రః స్తవభాతివినిశ్చితం ।
తస్మాద్గృహాణ శీఘ్రంత్వం తేనఖ్యాతి రతీవతే ॥ ౯౧

తా॥ నీకు కన్నకుమారుడు యితడనే నాకు నిశ్చయముగా తోచుచున్నది. కాబట్టి శీఘ్రముగా ఈపిల్లవానిని తీసికొనివెళ్ళి పోషించితివేని యితనివలన నీకు విశేషమైన ప్రసిద్ధి రాగలదు.

శ్లో॥ ఇత్యాజ్ఞప్తాశంభునాసా తమాదాయార్భకం ద్రుతం ।
అంకమారోప్యతందేవీ పాయయామాససా స్తనౌ ॥ ౯౨

తా॥ ఈప్రకారము సాంబమూర్తిచే నాజ్ఞాపింపబడి యాపార్వతీదేవి శీఘ్రముగా నాపిల్లవానిని తీసికొని తొడలయందునిడుకొని స్తన్యపానము జేయించెను.

శ్లో॥ దేవేనమోహితా దేవీ పుత్రస్నేహపరాభవత్ ।
పునః కైలాసమగమత్ప్రభుణాసహ శాంకరీ ॥ ౯౩

తా॥ ఈప్రకారము సాంబమూర్తిచే భ్రమనుపొందింపబడి పార్వతీదేవి పుత్రవాత్సల్యముగలదియగుచు సాంబమూర్తితో గూడ తిరిగి కైలాసమునకు చేరెను.

శ్లో॥ పుత్రంలాలయతీదేవీ సంతోషం పరమంయయౌ ।
ఏవం కుమారజననం వర్ణితంతే మయాద్భుతమ్ ॥ ౯౪

తా॥ అనంతరమా పార్వతీదేవి యాకుమారుని పెంచుచు విశేషమైన సంతోషమునుబొందెను. ఓరాజా! ఈప్రకార నాశ్చర్యకరమైన కుమారస్వామి జననమును నీకు చెప్పితిని.

శ్లో॥ యఇదంశృణుయాన్నిత్యం కుమారజననంశుభం ।
పుత్రపౌత్రాభివృద్ధింతు లభతేనాత్రసంశయః ॥ ౯౫

తా॥ శుభముల నొసంగు యీ కుమారస్వామి జననచరిత్రము నెవ్వడు వినుచున్నాడో అట్టివాడు ఇహలోకమునందు పుత్రులు, పౌత్రులు మొదలగు అభివృద్ధిని పొందగలడు. సందేహము లేదు.

శ్లో॥ మహద్దుఃఖంతుజననే హరస్యాప్రియతో౽భవత్ ।
ప్రీత్యాశ్రుతవైశాఖ ధర్మోస్యప్రీతిమోభవేత్ ॥ ౯౬

తా॥ తపోనిష్ఠాగరిష్ఠుఁడైయున్న సాంబమూర్తికి తిరిగివివాహమగుట అయి ష్టమైనందున నిట్టి అయిష్టమైన కార్యమును జేసికొనుటకు భ్రమనుకలిగించినందుకు మన్మథుఁడు కారణుఁడైనందుననూ, సత్పురుషులకు నప్రియమును చేసినందువలనను మనథుఁడు తిరిగి జన్మించినప్పుడు విశేషమైన దుఃఖమునుబొందెను. వైశాఖమాస ధర్మమైతే భగవంతునకును, సత్పురుషులకు నిష్టమైనందున నిత్యము వినుచుండిన యెడల విశేషమైన ఫలమునిచ్చునది యగును.

శ్లో॥ తస్మాద్వైశాఖధర్మోహి సర్వాఘౌఘవినాశనః ।
అవైధవ్యప్రదఃపుణ్యః సర్వసంప ద్విధాయకః ॥ ౯౭

తా॥ భగవంతునకు ప్రీతికరమగుటవలన వైశాఖధర్మము సమస్తపాపములను పోఁగొట్టునదియు, చిరకాలము సువాసినీత్వము కలిగించునదియు, పుణ్యకరమై నదియు, సమస్తసంపత్తుల నిచ్చునదియు నగును, విశాఖుఁ డనగా కుమారస్వామి గాన తచ్చరిత మిచ్చటసంగతము.

శ్లో॥ అనంగోపిహిసాంగత్వం యత్ప్రభావాత్సమాప్తవాన్ ॥
అస్నాత్వాచాప్యదత్వాచ వైశాఖోయస్యవైగతః ॥
అపిధర్మకృతోసాపి భవేద్దుఃఖపరంపరా ।
సర్వధర్మయుతస్యాత్తు యద్యేకోయమనుష్ఠితః ॥ ౯౯

తా॥ మన్మథుఁడు శరీరము లేనివాఁడైనను యే వైశాఖమాస ధర్మ మహత్తుచే శరీరసహితుఁడై యుండెనో, అట్టి వైశాఖమాసములో నెవఁడు స్నానముజేయకుం డునో, ఎవఁడు ధర్మముజేయకుండునో అట్టివాఁడు సమస్తధర్మములను జేసినప్పటికి దుఃఖములనే బొందుచుండును, సర్వధర్మములను జేయక నొక్క వైశాఖధర్మము నే జేసినయెడల సమస్తధర్మములను జేసినవాఁడగును.

ప్రుత్తోత్పత్తికథనంనామ నవమోధ్యాయ స్సమాప్తః ॥

---

## అ థ ద శ మో ధ్యా యః.

మైథిలః॥ శ్లో॥ యత్వా-మపత్నీ చరితఃమశూన్యశయనవ్రతం ॥
దేవోపదిష్ట. తస్యాస్య విధానం బ్రూహిభూసుర ॥ ౧

తా॥ మిథిలాధిపతి యగు హేమాంగుఁడు పలుకుచున్నాఁడు. ఓ బ్రాహ్మ ణుఁడా దేవతలచే నుపదేశింపఁబడినదియు, మన్మథుని భార్యయగు రతీదేవిచే నాచ రింపఁబడిన అశూన్యశయనవ్రతమనునది యేదికలదో దాని విధినంతయు చెప్పుము.

శ్లో॥ కిందానం కోవిధి స్తస్య పూజనం కింఫలం తథా ॥
ఏతదాచక్ష్వభూ దేవ శ్రోతుంకౌతూహలంహిమే ॥

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! ఏమి దానము చేయవలయును, ఎట్లు పూజింపవల యును, ఈవ్రతమాచరించిన వేమిఫలముకలుగును? దీనిని సవిస్తారముగా జెప్పితివేని వినుటకు నపేక్షగలిగియుంటిని,

శ్రుతదేవః॥ శ్లో॥ శృణుభూయః ప్రవక్ష్యామి వ్రతంపాపప్రణాశనం ।
అశూన్యశయనంనామ రమాయైహరిణోదితమ్ ॥ 3

తా॥ ఈప్రకారము హేమాంగుడడుగఁగా శ్రుతదేవుఁడు చెప్పుచున్నాఁడు. ఓరాజా! పాపములను బోఁగొట్టునదియు, లక్ష్మీదేవికి విష్ణుమూర్తిచే జెపఁబడిన దియు నగు అశూన్యశయనవ్రతమును జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ యేనచీర్ణేన దేవేశో జీమూతాభః ప్రసీదతి ॥
లక్ష్మీభర్తా జగన్నాథః సమస్తాఘౌఘనాశనః ॥ ౪

తా॥ దేవతలకందఱకు నధిపతియు, మేఘముయొక్క కాంతివంటి కాంతిగల వాఁడును, సమస్తపాపసమూహములను బోఁగొట్టువాఁడును, ప్రపంచమునకధిపతియు లక్ష్మీదేవికి పెనిమిటియగు విష్ణుమూర్తి యేవ్రతమాచరించిన ననుగ్రహించునో అట్టి వ్రతమును జెప్పుచున్నాను.

శ్లో॥ అకృత్వాయస్త్విదంరాజన్ వ్రతంపాతకనాశనం ।
గృహస్థధర్మాన్కురుతే తస్యధర్మోవిఫలంభవేత్ ॥ ౫

తా॥ ఓరాజా! పాపములను బోఁగొట్టు నీవ్రతముచేయక యెవఁడు గృహ స్థాశ్రమ ధర్మములనే జేయుచుండునో వాని ధర్మము లన్నియును నిష్ఫలములే యగుచుండును.

శ్లో॥ శ్రావణే శుక్లపక్షేతు ద్వితీయాయాంమహీపతే ।
అశూన్యశయనాఖ్యం తద్వ్రతమనుత్తమమ్ ॥ ౬

తా॥ ఓరాజా! అశూన్యశయనమనెడు శ్రేష్ఠమైన వ్రతమును శ్రావణ శుక్ల విదియనాఁడు జేయవలయును.

శ్లో॥ చాతుర్మాస్యేతుసంప్రాప్తే హవిష్యాశీభవేన్నరః ।
చతుర్భిఃపారణంమాసైః స్నాత్వా ప్రాప్య తే ప్రభో ॥ ౭

తా॥ ఓ ప్రభువా! ఈవ్రతము చేయునట్టి పురుషుడు చాతుర్మాస్యలయందు

పాయసముచే భుజియింపుచు నాలుగుమాసము లయిన పిమ్మట పారణము బాగుగా జేయవలయును.

శ్లో॥ లక్ష్మ్యాయుక్తో జగన్నాథః పూజనీయో జనార్దనః॥
పారణే విచ సేప్రాప్తే భక్ష్యాంశ్చైవ చతుర్విధమ్ । ౯

తా॥ పారణము జేయు దినమునందు లక్ష్మితో గూడినవాడును, మూడులోకములకు నధిపతియునగు విష్ణుమూర్తిని పూజించి నాలుగువిధములగు భక్ష్యములను నివేదన జేయవలయును.

శ్లో॥ ఉపాయనంచ దాతవ్యం బ్రాహ్మణాయకుటుంబినే ॥
సావర్ణీంరాజతీంవాపి మూర్తింకుర్యాన్మనోరమామ్ ॥
పీతాంబరధరాందివ్యాం వనమాలావిభూషితాం ।
శుక్లపుష్పైస్సుగంధైశ్చ పూజయేత్పురుషోత్తమమ్ ॥ ౧౦

తా॥ అనంతరము కుటుంబవంతుడైన బ్రాహ్మణునకు వాయన మియ్యవలయును. బంగారముతోగాని, వెండితోగాని శ్రేష్ఠంబగునదియు, సుందరముగానుండు నొక ప్రతిమనుజేయించి దానికి పట్టువస్త్రమునుజుట్టి తులసిమాలికలు మొదలగువానిచే నలంకరించి యాప్రతిమయందు విష్ణుమూర్తి నావాహనముజేసి తెల్లనిపుష్పములు పరిమళగంధములు మొదలగువానిచే పూజచేయవలయును.

శ్లో॥ శయ్యాదానైర్వస్త్రదానైర్విప్రాణాం భోజనైస్తథా ।
దంపత్యోర్భోజనైశ్చైవ దక్షిణాభిః ప్రపూజయేత్ ॥ ౧౧

తా॥ శయ్యాదానములు, వస్త్రదానములు, బ్రాహ్మణులకు భోజనము పెట్టుట దంపతులకు భోజనము పెట్టుట, దక్షిణలనిచ్చుట మొదగువానిచే బ్రాహ్మణులను పూజింపవలయును.

శ్లో॥ ఏవంతుచతురోమాసాన్పూజయిత్వా జనార్దనం ।
మార్గశీర్షాదిమాసేషు పూజయేత్పూర్వవద్ధరిమ్ ॥ ౧౨

తా॥ ఈప్రకారము శ్రావణము మొదలు నాలుగుమాసముల పర్యంతము విష్ణుమూర్తిని పూజించి పిమ్మట మార్గశీర్షము మొదలు నాలుగు మాసములయందును పూర్వమువలెనే విష్ణుమూర్తిని పూజింపవలయును.

శ్లో॥ రక్తవర్ణంహరింధ్యాయే ద్రుక్మిణీసహితంథా ।
చైత్రాదిచతురోమాసా నేవంసంపూజయేత్తతః ॥ ౧౩

తా॥ అనంతరము చైత్రము మొదలు నాలుగుమాసముల పర్యంతము రుక్మిణి

గా నే నాకయ్యకూడా యెల్లప్పుడుకూన్యణుకొనిపై యుండుగాక (అనగా నేనుండు పర్యంతము నా భార్యకూడా శివించియుండవలెననుట) అను నర్థముగల లక్ష్మ్యౌఅను శ్లోకమును జదివి భగవంతుని ప్రార్థించి దానమిచ్చి తాను భుజింపవలయును.

శ్లో॥ పురుషోవా సతీవాపి విధవావా సమాచరేత్ ।
అశూన్యశనార్థంచ కర్తవ్యంవ్రతముత్తమమ్ ॥ ౨౭

తా॥ శయ్యా సంపత్తిపుష్టముగా నెప్పుడు నుండుటకుగాను పురుషుడుగాని వాసినిగాని విధవగాని యెవరైయినను శ్రేష్ఠంబగు అశూన్యశయనను మనెడు వ్రతము చేయవలయును.

శ్లో॥ ఏవంతనమయాఖ్యాతం విస్తరాన్నృపసత్తమ ।
సుప్రసన్నే జగన్నాథే భవేయుర్వివిధాఃవ్రజాః ॥ ౨౮

తా॥ ఓ రాజశ్రేష్ఠుడా! ఈప్రకారము సవిస్తారముగా నేను నీకుజెప్పితిని. ఆశ్రీ విష్ణుమూర్తి యనుగ్రహముకలవాడయ్యెనేని సమస్త జనులు సంతోషింతురు.

శ్లో॥ తస్మిన్తుష్టే తు దేవేశే దేవాదామపిదుర్లభాః ।
తస్మాత్సర్వప్రయత్నేన వ్రతమేతత్సమాచరేత్ ॥ ౨౯

తా॥ సమస్త దేవతలకును ప్రభువగు భగవంతుడు సంతోషించినయెడల దేవతలకయినను పొందశక్యముగాని సంపదలను బొందుదురు. కాబట్టి సమస్త ప్రయత్నములచేత నశూన్యశయనమును నీవ్రతమును చేయవలయును.

శ్లో॥ అవశ్యంగంతుకామేన తద్విష్ణోఃపరమంపదం ॥
ఏవముక్తంమయాసర్వం కిమన్యచ్ఛ్రోతుమర్హసి ॥ ౩౦

తా॥ ఓరాజా! విష్ణుమూర్తియొక్క లోకమును ముఖ్యముగా పొందవలయునని కోరికగలవాడే వ్రతమును చేయవలయును. ఈప్రకారము వ్రతముయొక్క విధానము నంతయును జెప్పితిని. మఱియు నేమైనను వినవలయునని కోరిక యున్నయెడల దానినడుగుము.

శ్లో॥ ఇత్యుక్తస్తేవరాజర్షిః పునరప్యాహతంమునిం ।
వైశాఖేవ్రతదానస్య మాహాత్మ్యంవిస్తరాద్వద ॥ ౩౧

తా॥ ఈ ప్రకార మా మునీశ్వరుడు చెప్పగా విని యా రాజోత్తముడు తిరిగి యా మునీశ్వరు నడుగుచున్నాడు. ఓ మునీశ్వరా! వైశాఖమాసమున నొడగుడు దానమిచ్చినందువలన కలిగెడు మహాత్మ్యము విస్తారముగాజెప్పుము.

శ్లో॥ శృణ్వతోపినతృప్తిర్మే వైశాఖోక్తాశుభావహాః ॥
ఇతితద్వచనంశ్రుత్వా యశస్యంపుణ్యవర్ధనమ్ ॥
ప్రీత్యువాచమహాభాగ శ్రుతదేవోమహాయశాః ॥

తా॥ శుభములను గలుగజేయునట్టి వైశాఖమాసధర్మములను నెంతవినినను నాకు తనివితీరలేదు. అని యీప్రకారముగా బలికిన యా రాజుయొక్క కీర్తినొసంగునదియును పుణ్యమును వృద్ధిజేయునదియు నగువాక్యమును విని మహామహాభాగుండును విశేషప్రసిద్ధిగల యాశ్రుతదేవుండు తిరిగి చెప్పుచున్నాఁడు.

శ్రుతదేవః॥ శ్లో॥ వైశాఖేఘర్మతప్తానాం మానవానాంమహాత్మనాం॥
యేకుర్వంత్యాతపత్రాణి తేషాంపుణ్యమనంతకం ॥
అత్రైవోదాహరంతీమ మితిహాసంపురాతనమ్ ॥ 3౪

తా॥ శ్రుతదేవుఁడు చెప్పుచున్నాఁడు వైశాఖమాసము నందు యెండచే బాధింపఁబడినట్టియు, మహాత్ములగు మనుష్యులకు నెవఁడు గొడుగుల నిచ్చుచున్నాఁడో వాని పుణ్యము మితిమీరియుండును. ఇందునుగురించి పూర్వమందు జరిగిన యొక కథను జెప్పుచున్నాము.

శ్లో॥ వైశాఖధర్మముద్దిశ్య పురాకృతయుగేకృతం। వంగదేశేపురాకశ్చిద్ధేమకాంతఇతిశ్రుతః॥ 3౫ కుశకేతోస్సుధీమాన్ రాజాశస్త్రభృతాంవరః। ఏకదామృగయాసక్తో గహనంవనమావిశత్ ॥ 3౬

తా॥ వైశాఖమాసధర్మమునుగురించి పూర్వము కృతయుగములో జరిగిన కథ యెట్లన్నఁగా కుశకేతుయొక్క పుత్రుఁడును, బుద్ధిమంతుఁడును, ధనుర్ధరులలో శ్రేష్ఠుఁడునగు హేమకాంతుఁడనెడు రాజు పూర్వమందు వంగదేశములో నుండెను. ఆతఁడు యొకప్పుడు వేటాడుటయందాసక్తిగలవాఁడై దట్టమైనయరణ్యమునకు వెళ్లెను.

శ్లో॥ తత్రనానావిధాన్హత్వా మృగాన్క్రోడాదికాన్బహూన్ ।
శ్రాంతస్తృష్ణాన్వితోమధ్యాహ్నే వేళాయాంమునీనామాశ్రమంయయౌ

తా॥ ఆయరణ్యమునందు అడవిపందులు మొదలుగాగల యనేక మృగములను సంహరించి యలసినవాఁడై మధ్యాహ్నకాలమునందు మునీశ్వరులుండు ప్రదేశమునకు వెళ్లెను.

శ్లో॥ తదాశ్రమేతర్చినోస్థాము ఋషయశ్శంసితవ్రతాః ।
సమాధిస్థావజానంతి బాహ్యకృత్యంచకించన ॥ 3౭

తా॥ ఆయాశ్రమము శతర్చినులను మునులసంబంధమైనది. అప్పుడామునులు సమాధియందుండినవారై యింద్రియములని గ్రహించి బాహ్యకృత్యములను నతిథిసత్కారాదిబాహ్యవ్యాపారములను వేయేమియు నెఱుంగకయుండిరి.

శ్లో॥ తాన్దృష్ట్వానిశ్చలాన్విప్రాన్ క్రుద్ధోహంతుమనోదధే ।

భూషంచనివారసమాఘాస శిష్యాణామమృతంతదా ॥ ౩౯

తా॥ మహర్షియందుండి చలింపనివారై తపస్సును జేయుచున్న యామునులను జూచి మారాజు తనకు గౌరవముజేయలేదని కోపముగలవాడై వారిని చంప నిశ్చయించగా నప్పుడు వారిశిష్యులనేకముందికవచ్చి యారాజును నివారించి యిట్లుపలికిరి,

శ్లో॥ దుష్టబుద్ధేశ్శృణునోవాక్యం గురవస్తుసమాధిగాః।
నోజానంతిబహిఃకృత్యం తస్మాత్క్రోధంనచార్హసి ॥ ౪౦

తా॥ దుష్టబుద్ధిగలవాడా! మేము చెప్పునట్టి వాక్యమును వినుము. మాగురువులు సమాధియందుండినవారై యంతరంగమందు పరమాత్మనుజూచుచు బాహ్యమందు నేవ్యాపారమును జేయకుండిరి, కాఁబట్టి నీవిప్పుడు వారియందు కోపగించుట తగదు.

శ్లో॥ తతశ్శిష్యానువాచేదం వచనంక్రోధవిహ్వలః ।
యూయంకురుధ్వమాతిథ్య మద్వశాంతస్యమేద్విజాః ॥౪౧

తా॥ అని శిష్యులు పలుకఁగా ననంతరమారాజు తీవ్రమైన కోపముగలవాఁడై ఓ బ్రాహ్మణులారా! వారికి వీలులేనియెడల నేను మార్గాయాసముచే మిక్కిలి యలసియుంటినిగాన మీరయినను భోజనాదికమునొసంగుడని శిష్యులతో బలికెను.

శ్లో॥ ఏవముక్తాశ్చభూపేన శిష్యాఊచుస్తదానృపం।
నాజ్ఞప్తాగురుభిర్భూప వయంభిక్షాశినఃకథమ్ ॥ ౪౨

తా॥ ఈప్రకారము రాజు పలుకఁగా నా రాజుతో శిష్యులు చెప్పుచున్నారు. ఓ. రాజా! మేము గురువులాజ్ఞను బొందినవారము కాము. వారు మాకు భిక్షబెట్టిన యెడల దానిని తిని బ్రతుకుచున్నాము.

శ్లో॥ గురుతంత్రాఃకథంకర్తు మాతిథ్యంనవయుక్ష్మహే ।
ప్రత్యాఖ్యాతోనృపశ్శిష్యైస్తాన్హంతుంధనురాదదే ॥ ౪౩

తా॥ గురువుల యాజ్ఞలోనుండు మేము వారి యనుమతిలేక నతిథిసత్కారము నెట్లుజేయగలమని శిష్యులు బదులుచెప్పఁగా నారాజు కోపించి వారిని చంపుటకు ధనుస్సును గ్రహించి యిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ మృగదస్యుభయాదిభ్యో జహాంధారక్షితామయా ॥
తేమామేవోపశిక్షంతి మర్యాదత్తప్రతిగ్రహాః ॥ ౪౪

తా॥ క్రూరమృగములు దొంగలు, మొదలగువానివలన మీకుభయములేకుండ జేసితిని. అట్టినన్ను మాజలవ ఆగ్రహారాధి ,సత్కారములఁ బొందియు మమ్మునే బాధింపఁదలఁచియున్నారు.

తా॥ ఇట్లు హేమకాంతుఁడనెడు రాజు తండ్రిచే వెడలగొట్టింపఁబడి మిక్కిలి విచారముగలవాఁడగుచు ననంతర మొక దట్టమైన యడవిని బ్రవేశించి బ్రహ్మహత్యలచే పీడింపఁబడుచుండెను.

శ్లో॥ బహుకాలమవాసీచ్చ గహ్వరే నిర్జనే వనే ।
ఆహారం కల్పయామాస వ్యాధధర్మముపాశ్రితః ॥ ౫౨

తా॥ ఇట్లు ఆ అడవి పర్వతగుహతో సమానమైనది గనుకనే దట్టముగా నుండునట్టి ఆ యడవిని దిరుగుచు కిరాతుల వ్యాపారము నవలంబించి మాంసాదికము నాహారముగా జేసికొనుచు చాల కాలము గడపెను.

శ్లో॥ సకృపి సీమాపేద్యే హత్యయాభిద్రుతో భృశం ।
అష్టావింశతివర్షాణి వర్తన్యస్య దురాత్మనః ॥

తా॥ ఈ దురాత్ముఁడిట్లు బ్రహ్మహత్యచే పీడింపఁబడుచు నొక్కచోటునను నిలుకడలేక దిరుగుచుండఁగా నిరువదియెనిమిది సంవత్సరములు గడచెను.

శ్లో॥ తీర్థయాత్రాప్రసంగేన త్రితోనామ మహామునిః ।
తస్మిన్నరణ్యే వైశాఖే మాసే మధ్యందినే గతే ॥ ౫౪
గచ్ఛన్నాతపవిక్లాంత స్తృష్ణయా చాతిపీడితః ।
క్వచిద్వృక్షవిహీనేతు ప్రదేశే మూర్ఛితో భవత్ ॥ ౫౫

తా॥ ఇట్లు కొంత కాలము గడచిన పిమ్మట నొకప్పుడు త్రితుఁడను పేరుగల యొక మునిశ్రేష్ఠుఁడు పుణ్యక్షేత్రములను సేవించుటకుగాను బయలుదేరి యాయా క్షేత్రంబులను సేవించుచుండఁగా చెట్లులేని యొకానొక యడవి ప్రదేశమునకు వచ్చెను. ఇట్లుండఁగా మధ్యాహ్నకాలమాయెను. అప్పుడు వైశాఖమాస మగుటవలన యెండ వేడిమిచే తపింపఁబడి యాతఁడు దప్పికచే పీడింపఁబడి మూర్ఛనొందెను.

శ్లో॥ దైవాత్తత్ర ప్రవిష్టో హేమకాంత స్త్రితం నామ మహామునిం ।
తృష్ణార్తం మూర్ఛితం శ్రాంతం కృపాంచక్రే నృపాధమః ॥ ౫౬

తా॥ రాజాధముఁడైన యా హేమకాంతుఁడు యెండవేడిమిచే తపింపఁబడి దప్పికచే మూర్ఛనొందియున్న త్రితుఁడనెడు మునిశ్రేష్ఠుని దైవవశమువలన జూచి యా మునీశ్వరునియందు దయగలవాఁడయ్యెను.

శ్లో॥ ఛత్రం పత్రైస్తదా ఘత్రిం కృత్వా చాతపవారణం ।
మునేర్జగ్రాహ శిరసి పాలాబుష్టం జలం దదౌ ॥ ౫౭

తా॥ అప్పుడు మోదుగాకులనుదెచ్చి గొడుగుగాకుట్టి యా మునీశ్వరుని ముఖమునకు నీడవచ్చునట్లుగా పట్టి తాపమును బోఁగొట్టి సొఁకాయబుఱ్ఱయందుండిన జలము నిచ్చి దాహము తీర్చెను.

శ్లో॥ లబ్ధసంజ్ఞోభవత్తేన హ్యుపచారేణవై మునిః ।
పత్రఛత్రంతు తద్దత్తం గృహీత్వాగతవిక్లమః ॥
గ్రామంకంచిచ్ఛనైః ప్రాప్య సుఖితోసబభూవహ ॥

తా॥ ఆరాజుచే జేయఁబడిన యుపచారముచే నామునీశ్వరుఁడు మూర్ఛదెలసి మేల్కాంచి యా రాజుచే నీయఁబడిన మోదుగాకుల గొడుగును వేసికొనియలసట పోఁగొట్టుకొని మెల్లగా నొకగ్రామము జేరి సౌఖ్యమునుబొందెను.

శ్లో॥ తేనపుణ్యప్రభావేన బ్రహ్మహత్యాశతత్రయం ।
వినష్టమభవత్తస్య క్షణాదేవమహాత్మనః ।
తతోవిస్మయమాపన్నో హేమకాంతో మహారథః ॥ ౬౦

తా॥ ఆ మునీశ్వరునకు గొడుగునిచ్చుటచే గలిగిన పుణ్యమువలన యారాజుచే జేయఁబడిన మూఁడువందల బ్రహ్మహత్యలు నశింపఁబడినవి. ఆ రాజా పరిశుద్ధాంతరంగుఁడై యాశ్చర్యమునుబొంది యిట్లు విచారించుచుండెను.

శ్లో॥ బహుధాపీడ్యమానస్య బ్రహ్మహత్యాః కథంగతాః । కేనాపినిష్కృతాహ్యేతాః క్వగతాః కేనహేతునా ॥ ఇత్యేవంచింతయామాస బ్రహ్మహత్యావిమోచనం । ఏవంచాజ్ఞః స్థితేరాజ్ఞి యమదూతాఅథాగమన్ ॥ నేతుమేవం మహాత్మానం హేమకాంతం వనేస్థితం । గదంతుజనయామాసుః ప్రాణాన్హర్తుంమహాత్మనః ॥ ౬౩

తా॥ నేను బ్రహ్మహత్యలచే నిదివఱకు బాధింపఁబడితిని. ఇప్పుడెట్లునశించినవి? ఈబ్రహ్మహత్య లేకారణముననశించినవో తెలియకుండెను. ఎట్టి ప్రతిక్రియను జేసితినో యెఱుఁగను. అని యీప్రకారము ఆరాజు తనకు బ్రహ్మహత్యానివృత్తి కలిగినందుకు కారణము నెఱుఁగనివాఁడై యాలోచించుచుండగా ననంతరము యమదూతలువచ్చి వనమునందు నివసించియున్న మహానుభావుఁడైన యా హేమకాంతుని తమ లోకమునకు తీసికొని వెళ్ళదలఁచినవారై యా మహానుభావునకు ప్రాణములను తీసివేయునట్టి రోగమును పుట్టించిరి.

శ్లో॥ తదాప్రాణవియోగార్తః పురుషాంస్త్రీన్దదర్శహ ।
యమదూతాన్మహాఘోరా నూర్ధ్వకేశాన్భయంకరాన్ ॥ ౬౪

తా. అప్పుడా రాజు పాపిష్ఠులు భయంకరులును కేశములు పైకి నుండువారు నగు ముగ్గురు యమదూతలను జూచెను.

శ్లో॥ చింతయానాన్స్వకర్మాణి తూష్ణీమాసత్ తదానృపః।
ఛత్రదాన ప్రభావేన జాతావిష్ణుస్మృతిర్నృప॥ ౬౫

తా॥ ఓ రాజా! అప్పుడా యమదూతలు వారు చేయదలచిన కృత్యము నాలోచించుచు ఊరకుండిరి. అంతట పూర్వమందు గొడుగునిచ్చుటవలన గలిగిన పుణ్యవశముచే నా రాజునకు విష్ణుస్మరణ చేయుట సంభవించెను.

శ్లో॥ తేనస్మృతో మహావిష్ణుర్విష్వక్సేనంసమంత్రిణం।
ఉవాచతూర్ణంత్వంచాద్య యమదూతాన్నివారయ॥ ౬౬

తా॥ ఆరాజు విష్ణుమూర్తిని స్మరియింపగా నా విష్ణుమూర్తి తన మంత్రి యగు విష్వక్సేనుని బిలిచి యిట్లు చెప్పుచున్నాడు. నీవు శీఘ్రముగా వెళ్ళి యమదూతలను వెళ్ళగొట్టుము.

శ్లో॥ వైశాఖధర్మనిరతం హేమకాంతంకుపాలయ।
నిష్పాపమేనంమద్భక్తం పిత్రే దేహిపురంగతః॥ ౬౭

తా॥ హేమకాంతుడు వైశాఖమాస ధర్మములయం దాసక్తిగలవాడుగాన యాతనిని కాపాడుము. పాపరహితుడును నాకు భక్తుడు నగు నాతనిని తీసుకొని పట్టణమునకు వెళ్ళి యాతని తండ్రికి ఒప్పగించుము.

శ్లో॥ మదీరితేనవాక్యేన కుశకేతుంచబోధయ।
సర్వధర్మోజ్ఝితో వాపి బ్రహ్మచర్యాదివర్జితః॥
వైశాఖధర్మనిరతో మత్ప్రియస్స్యాన్నసంశయః।
కృతాగాశ్చాపిత్వత్పుత్రో మునిత్రాణపరాయణః॥ ౬౮

తా॥ నేను నీతో జెప్పినరీతిగా కుశకేతునితో నిట్లు చెప్పుము. ఓరాజా! నీ తనయుడు సమస్తధర్మములను విడిచినప్పటికిని, బ్రహ్మచర్యము మొదలగు నియమలను జరుపనప్పటికిని వైశాఖమాసధర్మములయం దాసక్తిగలవాడై మార్గమందు [illegible] ను నీశ్వరుని రక్షించెను గాన యపరాధములను జేసినవాడైనను నాకు ప్రియమైనవానినిగా నెంచితిని. సందేహము లేదు.

శ్లో॥ వైశాఖేఛత్రదానేన నిష్పాపోనాత్రసంశయః।
క్షేత్రప్రాప్య ప్రభావేన శాంతో దాంతశ్చిరాయుషః॥

శౌర్యౌదార్యగుణోపేత స్త్వత్సమోఽయంగుణైరపి ।
తస్మాదేవంరాజ్యభారే సంస్థాపయమహాబలమ్ ॥ ౭౧

తా॥ వైశాఖమాసములో గొడుగును దానమిచ్చుటచే పాపరహితుఁడై యుండెను. ఇందువిషయమై సందేహములేదు. ఆ పుణ్యవిశేషముచే ఓర్పుగలవాఁడును, ఇంద్రియనిగ్రహముగలవాఁడును, పూర్ణాయుర్దాయముగలవాఁడునై శౌర్యము ఔదార్యము మొదలగు గుణములుగలిగి నీతో సమానుఁడయియుండెను గాన మహాబలము గల యితనిని రాజ్యమునందుంచి పట్టాభిషిక్తుని జేయువలయును.

శ్లో॥ విష్ణునైవంసమాజ్ఞప్త మిత్యాదిశ్యనృపోత్తమం ।
పితుర్వసే హేమకాంతం స్థాప్యాయాహిచమాంపునః ॥ ౭౨

తా॥ ఈప్రకారము విష్ణుమూర్తి యాజ్ఞాపించెననియు, రాజుతో జెప్పి యా హేమంతుని తండ్రిస్వాధీనపరచి తిరిగి నాసన్నిధానమునకు రమ్ము.

శ్లో॥ ఇత్యాదిష్టోభగవతా విష్వక్సేనోమహాబలః ।
హేమకాంతంసమాసాద్య యమదూతాన్నివార్యచ ॥
పాణినాస్వాంతమేవంహి సస్పర్శాంగేషుభూమిపం ।
భగవద్భక్తసంస్పర్శా ద్గతవ్యాధిఃక్షణాదభూత్ ॥ ౭౪

తా॥ ఈప్రకారము విష్ణుమూర్తిచే నాజ్ఞాపింపఁబడి బలవంతుఁడగు యా విష్వక్సేనుఁడు యా హేమకాంతునొద్దకువెళ్ళి యమభటులను వెళ్ళగొట్టి బాధపడుచుండిన యా హేమకాంతుని శరీరావయవములను తన హస్తముతో స్పృశింపగా భగవద్భక్తుని హస్తస్పర్శ గలుగుట వలన క్షణకాలములోనే యా రాజునకుండు రోగము మానెను.

శ్లో॥ విష్వక్సేనస్తసస్తేన సహతస్యపురీం యయౌ ।
తందృష్ట్వా విస్మితోభూత్వా కుశకేతుర్మహాప్రభుః ॥ ౭౫
ననామశిరసాభక్త్యా దండవత్పతితోభువి ।
గృహంప్రవేశయామాస పార్షదం పరమాత్మనః ॥ ౭౬

తా॥ అనంతరము విష్వక్సేనుఁడు యా రాజుతోగూడ నాతని పట్టణమునకు వెళ్ళఁగా ప్రభువగు కుశకేతుఁడు పాపనివృత్తినిబొంది వచ్చిన తనకుమారునిజూచి మిక్కిలి యాశ్చర్యమునుబొంది యా విష్వక్సేనునకు సాష్టాంగదండప్రణామముజేసి తన కుమారునితోగూడ భగవద్భక్తుఁడగు నా విష్వక్సేనుని గృహమందు ప్రవేశపెట్టెను.

శ్లో॥ స్తుత్వాచవివిధైస్స్తోత్రైః పూజయామాసవైభవైః ।
తస్మైప్రీతమనాఃప్రాహ విష్వక్సేనో మహాబలః ॥ ౭౭

తా॥ ఆరాజు మహాబలుఁడగు విష్వక్సేనుని యనేకవిధముల స్తోత్రముజేసి తన భాగ్యముకొలఁది పూజించగా నా విష్వక్సేనుఁ డారాజుతో నిట్లుచెప్పెను.

శ్లో॥ హేమకాంతంసముద్దిశ్య యదుక్తంవిష్ణునాపురా ।
తచ్ఛ్రుత్వాకుశకేతుశ్చ పుత్రంరాజ్యేనివేశ్యచ ॥
విష్వక్సేనాభ్యనుజ్ఞాత స్సభార్యోవనమావిశత్ ॥

తా॥ విష్ణుమూర్తి విష్వక్సేనునితో జెప్పినరీతి నా విష్వక్సేనుఁడుచెప్పగా కుశకేతుఁడువిని సంతసించి తనయుని రాజ్యమునందుంచి విష్వక్సేనుఁ డనుజ్ఞ నివ్వఁగా నా కుశకేతుఁడు భార్యతోఁగూడ వనమునకేగెను.

శ్లో॥ విష్వక్సేనో హేమకాంత మనుమంత్ర్యాభిపూజితః ।
శ్వేతద్వీపంయయౌధీమా న్విష్ణోఃపార్శ్వేమహామనాః ॥ ౭౯

తా॥ మంచిస్వభావముగల యా విష్వక్సేనుఁడు హేమకాంతునిచే పూజింపఁబడి యనుజ్ఞ గొని శ్వేతద్వీపమునకువెళ్ళి విష్ణుసమీపమునందుండెను.

శ్లో॥ హేమకాంత స్తతోరాజా వైశాఖోక్తాన్ శుభావహాన్ ।
విష్ణుప్రీతికరాన్ ధర్మాన్ ప్రతివర్షంచకారహ ॥ ౮౦

తా॥ అనంతరము హేమకాంతుఁడు శుభమును గలుగజేయునట్టియు, విష్ణుమూర్తికి సంతోషకరమైనవియు, వైశాఖమాసములో జేయఁదగినవియునగు ధర్మములను ప్రతిసంవత్సరమున జేయుచుండెను.

శ్లో॥ బ్రహ్మణ్యోధర్మమార్గస్థ శ్శాంతోదాంతో జితేంద్రియః ।
దయాళుస్సర్వభూతేషు సర్వయజ్ఞేషుదీక్షితః ॥ ౮౧
ప్రవృద్ధస్సర్వసంపద్భిః పుత్రపౌత్రాదిభిర్వృత ।
భుక్త్వాభోగాన్సమస్తాంశ్చ విష్ణులోకమవాప్తవాన్ ॥ ౮౨

తా॥ బ్రహ్మజ్ఞానము గలవాఁడును, ధర్మమార్గము ననుసరించువాఁడును, ఓర్పుగలవాఁడును, అంతర్బాహ్యేంద్రియముల నిగ్రహించినవాఁడును, సమస్తభూతములయందు దయగలవాఁడును, సర్వయజ్ఞములను జేసినవాఁడును, సమస్తైశ్వర్యములచే నధికుఁడైనవాఁడును, పుత్రపౌత్రులు మొదలగువారితో గూడినవాఁడునై యీలోకంబున సమస్తసుఖముల ననుభవించి యనంతరము వైకుంఠమును బొందెను.

---

శ్లో॥ నేత్థేతువై శాఖ సమాంశ్చ ధర్మాన్ సుఖప్రియత్నా న్బహు పుణ్యహేతూన్ । పాపేంధనా ద్యగ్ని నిభాం త్సులభ్యాన్ ధర్మాదిమోక్షాంత పుమర్థ హేతూన్ ॥ ౮3

తా॥ కాబట్టి అనాయాసముగా జేయఁదగినవియు, విశేషపుణ్యముల నొసగునవియు, పాపములను సమిధలనుదహించుటవలన నగ్నితోసమానమైనవియు, శీఘ్రముగా జేయఁదగినవియు, ధర్మార్థకామమోక్షములను పురుషార్థములకు కారణమైనవియు నగు ధర్మములు వైశాఖమాస ధర్మములకంటె నితర ధర్మములు లేవని నాయభిప్రాయము.

నారదాంబరీషసంవాదే ఘృతదానప్రశంసనే హేమకాంతస్య బ్రహ్మహత్యాది పాపశమనంనామ దశమోధ్యాయ స్సమాప్తః.

---

అథ ఏ కా ద శో ధ్యా యః.

మైథిలః॥ శ్లో॥ వైశాఖధర్మాస్సులభాః పుణ్యారాశివిధాయకాః ।
విష్ణుప్రీతికరాస్సద్యః పుమర్థానాంతు హేతవః ॥
నప్రఖ్యాతాఃకథంలోకే శాశ్వతాశ్శ్రుతిచోదితాః ॥

తా॥ హేమాంగుఁ డడుగుచున్నాఁడు. ఓ మునీశ్వరా! సులభముగా జేయఁదగినవియు, విశేష పుణ్యములను గలిగించునవియు, విష్ణుమూర్తికి ప్రియమైనవియు, చేసిన తత్క్షణమునందే ధర్మార్థకామమోక్షముల నొసంగునవియు, చిరకాలమునుండు ఫలముల నిచ్చునవియు, వేదములచే జెప్పఁబడునవియు నగు వైశాఖమాసధర్మములు లోకములో నెందువలన ప్రసిద్ధి జెందియుండలేదు.

శ్లో॥ ప్రఖ్యాతారాజసాధర్మా స్తామసాఅపిభూరిశః। దుర్ఘటాబహుయత్నాశ్చ బహుద్రవ్యవ్యయావహాః ॥ కేచిన్మాఘంప్రశంసంతి చాతుర్మాస్యాన్ పరేజగుః ॥ వ్యతీపాతాదిధర్మాంశ్చ వర్ణయంతీహభూరిశః । ఏతద్వివేకంవిస్తార్య శ్రోతుకామాయమేవద ॥

తా॥ చేయ శక్యముగానివియు, విశేషప్రయత్నముచే జేయఁదగినవియు మిక్కిలి ద్రవ్యము ఖర్చుజేయవలసినవియు నగు రాజసధర్మములు, తామసధర్మములు లోకములో విశేషముగా వ్యాపించియున్నవి. కొందఱు మాఘమాసమును పుణ్యకరమైనదిగాను, మఱికొందఱు చాతుర్మాస్యములను పుణ్యకరములైనవిగాను, మఱి

శ్లో॥ యథాధిపత్యేసంప్రాప్తే సర్వస్మిన్భూమనోరథః ।
మోహాన్నిష్ఫలం ప్రాప్త మాధవత్వంగమాయతే । ౧౧

తా॥ ఆప్పు డాయన ప్రభుత్వమునకు సంప్రాప్తమైన సమస్త లోకములు నిర్భయముగా మోహకరములగు నితర ధర్మములను జేసినప్పటికిని సమస్త సంపత్తులు క్షీణింపక వృద్ధినొందును.

శ్లో॥ కారణంచ ప్రవక్ష్యామి శోచనే భూతలేంజసా ।
యద్వైశాఖోక్తధర్మాణాం సాత్వికానాం నృణామిహ ॥ ౧౨

తా॥ భూలోకమునందు సాత్వికధర్మములను వైశాఖమాస ధర్మములు యెందు వలన ప్రసిద్ధిజెందక యున్నవో ఆ కారణమును చెప్పుచున్నాను.

శ్లో॥ సార్వభౌమః పురాకాశ్యా మిక్ష్వాకుకులభూషణః ।
కీర్తిమానితివిఖ్యాతో నృగపుత్రో మహాయశాః ॥ ౧౩

తా॥ పూర్వము కాశియందు ఇక్ష్వాకువంశమునందు పుట్టి ప్రసిద్ధి జెందియుండినవాఁడును, విశేషకీర్తిగలవాఁడును, చక్రవర్తియు. నృగమహారాజు పుత్రుఁడును, కీర్తిమంతుఁడను రాజుగలఁడు.

శ్లో॥ జితేంద్రియోజితక్రోధో బ్రహ్మణ్యోరాజసత్తమః ।
ఏకదామృగయాసక్తో వసిష్ఠాశ్రమమాయయౌ ॥ ౧౪

తా॥ ఇంద్రియములను జయించినవాఁడును, క్రోధములేనివాఁడును, జ్ఞానము గలవాఁడునగు నా రాజోత్తముఁ డొకప్పుడు వేఁటయందు వాసక్తిగలవాఁడై వసిష్ఠుని యాశ్రమమునకు వెళ్ళెను.

శ్లో॥ గచ్ఛన్మార్గేదదర్శాసౌ వైశాఖేధర్మనిష్ఠురే ।
భూయోభూయఃకార్యమాణాన్ శిష్యైస్తస్యమహాత్మనః ॥

తా॥ ఆరాజధర్మములను జేయు శక్యముగాని వైశాఖమాసములో మార్గము నందు వెళ్ళుచు వసిష్ఠమహామునియొక్క శిష్యులు ప్రతిప్రదేశమునందును జేయఁబడు చుండిన వైశాఖమాసధర్మములను జూచుచుండెను.

శ్లో॥ క్వచిత్ప్రపాంప్రకుర్వంతి ఛాయామండపమేనచ ।
తటప్రపాతంనిస్త్రీర్య వాపీంకుర్వంతినిర్మలామ్ ॥ ౧౬

తా॥ ఒకచోటను చలివేందరిను, మఱియొక చోట నీడగానుండు మంటపమును, ఒక్కచోట చెఱువులను, ఒక్కచోట దిగుడుబావులను నేర్పఱచిరి.

శ్లో॥ సూపవిష్టాన్క్వచిద్వృక్షే వ్యజనైర్వీజయంతిచ ।
క్వచిద్దద్యురిక్షుఖండాన్ క్వచిద్గంధాన్క్వచిత్ఫలమ్ ॥ ౧౭

తా. ఒకానొకచోట చెట్లనీడలయందు నాయాసము జెంది కూర్చుండినవారిని విసనకఱ్ఱలతో విసరుచుండిరి. ఒకచోట చెఱకుగడ నిచ్చుచుండిరి. మఱియొకచోట గంధమును, ఇంకొకచోట ఫలముల నిచ్చుచుండిరి.

శ్లో॥ మధ్యాహ్నే ఛత్రదానంచ సాయాహ్నే పానకస్యచ ।
క్వచిత్ప్రయచ్ఛంతితాంబూలం నేత్రేకర్పూరలేపనమ్ ॥ ౧౮

తా॥ మధ్యాహ్న సమయంబున గొడుగుల నిచ్చుటయు, సాయంకాలమున పానకము నిచ్చుటయు, నొకచోట తాంబూలములనిచ్చుటయు, నొకచోట కండ్లకు కర్పూరము బూయుటయు జేయుచుండిరి.

శ్లో॥ సుచ్ఛాయేచవనే కేచి త్సుసంమృష్టాంగణేషుచ ।
కేచిదాస్తరయంత్యస్మిన్ వాలుకానిహితానిచ ॥ ౧౯

తా॥ కొందఱు నీడగల చెట్లక్రిందను, కొందఱు చక్కఁగా బాగుచేయఁబడిన వాకిండ్లయందునను, మఱికొందఱు చల్లనిప్రదేశము నందుండు నిసుకతిన్నెల యందునను ఆసనములను పఱచి కూర్చుండఁబెట్టుచుండిరి.

శ్లో॥ కుర్వంత్యాందోళికాం కేచి ద్వృక్షశాఖావలంబినీం ।
కేయూయమితిపప్రచ్ఛ వాసిష్ఠాఇతితేబ్రువన్ ॥ ౨౦

తా॥ ఓరాజా! ఒకానొకచోటున చెట్లయందు నుయ్యెలలనుగట్టి యూగించుచుండిరి. ఈప్రకారము వైశాఖధర్మములను జేయుచున్న యా మునులను జూచి మీ రెవరని యా రాజడుగఁగా మేము వసిష్ఠమహాముని శిష్యులమని వారు తిఱిగి పలికిరి.

శ్లో॥ కిమేతదితిపప్రచ్ఛ ధర్మావైశాఖచోదితాః ।
పుమర్థహేతవఇమే క్రియంతేస్మాభిరంజసా ॥ ౨౧

తా॥ మీరు చేయు కార్య మెందుకొఱకని రాజడుగఁగా నివి వైశాఖమాస ధర్మములు, ధర్మార్థ కామ మోక్షములకు కారణములైనవి. కాఁబట్టి మేము చేయుచున్నాము.

శ్లో॥ వసిష్ఠస్యాజ్ఞయాచేతి తేబ్రువన్నృపసత్తమం ।
సతదాచరణేపుంసాం కింఫలంకస్తుతుష్యతి ॥
ఏతద్విస్తార్యమేబ్రూత యూయంసమ్యగ్యథాశ్రుతం ।
ఇతిరాజ్ఞాతుసంపృష్టాః ప్రత్యూచుస్తేమహీపతిమ్ ॥ ౨౩

తా॥ వసిష్ఠమునీశ్వరునియాజ్ఞ చే నిట్లుచేయుచున్నామని యారాజశ్రేష్ఠునితో మునీశ్వరులు పలుకఁగా నీ వైశాఖమాస ధర్మమును జేయుటవలన పురుషులకు నేమి ఫలము కలుగును. ఏదేవత సంతోషించును. ఈవిషయమునంతయు మీకు తెలిసినంత వఱకు నాకు జెప్పవలయునని తిరిగి రాజడుగఁగా యామునీశ్వరు లాతనితో నిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ గురోరాజ్ఞాక్రమేణైవ కుర్వతాం పథిసత్క్రియాః।
నాస్మాకమవకాశోత్ర గురుంపృచ్ఛయథోచితః॥ ౨౪

తా॥ గురువుయొక్క యాజ్ఞానుసారముగా మార్గములో నిట్టి మంచికార్యములను జేయుచున్నాము. కాఁబట్టి యీవిషయమును జెప్పుటకు మాకు స్వతంత్రము లేదు. మా గురువువద్దకు వెళ్ళి మీ యిష్టానుసారముగా మీరే యా మునీశ్వరు నడిగి తెలిసికొనుడు.

శ్లో॥ సవేత్తితత్వతోనూనం ధర్మానేతాన్మహాయశాః।
ఇతిశిష్యైర్వశిష్ఠశ్య ప్రత్యుక్తస్తుద్రుతంయయౌ॥ ౨౫

తా॥ మహానుభావుఁడగు యామునీశ్వరుఁడే యీధర్మములను బాగుగా నెఱిఁగినవాఁడు అని వసిష్ఠమహాముని శిష్యులు చెప్పఁగా నారాజు శీఘ్రముగా నామునీశ్వరునియొద్దకు వెళ్ళెను.

శ్లో॥ వసిష్ఠస్యాశ్రమంపుణ్యం విద్యాయోగోపబృంహితం।
నమాయాంతంనృపంవీక్ష్య వసిష్ఠఃప్రీతమానసః ౨౬

తా॥ పుణ్యాకరమైనదియు, విద్యలు యోగము మొదలగువానిచే నిండియుండిన వసిష్ఠమహామునియొక్క యాశ్రమములో వచ్చుచున్న యారాజును జూచి వసిష్ఠమహాముని సంతోషించెను.

శ్లో॥ ఆతిథ్యంవిధివచ్చక్రే సానుగస్యమహాత్మనః।
సూపవిష్టఃకృతాతిథ్యః ప్రీతఃప్రపచ్ఛతంగురుమ్॥

తా॥ అనంతరమం దా మునీశ్వరుఁడు చతురంగబల సమేతముగా వచ్చుచున్న యారాజును కూర్చుండఁబెట్టి సంతోషముతో గూడినవాఁడై యతిథి సత్కారములనుజేయఁగా నారాజు సంతసించి యాగురువుతో నిట్లు పలుకుచున్నాఁడు.

రాజః॥ శ్లో॥ మార్గేదృష్టంమహాశ్చర్యం త్వచ్ఛిష్యైశ్చకృతంశుభం।
మయాపృష్టంచతైరోక్తం క్రియమాణంశుభావహామ్॥ ౨౮

తా॥ రాజు పలుకుచున్నాఁడు. ఓ మహానుభావా! మీశిష్యులు చేయుచున్న గొప్పకార్యములఁ జూచి శుభములకొఱకుగు మీచే జేయఁబడిన యీకార్యము లెందు నిమిత్తము చేయుచుండిరని వారిని యడుగఁగా వారు సమాధానము చెప్పలేదు.

శ్లో॥ నానాత్మకమవకాశోఽత్ర హ్యేతద్ధర్మప్రశంసనే ।
కర్తవ్యాశ్చక్రియాన్మాభి ర్గురుణాయాచచోదితా ॥ ౨౯
గురుంగచ్ఛేత్తైరుక్త ఆగతోహంతవాంతికం ।
త్వన్నిమంత్రితేన శ్రాంతేనాతిథ్యమిచ్ఛతా ॥ ౩౦

తా॥ ఓ మునీశ్వరా! నేను వేటాడుటయందు ఆసక్తిగలిగి యీవనమునకువచ్చి వేటాడి యలసి మీశిష్యులచే జేయఁబడిన యాతిథ్యమునుగ్రహించి యీ ధర్మములను గురించి వారి నడుగఁగా మేము వసిష్ఠమహాముని యాజ్ఞానుసారముగా ధర్మములను జేయువారమే కాని వాని మహాత్మ్యము జెప్పుటకు నధికారము మాకులేదు. కాన మా గురువు నడిగి తెలుసుకొనుమని వారు చెప్పఁగా మీవద్దకు వచ్చితిని.

శ్లో॥ దృష్టంచూర్గేత్వేదంపుణ్యాం తవశిష్యైశ్చకారితం ।
జిజ్ఞాసాసీత్తతశ్శ్రోతుం ధర్మానేతాన్మునీశ్వర ॥ ౩౧

తా॥ ఓ మునీశ్వరా! మార్గములో మీ శిష్యులచే జేయింపఁబడుచున్న యీ ధర్మములనుజూచి యాశ్చర్యపడి వానివిధానము తెలిసికొన నిశ్చయించి యనంతరం మీవలన యీ ధర్మములను వినుటకొఱకు వచ్చితిని.

శ్లో॥ త్వమాదిరాదిమార్గధర్మాన్ సమాచరసివై యతః ।
తాన్ ధర్మాన్ శ్రోతుకామాయ శిష్యాయప్రణతాయచ ॥
శ్రద్ధధానాయమేబ్రూహి విస్తరాన్మునిపుంగవ ॥

తా॥ ఓ మునిశ్రేష్ఠుడా! నీ వందఱిలో మొదటివాఁడవు గాన మొదటినుండి యుండిన ధర్మముల నెఱిఁగియుంటివి. అట్టి ధర్మములను వినుట శాసక్తిగలవాఁడను. శిష్యుఁడను. నమస్కరించినవాఁడను. శ్రద్ధగలవాఁడనగు నాకు సవిస్తారముగా జెప్పుము.

శ్లో॥ ఇతీక్ష్వాకుకులీనేన రాజ్ఞాపృష్టోమహాయశాః ।
మనసాతోషమాపేదే సమ్యక్పృష్టోధునామునా ।
అహో వ్యవస్థితాబుద్ధీ రాజంస్తేద్యసుశిక్షితా ॥ ౩౨

తా॥ ఈ ప్రకారం ఇక్ష్వాకువంశసంభూతుఁడగు కీర్తిమంతునిచే నడుగఁబడిన వాఁడై మహాకీర్తిమంతుఁడగు వసిష్ఠమహాముని యితఁడు మంచిప్రశ్న జేసినాఁడని తన మనస్సులో సంతోషించి యిట్లు పలుకుచున్నాఁడు. ఓ రాజా! నీవు మంచిజ్ఞానమును

నేర్చుకొనుటవలన నీ బుద్ధి ధర్మముల వినుటయందు వాసక్తిగలిగి యున్నది గాన యా శ్చర్యమయినది.

శ్లో॥ యస్మాద్విష్ణుకథాయాంచ తద్ధర్మాచరణేపిచ ।
మతిరాత్యంతికీజాతా సుకృతంఫలితంతవ ॥ 35

తా॥ ఓ రాజా! విష్ణుకథలను వినుటయందును, విష్ణుధర్మములను జేయుట యందు నీబుద్ధి యాసక్తిగలదై యున్నది గాన నీవుజేసిన పూర్వపుణ్యము ఫలించినది.

శ్లో॥ ఇతిసంభాష్యరాజానం జాతహర్ష స్తమబ్రవీత్ ।
శ్రుణుధర్మాన్ప్రవక్ష్యామి యత్పృష్టోహంత్వయాధునా ॥ 36

తా॥ ఈ ప్రకారము ఆరాజును కొనియాడి సంతసించి యా రాజుతో నిట్లు పలుకుచున్నాడు. ఓ రాజా! నీవిప్పుడు దేనినడిగితివో దానిని జెప్పెదను వినుము.

శ్లో॥ యస్యశ్రవణమాత్రేణ ముచ్యతేసర్వకిల్బిషైః ।
సర్వధర్మాన్పరిత్యజ్య వర్తతేఽవిషయాత్మకః ॥ 37

తా॥ ఏధర్మములను వినుటవలన సమస్తపాపములను, ఇతర సమస్త ధర్మము లనువిడిచి విషయవృత్తులకు లోబడకయుండునో అట్టివైశాఖధర్మములను జెప్పెదను

శ్లో॥ వైశాఖస్నాననిరత స్సప్రియోమధువిద్విషః ॥

తా॥ వైశాఖమాసములో ప్రాతఃకాలంబున స్నానము జేయువాడు విష్ణు మూర్తికి ప్రియమైనవాడగును.

శ్లో॥ సాంగాన్ధర్మాననుష్ఠాయ వైశాఖోయేననాదృతః ।
స్నానదానార్చనైఃపుణ్యై స్తస్యదూరతరోహరిః ॥

తా॥ సమస్తధర్మములను జేయుచు వైశాఖమాసమునందుమాత్రము స్నానము దానము పూజ మొదలగు పుణ్యకార్యముల నెవఁడు చేయఁడో వాఁడు విష్ణు మూర్తికి ప్రియమైనవాఁడు కాఁడు.

శ్లో॥ అస్నాత్వాచాప్యదత్వాచ వైశాఖోయేననీయతే ॥
కర్మణాసతుచండాలో నాత్రకార్యావిచారణా ॥

తా॥ ఎవఁడువైశాఖమాసములో స్నానముజేయకయు, దానములనియ్యకయు వెళ్ళబుచ్చునో వాఁడు చేసిన కర్మవలన చండాలుఁడై పుట్టును. ఇందువిషయమై సందేహము లేదు.

శ్లో॥ వైశాఖోక్తైర్మహాధర్మై ర్వ్యాచావాధితోహరిః ॥
తైశ్చతోషంసమాయాతి ప్రదదాతిసమీహితం ।

లక్ష్మీభర్తా జగన్నాథో హ్యశేషాఘౌఘనాశనః ॥ ౪౧

తా॥ వైశాఖమాసములో జేయవలసిన యుత్తమధర్మములను జేసి యెవఁడు విష్ణుమూర్తిని సేవించునో వానియొక్క ధర్మములచే ప్రపంచమునకు నధిపతియగు విష్ణుమూర్తి సంతోషించి వాని సమస్త పాపరాసులను నశింపఁజేసి వానికి కోరికల నిచ్చుచున్నాఁడు.

శ్లో॥ ధర్మైస్సూక్ష్మైశ్చ ప్రీణాతి న ప్రయాసైర్ధనైరపి ।
భక్త్యా సంపూజితో విష్ణుః ప్రదదాతి సమీహితమ్ ॥ ౪౨

తా॥ సూక్ష్మములగు నితర ధర్మములచేతగాని, కష్టమైన కార్యములచేతనుగాని, ధనములచేతనుగాని విష్ణుమూర్తి సంతోషింపఁడు. భక్తిగలిగి పూజించినయెడల విష్ణుమూర్తి కోరిన కోరికల నిచ్చుచున్నాఁడు.

శ్లో॥ తస్మాద్రాజన్ సదా భక్తిః కర్తవ్యా మధువిద్విషః ।
జలేనాపి జగన్నాథః పూజితః క్లేశహాహరిః ॥ ౪౩

తా॥ ఓ రాజా! ఆకారణమువలన యెల్లప్పుడు విష్ణుమూర్తియొక్క భక్తినే కోరవలయును. భక్తియుండి విష్ణుమూర్తిని జలముతో పూజించినను సమస్త కష్టములను బోగొట్టును.

శ్లో॥ పరితోషం వ్రజత్యాశు తృషార్తస్సలిలైర్యథా ।
మహదప్యల్పదం కర్మ తథాహ్యల్పాదిభూరిదమ్ ॥ ౪౪

తా॥ భక్తితో పూజించినయెడల దప్పిక యైనవానికి జలము నిచ్చినట్లుగానే విష్ణుమూర్తి శీఘ్రముగా సంతోషించును. భక్తిగలిగిన కర్మ కొంచెమైనను విశేష ఫలమునిచ్చును. భక్తి లేనికర్మ గొప్పదయినను కొంచెముఫలము నేయిచ్చును.

శ్లో॥ కర్మణో భూరిహేతుత్వే న హేతూ మహదల్పకే ।
కింతు కర్మస్వరూపంచ గహనా కర్మణో గతిః ॥ ౪౫

తా॥ కర్మ విశేషఫలము నిచ్చుటకు చిన్నకర్మయనియు, పెద్దకర్మయనియు కారణముగా జెప్పగూడదు. ఫలముల భేదములు కర్మననుసరించియున్నవి. కర్మను సంపూర్ణముగా తెలిసికొనుట శక్యము కాదు.

శ్లో॥ వైశాఖోక్తా ఇమే ధర్మా స్స్వల్పాయాసకృతా అపి ।
బహువ్యయవిహీనాశ్చ విష్ణోః ప్రీతికరాశ్శుభాః ॥ ౬౪

తా॥ వైశాఖమాసములో జేయుటకు జెప్పఁబడిన యీ ధర్మములు సులభముగా జేయఁదగినవయినను విశేష ద్రవ్యవ్యయము లేనివయినను, విష్ణుప్రదము సంతోషకరములై శుభముల నొసంగును.

శ్లో॥ తస్మాత్త్వమపిభూపాల వైశాఖోక్తాన్సమాచర ।
త్వద్రాష్ట్రేయేజనాస్సర్వేః కారయేమాన్ శుభావహాన్ ॥ ౪౭

తా॥ ఓ రాజా! శుభములను గలిగించునట్టి యీ వైశాఖమాస ధర్మములను నీవును జేయుము. నీ రాజ్యమునం దుండువారిచేతను చేయింపుము.

శ్లో॥ నకరోతిచయోధర్మాన్ వైశాఖోక్తాన్నరాధమః ।
బహుధాశిక్ష్యమాణోపి సదండ్యస్తవభూపతే ॥ ౪౮

తా॥ ఏమనుష్యుఁడు అనేకవిధములుగా బోధింపఁబడినను వినక జ్ఞానములేనివాఁడై వైశాఖధర్మములను జేయఁడో యట్టివానిని నీవు శిక్షింపవలయును.

శ్లో॥ ఇత్యావశ్యకతాంసమ్యక్ఛాస్త్రైర్వ్యవస్థాప్యతస్యచ ।
పశ్చాద్వైశాఖనిర్దిష్టాన్ ధర్మాన్ప్రోవాచసర్వశః ॥ ౪౯

తా॥ ఈ ప్రకారము వైశాఖమాస ధర్మము ముఖ్యముగా జేయవలయు నని శాస్త్రములచే ప్రతిపాదనచేసి యనంతరము వైశాఖమాసములో జేయవలసిన సమస్త ధర్మములను జెప్పెను.

శ్లో॥ శ్రుత్వాతాంత్సకలాన్ధర్మాన్ గురుంసంపూజ్యభక్తితః ।
సరాజాగృహమాపన్న సర్వాన్ధర్మాంశ్చకారహ ॥ ౫౦

తా॥ ఆ రాజు వసిష్ఠమహాముని చెప్పిన సమస్త ధర్మములను విని గురువును భక్తితో పూజించి యింటికివెళ్ళి సమస్తధర్మములను జేసెను.

శ్లో॥ భక్తిమాన్ కేశవేరాజన్ దేవదేవేనిరంజనే ।
నాన్యంపశ్యతిదేవేశా త్పద్మనాభాన్మహీపతిః ॥ ౫౧

తా॥ ఓ రాజా! ఆ కీర్తిమంతుఁడు దేవతలకు దేవుండును, విషయరహితుండు నగు విష్ణుమూర్తి యందు భక్తిగలవాఁడై దేవదేవుఁడగు నా విష్ణునికంటె మఱియొకనిని ధ్యానింపకయుండెను.

శ్లో॥ భేరీముద్వాహ్యమాతంగే స్వరాష్ట్రేఘోషయద్భటైః ।
అష్టవర్షాధికోమర్త్యో వ్యాశీతిర్నహిపూర్యతే ॥
ప్రాతర్నస్నాతిమేషస్థే సూర్యేసర్వోపియోజనః ।

॥ మేదంష్యశ్చ వధ్యశ్చ నిర్వాస్యో విషయాద్ధ్రువమ్ ॥ ౫౩

తా॥ ఆ రాజు యేనుఁగు నెక్కి భేరిని మోగింపుచు నిట్లు చాటించెను. నా రాజ్యములో నెనిమిది సంవత్సరములకంటె నధికమైన వయస్సు గలవాఁడును, యెనుబది సంవత్సరములకంటె తక్కువగా నున్నవాఁడు నెవఁడైనను సూర్యుఁడు మేషరాశియందుండఁగా అనఁగా వైశాఖమాసములో ప్రాతఃకాలంబున స్నానము జేయనివాఁడు శిక్షింపఁదగినవాఁడును, వధింపఁదగినవాఁడు నగును. లేక వానిని పట్టణము నుండి వెడలఁగొట్టుదుమను నిశ్చయము.

శ్లో॥ పితా వాయదివాపుత్రో భార్యావాథసుహృజ్జనః ।
వైశాఖధర్మహీనశ్చ నిగ్రాహ్యోదస్యువన్మయా ॥ ౫౪

తా॥ తండ్రిగాని, తనయుఁగాని, భార్యగాని, స్నేహితుఁడుగాని యెవరైనను వైశాఖమాసములో ధర్మములను జేయనివానిని దొంగవానివలెనే శిక్షింతురు.

శ్లో॥ దాతవ్యంవిప్రముఖ్యేభ్యో స్నాత్వాప్రాతర్జలేశుభే ।
ప్రపాదానాదిధర్మాంశ్చ కురుధ్వంశక్తితోనఘాః । ౫౫

తా॥ ప్రాతఃకాలంబున లేచి శ్రేష్ఠమైన జలములో స్నానముజేసి బ్రాహ్మణోత్తములకు దానములియ్యవలయును. ఓ పుణ్యాత్ములారా! వటియు చలివేంద్రి మొదలగు ధర్మములను మీశక్తిననుసరించి జేయుఁడు.

శ్లో॥ విప్రంచధర్మవక్తారం గ్రామేగ్రామేన్యవేశయత్ ।
పంచానామపిగ్రామాణా మకరోద్దధికారిణమ్ ॥
తండార్థంత్యక్తధర్మాణాం దశవాజినిషేవితం ।
ఏవంప్రవృత్తస్సర్వత్ర సార్వభౌమస్య శాసనాత్ ॥ ౫౬

తా॥ వైశాఖమాస ధర్మములను బోధించునట్టి బ్రాహ్మణుని ప్రతిగ్రామంబున కాపురముంచెను. ధర్మములను విడిచినవారలను శిక్షించుటకొఱకు పదిగుఱ్ఱముల నిచ్చి అయిదుగ్రామములకొకయధికారి నేర్పఱచెను. ఈప్రకారము ఆ రాజు శాసనము అంతటను వ్యాపింపజేసెను.

శ్లో॥ ప్రవృద్ధోధర్మవృక్షోయం సర్వేదేశేషువిస్తరాత్ ।
యేకేచిన్నిధనంయాంతి భూపాలవిషయేనరాః ॥
క్రమదాశ్చనృపశ్రేష్ఠ తేయాంతిహరిమందిరం ।
అవశ్యంవైష్ణవోలోకః ప్రాప్యతేమానవైర్ధ్రువమ్ ॥ ౫౭

తా॥ ఆరాజుయొక్క దేశమంతటను ధర్మమనెడు వృక్షము స్థాపింపఁబడెను.

ఆరాజుయొక్క దేశములో పురుషులుగాని, స్త్రీలుగాని యెవరయినను మృతినొందిన వారు విష్ణులోకమును బొందుచున్నారు. ఓ రాజా ! మనుష్యు లందఱును శీఘ్రము గానే వైకుంఠమును బొందుచున్నారు.

శ్లో॥ వ్యాజేనాపిసకృత్స్నాతః ప్రాతర్మేషగతేరవౌ ।
సర్వపాపవినిర్ముక్తో యాతివిష్ణోఃపరంపదమ్ ॥ ౬౦

తా॥ సూర్యుఁడు మేషరాశియందుండఁగా ప్రాతఃకాలంబున యే మిషచేత నయినను స్నానముజేసినయెడల నట్టివాఁడు సమస్తపాపములను విడిచినవాఁడై విష్ణు లోకమును బొందును.

శ్లో॥ నప్రాప్నోతియమంధర్మం సకృద్వైశాఖస్నానతః ।
వైలేఖ్యమగమద్రాజా రవిసూను స్తదానృప ॥ ౬౧

తా॥ ఓరాజా! అప్పుడు వైశాఖమాసములో ప్రాతఃకాలస్నానము నందఱు జేయుటచే నొక్కరయినను యమలోకమునకు వెళ్ళకుండుటచే నా యమధర్మరాజు నకు లెక్కవ్రాయుట మానవలసివచ్చెను.

శ్లో॥ లేఖకర్మణివిశ్రాంత శ్చిత్రగుప్తోభవే త్తదా ।
మార్జితానిచలేఖ్యాని పురాపాపోద్భవానిచ ॥ ౬౨

తా॥ వ్రాయఁదగిన లెక్కలు లేకుండుటచే చిత్రగుప్తుఁ డూరకుండెను. మఱియు నిప్పుడుచేసిన పుణ్యవశమున పూర్వమందు వ్రాయఁబడిన పాపములన్నియు తుడిచివేయఁబడెను.

శ్లో॥ గచ్ఛద్భిర్వైష్ణవైర్లోకం స్వకర్మఫలజైర్జనైః క్షణాత్ ।
శూన్యాస్తునరకాస్సర్వే పాపప్రాణివివర్జితాః ॥ ౬౩

తా॥ తమ కర్మములను జేయుచు పుణ్యముగలవారగుటచే శీఘ్రముగా విష్ణు లోకముమగుఱించి సర్వజనులు వెళ్ళుటవలనను, యమలోకమునకు జీవులు వెళ్ళకుం డుటవలనను నరకములన్నియు శూన్యములైయున్నవి.

శ్లో॥ భగ్నయామోభవన్మార్గో వైశాఖస్యప్రభావతః ।
సర్వేపివిమలాకారా జనాయాంతిహరేఃపదమ్ ॥ ౬౪

తా॥ యమలోకమునకుండు మార్గమున నడచువారు లేక శూన్యమైయున్నది. వైశాఖమాహాత్మ్యమువలన విష్ణుభక్తులందఱును నిర్మలస్వరూపముగలవారలై జను లందఱును వైకుంఠమును బొందుచున్నారు.

తా॥ ఎనిమిది సంవత్సరములకు పైగా నుండువాఁడును, ఏనుబది సంవత్సరములకు లోపుగా నుండువాఁడును వైశాఖధర్మమును జేయవలయునని భేరీమోయింపుచు నారాజు తనదేశమునం దంతటను చాటింపుజేయించెను.

శ్లో॥ యోవై హ్యకృతవైశాఖ స్నమేదండ్యోనసంశయః ।
తద్భయాద్ద్విజనాస్సర్వే నోల్లంఘంతికదాచన ॥ 2౨

తా॥ ఎవఁడు వైశాఖధర్మమును జేయకుండునో వానినివధింతును. సంశయము లేదనెను. కాఁబట్టి ఆరాజుయొక్క భయమువలన జనులందరు నారాజునాజ్ఞ నొకప్పుడయిన నతిక్రమించకుండిరి.

శ్లో॥ గచ్ఛంతివైష్ణవంధామ కర్మణాతేననారద ।
వైశాఖసేవనాల్లోకా యాస్యంతిహరిమందిరమ్ ॥ 23

తా॥ ఓ నారదా! అట్టి పుణ్యకర్మమువలన విష్ణులోకమును బొందుచున్నారు కాఁబట్టి వైశాఖమాసధర్మ మాచరించుటచే జనులందఱు వైకుంఠమునుబొందగలరు.

శ్లో॥ తేనరాజ్ఞామునిశ్రేష్ఠ మార్గోలుప్తోయమాధునా ।
కృతాహినరకాశ్శూన్యా లోకాశ్చాపిదివౌకసామ్ ॥ 2౪

తా॥ ఓ మునీశ్వరా! ఆకారణమువలన నా లోకమునకు వచ్చునట్టి మార్గము శూన్యమైనది. నరకములును పాపులులేక శూన్యముగానుండెను. యజ్ఞాదిపుణ్యకర్మములచే పొందదగిన యితరమైన దేవేంద్రాదుల లోకములును శూన్యముగానుండినవి. అనఁగా సమస్తకర్మములను విడిచి యొక్క విష్ణుభక్తినే గలిగియున్నారు.

శ్లో॥ చిత్రాంతో లేఖకో లేఖే లిఖితంమార్జితంజనైః ।
వైశాఖమాసధర్మస్య మాహాత్మ్యంత్వేదృశంమునే ॥ 2౫

తా॥ ఓ మునీశ్వరుఁడా! లేఖరియగు చిత్రగుప్తుఁడు వ్రాయఁదగిన విషయము లేకుండుటచే నూరకుండెను.మఱియు జనులు పుణ్యము లను జేయుటచే నింతకుపూర్వము వ్రాయఁబడిన పాపములన్నియు తుడిచివేయఁబడెను. కాఁబట్టి వైశాఖమాసధర్మ మిటువంటి మహత్తుగలిగియున్నది.

శ్లో॥ బ్రహ్మహత్యాదిపాపాని విముక్తానిజనైర్ద్విజ ।
కృత్వావైశాఖకృత్యాని యాంతివిష్ణోఃపరంపదమ్ ॥ 2౬

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! మనుష్యులు వైశాఖమాస ధర్మములను జేయుటవలన బ్రహ్మహత్య మొదలగు సమస్తపాపములను విడచి విష్ణుమూర్తియొక్క శ్రేష్ఠమగు లోకమును బొందుచున్నారు.

శ్లో॥ సోఽహంకాష్ఠసమోజాతో నకశ్చిన్మమగోచరః ।
యుద్ధంకృత్వాతుతంహన్మి సర్వథాద్యమహాబలమ్ ॥ ౭౭

తా॥ ఓమునీశ్వరా! ఈనేను యేపనియును లేనివాఁడనై యేమియును తోఁచని వాఁడనై కొయ్యవలె నుంటిని. కాఁబట్టి యాతండు మహా బలముగలవాఁడయినను సమస్తవిధములచేతను వానిని చంపవలయుననుకొంటిని.

శ్లో॥ అకృత్వాస్వామికార్యంతు నిర్వ్యాపారోయదిస్థితః ।
తస్యవిత్తంసమశ్నాతి సయాతినరకంధ్రువమ్ ॥ ౭౮

తా॥ ఎవఁడు తనయజమానుని ద్రవ్యమనుభవించుచు వానికార్యమును జేయక యూరకుండునో అట్టివాఁడు నరకమునుబొందును. నిశ్చయము.

శ్లో॥ యదిదైవాదవధ్యోహం తదాబ్రహ్మాణమేత్యచ ।
నివేద్యతస్మైతత్సర్వం పశ్చాత్స్వస్థస్థితిర్ధ్రువమ్ ॥

తా॥ ఆరాజు దైవయోగమువలన మరణమునొందఁడేని యనంతరము సత్యలోకమునకువెళ్ళి బ్రహ్మతో నీవృత్తాంతమునంతయు జెప్పి యటుపిమ్మట నాలోకమునకువచ్చి సుఖముగానుండును. అప్పుడు నాయందేమియు లోపముండదు.

శ్లో॥ ఇత్యుక్త్వాద్విజమామంత్ర్య సానుగఃప్రయయౌభువం । సకలోమహిషారూఢో దండముద్యమ్యభీషణమ్ ॥ మృత్యురోగజ్వరాద్యైశ్చ పార్శ్వదైశ్చ మహోత్కటైః । పంచాశత్కోటిసంఖ్యాకైర్యమదూతైర్వృతస్తతః ॥ సతూర్ణంతస్యరాజర్షే రురోధసకలాం పురీం । శంఖదధ్మౌమఘోరం సర్వలోకభయంకరమ్ ॥ ౮౨

తా॥ ఈప్రకారము మునీశ్వరునితోబలికి యాముని నిపంపించి యాయమధర్మరాజు భయంకరమగు దండమును ధరించి మహిషవాహనము నెక్కి మృత్యువు, రోగము జ్వరము మొదలగు కౄరులగు నేబదికోట్లసైనికులతోగూడి శీఘ్రముగా భూలోకమునకువెళ్ళి యారాజశ్రేష్ఠుని పట్టణమంతయు ముట్టడించి లోకమంతయు భయపడునట్లు మిక్కిలి గొప్పదియగు తన శంఖమును పూరించెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వాసతురాజర్షిః జ్ఞాత్వావైవస్వతంయమం ।
ససజ్జీకృతసర్వస్వః పత్త్రనాన్నిర్యయౌరుషా ॥ ౮౩

తా॥ ఇట్లు చేయఁబడినశంఖధ్వనిని యారాజశ్రేష్ఠుఁడువిని సూర్యసుతుఁడగు యమునిగా తెలిసి సైన్యమునంతయు నాయత్తపఱచుకొని కోపముగలవాడై పట్టణమునుండి బయలువెడలెను.

శ్లో॥ తయోర్యుద్ధమభూత్తత్ర భీషణంరోమహర్షణం ।
మృత్యుంకాలంతథారోగం యమందూతపతింతథా ॥
జిత్వాక్షణేనరాజర్షి ర్ద్రావయామాసరోషతః ॥

తా॥ అప్పు డుభయ సేనలకు యుద్ధమాయెను. ఆ సమయంబున భయంకరుఁడును, ఆశ్చర్యకరుఁడునగు మృత్యుదేవతను, కాలుని, రోగుని, యమదూతలను ఆ రాజు క్షణకాలములో జయించి మిక్కిలి కోపమునవలంబించి పాఱిపోవునట్లుగా చేసెను.

శ్లో॥ తతఃక్రుద్ధోయమోరాజా స్వయమభ్యేత్యతంరుషా ।
యుయోధబహుభిర్బాణై స్సింహనాదంచకారహ ॥

తా॥ అనంతరము యమధర్మరాజు కోపముగలవాఁడైవచ్చి యారాజునొచ్చునట్లనేకబాణములనేసి సింహధ్వనిని జేసెను.

శ్లో॥ చకర్తరాజాతస్యాపి కార్ముకంవిశిఖైస్త్రిభిః ।
పునశ్చర్మాసిమాదాయ యమోహంతుమథాగమత్ ॥

తా॥ ఆరాజు మూఁడు బాణముల నేసి యా యముని ధనస్సును ఖండించెను. ఆయమధర్మరాజు తిఱిగి చర్మముగల మఱియొక ఖడ్గమునుదీసికొని యారాజునుచంపుటకు వెళ్ళెను.

శ్లో॥ తందృష్ట్వాతునృపఃక్రుద్ధః పునశ్ఛిత్వాసిచర్మణీ ।
నిచఖానలలాటేచ శరంకాలోరగప్రభం ।
యమస్తేనాహతఃక్రుద్ధ స్తతోదండముపాదదే ॥ ౮౮

తా॥ ఆ యమధర్మరాజును జూచి రాజు కోపించి తిఱిగి ఖడ్గమును వరను తెగగొట్టి కాలసర్పముతో సమానమగు బాణమును ముఖమునందు వేయఁగా నా యమధర్మరాజు కోపించి యనంతరము తనకు ముఖ్యాయుధమైన దండమును తీసికొనెను.

శ్లో॥ బ్రహ్మాస్త్రేణచసంమంత్ర్య దండంతస్మైముమోచవా ।
హాహాకారోమహానాసీ జ్జనానాంపశ్యతాంతదా ॥ ౮౯

తా॥ బ్రహ్మాస్త్రమంత్రమును పఠించి దండము నా రాజుమీదికి విడువఁగానంతట జనులందఱు జూచుచు మిక్కిలి ఘోరమైనకార్యముపుట్టెననియాశ్చర్యపడిరి.

శ్లో॥ తదావిష్ణుస్స్వభక్తస్య రక్షాయైప్రాహిణోదరిం ।
విష్ణుముక్తంతదాచక్రం శీఘ్రమాగత్యతద్రణే ॥

యమదండేనసంయుధ్య తద్బ్రహ్మాస్త్రంనివార్యచ ।
యమంహంతుమథారేభే సహస్రారంమహాద్భుతమ్ ॥ ౯౧

తా॥ అప్పుడు విష్ణుమూర్తి తన భక్తుని రక్షించుటకొఱకు చక్రమును పంపించగా నాచక్రము శీఘ్రముగా యుద్ధభూమికివచ్చి బ్రహ్మాస్త్ర మంత్రముచే నభిమంత్రింపఁబడిన యాదండముతో యుద్ధముజేసి యాదండమునోడించి వెయ్యిఅంచులు గలదియు, మిక్కిలి యాశ్చర్యకరమగు నా చక్రము యమధర్మరాజును చంపుటకు ప్రయత్నించెను.

శ్లో॥ దేవభక్తస్తతోభీత స్తదాసౌచక్రమంజసా ।
సహస్రారనమస్తేస్తు విష్ణుపాణివిభూషణ ॥
త్వం సత్వలోకరక్షాయై హరిణాచ ధృతంపురా ।
త్వాంయాచేద్య యమంత్రాతుం విష్ణుభక్తంమహాబలమ్॥ ౯౩

తా॥ అనంతరము విష్ణుభక్తుఁడగునట్టి యా రాజు భయపడి శీఘ్రముగా నా చక్రము నిట్లు ప్రార్థించెను. వెయ్యి అంచులు గలుగునట్టియు, విష్ణుమూర్తి చేతికి నలంకారమైనట్టి యోచక్రమా ! నీకు నమస్కారము. పూర్వమందు విష్ణుమూర్తి సమస్తలోకములను రక్షించుటకొఱకు నిన్ను తనహస్తమునందు ధరియించెను. అట్టి నిన్నిప్పుడు మిక్కిలి బలముగలవాఁడును, విష్ణుమూర్తిభక్తుండునగు యమధర్మరాజును రక్షించుకొఱకు యాచించుచున్నాను.

శ్లో॥ నృణాందేవదుహాంకాల స్త్వమేవహినచాపరః ।
తస్మాదేనంయమంరక్ష కృపాంకురుజగత్పతే ॥ ౯౪

తా॥ ప్రపంచమునకు నధిపతివగు నోచక్రమా! దేవతలకు నపకారఁజేయునట్టి మనుష్యులను శిక్షించుటకు యముఁడవు నీవేకాని మఱియొకరు లేరు. కాబట్టి యీ యమునియందు దయయుంచి రక్షింపుము.

శ్లో॥ నృపేణైవంస్తుతంచక్రం యమంహిత్వానృపాంతికం ।
పునర్యయౌమహారాజ దేవానాంపశ్యతాందివి ॥ ౯౫

తా॥ ఓరాజా! ఈప్రకారము రాజు స్తుతింపగా నాచక్రము యముని విడిచి యాకాశంబున దేవతలంఋ చూచుచుండఁగా నారాజువద్దకు తిఱిగి వెళ్ళెను.

శ్లో॥ తతోయమోతినిర్విణ్ణో బ్రహ్మాణస్సదనంయమా ।
సదదర్శసమాసీనం మూర్తామూర్తజనైర్వృతమ్ ॥ ౯౬

తా॥ అనంతరము యముఁడు మిక్కిలి వ్యసన భయములుగలవాఁడై బ్రహ్మ లోకమునకు వెళ్ళి యచ్చట శరీర రహితులగువారితోడ గూడి చుట్టుకొనఁబడి కూర్చుండియున్న బ్రహ్మను జూచెను.

శ్లో॥ దేవాశ్రయుంజగద్బీజంర సర్వలోకపితామహం। ఉపాస్యమానంవిబుధై ర్లోకపాలై ర్దివిగీర్వరైః ॥ ఇతిహాస పురాణాద్యై ర్వే దై ర్విగ్రహసంస్థితైః । మూర్తిమద్భి స్సముద్రైశ్చ నదీభిశ్చ సరోవరైః ॥ దేహవద్భి స్తథావృక్షై రశ్వత్థాద్యైర శేషితైః । వాపీకూప తటాకైశ్చ మూర్తిమద్భిశ్చపర్వతైః ॥ అహోరాత్రై స్తథాపక్షై ర్మాసై స్సంవత్సరై స్తథా । కళాకాష్ఠాని మేషైశ్చ ఋతుభిశ్చాయనై ర్యుగైః ॥ సంకల్పైశ్చవికల్పైశ్చ నిమేషోన్మేషణై స్తథా । ఋక్షై ర్యోగై కరణైః పూర్ణిమాస్యేందు సంక్షయైః ॥ సుఖై ర్దుఃఖై ర్భయై శ్చైవ లాభాలాభై ర్జయాజయైః । సత్వేనరజసాచైవ తమసాచసమన్వితమ్ ॥ శాంతమోఢాతిఘోరైశ్చ వికారైః ప్రాకృతైరపి। వాయునా దేవదేవేన శ్లేష్మపిత్తాదిభిర్వృతమ్ । ౧౦౩

తా॥ మఱియు బ్రహ్మ యెటువంటివాఁడనఁగా దేవతలకు నాధారమైనవాఁడును, ప్రపంచమునకు కారణుఁడును, లోకములన్నిటికంటెను పూర్వుఁడును, అష్ట దిక్పాలకులచేతను ఇతరదేవతలచేతను సేవించబడువాఁడును, శరీరసహితమునున్నట్టి ఇతిహాసములు, పురాణములు, వేదములోడను ఆకారమును ధరియించిన సముద్రములు నదులు సరస్సులతోడను, ఆరీతిగానే యాకారమును ధరియించిన రావి మొదలగు సమస్తవృక్షములతోడను, శరీరమును ధరియించిన దిగుడుబావులు, నూతులు, చెఱువులు, పర్వతములు, పగళ్ళు, రాత్రులు, పక్షములు, మాసములు, సంవత్సరములు, కళలు, కాష్ఠలు, నిమేషములు, ఋతువులు, ఆయనములు, యుగములు, సంకల్పములు, వికల్పములు, నిమేషములు, రెప్పపాట్లు, నక్షత్రములు, యోగములు, కరణములు, పూర్ణిమలు, అమావాస్యలు, సుఖములు, దుఃఖములు, భయములు, లాభములు, నష్టములు, జయములు, అపజయములు, సత్వము, రజస్సు, తమము మొదలగు వానిఁ గూడియుండినవాఁడును, దేహవంతంబులగు శాంతము, మూఢత, ఘోరము, వికారము ప్రకృతి సంబంధములగు గుణములు దేవతలకందఱకునాధారుండగు వాయువును, శ్లేష్మము, పైత్యము మొదలగు గుణములతోడను గూడియుండిన బ్రహ్మను చూచెనని పూర్వముతో నన్వయించుకొనవలయును.

శ్లో॥ తేషాంమధ్యేవిశత్సూరి స్సపీడాచవధూర్వృథా ॥
విలోకయన్ ధరాపృష్ఠం మ్లానవక్త్రింవ్యదర్శయత్ ॥ ౧౦౪

తా॥ ఈపరికారము సకలపరివారముతోడను గూడియున్న బ్రహ్మయొక్క సభామధ్యభాగంబునకు సిగ్గుగలవాఁడుదివలెనే యముఁడు నేలవంక నేజూచుచు వెళ్ళి కూర్చుండఁగా నట్టి దీనముఖముతోనున్న యముని చూచెను.

శ్లో॥ సంప్రవిష్టంయమంద్రుష్ట్వా సకాశస్థంసహానుగం ।
విస్మితాస్తేమిథఃప్రోచుః కిమర్థంభాస్కరి స్త్విహ ॥ ౧౦౫
సంప్రాప్తోలోకకర్తార మిష్టందేవపితామహం ।
నిర్వ్యాపారోక్షణమపి యోయంనాస్తేరపేస్సుతః ॥ ౧౦౬

తా॥ సమీపమందు అనుచరసహితముగా సభను ప్రవేశించుచున్న యముని జూచి ఆ సభయందుండినవారు తమలోదామిట్లు చెప్పుకొనసాగిరి. యముఁడు లోకమును సృజించునట్టియు, సమస్తప్రాణులకు పూర్వుఁడైనట్టి బ్రహ్మవద్దకు నెందు నిమిత్తమువచ్చియున్నాఁడు. ఈయముఁడు వ్యాపారములేక యొకక్షణకాలంబైన నూరకుండువాఁడుకాఁడు.

శ్లో॥ సోయమభ్యాగతఃకస్మా త్కశ్చిత్ క్షేమందివౌకసాం ।
ఆశ్చర్యాతిశయోయశ్చ సమాన్మార్జితపట్టస్త్వయమ్ ॥ ౧౦౭

తా॥ అట్టి యీయముఁడు దేవతలకు క్షేమమునిమిత్తమైవచ్చెనో, లేక మఱి యేకారణమైయుండునో తెలియదు. మఱియు నితనియొద్దనుండు పాపకులను రద్దు చేయఁబడిన పటమును జూడఁగా మిక్కిలి యాశ్చర్యముగానున్నది.

శ్లో॥ లేఖకస్తమనుప్రాప్తో దైన్యేనమహతాన్వితః ॥
నకదాచిత్పటోహ్యస్య మార్జితోధర్మభీరుణా ॥ ౧౦౮

తా॥ యమునియొద్ద లేఖకుఁడైన చిత్రగుప్తుఁడును విచారయుక్తమయిన ముఖముగలవాఁడై యీయమునితోగూడ వచ్చుచున్నాఁడు. ధర్మమునకుభయపడువాఁడుగాన యెన్నఁడును వ్రాసినపద్దులను తుడుపుపెట్టియుండలేదు.

శ్లో॥ యన్నదృష్టంశ్రుతంవాపి తదిహాద్యప్రపద్యతే ।
ఏవముచ్చరతాంతేషాం భూతానాంభూతశాసనః ॥
నిపపాతాగ్రతోభూమౌ బ్రహ్మణోరవినందనః ।
కృంతమూలోయథాశాఖీ త్రాహిత్రాహీతివై రుదన్॥ ౧౧౦

తా॥ అట్లు తుదుపుపెట్టుట చూచియు, వినియుండలేదు. అది యిప్పుడు సంభవించినది. అని యీ ప్రకారము అక్కడనుండి దేవతలందఱు చెప్పుకొనుచుండఁగా భూతములకు శిక్షకుఁడైన యమధర్మరాజు నన్ను రక్షింపుము రక్షింపు మని యేడ్చుచు మొదలు కొట్టఁబడిన వృక్షమువలెనే బ్రహ్మదేవుని ముందఱను సాష్టాంగముగా పడెను.

శ్లో॥ పరిభూతోస్మి దేవేశ సమార్జితపటఃకృతః ।
త్వయినాథేనవిఫలం పశ్యామికమలాసన ॥ ౧౧౧

తా॥ దేవతలకు నధిపతియగు నో బ్రహ్మా! నేను యొక మనుష్యమాత్రునిచే తిరస్కరింపబడితిని. మఱియు పుణ్య పాపములు లిఖియించిన పత్రములను రద్దు చేయఁబడెను. నీవు ప్రభువై యుండఁగా నే నిప్పుడును వ్యాపార హీనుఁడనై యుంపలేదు.

శ్లో॥ ఏవముక్త్వాహినిశ్చేష్టో బభూవనృపసత్తమ ।
తతఃకోలాహలశ్శబ్ద స్సభాయాంసమజాయత ॥ ౧౧౨

తా॥ ఓరాజా! ఈప్రకారము యమధర్మరాజు పలికి నిశ్చేష్టుఁడైయుండెను. అంతట సభలో బహుజనధ్వనిపుట్టి యిట్లు చెప్పుకొనుచుండిరి.

శ్లో॥ యోహిరోదయతేమర్త్యాం త్సర్వాంత్స్థావరజంగమాన్ ।
సోపై రోదతిదుఃఖార్తః కస్మాద్వైవస్వతోయమః ॥ ౧౧౩

తా॥ ఏ యముఁడు సమస్తమనుష్యులను కదలుచుండిన జీవులను కదలకుండు నట్టి పర్వతాదులను దుఃఖింపఁజేయుచుండునో అట్టి సూర్యతనయుఁడగు యముఁడు విచారముగలవాఁడై యెందువలన నేడ్చుచుండెనో తెలియదు.

శ్లో॥ జననంతాపకర్తాయ సోచిరాద్వ్యత్యశోభనం ।
నహిదుష్కృతకర్తాహి నరఃప్రాప్నోతిశోభనమ్ ॥ ౧౧౪

తా॥ ఏవఁడు జనులను పీడించునో వాఁడు శీఘ్రముగానే చెడుగునుపొందును దుర్మార్గప్రకారములనుజేయువాఁ డెప్పుడును మేలునుపొందఁడు.

శ్లో॥ తతోనివారయామాస వాయుస్తేషాంవచస్తదా ।
లోకానాంసమవేతానాం మతేర్జ్ఞాత్వాసవేధసః ॥
నివార్యలోకాన్మార్తాండం శనైరుత్థాపయన్మరుత్ ।
భుజాభ్యాంసాలవీనాభ్యాం లోకసూత్రఉదారధీః ॥ ౧౧౬

తా॥ ఈప్రకారము సభలో మాట్లాడుచుండువారిమాటలను వాయువు నివా

రించి సమస్తమైనవారితోడను గూడియున్న బ్రహ్మదేవుని యభిప్రాయమును దెలిసికొని సమస్తప్రాణులకు నాధారమైనవాఁడును, గొప్పస్వభావముగల వాఁడు నగు వాయువు అక్కడనుండువారిని తొలఁగించి యేపిచెట్టువలెనే దృఢమైన తనభుజములతో నా యమధర్మరాజును మెల్లగా లేవదీసి కూర్చుండఁబెట్టెను.

శ్లో॥ విహ్వాలంతంపరాయత్త మాసనే సన్నివేశయత్ ।
ఆసనస్థమువాచేదం వ్యోమసూనూ రవేస్సుతమ్ ॥ ౧౧౮

తా॥ ఈప్రకారము వాయుదేవుఁడు స్వస్థచిత్తములేనివాఁడును స్వాతంత్ర్యములేనివాఁడునగుయమధర్మరాజును ఆసనమందుఁగూర్చుండబెట్టి యిట్లుపలుకుచున్నాడు

శ్లో॥ కేనత్వమభిభూతోసి కేనస్థానాన్నివారితః ।
కేనాయంమార్జితో దేవ పటోలేఖపట స్తవ ॥ ౧౧౯

తా॥ ఓ యమధర్మరాజా! నీవు యెవనిచే తిరస్కరింపఁబడితివి? ఎవఁడు నీస్థానమునుండి నిన్ను వెడలఁగొట్టెను. పుణ్యపాపములను లిఖియుంచిన పత్రములను యెవరిచే తుడిచివేయఁబడినవి?

శ్లో॥ బ్రూహిసర్వమశేషేణ కుశకేతో స్త్వమాగతః ।
యఃప్రభుస్త్రాతసర్వేషాం స తేకర్తామమాపిచ ॥
అపహృత్యతిమార్తాండే దుఃఖంహృదయసంస్థితమ్ ॥

తా॥ ఓ యమధర్మరాజా! ఈకుశకేతుమహారాజుముందు నీవు జరిగిన వృత్తాంతము నంతయు మిగులు లేకుండునట్లుగా జెప్పుము. అనంతరము నీకును, నాకును, మఱియు సమస్తమైనవారికిని ప్రభువగు బ్రహ్మదేవుండు నీ మనస్సునందుండు దుఃఖమును బోగొట్టగలఁడు.

శ్లో॥ సఏవము క్తశ్శ్వసనేనతస్య మాదిత్యసూను ర్వచనంబభాషే ।
విలోక్యవక్త్రంకుశకేతుసూనో స్సగద్గదంచేదమహాతిదీనమ్ ॥ ౧౨౦

తా॥ ఈ ప్రకారము వాయువు పలుకఁగా సూర్యతనయుఁడగు యముఁడు కుశకేతుమహారాజు యొక్క తనయుని ముఖము జూచి మిక్కిలి దీనుఁడై తొట్రుపాటుతో నిట్లు యదార్థముగా పలుకుచున్నాఁడు.

నారదాంబరీషసంవాదే కీర్తిమద్విజయనావర్ణనంనామ
ఏకాదశోధ్యాయ స్సమాప్తః.

## అథ ద్వాదశోధ్యాయః.

యమః॥ శ్లో॥ శృణుమేవచనంశంభో లోపితోహంపితామహ ।
మరణాదధికంమన్యే మత్పదస్యచఖండనమ్ ॥ ౧

తా॥ యముఁడు చెప్పుచున్నాఁడు. ఓ వాయువా! ఓ బ్రహ్మ! నేఁజెప్పునట్టి వాక్యమును వినుఁడు. నా యుద్యోగము నుండి తొలగింపఁబడితిని. కాఁబట్టి నా యుద్యోగముపోవుట మరణముకంటె నధికముగా దలఁచుచున్నాను.

శ్లో॥ నియోగీననియోగంహి కరోతికమలాసన ।
ప్రభోర్విత్తంసమశ్నాతి సభవేత్కాష్ఠకీటకః ॥ ౨

తా॥ అధికారమునందు నియమించబడిన వాఁడు తన వ్యాపారమును జేయకుండునేని యో బ్రహ్మ! వాఁడు ప్రభువుయొక్క విత్తమును అక్రమముగా ననుభవించుటయేగాక కొయ్యపురువు మొదలగు జన్మము లెత్తును.

శ్లో॥ యోశ్నాతిలోభాద్విత్తాని ప్రజ్ఞావాంశ్చమహీయతే ।
సతిర్యగ్యోనినరకౌ యాతికల్పశతత్రయమ్ ॥

తా॥ ఎవఁడు మిక్కిలి తెలివిగలిగి ధనమందు నాశచే తన యధికారమును జేయక స్వామిద్రవ్యము ననుభవించునో వాఁడు మూఁడువందల కల్పములవఱకు నరకమును మృగాదిజన్మమును బొందుచున్నాఁడు.

శ్లో॥ నిస్పృహోనాచరేద్యస్తు నియోగంపద్మసంభవ ।
భుక్త్వాతునరకాన్ఘోరాన్ సపుమాన్వాయసోభవేత్ ॥ ౪

తా॥ ఓబ్రహ్మ! ఎవఁడు నియమింపఁబడి తుదకునాశలేక తనవ్యాపారమును జేయకుండునో వాఁడు మిక్కిలి కష్టమైన నరకములననుభవించి తుదకు కాకిజన్మము గలవాఁడైయుండును.

శ్లో॥ ఆత్మకార్యపరోయస్తు స్వామికార్యంవిలుంపతి ।
భవేద్వేశ్మనిపాపాత్మా హ్యాఖుఃకల్పశతత్రయమ్ ॥ ౫

తా॥ ఎవఁడు తనకార్యమునుమాత్రము జేసికొని యజమానుని కార్యమునకు భంగముకలిగించునో ఆట్టివాఁడు పాపస్వభావముగలవాఁడగుటచే మూఁడువందల కల్పములపర్యంతము ఎలుకగా తన గృహమునందు పుట్టుచుండును.

శ్లో॥ నియోగీయస్తుభూత్వావై తిష్ఠన్నిత్యంస్వవేశ్మని ।
శక్తస్తుకార్యాకరణే మార్జాలోజాయతేనరః ॥ ౬

తా॥ ఎవఁడు అధికారమందు నియమింపఁబడినవాఁడై కార్యమును జేయుట యందు సమర్థుఁడైయుండియు జేయక నిత్యము తన గృహమునందే యుండునో అట్టి వాఁడు పిల్లిగా జనియించును.

శ్లో॥ సోహందేవతవాదేశా త్ప్రజాధర్మేణసాధయే ।
పుణ్యేనపుణ్యకర్తారం పాపంపాపేనకర్మణా ॥ ౭

తా॥ ఓబ్రహ్మ! అట్టి నేను మీ యాజ్ఞానుసారముగా పుణ్యమును విచారించి పుణ్యాత్ముని పాపమును విచారించి, పాపాత్ముని పరిశీలించి ప్రజలను ధర్మమార్గానుసారముగా పాలించుచుంటిని.

శ్లో॥ సమ్యగ్విచార్యమునిభి ర్ధర్మశాస్త్రాన్వితైఃప్రభో ।
కల్పాదావ ర్తమానస్య యాతనాయతనంమమ ॥ ౮

తా॥ ఓ స్వామి! ధర్మశాస్త్రమును బాగుగా తెలిసిన మునీశ్వరునితోఁగూడ చక్కగా నాలోచించి ప్రళయముల నాద్యంతములయందు నున్నట్టి యాతనలననుభవింపజేయుచుందును.

శ్లో॥ కర్తుంనియోగమేవంహి త్వదీయోనైవశక్నుయాం ।
రాజ్ఞాకీర్తిమతాభగ్నో నియోగ స్తవనేత్యేతః ॥ ౯

తా॥ నీ యాజ్ఞానుసారము ప్రవర్తింపదలఁచినట్టి నేను నీ వేర్పఱచిన యధికారమును జేయుటకు సమర్థుఁడనుగాను. నీ విచ్చిన యధికారము కీర్తిమంతుఁడను రాజుచే తీసివేయఁబడినది. అదినీవు విచారింపకుంటివి.

శ్లో॥ రాజాసోద్యజగన్నాథ పృథివీంసాగరాంబరాం ।
వైశాఖధర్మసహితాం పాలయన్వర్తతేక్వచిత్ ॥ ౧౦

తా॥ ఓప్రభువా! ఇప్పుడా రాజు చతుస్సముద్రపర్యంత ముండునట్టి భూమియందంతటను వైశాఖమాసధర్మమును వ్యాపింపజేసి పరిపాలించుచుండెను.

శ్లో॥ విహాయసర్వధర్మాంశ్చ విహాయపితృపూజనం । విహాయాగ్రసపర్యాంతు తీర్థయాత్రాదిసత్క్రియాః ॥ యోగసాంఖ్యప్రభోత్యక్త్వా త్యక్త్వాప్రాణనిరోధనం । త్యక్త్వాహోమంతుస్వాధ్యాయం కృత్వాపాపాని భూరిశః ॥ ప్రయాంతివైష్ణవంలోకం కృత్వావైశాఖ సత్క్రియాః । మనుజాఃపితృభిస్సార్థం తథైవచపితామహైః ॥ ౧౩

తా॥ అదియేలాగుననఁగా, సమస్తధర్మములను పితృపూజ, పెద్దలపూజ, తీర్థయాత్ర మొదలగు సత్కార్యములు, యోగము సాంఖ్యములనెడు రెండుధర్మములు

ప్రాణాయామము, హోమము, స్వాధ్యాయము మొదలగు ధర్మములను విడచియు, అనేక పాపకార్యములను జేసియు, వైశాఖమాస ధర్మములను జేసి మనుష్యులు తండ్రులు తాతలతోగూడ విష్ణులోకమును బొందిరి.

శ్లో॥ తేషామతీతపితరః పితౄణాంపితర స్తథా ।
తథామాతామహాయాంతి తేషాంవై జనకాదయః ॥ ౧౪

తా॥ తాత తండ్రులు వారితండ్రులు అప్రకారముగానే మాతామహులును వారి తండ్రులును వైకుంఠమునుబొందిరి.

శ్లో॥ తేషామపిచనేతారో జనిత్రీణాంహిపూర్వజా ।
ఏతద్దుఃఖంపునర్దేవ మమమ స్తకభేదనమ్ ॥ ౧౫

తా॥ వారి యజమానులు తల్లి సోదరులు మొదలగువారును వైకుంఠమును బొందిరి. ఓ స్వామీ ! ఈ దుఃఖమును విచారింపఁగా నా శిరస్సును పగులగొట్టినట్లుగానే యున్నది.

శ్లో॥ ప్రియాయాఃపితరోయాంతి మార్జయిత్వాలిపింమమ ।
పితౄణాంబీజజోయస్తు ధాత్ర్యాకుక్షౌధృతోవిభో ॥ ౧౬

తా॥ ఓ స్వామీ! భార్యాసంబంధులగువారును పాపములను లిఖించిన పత్రమును తుడిచి వైకుంఠమును బొందుచున్నారు. తండ్రుల బీజమువలన నుపమాతయందు జనియించినవారయినను వారుజేసిన వైశాఖ ధర్మమువలన నుత్తమలోకమును బొందుచున్నారు.

శ్లో॥ యదేకేనకృతంకర్మ తదేకేన్నై వభుజ్యతే ।
తన్నిరస్యకృంతంసర్వం జానంస్త్వేకకులేతుయః ॥
తారయేత్త్వాపుభాపక్షౌ షడ్వింశోపర్యలంవిభో ॥

తా॥ పుణ్యమునుగాని, పాపమునుగాని యెవఁడు చేసిన వాఁడే యనుభవించును. అట్టిమార్గము నిరసింపఁబడెను. ఈ వృత్తాంతమునంతయు నెఱింగిన యెవఁడయినను కులమునందొకఁడు వైశాఖమాస ధర్మమునుజేసిన ఉభయ వంశములందును బుట్టిన యిరువదియాఱుతరములవారిని తరింపజేయుటకు సమర్థుఁడైయున్నాఁడు.

శ్లో॥ ప్రియాయాశ్చాపిన్నై తాత సర్వేనై కుక్షిసంభవాః ॥
తేపిసర్వేజగన్నాథ యాంతివిష్ణోఃపరంపదం ।
నమేప్రయోజనందేవం నియోగేనేదృశేనవై ॥ ౧౭

తా॥ ఓతంద్రీ! ఓబగత్ప్రభువా! భార్యాసంబంధముగలవారందరుకూడ విష్ణు

లోకమును బొందుచున్నారు. కావుఁబట్టి యో స్వామీ ! మీరిచ్చిన యీ యుద్యోగముతో నాకు పనిలేదు.

శ్లో॥ వైశాఖధర్మనిరత స్సమాత్యక్త్వావ్రజేద్ధరిం ।
త్రిస్సప్తకులముద్దిశ్య త్యక్తపాపోతిశోభనః ॥ ౨౦

తా॥ వైశాఖమాసధర్మములయం దాసక్తిగలవాఁడు పాపములనన్నిటిని పోఁగొట్టుకొని మిక్కిలి మేలుగలవాఁడై నన్ను విడచి యిరువదియొక్క తరములవారితో గూడ విష్ణులోకమును బొందుచున్నాఁడు.

శ్లో॥ సత్యక్త్వామమమార్గంహి ప్రియాతిహరిమందిరం ।
నయజ్ఞైస్తాదృశైర్దేవ గతింప్రాప్నోతిమానవః ॥ ౨౧

తా॥ వైశాఖమాసధర్మమును జేసినవాఁడు నామార్గమును విడచి విష్ణులోకమును బొందుచున్నాఁడు. మనుష్యుఁడనేక యజ్ఞములను జేసినను వైకుంఠమును బొందింపఁజేయునటువంటి దారిని మఱియొకదానిని పొందనేరఁడు.

శ్లో॥ సర్వతీర్థైర్నదానాద్యై ర్నతపోభిశ్చనవ్రతైః ।
అపివాసకలైర్ధర్మై ర్యత్కోనాప్నోతితాంగతిమ్ ॥ ౨౨

తా॥ సమస్త తీర్థములతోడను, దానములతోడను, తపస్సులతోడను, వ్రతములతోడను, మఱియు సమస్తమైన ధర్మములతోడను కూడినవాఁడయినను వైశాఖమాసధర్మముతో సరియైన మార్గమును పొందనేరఁడు.

శ్లో॥ ప్రయాగపాతాద్రణమధ్యపాతా ద్భృగోశ్చపాతా స్మరణాచ్చకాశ్యాం । నతాంగతింయాంతి జనాశ్చసర్వే వైశాఖనిష్ఠేనచ యాం ప్రపద్యతే ॥

తా॥ మనుష్యులు ప్రయాగలో పడుటవలనను, యుద్ధములో మృతినొందుటవలనను భృగుప్రస్రవణములో పడుటవలనను, కాశీక్షేత్రములో మృతినొందుటవలనను వైశాఖమాసధర్మమువలన పొందునట్టి సుగతిని పొందనేరఁడు.

శ్లో॥ ప్రాతస్స్నాత్వా దేవపూజాంచకృత్వా శ్రుత్వా కథాం మాస మహాత్మ్యసంజ్ఞాం । ధర్మాన్ కృత్వా చోచితాన్వైష్ణవాంశ్చ సవైభవే ద్విష్ణులోకైకనాథః ॥

తా॥ ప్రాతఃకాలంబున స్నానముఁజేసి దేవతాపూజనుజేసి వైశాఖమాహాత్మ్య

మను కథను విని మఱియు తనకు జేయఁదగిన విష్ణుసంబంధమగు ధర్మములను జేసినట్టి వాఁడు విష్ణులోక సామ్రాజ్య మనుభవింపగలవాఁడగును.

శ్లో॥ అప్రమాణమహంమన్యే లోకంవిష్ణో ర్జగత్పతేః ।
యోనపూర్యేతకాట్యోఘై స్సర్వతఃకమలాసన ॥ ౨౫

తా॥ పాపాత్ములైయుండిన వారయినను నాప్రేపేతస్థానమును గూర్చి రాక వైశాఖమాహాత్మ్యముచే భగవంతుండగు విష్ణులోకమును బొందుచున్నారుగాన విష్ణులోకమును ఆక్రమమైనదిగా తలఁచుచున్నాను.

శ్లో॥ మాధవావసధేనేహ సమస్తేన పితామహ ।
వికర్మస్థాఽవికర్మస్థా శ్శుచయోఽశుచయ స్తథా ॥
కృత్వావైశాఖధర్మాని లోకాయాంతి నృపాజ్ఞయా ॥

తా॥ ఓస్వామీ! మంచికర్మములను జేసినవానుగాని, చేయనివారుగాని, పరిశుద్ధులుగాని, అపరిశుద్ధులుగాని యెవరయినను సమస్తజనులు రాజుయొక్క యాజ్ఞచే వైశాఖమాసధర్మములను జేసి విష్ణులోకమునకు వెళ్ళి యచ్చట నిండియున్నారు.

శ్లో॥ యోస్మాకంహిమహచ్ఛత్రు ర్భవతాంచవిశేషతః ।
నిగ్రాహ్యోజగతాంనాథ భవతాసోమహీపతిః ॥

తా॥ ఓ జగత్ప్రభువా! మాకు నెవరు విరోధులుగానుండిరో ఆట్టివారు మీకయినను మిక్కిలి శత్రువులేకాఁబట్టి యారాజును ముఖ్యముగా శిక్షింపవలయును.

శ్లో॥ హిత్వాహిసకలాన్ధర్మాం త్సకృద్వైశాఖస్నానతః ।
అసంస్కృతజనాయాంతి వైకుంఠంహరిమందిరమ్ ॥

తా॥ ఉపనయనాది సంస్కారములు జేయఁబడినవారయినను సమస్తధర్మములను విడచి యొక్కపర్యాయమైనను వైశాఖస్నానము జేయుటవలన విష్ణులోకమగు వైకుంఠమును బొందుచున్నారు.

శ్లో॥ అస్మాభిస్తుకృతోపేక్షో విష్ణుపాదైకసంశ్రయం ।
సమస్తంనేష్యతేలోకం పార్థివోనాత్రసంశయః ॥

తా॥ ఆకీర్తిమంతుఁడనురాజు విష్ణుపాదధ్యానము నాశ్రయించి మనమూరకుండుటచే లోకమునంతయు వైకుంఠములకే పంపించుచున్నాఁడు. ఈ విషయమై సందేహము లేదు.

శ్లో॥ ఏషదండఃపటోహ్యేష స్తవపద్మాన్యనివేశితః ।
లోకపాలత్వమతులం మార్జితంతేనభూభుజా ।

కిమపత్యేనజాతేన మాతుః క్లేశకరేణవై ॥ ౩౦

తా॥ ఓ స్వామీ! ఇదిగో నావంశము. ఇదిగో పాపపుణ్యములను వ్రాయు పుస్తకము. ఇంక నాకు శిక్షనో నేమిపనియున్నది. ఇదిగో నీపాదములయందుంచితిని ఆకీర్తిమంతుండను రాజు నాయధికారమును తీసివేసినాఁడు. ఇట్టి సంతానము కలుగుట తల్లికి కష్టమునకొఱకేగాని యేమిప్రయోజనమున్నది.

శ్లో॥ యోనతాపయతేశత్రుం జ్యేష్ఠమాసీవభాస్కరః ।
నచ నాసు తాహీయువతి ర్జ్ఞాతా వేదకుపుత్రిణీ ॥
నలిన్యాస్స్ఫురతేకీర్తి ర్ఘనస్యేవశతహ్రదా ।
యఃపితురోన్నద్ధరేత్పాపా ద్విత్యయావా బలేనవా ॥ ౩౩

తా॥ ఎవఁడు జ్యేష్ఠమాసములో సూర్యుఁడు ప్రకాశించినట్లుగా శత్రువును బాధింపఁడో వాఁడు వ్యర్థమైనవాఁడు అనుపయోగుఁడైన తనయుని గనిన యాడుదియు వ్యర్థమైన పుత్రుఁడుకలదియే తెలిసికొనవలయును. మేఘమునందు పుట్టిన మెఱుపుయొక్క కాంతి స్థిరముగా నుండునట్లు అట్టియువతియొక్క కీర్తియు ప్రకాశింపనేరదు. విద్యవలనగాని, బలములనగాని కుమారుఁడు తండ్రి దోషములను పోఁగొట్టువాఁడు కాఁడో అట్టవాఁడును వ్యర్థమైనవాఁడనియే తెలిసికొనవలయును.

శ్లో॥ మాతుర్జఠరజో రోగ స్సప్రసూతో ధరాతలే ।
ధర్మేచార్థేచకామేచ యఃప్రతిపోభవేత్సుతః ॥
మాతృహేత్యుచ్యతేసద్భి స్సపుత్రఃపురుషాధమః ॥

తా॥ కీర్తిలేనివాఁడు భూమిలో తల్లి గర్భమందుండిన రోగమే పురుషాకారముగా పుట్టినదని తలఁపవలయును. ఏకుమారుఁడు ధర్మము, అధర్మము, కామము అను పురుషార్థములనుసాధింపక వ్యతిరేకముగానుండునో అట్టిహీనుఁడు మాతృహత్య మొదలగు పాపములను జేసినవాఁడనియే పెద్దలు చెప్పుదురు.

శ్లో॥ తన్మాతాన్నృపపత్నీచ లోకవిఖ్యాతసత్క్రియా ।
ఏకైకవీరశూర్లోకే విరించేనాత్రసంశయః ।
యథావై కీర్తిమాన్జాతో మల్లిపేర్మార్జనాయవై ॥ ౩౬

తా॥ ఆ కీర్తిమంతుఁడు దుస్సాధ్యమైన నాయొక్క వ్రాతను గూడ తుడిచివేయుంచెనుగాన యో బ్రహ్మా! అతనియొక్క తల్లియే లోకములో వీరమాతయనియు క్షత్రియునిభార్యయనియు, లోకము ప్రసిద్ధికెక్కిన సత్కార్యములుకలదియనియు చెప్పవలయునుగాని అట్టికీర్తికి నితరు లర్హులుకారు.

శ్లో॥ నేదంవ్యవసితందేవ కేనచిత్త్సత్రిజేనహి ।
పురాణేషుజగన్నాధ నశ్రుతంపటమార్జనమ్ ॥ 32

తా॥ ఓస్వామీ! పూర్వమందేరాజుచేతనైన నిట్టికార్యము చేయుటకు ప్రియత్నమైనను జేయఁబడలేదు. ఇప్పుడిట్టికార్యము సంభవించినది. ఓప్రభువా! లెక్కలను. తుడుపుపెట్టించుట యిదివఱకెన్నఁడు నేపురాణములయందును వినియుండలేదు

శ్లో॥ సోహం న జానామి జగత్పతీశ ఋతే క్షితీశం హరితత్పరంతం । ప్రచోదయంతం పటహం సుఘోషం విలోపమానం మమ వేశ్మమార్గమ్ ॥

తా॥ జగత్తునకంతయు ప్రభువగు యోబ్రహ్మ! హరియందాశక్తిగలవాడును, గొప్పభేరిమొలలగువాద్యములను మోగించపజేసి వైశాఖమాసధర్మములనుచాటింపు చేయించిన కీర్తిమంతుండను రాజుగాక మఱియొకరు నాలోకములకు జీవులను రానియ్యక నా లోక మార్గమును శూన్యముఁగనదానిగా జేసినవారు లేరని నేనూహించుచున్నాను.

నారదాంబరీష సంవాదే యమదుఃఖ నిరూపణం నామ
ద్వాదశోధ్యాయ స్సమాప్తః.

---

## అథ త్రయోదశోధ్యాయః.

బ్రహ్మః॥ శ్లో॥ కిమాశ్చర్యంత్వయాదృష్టం కిమర్థం ఖిద్యతేభవాన్ ।
నద్గణేషుకృతస్తాప స్సతాపోమరణాంతికః ॥

తా॥ బ్రహ్మ చెప్పుచున్నాఁడు. ఓ యమధర్మరాజా! ఇది యేమి యాశ్చర్యము. నీ వెందునిమిత్తము దుఃఖించెదవు? సత్పురుషులకు నపకారము జేసిలయెడల నది యామరణాంతముండును.

శ్లో॥ యస్యోచ్చారణమాత్రేణ ప్రాప్యతేపరమంపదం ।
నగచ్ఛతిహరేర్లోకం కథంభూపస్యశాసనాత్ ॥ ౨

తా॥ ఏభగవంతుని నామమును స్మరియించిన మాత్రమున నే యుత్తమ మగు వైకుంఠమును బొందుదురో అట్టి భగవంతునకు ప్రియకరమగు వైశాఖధర్మములను జేయవలయునని రాజు యాజ్ఞాపించుటచే నాధర్మములనుజేసి విష్ణులోకమును బొందుట కేమి యాశ్చర్యమున్నది.

శ్లో॥ ఏకోఽపి గోవిందకృతప్రణామ శ్శతాశ్వమేధావబృధేనతుల్యః ।
యజ్ఞస్యకర్తాపునరేతిజన్మ హారేః ప్రణామోనపునర్భవాయ॥ 3

తా॥ విష్ణుమూర్తికి నొక నమస్కారము జేసినను నూఱు యజ్ఞములను జేసి యవభృథస్నానము జేసిన ఫలమునిచ్చును. యజ్ఞమును జేసినవాఁడు తిరిగి జనియించును. విష్ణుమూర్తికి జేయఁబడిన నమస్కారమైతే తిరిగి జన్మకలుగనియ్యదు.

శ్లో॥ కురుక్షేత్రేణకింతస్య సరస్వత్యాచకింతథా ।
జిహ్వాగ్రే వర్తతేయస్య హారిరిత్యక్షరద్వయమ్ ॥ ౪

తా॥ ఎవని యొక్క నాలుకచే హరి నామ స్మరణ జేయఁబడు చుండునో అట్టివానికి కురుక్షేత్రము, సరస్వతీ తీర్థము మొదలగు స్థలములను వెళ్ళుటచే నేమి ప్రయోజన మున్నది?

శ్లో॥ బ్రాహ్మణశ్శ్వపచీంభుంజన్ విశేషేణరజస్వలాం ।
సయాతిమరణేవిష్ణుం స్మరన్నాప్నోతితత్పదమ్ ॥ ౫

తా॥ బ్రాహ్మణుఁడు చండాలస్త్రీభోగాని, రజస్వలా స్త్రీభోగాని సంభోగించినవాఁడయినను మరణకాలమునందు విష్ణు స్మరణ జేసినయెడల వైకుంఠమును బొందుచున్నాఁడు.

శ్లో॥ అభక్ష్యభక్షణాజ్జాతం విహాయాఘస్యసంచయం ।
ప్రయాతివిష్ణుసాయుజ్యం యతోవిష్ణుప్రియాస్మృతిః ॥ ౬

తా॥ విష్ణుధ్యానము విష్ణుమూర్తికి ప్రియమైనదగుటచే తినరానిపదార్థములను తినుటచే గలిగిన దోషములనైనను పోఁగొట్టుకొని విష్ణుసమీపమున నుండగలఁడు.

శ్లో॥ ఏవంవిష్ణుప్రియోమాసో వైశాఖోనామవైయమ ।
యద్ధర్మంశ్రవణాదేవ ముచ్యతేసర్వకిల్బిషైః ॥ ౭

తా॥ ఓ యమధర్మరాజా! వైశాఖమాస ధర్మములను వినుటవలననే సమస్తపాపములు నశించుచున్నవి. కాబట్టి వైశాఖమాసము విష్ణువునకు ప్రీతియైనది.

శ్లో॥ యాతీతికిముక్తవ్యం తస్యానుష్ఠానతత్పరః ।
యస్మింత్సంగీయతేయోహి ప్రీయతేపురుషోత్తమః ॥ ౮

తా॥ ఏ వైశాఖధర్మములను జేయుటయందాసక్తిగలిగినయెడల విష్ణుమూర్తి సంతోషించునో అట్టివైశాఖమాసధర్మములను జేసినయెడల విష్ణులోకమును బొందునని చెప్పవలసినదేమియున్నది?

శ్లో॥ కథంనయాతిచగతిం తస్యానుష్ఠానతత్పరః ।
అస్మాకంజగతాంనాథో జనితాపురుషోత్తమః ॥ ౯

తా॥ విష్ణుమూర్తి మనలనందరిని పుట్టించి జగత్ప్రభువైయుండెనుగాన యాతనిని సేవించినవాఁడు యెట్లు యాతనిలోకమునుబొందఁడు? అనఁగా పొందును.

శ్లో॥ తస్యేష్టాకామాధవేమాసి ధర్మానేతాంకరోత్యయం ।
తస్యవిష్ణుః ప్రసన్నాత్మా సహాయేసర్వదాస్థితః ॥ ౧౦

తా॥ ఎవఁడు విష్ణుప్రీతికరమైన ధర్మములను వైశాఖమాసములో జేయుచుండునో అట్టివానికి విష్ణుమూర్తి యనుగ్రహించి యెల్లప్పుడు సహాయుఁగా నుండును.

శ్లో॥ నతస్యభూపతే స్సారే ప్రతిభా మమశిక్షణే ।
నవాసుదేవభక్తానా మశుభంవిద్యతేక్వచిత్ ॥ ౧౧

తా॥ ఓ యముఁడా! ఆరాజును శిక్షించుటయందు సమర్థత నాకులేదు. విష్ణుభక్తిగలవారి కెన్నఁడును పరాజయము కలుగనేరదు.

శ్లో॥ జన్మమృత్యుజరావ్యాధి భయంనాప్యుపజాయతే ॥

తా॥ మఱియు పుట్టుక, మరణము, ముదిమి, రోగము మొదలగు వానివలన భయమెన్నఁడును కలుగదు.

శ్లో॥ నియోగీస్వామికార్యేషు యావచ్ఛక్తిస్సమీహతే ।
తావతాసత్కృతార్థస్యా న్నరకాన్నైవగచ్ఛతి ॥

తా॥ యజమానునియొక్క కార్యములయందు నియమింపఁబడినవాఁడై తనకు సాధ్యమైనంతవఱకు జేయుటకు ప్రయత్నింపవలయును. అంతమాత్రమున కార్యములను జేసినవాఁడగును. నరకములను బొందఁడు.

శ్లో॥ కార్యేశక్తివినిష్క్రాంతే స్వామినేచనివేదయేత్ ॥
అనృణస్తావతాభృత్యో నియోగీసుఖమశ్నుతే ।
తస్మాన్నివేదితార్థస్య నఋణంనచపాతకమ్ ॥ ౧౪

తా॥ సాధ్యమైనంత వఱకు ప్రయత్నముజేసి తుదకు కార్యమును జేయుటయందు సమర్థతలేకుండినప్పుడు తన యజమానునితో జెప్పినయెడల నియోగింపఁబడినవాఁడు ఋణవిముక్తుఁడై సుఖమునుబొందును. కాబట్టి కార్యమును జేయుటకు శక్తిలేనిసమయము సంభవించినప్పుడు యజమానునితో జెప్పినవానికి ఋణములేదు. పాపమును లేదు.

శ్లో॥ యత్నేకృతేప్యకర్తవ్యే నాపరాధోస్తిదేహినః ।
తస్మాదవస్యకార్యేస్మి న్నావశోచితుమర్హసి ॥ ౧౫

తా॥ ప్రతివానికిని తాను జేయఁదగిన కార్యమునందు ప్రయత్నముజేసి సమర్థతలేకుండుటచే నుపేక్షజేసినయెడల దోషములేదు. కాఁబట్టి యోధర్మరాజా! నీవు శక్యముగాని కార్యమువిషయమై విచారపడగూడదు.

శ్లో॥ ఇత్యుక్తోబ్రహ్మణాసౌరిః పునరత్యంతఖిన్నధీః ।
ఉవాచ దీనయావాచా గళ ద్బాష్పాకులేక్షణః ॥ ౧౬

తా॥ ఈప్రకారము బ్రహ్మదేవుఁడు పలుకఁగా నాయమధర్మరాజువిని తిరిగి మిక్కిలి విచారముగలవాఁడై కన్నులనుండి బాష్పములను విడచుచు దీనస్వరముతో నిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ ప్రాప్తంతాతమయాసర్వ త్వదంఘ్రిభజనేనహి ।
నాహంయాస్యేపునఃకర్తుం నియోగంపద్మసంభవః ॥ ౧౭

తా॥ ఓతాతా! నీపాదసేవ జేయుటచే నేను సమస్తమును బొందితిని. ఓపద్మసంభవా! తిరిగి ఆయుద్యోగమును జేయుటకు వెళ్ళను.

శ్లో॥ ప్రశాసతిమహావీర్యే భూపేస్మిన్భూమిమండలే ।
చాలయిత్వాస్వధర్మాంశ్చ తమేకంభూపతింవిభో ॥
కృతకృత్యోస్మితనయో గయాయాంపిండదోయథా ।
కృపాళోతదిదంకార్యం సాధయస్వమమావ్యయమ్ ॥ ౧౮

తా॥ ఓస్వామీ! భూలోకములో ఆకీర్తిమంతుఁడీరీతి మహాపరాక్రమముతో రాజ్యము సేయుచుండఁగా నధికారమును జేయనొల్లను. ఇఁక నేమియనఁగా ఆ రాజును వైశాఖమాసధర్మములవలన భ్రష్టునిగా జేసినయెడల గయలో పిండమును వేసిన తనయుఁడువలెనే కార్యమును నెఱవేర్చినవాఁడ నగుదును. ఓ దయాస్వభావముగలవాఁడా! నాయుద్యోగమునకు భంగముకాని యీకార్యమును నీవు చేయవలయును.

శ్లో॥ విజ్వరస్తుతతోభూయ శ్శాసనంతేకరోమ్యహం ।
శ్రుత్వాబ్రహ్మయమేనోక్తం పునశ్చింతాపరాయణః ॥
తమువాచపునర్బ్రహ్మ సాంత్వయన్బహుధావ్యయమ్ ॥

తా॥ నేచెప్పినట్లుచేసితివేని నేను శత్రుభయములేనివాఁడనై నీయాజ్ఞననుసరించి నాయుద్యోగమును జేయుదును. అని యమధర్మరాజు చెప్పిన మాటలను విని

బ్రహ్మదేవుఁడు కొంతవఱకు విచారించి అనేక విధములుగా నా యమధర్మరాజును బ్రతిమాలుచు నిట్లు చెప్పెను.

బ్రహ్మః॥ శ్లో॥ ననిగ్రాహ్యోత్వయారాజా విష్ణుధర్మపరాయణః॥
యదిచాలయసే కోపా ద్గచ్ఛామోహ్యాంతికంహరే ।
నివేద్యసకలంతస్మై కుర్మఃపశ్చా త్తదీరితమ్ ॥ ౨౨

తా॥ బ్రహ్మ చెప్పుచున్నాఁడు. ఆ రాజు విష్ణుభక్తియందు శ్రద్ధగలవాఁడగుటచే నీచే శిక్షింపఁబడడు. లేక నీవు ఆయనమీద కోపముండి ధర్మభ్రష్టునిగా జేయవలయుననిదలఁచితివేని మనము విష్ణులోకమునకు వెళ్ళి ఈజఱిగినవృత్తాంతమునంతయు నాభగవంతునితో జెప్పి యనంతర మాయన యెట్లు చెప్పునో యాతీరున జేయుదము.

శ్లో॥ సఏవకర్తాలోకస్య ధర్మస్యపరిపాలకః ।
సచదండధరోస్మాకం శాసాకర్తానియామకః ॥ ౨౩

తా॥ విష్ణుమూర్తియే లోకమును సృజియించువాఁడు. ఆయనే ధర్మమును కాపాడువాఁడు. ఆయనే దండమును ధరియించి మనలకు శిక్షకుఁడుగాను, కర్తగాను నియమించువాఁడుగా నుండెను.

శ్లో॥ నతదుక్తేస్తిప్రత్యుక్తి రస్మాకంవిహితావ్యయ ।
నరాజ్ఞోక్తేస్తుప్రత్యుక్తి ర్దుర్లభ్యతేజ్వాపిభూతలే ॥ ౨౪

తా॥ ఓయమధర్మరాజా! ఆభగవంతుఁడు చెప్పినమాటకు మాఱుమాట చెప్ప మనము సమర్థులము కాము. ఆయన భక్తుడైనందున ఆరాజుయొక్క మాటకు యెవను తిఱిగి సమాధానము చెప్పువారి నీభూమియందు లేకపోవుటను గానము.

శ్లో॥ ఇత్యాశ్వాస్యయమంతేన సాకంక్షీరాంబుధింయయౌ ।
బ్రహ్మాతుష్టావచిన్మాత్రం నిర్గుణంపరమేశ్వరమ్ ॥ ౨౫
సాంఖ్యయోగై రద్వితీయ మేకంతంపురుషోత్తమం ।
ఆవిరాసీత్తదావిష్ణుః బ్రహ్మణాసంస్తుతోహరిః ॥ ౨౬

తా॥ ఈప్రకారము యమునితో మంచిమాటలు చెప్పి బ్రహ్మదేవుండాయమునితోగూడ పాలసముద్రమునకు వెళ్ళి యచ్చట ప్రకాశస్వరూపుఁడును గుణరహితుఁడును, సాంఖ్యులు యోగులతో గూడుకొనియున్న వాఁడును, తనతో సమానమగు మఱియొకఁడు లేనివాఁడును, సమస్తమైనవారిలో నుత్తముమైనవాఁడు నొక్కఁడునగు నాపరమేశ్వరుని స్తోత్రము చేయఁగా నావిష్ణుమూర్తి బ్రహ్మదేవునికి ప్రత్యక్షమాయెను

శ్లో॥ ప్రణామంచ క్రతుస్తస్మై యమో బ్రహ్మచసత్వరం ।
తావువాచమహావిష్ణు ర్మేఘగంభీరయాగిరా ॥ ౨౮

తా॥ అప్పుడు బ్రహ్మదేవుండును, యమధర్మరాజును శీఘ్రముగా నా విష్ణు మూర్తికి నమస్కారము చేయఁగా శ్రీ మహావిష్ణువు గర్జితముతో సమానమైన ధ్వని కలుగునట్లుగా వారి యుభయులతోడ నిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ కస్మాదమ్యాగమిహాయాతౌ కిందుఃఖందనుజైరభూత్ ।
మ్లానం యమముఖంకస్మాత్కేనవానతకంధరః ॥ ౨౯

తా॥ మీరిచ్చటి కేమి కారణమున వచ్చితిరి ? రాక్షసులవలన కష్టము సంభ వించినదాయేమి? యమధర్మరాజుయొక్క ముఖముకూడ వాడియున్నది యేమి కార ణము? ఎందువలన ముఖము వంచుకొనియుండెను.

శ్లో॥ ఏతద్వదస్వమే బ్రహ్మన్నిత్యుక్తః ప్రాహకంజజః ।
త్వద్దానవర్యే భూపాలే భూమింశాసతివై వరాః ॥
వైశాఖధర్మనిరతా యాంతి తేపదమవ్యయం ।
తతోయమపురీశూన్యా తేనచాతీవదుఃఖితః ॥ ౩౦

తా॥ ఓ బ్రహ్మ! ఈవృత్తాంతమునంతయు జెప్పుమని విష్ణుమూర్తి యడుగగా బ్రహ్మ చెప్పుచున్నాఁడు. ఓ స్వామీ! నీ వరబలముచే నధికమైనవాఁడై కీర్తిమంతుఁ డను రాజు భూమిని పరిపాలన చేయుచుండఁగా జనులందఱు వైశాఖధర్మములను జేసి శాశ్వతమైన నీస్థానమును జేరుటవలన యమ పట్టణము శూన్యముగా నున్నది. అందువలన నితఁడు మిక్కిలి దుఃఖించుచున్నాఁడు.

శ్లో॥ తేనయుద్ధంచకారాసౌ హంతుందండమథాదదే ।
త్వచ్చక్రేణపరాభూతో యయావద్యమమాంతికమ్॥ ౩౧

తా॥ ఇతఁడారాజుతో యుద్ధముచేసి యాతనిని సంహరించుటకు దండమును గ్రహింపఁగా నప్పుడు నీచేఁబంపఁబడిన చక్రముచే నోడింపఁబడి యనంతరము నా సమీపమునకు వచ్చెను.

శ్లో॥ నచశక్తావయందండం త్వద్భక్తానాంమహాత్మనాం ।
తస్మాత్త్వామేవశరణం వయంప్రాప్తామహావిభో ॥ ౩౨

తా॥ ఓస్వామీ! మహానుభావులగు నీ భక్తులను దండించుటకు మేము సమర్థు లము కాము. కావున నిన్నే మేము శరణుబొందితిమి.

శ్లో॥ తస్మాద్భూపం దండయిత్వా పాలయైనం యమం స్వకం ।
ఇత్యుక్తః ప్రహసన్ ప్రాహ బ్రహ్మాణం యమమేవచ ॥ 33

తా॥ ఆ కారణము వలన ఆ రాజును దండించి నీకు భృత్యుఁడైన యముని రక్షింపుమని బ్రహ్మ పలుకఁగా విని విష్ణుమూర్తి చిరునవ్వు నవ్వి బ్రహ్మతోడను, యమునితోడను నిట్లు వలుకుచున్నాఁడు.

శ్లో॥ లక్ష్మీం వాపి పరిత్యక్ష్యే ప్రాణాన్ దేహమథాపి వా ।
శ్రీవత్సం కౌస్తుభం మాలాం వైజయంతీమథాపి వా ॥
శ్వేతద్వీపంచ వైకుంఠం క్షీరసాగర మేవచ ।
శేషంచ గరుడంచైవ నభక్తం త్యక్తుముత్సహే ॥ 34

తా॥ లక్ష్మీదేవి ప్రాణములు, దేహము, శ్రీవత్సము, కౌస్తుభము, వైజయంతి యను మాలిక, శ్వేతద్వీపము వైకుంఠము, పాలసముద్రము, ఆదిశేషువు, గరుత్మంతుఁడు ఈ మొదలగువానిలో దేనినయినను విడిచిపెడుదునుగాని భక్తునివిడుచుటను మాత్రము నే నంగీకరింపను.

శ్లో॥ విసృజ్య సకలాన్ భోగాన్ మదర్థే త్యక్తజీవితాన్ ।
మదాత్మకాన్మహాభాగాన్ కథం తాం స్త్యక్తుముత్సహే ॥ 35

తా॥ సమస్తసుఖములను విడిచి నానిమిత్తమై ప్రాణములనయినను విడుచుటయందు దాసక్తిగలవారును, నా స్వరూపులును, మహానుభావులు నగు నాభక్తుల నెట్లు విడువగలను.

శ్లో॥ తస్మాత్త్వద్దుఃఖశమనే హ్యుపాయం కల్పయామ్యహం ।
తస్యచాయుర్మయాదత్త మయుతం భూపతేర్భువి ॥ 36

తా॥ ఆకారణమువలన నీదుఃఖము పోవుటకు మఱియొక యుపాయము నాలో చింతును. ఆరాజునకు పదివేలు సంవత్సరములు భూలోకములో నుండునట్లు ఆయుర్దాయము నే నిచ్చితిని.

శ్లో॥ గతాన్యష్టసహస్రాణి తత్రేదానీం నరాంతక ।
ఆయుశ్శేషే తేవసితే మత్సాయుజ్యంగతేపిచ ॥
భవిష్యతి తతోరాజా వేనోనామదురాత్మవాన్ ।
సలుంపతి మహాధర్మాం త్సర్వానేతాం ప్రచ్ఛతీరితాన్ ॥ 37

తా॥ ఓ యమధర్మరాజా! ఆ పదివేల సంవత్సరములలో నెనిమిదివేల సంవత్సరములు గడచినవి మిగిలిన ఆయుర్దాయముకూడ గడచిన పిమ్మట ఆరాజు నా

యొద్దకు వచ్చును. అనంతరమున వేనుఁడను రాజు పుట్టి దుష్టప్రవర్తనగలవాఁడై వేదములయందును ప్రసిద్ధికెక్కియుండిన యీగొప్పధర్మములను నశింపఁజేయును.

శ్లో॥ తదావైశాఖధర్మాశ్చ విచ్ఛిన్నాస్స్యుర్నసంశయః ।
స్వకృతేనైవపాపేన వేనోదగ్ధోభవిష్యతి ॥ ౪౦

తా॥ అప్పుడు వైశాఖధర్మములుకూడ నశించును. సందేహములేదు. ఆవేనుఁడనురాజు తాను జేసికొనిన పాపములచే నశించును.

శ్లో॥ పశ్చాదహంపృథుర్భూత్వా పునర్ధర్మాన్ప్రవర్తయే ।
తదాజనేషుప్రఖ్యాతా న్వైశాఖోక్తాన్కరోమ్యహమ్ ॥ ౪౧

తా॥ అనంతరము నేను పృథుఁడను రాజునై తిరిగి ధర్మములను ప్రవర్తింపజేయుదును. అప్పుడు నశింపఁగా మిగిలినవియు జనులచే ప్రసిద్ధికెక్కియున్న వైశాఖధర్మములను నేను చేసెదను.

శ్లో॥ మద్భక్తోమద్గతప్రాణో యస్తువిన్యస్తసంగ్రహః ।
ఏకస్సహస్రేభవితా తస్యప్రఖ్యాతయేదిమాన్ ॥ ౪౨

తా॥ నాయందు భక్తిగలవాఁడును, నాయందే ప్రాణముల నుంచినవాఁడును సమస్తవైభవమును పరిత్యజించినవాఁడును యెవఁడయినను వెయ్యింటిలో నొక్కఁడుండెనేని వానిచే ఆ మిగులినధర్మములు జేయఁబడుచుండును.

శ్లో॥ కశ్చిదేవహిజానాతు ధర్మానేతాన్ క్షితౌమమ ।
తతస్తేభవితాకార్యం మావిషీదనరాంతక ॥ ౪౩

తా॥ ఓ యమధర్మరాజా! అప్పుడుభూలోకములో నాసంబంధమగుధర్మములను ఒకానొకఁడె యెఱుంగుఁగాని అందఱికిని తెలియదు. కాఁబట్టి నీకార్యమప్పుడు సానుకూలమగును దుఃఖింపవలదు.

శ్లో॥ దాపయిష్యామితేభాగం మాసేస్మిన్మాధవేపిచ ।
నరైస్సర్వైశ్చవైశాఖ ధర్మనిష్ఠైర్మహాత్మభిః ॥ ౪౪

తా॥ ఈవైశాఖమాసములో వైశాఖధర్మములనుజేయు సమస్తమహానుభావుల చేత నీకు కొంతభాగము నిప్పించెదను.

శ్లో॥ భూపేనాపిచకాలస్య షష్ఠాంశమయితేనచ ।
వీర్యశుల్కంతుతేభాగం శతోర్ధ్వంక్తేబలాధికాత్ ॥ ౪౫

తా॥ పరాక్రమాతిశయముచే తీసికొనఁబడిన నీభాగమును తిరిగి నీదుఃఖమును శాంతింపజేసి యారాజు నీకిప్పించెదను. బలాధికుఁడైన శత్రువనుభవించుట సిద్ధము.

శ్లో॥ గృహాణ గృహంత్స్వకంభాగం నభాగీదుఃఖమర్హతి ॥

తా॥ తమయొక్క భాగము ననుభవించెడువారికి విచారముండుట లేదుగదా? కాబట్టి నీభాగమును నీవుపొంది విచారమును మానుము.

శ్లో॥ త్వముద్దిశ్యనకుర్వంతి ప్రత్యహం యేనరాభువి ॥
స్నానంచార్ఘ్యసోదకుంభం దధ్యన్నంచాంతిమేదినే ।
వైశాఖేసకలంకర్మ తేషాంచవిఫలంభవేత్ ॥ ౮౭

తా॥ వైశాఖమాసములో ప్రతిదినమందు స్నానము అర్ఘ్యము జలసహితమైన కలశము చివరదినమందు పెరుగుతోఁగూడిన యన్నము నేజనులు నీకు నివ్వకుందురో వారిచే వైశాఖమాసములో జేయఁబడిన కర్మములన్నియు వ్యర్థములేయగును.

శ్లో॥ తస్మాత్క్రోధంత్యజన్నృపే భాగదేమత్వరాయణే ।
యేకేచాపినకుర్వంతి లోకేతేభాగదానరాః ॥
వైశాకో క్తేమహాధర్మే తేషాంవిఘ్నంసమాకురు ॥

తా॥ ఆకారణమువలన నాకు భక్తుఁడును నీకు భాగమునిచ్చువాఁడునగు రాజు యందు కోపమును విడువుము. ఎవరైనను కొందరు లోకములో నీకు భాగము నివ్వకుందురేని వారుచేయుచుండెడి వైశాఖధర్మములకు విఘ్నమునుకలిగింపుము.

శ్లో॥ మామేవయేయజంతిహా త్వాంహిత్వాధర్మపాలకం ।
మదాజ్ఞయామహాభాగ తదాదండంచత్వంకురు ॥

తా॥ న్యాయాన్యాయములను పరిశీలించునట్టి నిన్ను విడచి నన్నుమాత్రమే యెవరు పూజింతురో ఓ యమధర్మరాజా! అప్పుడు నా యాజ్ఞానుసారముగా వారిని శిక్షింపుము.

శ్లో॥ నృపాద్భాగందాపయితుం సునందంప్రేషయామిచ ।
మచ్ఛాసనాత్సవైగత్వా భాగంతేదాపయిష్యతి ॥

తా॥ రాజు నీకు భాగమునిచ్చుకొఱకు సునందునిపంపెదను. అతఁడు వెళ్ళి నాయాజ్ఞానుసారముగా నీకు భాగము నిప్పించగలఁడు.

శ్లో॥ త్రిష్ఠత్యేవంయమేస్వస్య సన్నిధౌ గరుడాసనః ।
సునందంప్రేషయామాస నృపంబోధయితుంవిభుః ।
సోపిగత్వాబోధయిత్వా పార్శ్వంచపునరాగమత్ ॥ ౯౨

తా॥ ఈ ప్రకారము విష్ణుమూర్తి చెప్పి యముఁడు తనవద్ద నుండఁగానే యా రాజుతో నీవృత్తాంతమునంతయు జెప్పి యమునకు భాగమిచ్చునట్లు జేయుటకు సునం దుని పంపఁగా నతఁడు వెళ్ళి యా ప్రకారమే చెప్పి తిరిగి విష్ణుసన్నిధానమునకు వచ్చెను.

శ్లో॥ ఇత్యాశ్వాస్య యమం విష్ణు స్తత్రైవాంతరధీయత ।
యమం స్వయం శాసయిత్వా తమనుజ్ఞాప్య వై విధిః ॥
అతివిస్మయమాపన్నో యయౌ ధామ సహానుగైః ।
యమోఽపి స్వపురీం ప్రాయాత్ కించిత్సంహృష్టమానసః ॥ ౫౪

తా॥ ఈ ప్రకారము విష్ణుమూర్తి యముని సమాధానపఱచి యచ్చటనే యంతర్ధానమాయెను. అనంతరము బ్రహ్మదేవుం డాశ్చర్యము కలవాఁడై యమునకు బోధింపఁదగిన విషయములను బోధించి యతనితో జెప్పి తన భృత్యులతో గూడ సత్యలోకమునకు వెళ్ళెను. యముఁడును కొంచెము సంతోషముగలవాఁడై తనలోక మును గూర్చి వెళ్ళెను.

శ్లో॥ పశ్చాద్విష్ణోర్నిదేశేన సునందపరిబోధితాః ।
భాగదాస్సకాలాలోకా యే వైశాఖపరాయణాః ॥ ౫౫

తా॥ అనంతరమందు విష్ణుమూర్తి యాజ్ఞానుసారముగా సునందునిచే బోధింప బడి వైశాఖమాస ధర్మములయందు దాసక్తిగలవారందఱును యమునికి భాగమిచ్చు చుండిరి.

శ్లో॥ ధర్మరాజం పురస్కృత్య యే న కుర్వంతి మానవాః ।
తేషాం హి స్వయమాదత్తే పుణ్యం వైశాఖసంభవమ్ ॥ ౫౬

తా॥ ఏ మనుష్యులు ధర్మమును జేయునప్పుడు యమధర్మరాజును గుఱించి జేయక నితరధర్మములను జేయుచుందురో అట్టివారి వైశాఖసంబంధమగు పుణ్యమంత యును యముఁడు తానే తీసికొనును.

శ్లో॥ కుర్యాచ్చ ప్రత్యహం స్నానం దద్యాదర్ఘ్యం యమాయ వై ।
వైశాఖే సకలం పుణ్య మన్యథా విఫలం భవేత్ ॥ ౫౭

తా॥ వైశాఖమాసములో ప్రతిదినమందును స్నానము జేసి యమునకు గూడ నర్ఘ్యమియ్యవలయును. అట్లు జేయనిపక్షమున చేసినపుణ్యమంతయు వ్యర్థమగును.

శ్లో॥ సోదకుంభం చ దధ్యన్నం పౌర్ణమాస్యాం చ మాధవే ।
ధర్మరాజం సముద్దిశ్య దాతవ్యం ప్రథమం జనైః ॥ ౫౮

తా॥ వైశాఖమాసములో పూర్ణిమయందు ముందుగా జలసహితమైన కలశమును, పెరుగుకలిపిన యన్నమును యమధర్మరాజునుద్దేశించి యియ్యవలయును.

శ్లో॥ పశ్చాత్పితౄంత్సముద్దిశ్య గురుముద్దిశ్యవై నరః ।
మధుసూదనముద్దిశ్య పశ్చాద్దేవంజనార్దనమ్ ॥
శీతలోదకదధ్యన్నం తాంబూలంచసదక్షిణం ।
సఫలంకాంస్యపాత్రస్థం బ్రాహ్మణాయనివేదయేత్ ॥ ౬౦

తా॥ అనంతరమున పితృదేవతలను, అటునమ్మట గురువును పూజింపవలెను. అనంతరము మధురాక్షసుని సంహరించి విష్ణుమూర్తి నుద్దేశించి చల్లని యుదకమును, పెరుగుకలిపిన యన్నమును, తాంబూలమును, దక్షిణసహితమైన ఫలములను కంచుపాత్రియందుంచి బ్రాహ్మణునకు నియ్యవలయును.

శ్లో॥ దద్యాచ్చప్రతిమాందివ్యాం మధుసూదనదేవతాం ।
మాసధర్మప్రవక్త్రేచ దద్యాద్విప్రాయసీదతే ॥ ౬౧

తా॥ బాగుగా ప్రకాశించునదియు విష్ణుమూర్తి విగ్రముగల ప్రతిమను వైశాఖమాస పురాణమును జెప్పునట్టి బ్రాహ్మణున కిచ్చినయెడల ఆ భగవంతుఁడు యనుగ్రహముగలవాఁడగును.

శ్లో॥ తమేవధర్మవక్తారం పూజయేద్విభవైస్స్వకైః ।
ఇత్యాదిష్టస్సునందేన తథారాజాచకారహ ॥ ౬౨

తా॥ అట్టి వైశాఖ ధర్మములను జెప్పువారిని తనకుండు నైశ్వర్యములకొలఁదియు పూజించవలయు. ఇట్లు సునందునిచే యాజ్ఞాపింపఁబడినరీతిగా ఆ కీర్తిమతుఁడను రాజు చేయుచుండెను.

శ్లో॥ సనీత్వాచాయుష శ్శేషం భుక్త్వాభోగాన్యథేప్సితాన్ ।
పుత్రపౌత్రాదిభిర్యుక్తో జగామహరిమందిరమ్ ॥ ౬౩

తా॥ ఆ కీర్తిమంతుండిట్లు ధర్మములనుజేయుచు న్యాయముగా రాజ్యమును పాలించి పుత్రులు పౌత్రులు మొదలగువారితోగూడ తమ కిష్టమయిన సౌఖ్యముల నన్నింటి ననుభవించి మిగిలిన యాయుర్దాయమును గూడ వెళ్ళబుచ్చి యనంతరమున సకుటుంబముగా వైకుంఠమునకు వెళ్ళెను.

శ్లో॥ వైకుంఠస్థేన్ద్రపేతస్మి న్వేనోరాజాధమోభవత్ ।
సర్వేధర్మాశ్చవైశాఖ ధర్మాఅపివిశేషతః ॥

దురాత్మానాచ తేనైవ లుప్తావై తేబభూవిరే ।
నప్రఖ్యాతాపునర్యావా భూరిశో మోక్షహేతవః ॥ ౬౫

తా॥ కీర్తిమంతుఁడు వైకుంఠమునకు వెళ్ళినపిమ్మట వేనుఁడను రాజాధముఁడు రాజ్యము చేయుచు సమస్తధర్మములను వానిలో ముఖ్యముగా వైశాఖ ధర్మములను దుర్మార్గపుస్వభావము కలవాఁడై నశింపఁజేయఁగా నది మొదలు భూమిలో తరచుగా మోక్షమునకు కారణమైన ధర్మమే లేకుండెను.

శ్లో॥ యఃకశ్చినైవజానాతి వైశాఖోక్తానిమాంచ్ఛుభాన్ ।
బహుజన్మార్జి తేపుణ్యే పరిపక్వేఉపాగతే ॥
వైశాఖోక్తేషు ధర్మేషు మతిరాత్యంతికీభవేత్ ॥

తా॥ ఒకానొకఁడయినను శుభముల నొసంగునట్టి వైశాఖమాస ధర్మములను ఆకాలంబున నెఱుఁగకుండెను. కాఁబట్టి యనేకజన్మలయందు చేయఁబడినపుణ్యము పరిపక్వమైనగాని వైశాఖమాస ధర్మములయందు శ్రద్ధగలవాఁడు కానేరఁడు.

మైథిలః॥ శ్లో॥ పూర్వమన్వంతరస్థోహి వేనోరాజాదురాత్మవాన్ । అయంవైవస్వతస్థోహి రాజాచేక్ష్వాకునందనః । ఇతిశ్రుతంమయా పూర్వ మిదానీంచోచ్యతేత్వయా ॥ అథవైకుంఠగఃపశ్చా ద్వేనో రాజాభవిష్యతి । ఇత్యేవంసంశయంఛింధి శ్రుతదేవమహామతే ॥

తా॥ గొప్పబుద్ధిగల యో శ్రుతదేవుఁడా! పూర్వ మన్వంతరమందున్న వేనుఁడు దురాత్ముండనియును, ఈ వేనుండైతే ఇక్ష్వాకు వంశమున బుట్టినావాఁడు వైవస్వత మన్వంతరమున నుండినవాఁడనియును పూర్వము నేను వింటిని. ఇప్పుడు మీకు కీర్తి మంతుండనురాజు వైకుంఠమున కేగిన పిమ్మట వేనుఁడను రాజు కాఁగలడని చెప్పితిరి. ఇచ్చట నాకు సందేహము కలిగినది. కాఁబట్టి అది యేలాగునో విమర్శించి చెప్పుమని శ్రుతదేవు నడిగెను.

శ్రుతదేవః॥ శ్లో॥ పురాణేషుచవైషమ్యం యుగకల్పవ్యవస్థయా ।
నచాప్రమాణ్యశంకాతే కథాయావ్యత్యయేక్వచిత్ ॥ ౭౦

తా॥ శ్రుతదేవుఁడు చెప్పుచున్నాఁడు. యుగములు, కల్పములు మొదలగు భేదములచే పురాణములయందు కథలకు వ్యత్యయ ముండినప్పటికిని అట్టికథలకు ప్రమాణము లేదని చెప్పుటకు వీలులేదు.

శ్లో॥ గతేద్వైనందినేకల్పే యద్వైపాశాశ్వతీశుభా ।
మార్కండేయేనమేప్రోక్తా సాచోక్తాతవభూపతే ॥ ౭౧

తా॥ ఓరాజా! నిత్యకల్పములు వెళ్ళుచుండఁగా యీచరిత్రము లెట్లు జరుగుచుండునో అట్లు మార్కండేయుఁడు నాకు చెప్పెనుగాన అదే ప్రకారము నీకుఁ జెప్పితిని.

శ్లో॥ తస్మాన్నఖ్యాతిమాయాతి ధర్మోవైశాఖసంభవః।
కశ్చిదేవహి జానాతి విరక్తో విష్ణుతత్పరః॥

తా॥ ఆకారణమువలన వైశాఖమాస ధర్మము ఆ కాలములో ప్రసిద్ధికెక్కియుండలేదు. ఆ కాలములో సంసారమునందు విరాగముకలవాఁడై వైశాఖధర్మమునందు ఒకానొకఁడే తెలిసికొనియుండెడివాఁడు.

నారదాంబరీష సంవాదే యమదుఃఖ సాంత్వనంనామ
త్రయోదశోధ్యాయ స్సమాప్తః.

---

## అథ చతుర్దశోధ్యాయః.

శ్రుతదేవః॥ శ్లో॥ యఃప్రాతస్స్నాతివైశాఖే మేషసంస్థేదివాకరే।
మధుసూదనమభ్యర్చ్య కథాంశ్రుత్వాహరేరిమామ్॥
సతుపాపవినిర్ముక్తో యాతివిష్ణోఃపరంపదమ్॥

తా॥ శ్రుత దేవుఁడు చెప్పుచున్నాడు. వైశాఖమాసములో సూర్యుఁడు మేషమునందుండఁగా ఎవఁడు ప్రాతఃకాలంబున స్నానముజేసి విష్ణుమూర్తిని పూజించి విష్ణుమూర్తియొక్క కథను వినునో వాఁడు సమస్తపాపములవలన విడువఁబడి విష్ణువుయొక్క యుత్తమైన లోకమును బొందగలఁడు.

శ్లో॥ వాచ్యమానాంకథాంహిత్వా యోన్యాంసేవేతమూఢధీః।
రౌరవంనరకంప్రాప్య పైశాచీంయోనిమాప్నుయాత్॥

తా॥ విష్ణుకథను జెప్పుచుండఁగా దానిని వినక యే మూఢుఁడు మఱియొక వ్యాపారమును జేయుచుండునోవాఁడు రౌరవమునునరకమునుబొంది పిమ్మట పిశాచజన్మ మెత్తును.

శ్లో॥ అత్రైవోదాహరంతీమ మితిహాసంపురాతనం।
పాపఘ్నంపావనంధర్మ్యం సద్యోవంద్యంపురాతనమ్॥

తా॥ దీనినిగుఱించి పూర్వమునజఱిగినదియు, పాపములను బోఁగొట్టునదియు,

పవిత్రమైనదియు, ధర్మస్వరూపమైనదియు, శీఘ్రముగా నమస్కరింపదగినదియు నగు నొక యితిహాసమును జెప్పెదను.

శ్లో॥ పురాగోదావరీతీరే క్షేత్రేబ్రహ్మేశ్వరేశుభే । దుర్వాస శిష్యౌపరమ హంసౌబ్రహ్మైకనిష్ఠితౌ ॥ సదైవోపనిషద్విద్యా నిష్ఠితౌ నిరపేక్షితౌ ॥ భిక్షామాత్రాశినౌపుణ్యౌ భృగుహోవాసినావుభౌ। సత్య నిష్ఠతపోనిష్ఠౌ విఖ్యాతౌజగత్త్రయే ॥ ౬

తా॥ పూర్వమందు గోదావరీ నదీతీరంబున శుభముల నొసఁగు బ్రహ్మేశ్వర మను క్షేత్రముకలదు. అచ్చట సర్వసంగపరిత్యాగులును, బ్రహ్మధ్యానయందాసక్తి గలవారును, యెల్లప్పుడు వేదాంతవిద్యావిచారణ జేయుచుండువారును, కోరికరహితులును, భిక్షమెత్తుకొని జీవించువారును, పుణ్యులును, మూఁడులోకములయందును ప్రసిద్ధికెక్కినవారును, సత్యనిష్ఠ తపోనిష్ఠులను పేరుగల యిద్దఱు మునులు భృగు ప్రస్రవణమను స్థలమున నుండిరి.

శ్లో॥ తయోర్మధ్యేసత్యనిష్ఠ స్సదావిష్ణుకథాపరః ।
శ్రోతౄణామప్యభావేచ వ్యాఖ్యాతౄణాంతథానృప ॥ ౭
తదాకర్మకలాంనిత్యం కరోత్యద్ధామునీశ్వరః ।
శ్రోతాచేద స్తియఃకశ్చి త్తస్మై వ్యాఖ్యాత్యహర్నిశమ్॥ ౮

తా॥ ఓరాజా! వారిద్దరిలో సత్యనిష్ఠుఁడను మునీశ్వరుఁడు యెల్లప్పుడు విష్ణు కథలను వినుటయందాసక్తిగలవాఁడునై వినువారును, చెప్పువారును లేకుండినప్పటికిని తాను విష్ణుకథలయందాసక్తిగలవాఁడై విష్ణుసంబంధములగు కర్మములనన్నియు జేయుచుండెను. మఱియు నెవఁడయినను వినువాఁడు సంభవించినప్పుడు రాత్రింబవళ్ళు విష్ణుకథలను విస్తరించి చెప్పుచుండెను.

శ్లో॥ యదివ్యాఖ్యాతికశ్చిద్వా పుణ్యాంవిష్ణుకథాంశుభాం ।
తదాసంకుచ్యకర్మాణి శ్రుణోతిశ్రవణేరతః ॥ ౯

తా॥ పవిత్రమగునదియు శుభముల నొసంగునదియునగు విష్ణుకథను యెవఁడైనను జెప్పుటకై సంభవించినప్పుడు తన పనులన్నియు నాపుకొని వినుచుండును.

శ్లో॥ అతిదూరస్థతీర్థాని దేవతాయతనానిచ ।
హిత్వాకథావిరోధీని తథాకర్మాణిభూరిశః ॥
శ్రుణోతిచకథాందివ్యాం శ్రోతృభ్యోవక్తివైస్వయం ।
వినాకథాంనజానాతి సేవ్యమన్యం నరేశ్వర ॥ ౧౧

తా॥ ఓరాజా! మిక్కిలిదూరమందుండు తీర్థములను. దేవాలయములను, ఇతర విరుద్ధకణిలను. ఇతరమగు కర్మలను విడచి శ్రేష్ఠమయిన విష్ణుకథలనే వినుచుండును వినెడువారుండు సమంజమున తాను జెప్పుచుండును. మఱియు నా మునీశ్వరునకు విష్ణుకథలయం దాసక్తిగాక మఱి దేనియందున నపేక్షలేకుండెను.

శ్లో॥ వ్యాఖ్యాతిచగృహేస్వస్య వక్తా రోగాద్యుపద్రుతః ।
కూపస్నానపరోభూత్వా శృణ్వోత్యేవకథాంమునిః ॥ ౧౨

తా॥ తనకు ధర్మములను జెప్పునట్టివానికి రోగము మొదలగుకష్టములు సంభవించినప్పుడు తానొక్కడే కూపోదకస్నానముజేసి విష్ణుకథను వినుచుండును.

శ్లో॥ కథాయాశ్చవిరామేతు స్వకృత్యంసాధయేత్పరం ।
కథాంవై శృణ్వతఃపుంసో జన్మబంధోనవిద్యతే ॥ ౧౩

తా॥ కథను జెప్పి చాలించినపిమ్మట తన కార్యములను సాధించుకొనును. కాబట్టి విష్ణుకథలను వినునట్టి మనుష్యునకు జనియించడమను బంధము నశించును.

శ్లో॥ సత్వశుద్ధిస్తతోవిష్ణౌ ననురక్తిశ్చజాయతే ।
రతిశ్చజాయతేవిష్ణౌ సౌహార్దంచైవసాధుషు ॥
నిరంజనంనిర్గుణంబ్రహ్మ సద్యోహృద్యవరుధ్యతే ।
జ్ఞానహీనస్యవై పుంసః కర్మవై నిష్ఫలంభవేత్ ॥ ౧౪

తా॥ విష్ణుకథలను వినుటవలన చిత్తశుద్ధిగలుగును. అందువలను విష్ణుభక్తియం దాసక్తికలుగును. అందువలన సత్పురుషులయందు ప్రేమకలుగును. దానివలన సర్వ కళంకరహితమైనదియు. గుణరహితమైనదియు నగు పరబ్రహ్మము తన హృదయము నందు ప్రకాశించును. జ్ఞానములేనివాని కర్మము వ్యర్థమగును.

శ్లో॥ బహుధాచరితంవాపి యద్వైవాంధకదర్పణం ।
కర్మాణికిృయమాణాని బహుధాశోచితాత్మభిః ॥
సత్వశుద్ధ్యైభవంత్యేవ సత్వశుద్ధ్యాశ్రుతింవ్రజేత్ ।
శ్రుతేస్తు జ్ఞానమాసాద్య జ్ఞానా ధ్యానాయకల్పతే ॥ ౧౫

తా॥ దుష్టస్వభావముగలవారిచే ననేకవిధములయిన కర్మములు చేయఁబడినను గ్రుడ్డివాఁడు అద్దమును జూచినట్లుగానే యుండును. కాబట్టి చిత్తశుద్ధి కలుగునట్లు ప్రయత్నింపవలయును. చిత్తశుద్ధివలన విష్ణుకథాశ్రవణము కలుగును. ఆశ్రవణము వలన జ్ఞానముకలుగును. ఆజ్ఞానమువలన భగవద్ధ్యానము సంభవించును.

శ్లో॥ బహుధాశ్రవణంధ్యానం మననంశ్రుతిచోదితం ।

యత్రవిష్ణుకథానాస్తి యత్రసాధుజనానహి ॥
సాతీర్థంగాతటంవాపి త్యాజ్యమేవనసంశయః ॥

తా॥ అనేకవిధములుగా విష్ణుకథలను వినుట, ధ్యానము చేయుట, వేదముల యందు జెప్పినరీతిగా విచారణమునుజేయుట కలుగును. మరియు నెచ్చట విష్ణుకథ లుండవో, సత్పురుషులు యెచ్చట నుండరో అప్రదేశము గంగాతీరమయినను విడువవలయును.

శ్లో॥ యద్దేశేతులసీనాస్తి నైష్ణవంధామవాశుభం ।
యత్రవిష్ణుకథానాస్తి మృత స్తత్రతమోవ్రజేత్ ॥

తా॥ ఏప్రదేశమందు తులసీవనముగాని, విష్ణుని యాలయముగాని యుండదో యెచ్చటను విష్ణుకథాశ్రవణముండదో అక్కడ మృతినొందినవాడు తమస్సు అను నట్టి నరకమును బొందును.

శ్లో॥ యద్గ్రామేవైష్ణవంధామ నాస్తికృష్ణమ్మగోపివా ॥
యత్రవిష్ణుకథానాస్తి సాధవోవాతదాశ్రయాః ।
మృత స్తత్రపుమాన్ క్షిప్రం శ్వానయోనిశతంవ్రజేత్ ॥ ౨౧

తా॥ ఏగ్రామములో విష్ణునియాలయముగాని, ఇత్తిగాని, విష్ణుకథాశ్రవణము గాని, సత్పురుషులుగాని యుండరో అక్కడ మృతినొందినవాడు శీఘ్రముగా ననేకజన్మలయందును కుక్కగా బుట్టుచుండును.

శ్లో॥ విచార్యోపనిషద్విద్యా మితినిశ్చిత్యవైమునిః ।
సదావిష్ణుకథాసక్తో విష్ణుస్మృతిపరాయణః ॥
నకించిదధికంజాతు మన్యతేశ్రవణాత్పరమ్ ॥

తా॥ ఈసత్యనిష్ఠుడను మునీశ్వరుడు వేదాంతవిద్యానే విచారణచేయవలయు నని నిశ్చయించుకొని యెల్లప్పుడు విష్ణుకథలను వినుటయందును, విష్ణుస్మరణము చేయుటయందు నాసక్తిగలవాడై విష్ణుకథాశ్రవణము కంటె నితరమగు దేనినయిన నధికముగా నొకప్పుడును తలచియుండలేదు.

శ్లో॥ ఇతరస్తుతపోనిష్ఠః కర్మనిష్ఠో దురాగ్రహీ ॥
నవ్యాఖ్యాతిస్వయంవాపి నశృణోతిచసత్కథాం ।
వాచ్యమానాంకథాంహిత్వా తీర్థస్నానాయగచ్ఛతి ॥ ౨౮

తా॥ తపోనిష్ఠుడను రెండవమునీశ్వరుం డేరీతి ప్రవర్తించుచుండె ననగా కర్మలయందు నాసక్తిగలవాడై, అహంకారముకలవాడగుచు తాను విష్ణుకథలను

జెప్పుటలేదు. ఇతరులు చెప్పినను వినుటలేదు. మఱియు కేవరయినను జెప్పుచుండగా కథచే వినక తీర్థస్నానము మొదలగువానికి నేగును.

శ్లో॥ తీర్థేపిచ ప్రవృత్తాయాం కథాయాం భూమిపాలక ।
కర్మలోపభయాద్దూరం యాతిచాంచల్యశంకితః ॥ ౨౫

తా॥ ఓరాజా! ఆ తీర్థస్నానము జేయు స్థలమునందును గూడ కథను చెప్పుచుండిరేని యాకథను వినినయెడల తన చిత్తము చలించి కర్మములకు లోపముకలుగునను భయముచే నచ్చటనుండి దూరముగా మఱియొక ప్రదేశమునకు వెళ్ళును.

శ్లో॥ వ్రజంతిగృహకృత్యార్థ సంగమాత్పరతోజనాః ।
న శ్రోతారో నవక్తార స్తస్యపార్శ్వే తుకర్మిణః ॥ ౨౬

తా॥ ఆయన పార్శ్వమందుండెడి కర్మఠులందఱు ఆ క్షేత్రంబున ప్రాతఃకాలంబున స్నానాదికర్మములను జేయుచు సంగవకాలము పర్యంత ముండి పిదప నింటికివెళ్ళి గృహకృత్యములఁ జేయుడయం దాసక్తికలవారై యుందురే కాని విష్ణుకథలను వినెడువారుగాగాని, చెప్పునట్టివారుగాగాని యుండరైరి.

శ్లో॥ దురాత్మనస్తుదుర్బుద్ధేః కాలఏవక్షయంగతే ।
జిహ్వాం శ్రుతించనక్వాపి స్వశ్రావ్యాకథావిభో ॥ ౨౭

తా॥ ఓ స్వామీ! ఈప్రకారము కాలము గడచిపోవుచుండెనుగాని యొక దినమందైనను దుష్టస్వభావముగల యా దురాత్ముఁడు విష్ణుకథను నాలుకతో స్మరియించిగాని, చెవులతో వినిగాని యెఱుఁగడు.

శ్లో॥ అశ్రోతృదవక్తృత్వా ద్దుర్బుద్ధిత్వాద్దురాగ్రహాత్ ।
పశ్చాత్పంచత్వమాసాద్య సద్యోధర్మేణనైమునిః ॥
పిశాచోభూచ్ఛమీవృక్షే ఛిన్నకర్ణాహ్వయోబలః ।
నిరాశ్రయో నిరాహార శ్శుష్కకంఠోష్ఠతాలుకః ॥ ౨౮

తా॥ తపోనిష్ఠుఁడను యా మునీశ్వరుఁడు విష్ణుకథలను వినకుండుటవలనను, చెప్పకుండుటవలనను, దుష్టస్వభావముకలుగుటవలనను, అహంకారము కల్గుటవలనను కొంతకాలమునకు మృతినొంది పిమ్మట విష్ణుకథాశ్రవణము లేని యధర్మముచే పిశాచస్వరూపమై చెవులులేనివాఁడు గనుక నే ఛిన్నకర్ణుఁడను పేరుగలవాడై బలము లేనివాఁడుగను, ఆధారములేనివాడుగను, ఆహారములేనివాఁడుగను, యెండినటువంటి కంఠము ఓష్ఠములు తాలువులు గలవాఁడుగను యొకానొక జమ్మిచెట్టు యందు నివసించియుండెను.

శ్లో॥ ఏవంనైక్ష్యమాణస్య సమాఅప్యయుతంగతాః ।
నాపశ్యత్స్వస్యత్రాతారం నిరాహారోతిదుఃఖితః ॥ ౩౦

తా॥ ఈ ప్రకారము ఆహారములేక మిక్కిలి దుఃఖించుచుండఁగా పదివేల సంవత్సరములు గడచినవి. ఒక్కఁడయినను నితని రక్షించువారు లేరు.

శ్లో॥ స్వకృతంచింతయానశ్చ మత్తోన్మత్తఇవాభ్రమత్ ।
క్షుధయాపర్యటన్వాపి నివృత్తింనాపమూఢధీః ॥ ౩౧

తా॥ మూఢుఁడయిన యాతఁడు తన పూర్వజన్మ సంచితమునుగుఱించి విచారపడు ఆకలిచేఁబీడింపఁబడుచు మదించినవాఁడువలెను, పిచ్చిపట్టినవాఁడువలెను దిఱుగుచు నెప్పటికిని నివృత్తిని పొందకుండెను.

శ్లో॥ కృశానుసదృశోవాయు రంగంస్పృష్ట్వాకృతాత్మనః ।
కాలాగ్నితుల్యాఆపశ్చ ఫలపుష్పాదికంవిషమ్ ॥ ౩౨

తా॥ వాయు వితనిశరీరమును స్పృశింపఁగా నగ్నితోసమానముగాను, ఉదకములు ప్రళయకాలాగ్నితో సమానముగాను, ఫలములు పుష్పములు విషముతో సమానముగా నుండెను,

శ్లో॥ నక్వాపిసుఖమాపేదే కర్మణోదీనధీరయం ।
ఏవంవ్యవసితేతస్మిన్నరణ్యేజనవర్జితే ॥
కథయారహితేక్షేత్రే స్వాశ్రయేసాధువర్జితే ।
దైవాదాయాత్సత్యనిష్ఠ స్తదాపైఠీనసీంపురీమ్ ॥ ౩౪

తా॥ కర్మలయం దాసక్తిగలవాఁడును, దీనుఁడు నగు ఆ పిశాచము ఒకిప్పుడయినను సుఖమును బొందుటలేదు. ఇట్లుండఁగా మనుష్యసంచారము లేనిదియు, విష్ణుకథాశ్రవణము లేనిదియు, సత్పురుషులు లేనిదియు, తనకాధారమైన యాయరణ్యంబునకు పైఠీనసమను పట్టణమునకు నొకప్పుడు సత్యనిష్ఠుఁడు వెళ్ళుచు దైవవశమున నా మార్గంబుగా వచ్చుచుండెను.

శ్లో॥ గచ్ఛన్మార్గేదదర్శాసౌ ఛిన్నకర్ణంబహువ్యథం ।
దృష్ట్వాత్మానంద్రావయంతం రుదంతంక్షుధయాతురం ॥
మాభైషీతిసమాభాష్య కోసీత్యాహామునీశ్వరః ॥

తా॥ ఇట్లు ఆ సత్యనిష్ఠుఁడు వచ్చుచు మార్గములో మిక్కిలి బాధపడుచున్న వాఁడును, ఆఁకలిచే పీడింపఁబడువాఁడును, తనను జూచి యేడ్చుచున్న వాఁడునగు ఆ ఛిన్నకర్ణుని జూచి నీవు భయపడకుము. నీ వెవరవని యడిగెను.

శ్లో॥ దశేదృశీచకస్మాత్తే నతేదుఃఖమతఃపరమ్ ॥
ఇత్యాశ్వాస్యోమునాభిన్న కర్ణఃపాపిహతివిహ్వలః ।
తపోనిష్ఠోయతిరహం శిష్యోదుర్వాసనఃపురా ॥ 38

తా॥ ఇటువంటిదుడవస్థ నీకేల సంభవించెను? ఇఁకముందు నీదుఃఖము తొలగి పోవును. అని యీప్రకారము సత్యనిష్ఠుఁడు ఓదార్చగా అప్పుడు ఛిన్నకర్ణుఁడు మిక్కిలి దీనుఁడై యిట్లు చెప్పుచున్నాడు. ఓ స్వామీ! నేను పూర్వమందు తపోనిష్ఠుఁడను పేరుగల యతీశ్వరుఁడను దూర్వాసుని శిష్యుఁడను.

శ్లో॥ బ్రహ్మేశ్వరక్షేత్రవాసీ కర్మనిష్ఠోదురాగ్రహీ ।
కర్మలోపభయాన్మోహా న్మయాదుర్బుద్ధినామునే ॥
సాధుభిర్వాచ్యమానాపి నాదృతావిష్ణుసత్కథా ।
నవ్యాఖ్యాతాచశ్రోతృభ్యో కథాకర్మనికృంతనీ ॥ 39

తా॥ బ్రహ్మేశ్వర మను క్షేత్రమందు నివసించువాఁడను. కర్మములయం దాసక్తిగలవాఁడను. పనికిమాలిన పట్టుదలగలవాఁడను. ఓమునీశ్వరా! ఇట్టిదుర్బుద్ధి గల నేను జ్ఞానములేకుండుటచే కర్మములకు లోపము సంభవించునను భావముచే సత్పురుషులు విష్ణుకథలను జెప్పుచుండినను ఆదరముగలిగి వినకుంటిని. మఱియు వినెడువారు సంభవించినప్పుడు సమస్తకర్మములను నశింపఁజేసి ముక్తినిచ్చునట్టి విష్ణు కథను జెప్పనైతిని,

శ్లో॥ తేనకర్మవిపాకేన మహతాహంమృతింగతః ।
ఛిన్నకర్ణోభవన్నామ్నా పిశాచోదుఃఖవిహ్వల ॥ 40

తా॥ అటువంటి గొప్ప పాపవిశేషముచే నేను మృతినొందిన పిమ్మట ఛిన్న కర్ణుఁడను పేరుగలవాఁడను, విచారముగలవాఁడనగు పిశాచమైతిని.

శ్లో॥ నపశ్యామిచత్రాతారం దుఃఖాదస్మాత్కథంచన ।
తవదృష్టిపథంయాతో దిష్ట్యాహంగతకల్మషః ॥ 41

తా॥ ఇటువంటి దుఃఖమునుండి నన్ను ఎట్లుగానయినను తప్పించువానిని గాన నైతిని. ఇప్పుడు దైవయోగముచే మీరగపడితిరి. మీ దర్శనమువలన నా పాపము లన్నియు నశించెను.

శ్లో॥ అద్యమేదేవతాస్తుష్టా గురవస్సాధవశ్చయే ।
హరిశ్చమేప్రసన్నోభూ ద్యతస్తేదర్శనంమమ ॥ 42

తా॥ మీ దర్శనము నాకు దొరుకుటవలన నా యిలవేల్పులు, గురువులు,

సత్పురుషులు అందరును సంతోషించిరి. విష్ణుమూర్తియును నాయందు అనుగ్రహము గలవాడాయెను.

శ్లో॥ పపాతపాదయోర్భూమౌ త్రాహిత్రాహీతివైరుదన్ ॥

తా॥ ఈ ప్రకారము తపోనిష్ఠుడు పలికి యేడ్చుచు నన్ను రక్షింపు రక్షింపుమని యా మునీశ్వరుని పాదములను పట్టుకొనుచు భూమియందు పడెను.

శ్లో॥ తత స్తత్కృపయావిష్ట స్సత్యనిష్ఠోమునీశ్వరః ।
సోర్ధాభ్యముత్థాపయామాస తందృఢాభ్యాంమహాయశాః ॥

తా॥ విశేషకీర్తిగల యా సత్యనిష్ఠుడను మునీశ్వరుడు దయాస్వభావముకలవాడై యాఛిన్న కర్ణుని దృఢములగు తన భుజములతో లేవదీసి కూర్చుండబెట్టెను.

శ్లో॥ తత స్త్వపఉపస్పృశ్య దదౌతస్మైత్వనుత్తమం ।
వైశాఖమాసమాహాత్మ్య శ్రవణస్యముహూర్తజమ్ ॥

తా॥ అనంతరము జలమును స్పృశించి వైశాఖమాస మాహాత్మ్యమును విని సంపాదించిన పుణ్యములో తాను రెండుగడియల కాలము వినినందువలన గలిగిన శ్రేష్ఠమగు పుణ్యము నా ఛిన్నకర్ణునకు దానమిచ్చెను.

శ్లో॥ తేనపుణ్యప్రభావేన సద్యోధ్వస్తాఖిలాశుభః ॥ ౭౫
పిశాచదేహాన్నిర్ముక్తో దివ్యదేహధరోభవత్ ॥

తా॥ ఆ మునీశ్వరుడిచ్చిన పుణ్యవిశేషముచే వతని సమస్తపాపములు శీఘ్రముగా నశింపగా పిశాచదేహమును వదలి శ్రేష్ఠమగు శరీరమును ఆ ఛిన్న కర్ణుడు పొందెను.

శ్లో॥ దివ్యంవిమానమారుహ్య తంప్రణమ్యమహామునిం ।
ఆమంత్ర్యచపరిక్రమ్య యయౌవిష్ణోఃపరంపదమ్ ॥

తా॥ ఆ తపోనిష్ఠుడు సత్యనిష్ఠుడను మునీశ్వరునకు ప్రదక్షిణముగా తిరిగి నమస్కారముజేసి యనుజ్ఞతీసికొని శ్రేష్ఠంబగువిమానము నెక్కి వైకుంఠమునకు వెళ్లెను

శ్లో॥ సత్యనిష్ఠ స్తతోధీమాన్ యయౌపైఠీనసీంపురీమ్ ॥ ౭౭
మాహాత్మ్యశ్రవణస్యైవం చింతయానఃపునఃపునః ॥

తా॥ అనంతరమున బుద్ధిశాలియగు నా సత్యనిష్ఠుడు వైశాఖమాహాత్మ్యమును వినుటవలన నిటువంటి విశేషఫలము సంభవించెనుగదాయని మాటిమాటికి నాలోచించుచు పైఠీనసమను పట్టణమునకు వెళ్ళెను.

శుౘితదేవః॥ శ్లో॥ యత్రవిష్ణుకథాపుణ్యా శుభాలోకమలాపహా ।
తత్రసర్వాణితీర్థాని క్షేత్రాణివివిధానిచ ॥

తా॥ శుౘితదేవుఁడు చెప్పుచున్నాఁడు. పుణ్యకరమైనదియు శుభములనొసఁగు నదియు మనుష్యుల పాపములను పోఁగొట్టునదియు నగు విష్ణుకథ యెచ్చట చెప్పుకొనుచుందురో అచ్చట సమస్తమైన తీర్థములు సమస్తమయిన క్షేత్రములుండును.

శ్లో॥ యత్రప్రవహతేపుణ్యా శుభావిష్ణుకథాపగా ।
తద్దేశేవాసినాం ముక్తిః కరసంస్థాపనంజగుః ॥ ౫౦

తా॥ పుణ్యకరమైనదియు, శుభములనొసఁగునదియు నగు విష్ణుకథ యనెడు నది యేదేశంబున ప్రవహించుచుండునో ఆదేశమునందు నివసించువారికి హస్తమునందుండునట్టి ఫలమువలెనే మోక్షము సులభముగా పొందననునని పెద్దలు చెప్పిరి.

నారదాంబరీష సంవాదే కథాప్రశంయాం పిశాచముక్తిర్నామ
చతుర్దశోధ్యాయ స్సమాప్తః.

---

## శ్రీ భ గ వ త్స్వ రూ ప మ్.

" ఏకోవసీ సర్వభూతాంతరాత్మా ఏకరూపం బహుధాయః కరోతి । తమాత్మస్థం యే నుపశ్యంతి ధీరా స్తేషాం సుఖం శాశ్వత న్నేతరేషామ్ "

" ఏకోదేవ స్సర్వ భూతేషు గూఢ స్సర్వ వ్యాపీ సర్వభూతాంంరాత్మా ।. కర్మా ధ్యక్షః సర్వ భూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ "

" ఏకో నారాయణో నద్వితీయో స్తి కశ్చిత్ "

" ఏక ఏవ శివో నిత్య స్తతోన్య త్సకలం మృషా "

" బహు నాత్ర కిముక్తేన సర్వం బ్రహ్మమయం జగత్
అనేకభేద భిన్నస్తు క్రీడతే పరమేశ్వరః "

---

అథ పంచదశో ధ్యాయః.

శ్రుతదేవః॥ శ్లో॥ భూయశ్శృణుష్వభూపాల మాహాత్మ్యంపాపనాశనం।
వైశాఖస్యమాసస్య వల్లభస్యమధుద్విషః ॥

తా॥ శ్రుతదేవుఁడు చెప్పుచున్నాఁడు. ఓ రాజా! పాపములను బోఁగొట్టు వైశాఖమాసముయొక్క మాహాత్మ్యమును భగవంతుఁడగు విష్ణుమూర్తియొక్క మహత్తును తిరిగి చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ పురాపాంచాలదేశేషు రాజాపురుయశాభవత్ ।
తనయోభూరియునసః పుణ్యశీలస్యధీమతః ॥ ౨

తా॥ పూర్వమందు పాంచాల దేశమునందు విశేష కీర్తిగలవాఁడును, పురుయశుఁడను పేరుగల యొక రాజుండెను. అతనికి బుద్ధిమతుఁ డగు పుణ్యశీలుఁడను తనయుఁ డుండెను.

శ్లో॥ పితర్యుపరతేభూప రాజ్యస్థోధర్మలాలసః ।
శౌర్యౌదార్య గుణోపేతో ధనుర్విద్యావిశారదః ॥
సశాసపృథివీంసర్వాం స్వధర్మేణమహామతిః ॥

తా॥ ఓ రాజా! ఆ పుణ్యశీలుఁడు తండ్రి మృతినొందగానే రాజ్యపరిపాలన యందుంచబడినవాఁడై శౌర్యము ఔదార్యము మొదలగు గుణములుగలిగి ధనుర్విద్య యందు నేర్పుగలవాఁడై, ధర్మములయం దాసక్తిగలవాఁడగుచు, మిక్కిలి యోచన గలవాఁడగుచు ధర్మమార్గముగా సమస్తభూమిని పరిపాలన జేయుచుండెను.

శ్లో॥ పూర్వజన్మజలాదానా ద్దోషేణమహతావృతః ।
సంపద్ధానిమవాపాసౌ కాలేన కియతానఘ ॥

తా॥ దోషరహితుఁడవగు నోరాజా! ఆపుణ్యశీలుఁడు పూర్వజన్మంబున జల దానము చేయనందున మిక్కిలి పాపముగలవాఁ డాయెను. అందుచే కొంతకాలము గడువఁగా నారాజుయొక్క యైశ్వర్యమంతయు నశించెను.

శ్లో॥ హయానగజామృతింయాతా మహద్రోగేణపీడితాః ॥
దుర్భిక్షమతులంచాసీ న్నిర్మానుష్యవిధాయకం।
రాజ్యంకోశంతదాచాసీ ద్గజభుక్తకపిత్థవత్ ॥ ౬

తా॥ ఏనుఁగులు, గుఱ్ఱములు పెద్దరోగములు సంభవించుటవలన మృతినొందినవి. మనుష్యులందఱు నశించిపావునట్టి గొప్ప కఱువు సంభవించెను. రాజ్యమంత

యును నష్టమాయెను. కొల్లలోనుండు ధనమంతయు ఖర్చుపెట్టఁబడక నే యేనుగుచే మింగఁబడిన వెలగపండువలెనే నశించెను.

శ్లో॥ బలహీనంస్సంజ్ఞాత్వా కోశరాష్ట్రవివర్జితం ।
తంజేతుమేషసమయ ఇతినిశ్చితమానసాః ॥
ఆజగ్ముశ్శత్రవోభూప రిపవస్తస్యభూపతేః ।
జగ్ముర్యుద్ధేనతంభూపం పాంచాలవిషయాధిపమ్ ॥ ౮

తా॥ ఓ రాజా! చతురంగబలము, ధనము మొదలగునవి నశించుటచే పుణ్యశీలుఁడు దుర్బలుఁడై యుండెనుగాన యాతనినిజయించుట కిదేసమయమని యారాజు యొక్క శత్రువులందఱు నిశ్చయముజేసికొని యా పుణ్యశీలునిమీదికి దండెత్తివచ్చి యుద్ధముజేసి పాంచాలదేశమున కధిపతియగు నారాజును పట్టుకొనిరి.

శ్లో॥ పరాజితస్తతోరాజా వివేశగిరిగహ్వరే ।
శిఖిన్యాభార్యయాసాకం ధార్త్యాదిగుణసంయుతః ॥
అజ్ఞాతపద్ధతిస్స్వస్వై ర్బహుదుఃఖసమాకులః ।
త్రిపంచాశత్సమాశ్చైవ నీతా స్తేనవిలీయతా ॥ ౧౦

తా॥ అనంతరమున నారాజు యోడిపోయి శిఖిని యను తన భార్యతో గూడి పర్వతగుహయందు ప్రవేశించి యోర్పుగలవాఁడై తనయునికి నెవరికిని దెలియకుండు నట్లు రహస్యప్రదేశంబుననుండి మిక్కిలి వ్యాకులపడుచు నేబదిమూఁడు సంత్సరములను వెళ్ళఁబుచ్చెను.

శ్లో॥ చింతయామాసభూపాలః కిమేతదితిభూరిశః ।
కర్మణాజన్మనాశుద్ధో మాతాపితృహితేరతః ॥ ౧౧

తా॥ ఇట్లు ఆ రాజు దుఃఖపడుచు నీ రీతిగ విచారించెను. ఇటువంటి యవస్థ నాకెందుకు సంభవించెను? నేను కర్మముచేతను పుట్టుకచేతను పరిశుద్ధమైనవాఁడవు తల్లిదండ్రుల పోషించుటయందు దాసక్తిగలవాఁడను.

శ్లో॥ గురుభక్తస్సదాదక్షో బ్రహ్మణ్యోధర్మతత్పరః ।
దయావాం త్సర్వభూతేషు దేవభక్తోజితేంద్రియః॥ ౧౨

తా॥ గురువుయందు భక్తిగలవాఁడను, మంచికార్యములను జేయుటయందు సమర్థతగలవాఁడను, బ్రహ్మజ్ఞానముగలవాఁడను, ధర్మమునం దాసక్తిగలవాఁడను, సర్వభూతములయందు దయగలవాఁడను, దేశభక్తి గలవాఁడను, ఇంద్రియములను జయించినవాఁడను.

శ్లో॥ న భ్రాతా మే న పుత్రో మే నచ మే సుహృదో హితాః ।
దయాశౌచవివిక్తాత్మా కులీనస్యాపి మే కుతః ॥ ౧౩

తా॥ నాసోదరులు, పుత్రులు, స్నేహితులు మొదలగువారందరును, దయయు శౌచము మొదలగు గుణములకెల్లి ప్రసిద్ధిఁజెందిరిగాని అధర్మవంతులు గాలేదు. అట్టి సద్వంశమునఁ బుట్టిన నాకిట్టి కష్టమేల సంభవించెను? తాత్పర్య మింకొకవిధముగా వ్రాయఁబడెను. నేను న్యాయమునను సరించి సోదరుఁడనియు, పుత్రుఁడనియు, స్నేహితుఁడనియు, ఆప్తుఁడనియు, భేదము నెంచకుంటిని మఱియు దయ శౌచము మొదలగు సుగుణములచే ప్రసిద్ధినొందితిని. ఇట్టి సద్వంశంబున బుట్టిన నాకు కష్టమేల సంభవించెను?

శ్లో॥ కేన వా కర్మణా ప్రాప్తం దారిద్ర్యం భూరిదుఃఖదం ।
కేన వా సజయో మేద్య కేన వా వనవాసితా ॥ ౧౪

తా॥ విశేష దుఃఖమును బొందుచున్న యీ దరిద్రత్వము యేదుష్కృతముచే పొందఁబడెను. ఏకారణమువలన యోడిపోతిని? ఏహేతువుచే అడవులలో కాపురము చేయవలసివచ్చెను?

శ్లో॥ ఇతిచింతాకులో రాజా గురూ సస్మార ఖిన్నధీః ।
యాజోపయాజకౌ నామ సర్వజ్ఞౌ మునిసత్తమౌ ॥ ౧౫

తా॥ ఈప్రకారము రాజు చింతించుచు విచారముఁజెందిన మనస్సు గలవాఁడై సమస్తమును తెలిసినవారును, మునిశ్రేష్ఠులును, యాజ ఉపయాజకు లను పేరుగల్గు గురువులను దలఁచెను.

శ్లో॥ ఆజగ్మతుర్మునీంద్రౌ తౌ రాజ్ఞాహూతౌ మహామతిః । తౌ
దృష్ట్వా సహసోత్థాయ రాజా పాంచాలవల్లభః ॥ ననామ శిరసా భక్త్యా
ప్రవాసేనాతిపీడితః । రాజచిహ్నవిహీనశ్చ కేనాప్యజ్ఞానపద్ధతిః ॥
తూష్ణీంతస్థౌ ముహూర్తం హి పతిత్వా భువి పాదయోః ॥

తా॥ అప్పుడు రాజు స్మరింపఁగానే యామునీశ్వరులిద్దఱు వచ్చిరి. అంతట బుద్ధిశాలియగు నారాజు వారిద్దఱను జూచి శీఘ్రముగా లేచి భక్తితో సాష్టాంగదండ ప్రణామము జేసి వనవాసముచే మిక్కిలి దుఃఖించుచున్నవాఁడును, ప్రభుచిహ్నము లను విసర్జించినవాఁడును, ఇతరులకుఁ దెలియఁబడక రహస్యముగానుండువాఁడు నగు ఆరాజు ఆమునీశ్వరుల పాదములమీఁదఁబడి రెండుగడియలకాల మూరకుండెను.

శ్లో॥ దోర్భ్యాంస్వయమూర్ధ్వాభ్యాం పరిమృష్టాస్సులోచనః ।
విధివత్పూజయామాస పద్యార్ఘ్యాద్యైశ్చ భక్తిభిః ॥

తా॥ అనంతరము రాజు వృద్ధులై శరీరమునందు నిస్సత్తువగుచుండగా నారాజు యా మునీశ్వరులను పరికరములైనవియు, వస్తువులను సంపాదించినవియు నగు తగిన పూజాద్రవ్యముచే యథావిధిగా పూజించెను.

శ్లో॥ సూపవిష్టౌతుతౌవిప్రౌ పప్రచ్ఛానతకంధరః । బ్రాహ్మణౌ వదతందుఃఖ కారణంచక్షితీపతుః ॥ కర్మణాజన్మశుద్ధస్య పితృదేవప్రియస్యచ॥ పాపభీరోఃకృపాళోశ్చ గురుభక్తస్యమేకుతః। దారిద్ర్యం కోశహానిశ్చ రిపుభిశ్చ పరాభవః ॥ కస్మాదరణ్యవాసశ్చ కుతఏకాకితామమ ॥ ౨౧

తా॥ అనంతరము యామునీశ్వరులిరువురు సుఖముగా గూర్చున్న పిమ్మట నారాజు నమస్కరించినవాఁడై యిట్లు పలుకుచున్నాఁడు. ఓ బ్రాహ్మణులారా! నేను భూమిని పాలించువాఁడను. జన్మము చేతను, కర్మము చేతను పరిశుద్ధమైనవాఁడను. పితృదేవతలయందు ప్రియముగలవాఁడను. పాపమును గురించి భయపడువాఁడను. దయగలవాఁడను గురువులయందు భక్తిగలవాఁడ నగు నాకిట్టి దుఃఖమేల సంభవించెను? ధనముపోయి దరిద్రము శత్రువులచే జయింపఁబడుట యేలకలిగెను? ఏకారణమువలన నరణ్యనివాసము నొంటరిగానుండుట సంభవించెనో చెప్పవలయును.

శ్లో॥ నపుత్రోనచమేభ్రాతా నహితాసుహృదశ్చమే ॥
దుర్భిక్షంవాకుతశ్చాసీ ద్దేశేరుత్పాలితేనఘౌ ।
ఏతద్విస్తార్యమేబ్రూతాం కారణం మునిపుంగవౌ ॥ ౨౩

తా॥ కుమారుఁడనియు సోదరుఁడనియు, స్నేహితుఁడనియు, ఆప్తుడనియు నేను పక్షపాత మవలంబించి యుండలేను. కాఁబట్టి యోమునీశ్వరులారా! ఈరీతి పక్షపాతరహితముగా రాజ్యమును పాలించిన నాదేశములో దుర్భిక్ష మేకారణమున సంభవించెనో దీనినంతయు సవిస్తారముగా నాకుఁ జెప్పుమని యారాజడిగెను.

శ్లో॥ ఇత్యుక్తౌతౌమునిశ్రేష్ఠౌ భూపేనాత్యంతదుఃఖితౌ ।
ప్రత్యూచతుర్మహాత్మానౌ కించిద్ధ్యానపరాయణౌ ॥ ౨౪

తా॥ మిక్కిలి దుఃఖించుచున్న యారాజిట్లు మహానుభావులగు నాయిరువురు మునులతో బలుకఁగా నామునులు కొంచెము సేపు ధ్యానము నవలంబించి దివ్యదృష్టి చేతనుఁగొని యిట్లు చెప్పుచున్నారు.

యాజ్ఞోపయాజః॥ శ్లో॥ శృణుభూపప్రవక్ష్యావ స్తవదుఃఖస్యకారణం।
పురాభూప మహాపాపీ వ్యాధ స్త్వందశజన్మసు ॥ ౨౫

తా॥ యాజ్ఞోపయాజులు చెప్పుచున్నారు. ఓ రాజా! నీదుఃఖమునకు కారణమును చెప్పుచున్నాము వినుము. పూర్వజన్మములలో పదిజన్మలవఱకును నీవు మహాపాపమును జేయుచు యెఱుకలవాఁడవై జన్మించితివి.

శ్లో॥ నిష్ఠురస్సర్వలోకానాం సదాహింసాపరాయణః ।
ధర్మలేశకరః క్వాపి నదమోనచవై శమః ॥ ౨౬

తా॥ సమస్తమనుష్యులకు కఠినుఁడుగా నగపడువాఁడవును, ఎల్లప్పుడు హింసఁజేయుటయందే యాసక్తుఁడవై యుంటివి. ఎప్పుడును కొంచెముధర్మమైనను జేయకుంటివి. ఇంద్రియనిగ్రహము శాంతి మొదలగు గుణములేమియు నీయందు లేవు.

శ్లో॥ నజిహ్వావక్తి నామాని విష్ణోః క్వాపి కథంచన ।
చేతస్స్మరతిగోవింద చరణాంబురుహద్వయమ్ ॥ ౨౭

తా॥ నీనాలుక యెప్పుడును అతికష్టముగానయినను విష్ణునామములను పలుకుటలేదు. చిత్తము విష్ణు పాదపద్మధ్యానము జేసియుండలేదు.

శ్లో॥ నప్రణామః కృతః క్వాపి శిరసాపరమాత్మనే ।
నవజన్మార్జితైర్భూప గతాన్యేవం దురాత్మనః ॥ ౨౮

తా॥ ఆ పరమాత్మునకు నొకప్పుడైనను నమస్కారమును జేయనైతివి ఓ రాజా! ఈప్రకారము దుష్టస్వభావముచే పాపమును జేయుచు తొమ్మిదిజన్మములను వెళ్ళబుచ్చితివి.

శ్లో॥ దశమేజన్మని ప్రాప్తే వ్యాధ స్త్వంసహ్యభూధరే ।
నిష్ఠురస్సర్వలోకానాం నరాణాంత్వంనరాతకః ॥ ౨౯

తా॥ పదియవజన్మంబున సహ్యాముపర్వతమందు యెఱుకలవాఁడవై జన్మించి నీవు క్రూరుఁడవై సమస్తమనుష్యులను, సమస్తలోకములను బాధపెట్టితివి.

శ్లో॥ దయాహీనశ్శస్త్రజీవీ సదాహింసాపరాయణః ।
నిర్గుణస్సకళత్ర స్త్వం మార్గపీడాకరశ్చరః ॥ ౩౦

తా॥ దయలేనివాఁడవు, ఆయుధములచేత జీవించువాఁడవు, యెల్లప్పుడును హింసఁజేయువాఁడవు, సుగుణములు లేనివాఁడవునై నీవు భార్యతోఁగూడా యుండి మార్గమున నడచువారిని బాధించుచు నిట్లు మూర్ఖుఁడవైయుంటివి.

శ్లో॥ ప్రజానాంగౌడదేశానాం రాక్షసోమానుషాశనః।
ఏవంచాబ్దాన్యతీతాని నైజంహితమజానతః॥ 30

తా॥ ఇట్లు గౌడదేశమునందుండిన సమస్తమనుష్యులకు మనుష్యులనుభక్షించు నట్టి రాక్షసుఁడవుగా నుంటివి. ఇట్లు క్రూరవృత్తి నవలంబించి నీకు మేలుఁగలుగు నట్టి యుపాయము నెఱుఁగకుండి కొన్ని సంవత్సరములను వెళ్ళబుచ్చితివి.

శ్లో॥ బాలాపత్య మృగాణాంచ పక్షిణాంచ వధాత్తవ।
దయాహీనస్యదుర్బుద్ధే జన్మన్యస్మిన్నపుత్రతా॥ 31

తా॥ బాలులను, మృగములను, పక్షులను దుర్మార్గపుస్వభావముగలిగి దయ లేనివాఁడవై హింసించుటవలన నీకు నీజన్మంబున సంతానములేకుండెను.

శ్లో॥ విశ్వాసఘాతుకత్వేన భ్రాతరోనైవసోదరాః।
మార్గపీడాకరత్వేన సుహృజ్జనవివర్జితః॥ 33

తా॥ నిన్ను నమ్మియున్నవారిని హింసజేయుటచే సోదరులు తోఁబుట్టువులు లేరు. మార్గస్థులను బాధించుటచే స్నేహితులు లేకుండిరి.

శ్లో॥ సాధూనాంచతిరస్కారా చ్ఛత్రుభిస్తేపరాజయః।
కదాప్యదత్తదోషేణ దారిద్ర్యంపతితంగృహే॥ 34

తా॥ సజ్జనులను నిరాకరించుటచే శత్రువులచే నోడింపఁబడితివి. ఎప్పుడును దానముజేయకుండిన దోషముచే నీగృహమునందు దరిద్రము సంభవించినది.

శ్లో॥ సర్వోద్వేగకారిత్వా త్ప్రవాసస్తేదురాసదః।
సర్వేషామప్రియత్వాచ్చ దుఃఖమత్యంతదుస్సహమ్॥ 35

తా॥ ఇతరులకు నెల్లప్పుడు పీడనొనరించుటచే సాధ్యముగాని వనవాసము సంభవించెను. అందఱికిని అయిష్టమునే జేయుటచే మిక్కిలి దుఃఖము సంభవించెను

శ్లో॥ నిరాహారోయతఃపూర్వం పదాక్రూరేణకర్మణా।
తస్మాద్రాజ్యాపహారస్తే జన్మన్యస్మిన్మహామతే॥ 36

తా॥ విశేషబుద్ధిగలవాఁడా! పూర్వమున మనుష్యులను భుజియించుటచే నాహారము లేనివాఁడవైతివి. ఎల్లప్పుడు క్రూరకృత్యములనే జేయుచుండుటచే నీ జన్మంబున నీరాజ్యము శత్రువులచే హరింపఁబడెను.

శ్లో॥ అథతేసత్కులీనత్వే హేతూంశ్చాపిబ్రవీమ్యహమ్॥

తా॥ ఇఁకను నీవు మంచివంశంబునబుట్టుటకు కారణములను జెప్పుచున్నాను.

శ్లో॥ యదాభూద్గౌడదేశీయో వ్యాంతిమేవ్యాధజన్మని । స్వకర్మనిరతే క్రూర విపినేకంటకావిలే । తిష్ఠత్యేవం దయాహీనే సర్వభూతాంతకే పథి ॥ వైశ్యావాజగ్మతుర్దైవాద్ధనాఢ్యౌధర్మపీడితౌ । మునిశ్చకర్షణోనామ వేదవేదాంగపారగః ॥ జటాచీరధరః పుణ్యః కమండలుపరిగ్రహః ॥ ౪౦

తా॥ చివఱజన్మంబున గౌడదేశములో నెఱుకలవాఁడవై జనియించి ముండ్లతో వ్యాపింపఁబడియున్న యా కారడవిలో దయలేక సర్వభూతములను హింసించుచు మార్గమునందు బాటసారులను బాధించుచు నిట్లు క్రూరవృత్తిచే జీవించుచు, ఉండఁగా దైవయోగమునే ధనవంతులును, ధర్మరహితులును నగు నిద్దఱు కోమట్లును, వేదములను శాస్త్రములను జదివినవాఁడును, జడలను నారచీరెలను ధరించినవాఁడును, పుణ్యశీలుఁడును, కమండలమును ధరించినవాఁడు నగు కర్షణుఁడను మునీశ్వరుఁడును ఆయడవిమార్గములో నడచుచుండిరి,

శ్లో॥ తాన్ దృష్ట్వా ధనురాదాయ మార్గంరుద్ధ్వావ్యవస్థితః । అనుద్రుత్య శరైర్వైశ్యౌ బాణైశ్ఛిన్నశరీరకౌ । తయోరేకంచత్వం హత్వా గృహీత్వాఖిలతర్పణమ్ ॥ అపరంహంతుముద్యుక్తో సదుద్రావభయాద్ధురితం । పణంగుల్మేవినిక్షిప్య భీతః ప్రాణపరీప్సకః॥ ౪౧

తా॥ అప్పుడు వ్యాధుఁడవగు నీవు ఆ ముగ్గురను జూచి మార్గము నడ్డగించి వారి వెంబడి వెళ్ళి ఆవైశ్యులలో నొకరిని చంపి యాతనివద్దనుండు ధనమునుదీసికొని రెండవవానిని చంపుటకు వెళ్ళఁగా నతఁడును భయమును బొంది తనవద్దనుండిన ధనము నొక పొదలో నుంచి ప్రాణములను కాపాడుకొనుటకు శీఘ్రముగా పారి పోయెను.

శ్లో॥ కర్షణోపిమునిశ్శీఘ్రం వ్యాధాన్మృత్యువిశంకితః ।
అతవేధావమానస్సన్ తృషాఘుర్మప్రపీడితః ॥
మూర్ఛామాపగలస్వేద స్సంజ్ఞామాత్రావశేషితః ।
విహాయైనంద్రుమవేచ వైశ్యోజీవనతత్పరః ॥ ౪౨

తా॥ కర్షణుఁడను మునీశ్వరుఁడును కిరాతుఁడు చంపునని భయముచే పాఱిపోవుచుండెను. ఇట్లు ఆకోమటియు, మునీశ్వరుఁడును వెళ్ళుచుండఁగా నామునీశ్వరుడు యెండలో పఱుగెత్తి వెళ్ళుటచే యెండవేడిమిచే నలసి దాహము గలవాఁడై మూర్ఛనుబొంది చెమటకారుచుండ కొంచెముయూపిరితో నుండెను. ఆకోమటియు తన ప్రాణములను రక్షించుకొనదలఁచి యా మునీశ్వరునివిడచి వెళ్ళెను.

శ్లో॥ త్వంతావనుద్రితో దృష్ట్వా మూర్ఛితంభువి భూసురం। పణంకుత్రవినిక్షిప్తం కియద్దూరంగతోవణిక్॥ ఇతిపృష్టుంద్విజశ్రాంత ముజ్జీవయితుముద్యతః। స్ఫూత్కృత్వాకర్ణయోస్తస్య నాగరంస్మృతి కారణమ్॥ పల్వలస్థోదకేనైవ క్రిమికర్ణమసంయుజా। నేత్రేసంమృజ్య శ్రాంతస్య పత్రైఃస్సంవీజ్యతన్ముఖే॥ ససంజ్ఞంచమునింకృత్వా త్వ మాత్తస్వత్వమానసః॥

తా॥ నీవు వారిని వెంబడింపఁగా వారిలో కలసి భూమిమీఁద మూర్ఛఁబడి యున్న బ్రాహ్మణుని జూచి కోమటి యెచ్చటికి వెళ్ళినదియు, ధనమెచ్చట నుంచి నదియు తెలిసికొనేనిమిత్తము మూర్ఛనొందిన యా బ్రాహ్మణుని బ్రతికింపదలఁచి తెలివివచ్చుటకు చెవులలో నూది చిన్నచిన్న గోతులలో బురద పురుగులతో మిళిత మైయున్న జలములఁదెచ్చి నేత్రముల తుడిచి ఆకులతో చల్లనిగాలి ముఖమునందు తగులునట్లుగా వీచి యా బ్రాహ్మణుని మూర్ఛఁదెలిపి స్థిరచిత్తగలవాఁడవై యాత నితో నిట్లు పలికితిః.

శ్లో॥ మాశంకాతేమునేకార్యా మత్తశ్శస్త్రభృతోవనే॥
నిష్కించనస్సుఖీలోకే కుత స్తేభయముల్బణం।
భిన్నపాత్రేణచీర్ణేన నమేకించిద్భవిష్యతి॥ ౪౯

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! నేను ఆయుధములు గలవాఁడననియు చంపెద ననియు నీవు భయపడవద్దు లోకములో డబ్బులేనివానికేమియు భయము లేదు. కాఁ బట్టి దరిద్రుఁడవగు నీకేమి భయమున్నది? నీవద్దనుండు పాత్రకూడ పగిలి శిధిలమై యున్నది.

శ్లో॥ ఏతావద్వదమేవిద్వ న్వణిక్కుత్రపలాయితః।
కుత్రగుల్మేధనం క్షిప్తం తేనశీఘ్రం గలాయతా॥ ౫౦
అన్యథాత్వాంవధిష్యామి యదిమిథ్యావదిష్యసి॥

తా॥ ఓ విద్వాంసుఁడా! ఆ కోమటి యెచ్చటికి వెళ్ళెను? ఆతఁడు పారిపో వుచు యే పొదలలో ధనము పారవైచెను? దీనినంతయు యథార్థముగా జెప్పుము. నీవు మఱియొకయుద్దేశ్యముచే నబద్ధము జెప్పితివేని నిన్ను చంపెదను.

కర్షణః॥ శ్లో॥ ధనంగుల్మేవినిక్షిప్తం మార్గాదస్మాత్పలాయితః।
ఇతిప్రాహాభయాత్సోపి పృష్టఃప్రాణపరీప్సయా॥

తా॥ ఈప్రకారము నీవడుగఁగా ధనము యీ పొదలో నుంచబడెననియు,

ఆకోమటి యీమార్గముగా వెళ్ళెననియు నాబ్రాహ్మణుఁ నీవు చంపెదవనెడు ప్రాణభయమువలన జెప్పెను.

శ్లో॥ గచ్ఛవిప్రసుఖంమార్గం మత్తోభీతింవిహాయచ ।
ఇతోవిదూరేసలిలం తటాకేవర్తతేశుభం ।
తత్పీత్వాసలిలంపుణ్యం గచ్ఛగ్రామంగతశ్రమః ॥ ౫౩

తా॥ ఇట్లు ఆబ్రాహ్మణుఁడు చెప్పఁగా విని నీవిట్లు పలికితివి. ఓ బ్రాహ్మణుఁడా! నావలన నీకేమియుభయములేదు. నీవు సుఖముగా నింటికిపొమ్ము. ఇచ్చటకు సమీపములో మంచి జలముగల యొక చెఱువుకలదు. ఆ చెరువులో నుండు స్వచ్ఛమైన జలమును త్రాగి ఆయాసమును బోఁగొట్టుకొని నీగ్రామమునకు వెళ్లుము.

శ్లో॥ అథునైవాగమిష్యంతి రాజకీయాఃపథాజనాః ।
మత్పదాన్వేషణేసక్తా శ్శ్రుత్వారావంవణిక్పతేః ।
తృషార్తమనుగంతుంమే నశక్యంత్వాం తతోద్విజ ॥

తా॥ ఓబ్రాహ్మణుఁడా! నీవాయాసపడియుండుటచే నిన్నుఁ గొంతవఱకు పంపించెద ననుకొంటినిగాని యది వీలుకాదు. ఏలననఁగా, ఈకోమటియొక్క ఆర్తధ్వనిని విని రాజభటులు నన్ను పట్టుకొనదలఁచి నన్ను వెదకుటకై యిప్పుడేవత్తురు. అందువలన సాధ్యముకాదు.

శ్లో॥ వీజయానేనపర్ణేన ఘర్మఃకించిద్గమిష్యతి ।
తస్మైదత్వాపలాశంచ త్వమాగాద్విపినంపునః ॥

తా॥ ఈయాకులతో నీవు విసరుకొనినయెడల ఆయాసముతగ్గునని కొన్నియాకుల నాబ్రాహ్మణునకిచ్చి నీవు తిఱిగి వనములోకి వెళ్ళితివి.

శ్లో॥ తేనపుణ్యప్రభావేన వైశాఖేఘర్మఘర్ఘరే ॥
స్వకార్యార్థంకృతేనాపి మునేస్త్రాణాయపద్ధతౌ ।
జన్మాసీత్తేమహాపుణ్యే రాజవంశేతివిస్తృతే ॥ ౫౭

తా॥ ఎండ వేడిమిచే దుస్సహమైన వైశాఖమాసములో నీ యుపయోగము కొఱకు ఆమునీశ్వరునకు నుపచారము జేసినప్పటికిని ఆ మునీశ్వరుఁడు బ్రతుకుట కలిగినది. ఆ విశేషపుణ్యముచే మిక్కిలి పుణ్యాకరమైన గొప్ప రాజవంశంబున నీవు జన్మించితివి.

శ్లో॥ యదీచ్ఛసిసుఖంరాజ్యం ధనధాన్యాదిసంపదః ।
స్వర్గాపవర్గౌయదివా సాయుజ్యంవాహరేపదమ్ ॥
కురువైశాఖధర్మాం స్త్వం సర్వసౌఖ్యమవాప్స్యసి ॥

తా॥ ఓరాజా! సుఖముగాని, రాజ్యముగాని, ధనము ధాన్యము మొదలగు సంపత్తులను, స్వర్గమునుగాని, విష్ణుసాయుజ్యమునుగాని, మోక్షమునుగాని, నీవు దేనిని కోఱినను వైశాఖధర్మములను జేసితివేని సమస్తసౌఖ్యములను బొందగలవు.

శ్లో॥ మాసోయంమాధవోనామ తృతీయాచాక్షయాహ్వయా ।
గాంచసకృత్ప్రసూతాఖ్యాం దేహివిప్రాయసీదతే ।
తేనతేశోకపూర్తిస్స్యాచ్ఛయ్యాందేహిసుఖంభవేత్ ॥ ౬౦

తా॥ వైశాఖమాసములో అక్షయ తృతీయ యందు అదివఱకు ప్రసవించిన ఆవును బ్రాహ్మణునకు దానమిచ్చినయెడల నీ దుఃఖము నశించును. శయ్యను దానమిచ్చిన సుఖముకలుగును.

శ్లో॥ కురుచ్ఛత్రప్రదానంచ సామ్రాజ్యంతేభవిష్యతి ।
స్నానంకురుయథాన్యాయం తథైవార్చయమాధవమ్ ॥ ౬౧

తా॥ గొడుగును దానమిచ్చిన యెడల నీకు సామ్రాజ్యము సంభవించును. ప్రాతఃకాలంబున యథావిధిగా స్నానముజేసినను ఆ ప్రకారముగా విష్ణుమూర్తిని పూజించినను ముక్తికలుగును.

శ్లో॥ దేహిత్వంప్రతిమాందివ్యాం కృత్వాతేనజయోభవేత్ ।
ఆత్మతుల్యగుణాన్పుత్రా న్యదికామయసేనృప ॥

తా॥ ఓరాజా! జయమును, నీతోసమానులగు పుత్రులను కోఱితివేని శ్రేష్ఠమగు విష్ణుప్రతిమను దానముచేయవలెను.

శ్లో॥ సర్వభూతహితార్థాయ ప్రపాదానంచత్వంకురు ।
వైశాఖోక్తానిమార్గధర్మాం త్సమ్యగాచరభూమిప ॥ ౬౩

తా॥ ఓరాజా! చలివేంద్రను స్థాపించుము. మఱియు సమస్త భూతములకు నుపయోగమగునట్టి యీ వైశాఖధర్మముల నన్నియు బాగుగాజేయుము.

శ్లో॥ తేనతేసకలాలోకా వశంయాంతినసంశయః ।
నిష్కామకేనచిత్తేన యదిధర్మాన్కరిష్యసి ॥ ౬౪

తా॥ ధర్మములను గోరక ధర్మములను జేసితివేని నీ పుణ్యవశమున సమస్త లోకములు నీ స్వాధీనమగుచు సందేహము లేదు.

శ్లో॥ వైశాఖేపుణ్యమాసేస్మిన్ ప్రీతయేమధుఘాతినః ।
ప్రత్యక్షోభవితావిష్ణు స్తవనిర్మలచేతసః ॥ ౬౪

తా॥ పుణ్యమగు వైశాఖమాసములో పరిశుద్ధాంతఃకరణము గలిగి విష్ణుమూర్తి ప్రీతికొఱకు ధర్మములను జేసితివేని నీకు విష్ణుమూర్తి ప్రత్యక్షమగును.

శ్లో॥ యేనచారితాఃపుంసా ధర్మాహ్యేతేశుభావహాః ।
తేషాంచశాశ్వతాలోకాః పురాణేకవయోవిదుః ॥ ౬౬

తా॥ ఎవరు శుభకరములగు వైశాఖధర్మములను జేయుదురో వారికి శాశ్వతమగు పుణ్యలోకములు లభించునని విద్వాంసులు పురాణములయందు చెప్పియుండిరి

శ్లో॥ ఏతత్సర్వంతవప్రోక్తం యథాదృష్టంయథాశ్రుతం ।
ఇతిరాజానమామంత్ర్య బ్రాహ్మణౌచపురోధసౌ ॥
యాజోపయాజకౌనామ జగ్మతుస్తౌయథాగతౌ ॥

తా॥ ఓ రాజా! మేము చూచినట్టియు వినినట్టియు సమస్త వైశాఖధర్మములను నీకుఁజెప్పితిమనిపలికి యారాజునకు పురోహితులును, బ్రాహ్మణులునగు యాజోపయాజకులు ఆరాజుతో చెప్పి వారి నివాసమునకు వెళ్ళిరి.

శ్లో॥ తతోరాజామహావీర్యః పురోధోభ్యాంచబోధిత ॥
వైశాఖధర్మాంత్సకలాం శ్చకారశ్రద్ధయాన్వితః ।
యథోపదిష్టంచతథా మధుసూదనమర్చయత్ ॥ ౬౯

తా॥ ఆ రాజా పురోహితులచే బోధింపఁబడిన పిమ్మట సారాజా మిక్కిలి బలముగలవాఁడై శ్రద్ధగలిగి ఆమునీశ్వరులు చెప్పినరీతిగా విష్ణుమూర్తిని పూజించుచు సమస్తమైన వైశాఖధర్మములను జేసెను.

శ్లో॥ తతోలబ్ధప్రభావస్సన్ బంధుభిస్సకలైర్వృతః ।
పాంచాలనగరీంప్రాప్త హాతశేషబలాన్వితః ॥ ౭౦

తా॥ అనంతర మారాజా వైశాఖధర్మ మహిమచే విశేషమగు సామర్థ్యమును బొంది సమస్త బంధువులతోడను గూడి పూర్వము తనకు మిగిలిన సేనలతో గూడి తిరిగి పాంచాలపట్టణమునకు వెళ్ళెను.

శ్లో॥ తతస్తత్రతవోభూప ఉపశృత్యాచభూపతేః ।
ప్రవేశంచపురస్యాథ పునరాజగ్ముసద్ధతాః ॥ ౭౧

తా॥ ఓ రాజా! ఈరాజు తిరిగి యుద్ధముచేయుటకు పాంచాలపట్టణమునకు వచ్చినాడని విని యారాజులందఱు యుద్ధసన్నాహులై వచ్చిరి.

శ్లో॥ తదాపాంచాలభూపేన నృపాణామభవద్రణం ।
జిగ్యేపర్వాన్మహాబాహూ చేకఏవమహారథః ॥ ౭౨

తా॥ అప్పుడు పాంచాలరాజునకును యితరరాజులకును యుద్ధము జరిగెను. అప్పుడు మహారథకుఁడగు నాతఁడొక్కఁడే యారాజులనందఱిని జయించెను.

శ్లో॥ పలాయితేషుభూపేషు నానాదేశపథిష్వపి ।
రాజ్ఞాకోశంగజానశ్వాన్ స్వయంజగ్రాహవీర్యవాన్ ॥ ౭౩

తా॥ అప్పుడు రాజులందఱును నోడిపోయి యనేకమార్గములుగా పాఱిపోయిరి. పిమ్మట నా రాజు బలగలవాఁడైనందున ధనగృహములను ఏనుఁగులను, గుఱ్ఱములను తన స్వాధీనము చేసికొనియెను.

శ్లో॥ అశ్వానాంనిర్బుదంచైవ గజానాంచత్రికోటికం ।
రథానామర్బుదంచైవ దీర్ఘగ్రీవాయుతంతథా ॥
రాసభాణాంత్రిలక్షాణి ప్రాపయామాసతాంపురీమ్ ॥

తాఁ అనేక గుఱ్ఱములు, మూఁడుకోట్ల యేనుఁగులు, అర్బుదమురథములు, పదివేల ఒంటెలు, మూఁడులక్షలు గాడిదెలు ఆపట్టణములో వ్యాపించియుండెను.

శ్లో॥ వైశాఖధర్మమాహాత్మ్యాత్ క్షణాత్సర్వేచభూభృతః ।
కరదాభగ్నసంకల్పాః పాదాక్రాంతాబభూవిరే ॥

తా॥ వైశాఖధర్మ ప్రభావముచే శత్రురాజులందఱును తమ సంకల్పములన్నియును వ్యర్థమైనందున ఆక్షణకాలములోనే పాదాక్రాంతులై పన్నులనిచ్చువారైరి.

శ్లో॥ సుభిక్షమతులంచాసీ త్పాంచాలవిషయేషుచ ।
ఏకచ్ఛత్రమభూద్రాజ్యం ప్రసాదాన్మధుఘాతినః ।

తా॥ విష్ణుమూర్తి యొక్క అనుగ్రహము వలన పాంచాల దేశములయందు మిక్కిలి సుభిక్షముగానుండెను. మఱియు చతుస్సముద్రపర్యంతం రాజ్యము నేలెను.

శ్లో॥ పుత్రాః పంచాపితస్యాసం శౌర్యౌదార్యగుణాన్వితాః ॥
ధృష్టకీర్తిర్ధృష్టకేతు ర్ధృష్టద్యుమ్న స్తథాపరే ।
విజయశ్చిత్రకేతుశ్చ మయూరధ్వజసన్నిభాః ॥ ౭౮

తా॥ పరాక్రమము ఔదార్యము మొదలగు గుణములతో గూడినవారును,

కుమారస్వామితో సమానమైనవారును ధృష్టకీర్తి, ధృష్టకేతువు, ధృష్టద్యుమ్నుఁడు, విజయుఁడు, చిత్రకేతువు అను పేరుగల అయిదుగురు తనయులు ఆరాజునకుకలిగిరి.

శ్లో॥ అనురక్తాఃప్రజాశ్చాసన్ ధర్మేణ ప్రతిపాలితాః ।
వైశాఖస్యప్రతాపేన ప్రత్యయస్తత్ క్షణాదభూత్ ॥ ౭౯

తా॥ ధర్మముగా పరిపాలన జేయుటచే ప్రజలందఱు ననురాగము గలవారైరి. కాఁబట్టి క్షణకాలములోనే యిటువంటి ప్రభావము కలుగుటచే వైశాఖధర్మములయందు మిక్కిలి నమ్మకము కలిగెను

శ్లో॥ పునశ్చకారతాన్ ధర్మా న్పాంచాలనగరీశ్వరః ।
అకాముకేన చిత్తేన ప్రీతయేమధుఘాతినః ॥ ౮౦

తా॥ విష్ణుమూర్తియొక్క ప్రీతికొఱకు ఆ పాంచాలదేశపు రాజు ఫలమునపేక్షింపని మనస్సుకలవాఁడై తిరిగి యీవైశాఖధర్మములను జేయుచుండెను.

శ్లో॥ ధర్మేణానేనసంతుష్టో భగవాన్మధుసూదనః ।
అక్షయాయాం తృతీయాయాం ప్రత్యక్షస్సమజాయత ॥ ౮౧

తా॥ ఈప్రకారమారాజుచే జేయఁబడిన వైశాఖధర్మమువలన సంతోషించినవాఁడై షడ్గుణైశ్వర్యసంపన్నుండగు విష్ణుమూర్తి వైశాఖశుద్ధ తృతీయయగు అక్షయతృతీయయందు ప్రత్యక్షమాయెను.

శ్లో॥ తంద్రుష్ట్వావిస్మితశ్చాభూత్ పరమాత్మానమచ్యుతం ।
నారాయణంచతుర్బాహుం శంఖచక్రగదాధరమ్ ॥
పీతాంబరధరం దేవం వనమాలావిభూషితం ।
సలక్ష్మీకంసానుగంచ గరుడోపరిసంస్థితమ్ ॥ ౮౩

తా॥ పరమాత్మస్వరూపుఁడును, నాశరహితమైనవాఁడును, నాలుగుచేతులు గలవాఁడును, శంఖము–చక్రము– గద మొదలగు ఆయుధములను ధరించినవాడును, పట్టుబట్టలను ధరించినవాఁడును, ప్రకాశించువాఁడును, తులసిమాలికను ధరించినవాఁడును, లక్ష్మితోడను భృత్యులతోడను గూడియున్న వాఁడును, గరుడవాహనము నెక్కినవాఁడును నగు విష్ణుమూర్తినిజూచి యాశ్చర్యమును బొందెను.

శ్లో॥ నిరీక్ష్యదుస్సహం తేజ స్సద్యోమీలితలోచనః ।
ఉత్ప్లుతంత్సంపతన్ హర్షా న్మత్తోన్మత్తఇవాభ్రమన్ ॥ ౮౪

తా॥ ఇట్లు ప్రత్యక్షమైన యీ నారాయణమూర్తియొక్క విశేషమైన తేజస్సును జూడలేక అప్పుడే కండ్లనుమూసికొని యిట్టి గొప్పభాగ్యము దొఱకెనని సంతోష

ముచే మదించిన వానివలెను, పిచ్చిపట్టిన వానివలెను యెగిరి గంతులు వేయుచు తిలుగుచుండెను.

శ్లో॥ పులకాంకితసర్వాంగో గళద్బాష్పాకులేక్షణః ।
తుష్టావపరయాభక్త్యా ప్రాంజలిః ప్రణతో భువి ॥ ౮౫

తా॥ సమస్త అవయవములయందు పులకాంకురము గలవాఁడై కండ్లవెంట నానందభాష్పము లోలుకుచుండ విశేషమగుభక్తితో గూడి భూమియందు పడి సాష్టాంగ దండప్రణామము జేసెను.

నారదాంబరీష సంవాదే పాంచాలదేశాధిపతే ర్జయప్రాప్తి దరిద్రనాశనంనామ పంచదశోధ్యాయ స్సమాప్తః.

---

## అథ షోడశో ధ్యాయః.

శ్రుతదేవః॥ శ్లో॥ తద్దర్శనాహ్లాద పరిప్లుతాశయ నద్య స్సముత్థాయ ననామమూర్ధ్నా । చిరంసుబాష్పాకులలోచనై రముం విశ్వాత్మదేవం జగతామధీశమ్ ॥ ౧

తా॥ శ్రుతదేవుఁడు చెప్పుచున్నాఁడు. ఆ భగవంతుని దర్శనముచే సంతోషచిత్తుండై ఆనందబాష్పపూరితమైన నేత్రములచే నాభగవంతుని జూచుచు ప్రపంచమునందు ఆత్మస్వరూపముగా నిండియున్నవాఁడును ప్రపంచమున కధిపతియునగు భగవంతునకు సాష్టాంగదండప్రణామము జేసెను.

శ్లో॥ దధారపాదా వపనిజ్య తజ్జలం యత్పాదజా బ్రహ్మజగత్పునాతి । సమర్చయామాస మహావిభూతిభి ర్మహార్హ వస్త్రాభరణానులేపనైః ॥ ౨

తా॥ ఏ భగవంతుని పాదములవలన జనియించిన గంగ బ్రహ్మను జగత్తును పవిత్రముజేయునో అట్టి భగవంతుని పాదములను ప్రక్షాళనముజేసి యా తీర్థమును తన దేహమునందంతటను జల్లుకొని విశేష విలువగల వస్త్రములు, ఆభరణములు, గంధములు, పుష్పములు మొదలగువానిచే పూజించెను.

శ్లో॥ స్రగ్ధూప దీపామృత భక్షణాదిభి స్స్వగాత్ర విత్తాత్మ సమర్పణేన । తుష్టావ విష్ణుం పురుషం పురాణం నారాయణం నిర్గుణమద్వితీయమ్ ॥ 3

తా. సమస్త ప్రపంచమును వ్యాపించినవాఁడును, ప్రాచీనపురుషుండును, గుణ రహితుఁడును, దేనితో సమానుఁడు లేనివాఁడు నగు నారాయణుని స్తోత్రముజేసెను.

శ్లో॥ నిరంజనం విశ్వసృజా మధీశం పరాత్పరం పద్మభవాది
వందితం యన్మాయయా తత్వవిదుత్తమా జనా విమోహితా విశ్వ
సృజా మధీశ్వరమ్ ॥ ౪

తా॥ సంబంధ రహితుఁడును, ప్రపంచ సృష్టికర్తలగు నధిపతియైనవాఁడును, దేవునికంటె పరమైనవాఁడును, బ్రహ్మ మొదలగువారిచేత నమస్కరింపఁబడువాఁడును జ్ఞానముచే కధికులైయుండువారయినను తనమాయచే మోహింపజేయువాఁడు నగు భగవంతుని స్తుతించెను.

శ్లో॥ ముహ్యంతి మాయాచ తితేషు మూఢా గుణేషుచిత్రం
భగవద్విచేష్టితం । అనీహ ఏత ద్బహుధైక ఆత్మనా సృజత్యవత్య
త్తినసజ్జతే వ్యథ ॥ ౫

తా॥ మూఢులు భగవంతునియొక్క మాయవలగలుగు కార్యములచే మోహపడుచుందురు. భగవంతుని చేష్టలన్నియు చిత్రముగా నుండును. భగవంతుఁడు తన కేమియు కోఱికలేకయే తానే అనేకవిధములుగా ఈప్రపంచమును సృజియించును పోషించును. నశింపుజేయును.

శ్లో॥ సమస్త దేవాసుర సౌఖ్యదుఃఖ ప్రాప్త్యైభవా న్పూర్ణ
మనోరథోపి । తత్రాపి కాలే స్వజనాభిగుప్త్యై బిభర్షి సత్వం కలునిగ్ర
హాయ ॥ తమోగుణం రాక్షస బంధనాయ రజోగుణం నిర్గుణ విశ్వ
మూర్తే । దిష్ట్యా త్వదంఘ్రిం ప్రణతాఘనాశనం తీర్థాస్పదం హృది
ధృతం సువిపక్వయోగైః ॥ ౭

తా॥ గుణరహితుఁడవును, ప్రపంచస్వరూపుఁడవు నగు ఓా భగవంతుఁడా! నీవు సిద్ధించిన సమస్తకోఱికలు గలవాఁడవైనను సమస్త దేవతలను సుఖపెట్టుటకొఱకును, రాక్షసులను హింసించుటకొఱకు నవతారములెత్తుచు సత్వగుణమునుబొంది నీ భక్తులను పోషింపుచు తమోగుణము ననుసరించి దుష్టులను శిక్షించుచు, రజోగుణము నవలంబించి రాక్షసులను బంధింపుచుందువు. కోట్ల నీకు నమస్కరించువారియొక్క పాపములను నశింపజేయునదియు, గంగాది సమస్తతీర్థములకు స్థానమైనదియు నగు నీపాదమును నా పూర్వజన్మసుకృతము ఫలించినదగుటచే దైవవశమున నా హృదయమందు నిల్పి ధ్యానముజేయగలుగుట సంభవించెను.

శ్లో॥ ఉత్సిక్త భక్త్యుపహృతాశయ జీవభావాః ప్రాపుర్గతిం తవపదస్మృతిమాత్రతో యే। భవాఖ్యకాలోరగపాశ బంధః పునః పునర్జన్మజరాదిదుఃఖైః ॥ భ్రమామియోనిష్వహమాఖుభక్షవ త్ప్రవృద్ధవర్ష్మ స్తవపాదవిస్మృతిః। నూనం నదత్తం నచతే కథాశ్రుతా నసాధవో జాతుమయాపి సేవితాః ॥ ౯

తా॥ విశేషమైన భక్తిగలిగి తాము జీవుఁడనెడు భేదము నశింపఁజేసి నీ పద స్మరణ జేసినవారు నీలోకమును బొందుదురు. నేను నీ పాదస్మరణ జేయనివాఁడనై సంసారమనెడు గొప్పసర్పముచే జుట్టుకొనఁబడి జన్మము, ముదిమి, మృత్యువు మొదలగువానిని బొందుచు, ననేకయోనులయందుఁబుట్టుచు ఎలుకలను తిని శరీరము పెంచుకొనిన పిల్లివలెనే తిరుగుచుంటిని గాని యొక దానమునయిన నియ్యనైతిని. నీకథను విననైతిని. సత్పురుషుల నొకప్పుడయినను సేవించనైతిని.

శ్లో॥ తేనారిభి ర్ధ్వస్త పరార్ధ్యలక్ష్మీ ర్వనం ప్రవిష్ట స్స్వగురూహ్యహంస్మరన్। స్మృతౌ చతౌ మా సముపేత్య దుఃఖా త్సంబోధయాం చక్రతు రార్తబంధూ ॥ ౧౦

తా॥ నిన్ను స్మరింపని కారణమున విశేషమగు రాజ్యము శత్రువులచే హరింపబడఁగా వనమును బ్రవేశించి కొంతకాలముండి పిమ్మట గురువులను స్మరించితిని. అంతట ఆపద్బాంధవులగు వారు నాకద్దకు వచ్చి దుఃఖమును బోఁగొట్టిరి.

శ్లో॥ వైశాఖధర్మై శ్శ్రుతిచోదితైశ్శుభై స్స్వర్గాపవర్గాదిపుమర్థహేతుభిః। తదోపబృంహితోహం కృతవాం త్సనుస్తాం చ్ఛుభావహాన్మాధవమాస ధర్మాన్ ॥ ౧౧

తా॥ శ్రుతులయందు చెప్పఁబడినవియు, శుభముల నొసంగునవియు, మోక్షము స్వర్గము మొదలగు పురుషార్థములకు కారణములైనవియు నగు వైశాఖధర్మములను ఆ మునులు బోధింపఁగా శుభకరంబులగు నట్టి వైశాఖమాసధర్మముల నన్నియు జేసితిని.

శ్లో॥ తస్మాన్నభూ న్మే పరమప్రసాద స్తేనాఖిలా స్సంపద ఊర్జితా ఇమాః। నాగ్ని ర్నసూర్యో నచ చంద్ర తారకా నభూర్జలం ఖం శ్వసనోథవాఙ్మనః ॥ ఉపాసితా స్తేపి హరం త్యయం చిరా ద్విపశ్చితో ఘ్నంతి ముహూర్త సేవయా। యన్మన్యసే త్వం భవితాపి భూరిశ స్త్వ త్తేషణాం స్త్వత్పదన్యస్తచిత్తాన్ ॥ ౧౩

తా॥ ఆ కారణమువలన గొప్పదియగు నీ యనుగ్రహము కలిగెను. అందువలన నీ సమస్త సంపత్తులు పొందఁబడినవి. అగ్నియు, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, భూమి, జలము, ఆకాశము, వాయువు, వాక్కు, మనస్సు మొదలగువానిని నే సేవించలేను. ఆలాగున వానిని స్మరించినయెడల చాలకాలము గడచిన పిమ్మట నా యగ్నిహోత్రాదులును నశించునవియే. కాఁబట్టి విద్వాంసులు ఒక్కక్షణకాలమైనను నిన్ను సేవించి తరించినవార లగుదురు. ఈ క్షణత్రయము వదలి నీ పాద పద్మముల యందు ధ్యానము గలవారికి ని వేది యివ్వదలంచితిరో అది యంతయును సంభవించును.

శ్లో॥ నమ స్స్వతంత్రాయ విచిత్రకర్మణే నమః పరస్మై స్మ సద నుగ్రహాయ । త్వ న్మాయయా మోహితో హం గుణేషు దారార్థ రూపేషు భ్రమామ్యనర్థదృక్ ॥ ౧౨

తా॥ స్వతంత్రుఁడవును, ఆశ్చర్యకరమైన కార్యములను జేయువాఁడవును, సత్పురుషులయం దనుగ్రహము కలవాఁడవును, పరమపురుషుఁడగు నీకొఱకు నమస్కారము నీ మాయచే మోహింపఁబడినవాఁడనై నేను అనుపయోగ విషయముల యందు వాంఛగలిగి త్రిగుణస్వరూపములగు భార్యా పుత్ర ధనాదులయందు ప్రేమ గలిగి వర్తింపుచుంటిని.

శ్లో॥ త్వ త్పాదపద్మం సతి మూలనాశనం సమస్త పాపాప హారంసునిర్మలం । సుఖేచ్ఛయానర్థ నిదానభూతై స్సుతాత్మదారై ర్మమతాభియుక్తః । నశ్యాపి నిద్రాం లభతే న శర్మ ప్రవృద్ధతర్షః పునరేవ తస్మిన్ । లబ్ధ్వా దురాపం నర దేవజన్మ త్వాం యత్నత స్సర్వ పుమర్థహేతుః ॥ ౧౬

తా॥ ఓ స్వామీ! అజ్ఞానమును నశింపజేయునదియు, సమస్తపాపములను బోఁ గొట్టునదియు, కలుషరహితమైన నీ పాదపద్మముల సేవయుండఁగా దానిని విడచి సుఖమునందు అపేక్షచే అనర్థములకు కారణములగు దారాపుత్రాదులయందు మిక్కిలి ప్రేమగలవాఁడై విశేషమగు సంతోషమును బొంగుచు తాను పొందశక్యముగాని బ్రాహ్మణజన్మ మెత్తియు సమస్తవిధములను పురుషార్థములకు కారణుఁడవైన నిన్ను సేవింపక యీ దారాదులనే ప్రేమించి యొకప్పుడయినను నిద్రనుగాని, సుఖమును గాని పొందకుండును.

శ్లో॥ పదారవిందం న భజామి దేవ సం మూఢచేతా విష

యేషు లాలసః। కరోమి కర్మాణి సునిష్ఠితస్సన్ పరివృద్ధతర్షా త్త్వదపేక్షయా దదన్ ॥

తా॥ అజ్ఞానముగలవాఁడనై విషయములయందు ఆసక్తిగలిగి నీపాదపద్మముల సేవించనైతిని. ఓ స్వామీ! ఆవిషయములయందు అపేక్షచే నేమియునివ్వక కర్మములను జేయుచు మిక్కిలి సంతోషముగలవాఁడనైయుంటిని.

శ్లో॥ పునశ్చభూయా మహామద్యభూయా మిత్యేవచింతా శతలోల మానసః। తదైవ జీవస్య భవే త్కృపావిభో దురంత శక్తే స్తవ విశ్వమూర్తేః ॥ ౧౮

తా॥ ఓ స్వామీ! ఇప్పుడు చేయవలయుననియు తిరిగి చేయవలయుననియు ననియెడు సంకల్పములతో గూడియుండునుగాని జేయకుండును. ఎప్పుడు జేయునో అప్పుడే అశక్యమైన శక్తిగలవాఁడవును, ప్రపంచస్వరూపుఁడవగు నీయొక్క దయ జీవునియందు కలుగును.

శ్లో॥ సమాగమస్స్యా న్మహతాంహి పుంసాం భవాంభుధిర్యే నహిగోష్పదాయతే। సత్సంగమో దేవ యదైవభూయా త్తర్హీశ దేవే త్వయి జాయతే మతిః ॥ ౧౯

తా॥ ఓ స్వామీ! సత్కర్మములను జేయుటవలల సంసారసాగరమును గోష్పదమునువలెనే చులకనగాదాటగలిగిన సత్పురుషుల సహవాసము సంభవించును. ఓస్వామీ! సత్సహవాసము కలుగుటవలన దేవుఁడవగు నీయందు భక్తికలుగును.

శ్లో॥ సమస్త రాజ్యోపగమంహిమన్యే హ్యనుగ్రహం తే మయి జాతమంజసా। యధార్థ్యతే బ్రహ్మసురాసురాద్యై రిష్వవృత్తతమైరపి హంసయూధైః ॥ ౨౦

తా॥ బ్రహ్మ, సమస్తదేవతలు, రాక్షసులు మొదలగువారిచేతను, కోరికలన్నియు నశించిన పరమహంసులగు జ్ఞానులచేతను యెటువంటి నీ యనుగ్రహము కోరబడునో అట్టి నీయనుగ్రహము నాయందు శీఘ్రముగా కలిగెను. దానిచే సమస్త రాజ్యసుఖములను బొందినట్లు తలచుచున్నాను.

శ్లో॥ ఇతస్స్మరా మ్యచ్యుత మేవ సాదరం భవాపహం పాదసరోరుహం విభో। అకించనప్రార్థ్య మమందభాగ్యదం నకామయే ఽన్య త్తవపాదపద్మాత్ ॥ ౨౧

తా. ఓ స్వామీ! నాశన రహితమైనదియు సంసారమును బోఁగొట్టునదియు నిత్యశ్రేయము లేనివారలచేతనే స్మరింపబడుచున్నదియు విశేషమగు నైశ్వర్యమునిచ్చునదియు నగు నీపాదపద్మమునే యింతటనుండి స్మరించుచున్నాను. నీపాదపద్మము కంటె మొకదానిని నే కోరుటలేదు.

శ్లో॥ అత్రోపరాజ్యం న సుతాదికోశం దేహేనశశ్వ త్పతతా రజోభువా । భజామి నిత్యం త దుపాసితవ్యం పాదారవిందం మునిభి ర్విచింత్య ॥ ౨౨

తా॥ వ్యాప్తికవలన కలిగిన సుఖమువలెనే యీ దేహము యెప్పుడు నశించు స్వభావము కలది గనుక నా కు సుఖముగాని. పుత్రులను భార్యనుగాని, ధనమునుగాని కోరను. ఇంక నేమియనగా శాశ్వతమైనదియు సేవించదగినదియు మునీశ్వరులచేధ్యానముజేయబడుచున్నదియునగు ఆ ప్రసిద్ధమైన నీపాదపద్మమును సేవించుచున్నాను.

శ్లో॥ ప్రసీద దేవేశ జగన్నివాస స్మృతిర్యథాస్యా త్తవపాద పద్మే । భక్తిస్సదా గచ్ఛతు దారకోశ పుత్రాత్మ చిహ్నేషు గుణేషు మే ప్రభో ॥

తా॥ దేవతలకు నధిపతియు, జగత్తులకు నాధారభూతుండవు నగు నో భగవంతుఁడా! అనుగ్రహింపుము. నీ పాదపద్మములయందు భక్తిగలుగునట్లు జేయుము. త్రిగుణవికారములగు భార్య, పుత్రుఁడు, ధనము, స్వకీయవస్తువులు మొదలగువానియం దాసక్తి పోవునట్లు జేయుము.

శ్లో॥ భూయాన్మనః కృష్ణపదారవిందయో ర్వచాంసి తేదివ్య కథానువర్ణనే । నేత్రే మమస్యా త్తవ విగ్రహేక్షణే శ్రోత్రే కథాయాం రసనా ద్వదర్పితా ॥ ౨౪

తా॥ ఓ స్వామీ! నామనస్సు విష్ణుమూర్తివగు నీ పాదపద్మముల ధ్యానమునందును, నా వాక్కులు శ్రేష్ఠమగు నీ కథలను వర్ణించుటయందును, నేత్రములు నీ శరీరమును జూచుటయందును, చెవులు నీకథలను వినుటయందునుండుగాక. నాలుక నీయందే సమర్పింపఁబడినది.

శ్లో॥ ఘ్రాణం చ త్వత్పాదసరోజ సౌరభే త్వద్భక్త గంధాది విలేపనేత్వక్ । స్యాతాంచ హస్తౌ తవమందిరే విభో సంమార్జనాదౌ మమ నిత్యమేవ ॥ ౨౫

తా॥ ముక్కు నీ పాదపద్మములయందుండు పరిమళమును వాసనచూచుట

యందును, శరీరము నీ భక్తుల గంధము మొదలగువానిచే పూయబడుటయందును, ఓ స్వామీ! నీయాలయమునందు నిత్యమును పూడ్చుట మొదలగు పనులయందు నా హస్తములు ప్రవర్తించుగాక.

శ్లో॥ పాదౌవిభోః క్షేత్రకథాసు సర్పణే మూర్ధాచ మే స్వా త్తవవందనే నిశం । కామశ్చ మేస్వా త్తవ సత్కథాయాం బుద్ధిశ్చ మే స్వా త్తవచింతనే నిశమ్ ॥ ౨౬

తా॥ పాదములు ప్రభువగు నీయొక్క కథలను వినుటకొఱకు క్షేత్రముల యందు తిరుగుటకొఱకును, శిరస్సు యెల్లప్పుడు నీకు సాష్టాంగ దండప్రణామము చేయుటకును ప్రవర్తించుగాక. నా కోరిక నీ మంచికథలను వినుటయందే యుండు గాక. బుద్ధి నిన్ను స్మరించుటయందే యుండునుగాక.

శ్లో॥ దినాని మే స్యు స్తవ సత్కథోదయై ర్మద్గీయమానై ర్మునిభిర్గృహాగతైః । హింసప్రసంగ స్తన మే స భూయాత్ క్షణం నిమేషార్థ మథాపి విష్ణోః । ౨౭

తా॥ నీ సత్కథలచేతను, స్తోత్రము చేయదగినవారును, గృహమునకు నతిథు లుగావచ్చిన మునీశ్వరుల పూజించుటచేతను నే జీవించెడు దినములు గడచుగాక. విష్ణుమూర్తి చరిత్రములేని కథలచే నొక్కనిమిషముగాని, అరనిమిషముగాని ప్రవ ర్తింపకుండునటులు అనుగ్రహింపుము. అనఁగా యెల్లప్పుడు విష్ణుస్మరణమాత్రమే యుండవలయు ననుట.

శ్లో॥ నపారమేష్ఠ్యం నచసార్వభౌమం న చాపవర్గం స్పృహ యామి విష్ణో । త్వత్పాదసేవాంచ సదైవకామయే ప్రార్థ్యాం శ్రియా బ్రహ్మభవాదిభి స్సురైః ॥ ౨౮

తా॥ ఓవిష్ణుమూర్తీ! బ్రహ్మపదమును గోరను. చతుస్సముద్రపర్యంత రాజ్య మును గోరను. స్వర్గాదిలోక ముక్తిని గోరను. ఇఁక నేమి కోరెదననఁగా, లక్ష్మీ దేవి, బ్రహ్మ, సాంబమూర్తి, ఇంద్రుఁడు మొదలగు సమస్తదేవతలచేతను గోరఁబడు నీ పాదసేవనుమాత్రమే నే నెల్లప్పుడు గోరుచున్నాను.

శ్లో॥ ఇతిరాజ్ఞాస్తుతోవిష్ణుః ప్రసన్నః కమలేక్షణః ।
మేఘగంభీరయా వాచా త మువాచ క్షితీశ్వరమ్ ॥ ౨౯

తా॥ పద్మములవంటి నేత్రములుగల విష్ణుమూర్తి యీప్రకారము ఆరాజుచే

స్తుతింపఁబడి యనుగ్రహముగలవాఁడై మేఘధ్వనులవలెనే గంభీరములగు వాక్కు-లచే ఆరాజుతో నిట్లు పలికెను.

శ్రీభగవానుః॥ శ్లో॥ జానేత్వాందాసపర్యంమే నిష్కామకమకల్మషం ।
అథాపితేప్రదాస్యామి వరందైవతదుర్లభమ్ ॥ 30

తా॥ భగవంతుఁడు చెప్పుచున్నాడు. ఓరాజా! కోరికరహితుఁడవును దోష రహితుఁడవగు నిన్ను నాకు ముఖ్యమైన దాసునిగా నెఱింగితిని. మఱియు దేవతల కయినను పొందశక్యముగాని వరమును నీకు నిచ్చెదను.

శ్లో॥ ఆయుష్యం చాయుతం దివ్యం సంపదశ్చ నరేశ్వర ।
భక్తిర్మయి స్పృహాభూయా దంతే సాయుజ్యమేవచ ॥ 31

తా॥ ఓరాజా! పదివేల దివ్యసంవత్సరములు మీకు ఆయుర్దాయమును, సంపత్తులును, నాయందు చలింపని భక్తియు నుండి జన్మాంతంబున నా సాయుజ్యమును బొందగలవు

శ్లో॥ త్వయాకృతేన స్తోత్రేణ మాం స్తువంతిచ యేభువి ।
తేషాంతుష్టః ప్రదాస్యామి భుక్తింముక్తిం న నంశయః॥ 32

తా॥ ఓ రాజా ! నీచే జేయఁబడిన యీ స్తోత్రముచే నెవరు యీ భూమిలో నన్నుస్తుతింతురో నేను సంతోషించి అటువంటివారికి ఇహలోకమున నైశ్వర్యమును జన్మాంతమందు ముక్తి నిచ్చెదను.

శ్లో॥ తృతీయైషాక్షయా నామ భువిఖ్యాతా భవిష్యతి ।
యస్యాం తవప్రసన్నోహం భుక్తిముక్తిఫలప్రదః ॥ 33

తా॥ ఏదినమందునీకుప్రత్యక్షమై నేను భుక్తిని ముక్తిని ఫలముల నిచ్చితినో ఆదినము అక్షయతదియ యని భూమిలో ప్రసిద్ధిజెందియుండును.

శ్లో॥ యేకుర్వంతినరామూఢా స్నానదానాదికాఃక్రియాః।
వ్యాజేనాపిస్వభావాద్వా యాంతి మత్పదమవ్యయమ్ ॥ 34

తా॥ ఏ మూఢులైననుకపటముచేగాని, లేకస్వతస్సిద్ధముగాగాని వైశాఖమాసములో స్నానము దానము మొదలగు క్రియలను జేయుదురో వారు నాశరహితమైన నాస్థానమును జేరుదురు.

శ్లో॥ యేచాక్షయతృతీయాయాం పితౄనుద్దిశ్యమానవాః ।
శ్రాద్ధంకుర్వంతితేషాంవై తదానంత్యాయకల్పతే ॥ 35

తా॥ ఏమనుష్యులు అక్షయతదియయందు పితృదేవతలనుగురించి శ్రాద్ధమును జేయుచున్నారో వారుచేసిన శ్రాద్ధము విశేషఫలము నొసంగును.

శ్లో॥ నచానయా తిథిర్లోకే సమావానాధికాభువి ।
అస్యాంకృతం స్వల్పమపి తదక్షయ్యఫలంభవేత్ ॥ 36

తా॥ లోకములో అక్షయతదియతో సమానమైనతిథిగాని, అధికమైనతిథిగాని లేదు. ఈ అక్షయతదియయందు చేయఁబడిన ధర్మము స్వల్పమయినను శాశ్వతమైన ఫలము నిచ్చుచున్నది.

శ్లో॥ యోగాందద్యాన్నృపశ్రేష్ఠ బ్రాహ్మణాయకుటుంబినే ।
సర్వసంపత్ప్రివర్గాఖ్యా భుక్తిర్ముక్తిఃకరేస్థితా ॥ 37

తా॥ ఓరాజోత్తమా! కుటుంబవంతుఁడగు బ్రాహ్మణునకు నెవఁడు గోదానమునుజేయుచున్నాఁడో అట్టివానికి సమస్తసంపత్తులను సంభవించి భుక్తియు ముక్తియు హస్తమందుడునట్లుగా సులభమైయుండును.

శ్లో॥ యోహిందద్యానడుహం సర్వపాపవినాశనం ।
కాలమృత్యువిముక్తస్సన్ దీర్ఘాయుష్యమవాప్నుయాత్ ॥ 38

తా॥ ఎవఁడు సమస్త పాపములను పోఁగొట్టునట్టి వృషభ దానమును జేయుచున్నాఁడో అట్టివాఁడు మృత్యుభయములేనివాఁడై దీర్ఘాయుష్యమును బొందును.

శ్లో॥ వైశాఖమాసేయోధర్మాన్ కురుతే మత్ప్రియావహాన్ ।
తేషాంమృత్యుజరాజన్మ భయంపాపంహరామ్యహమ్ ॥ 39

తా॥ ఎవఁడు వైశాఖమాసములో నాకు ప్రియకరమైన ధర్మములను జేయుచున్నాఁడో అట్టివానికి మృత్యువు, ముదిమి, జన్మము, భయము, పాపము మొదలగు వానిని నే పోఁగొట్టుచున్నాను.

శ్లో॥ యథావైశాఖధర్మైస్తు తుష్టస్స్యాంసకలైరపి ।
మాసధర్మైర్నతుష్టస్స్యాం మాసోమేమాధవఃప్రియః॥ 40

తా॥ వైశాఖమాసము నాకు ప్రియమైనది కాఁబట్టి వైశాఖమాసములో జేయబడిన సమస్తధర్మములచేత నే సంతోషించినట్లుగా నితరమాసములయందు చేయబడిన ధర్మములచే నేను సంతోషించను.

శ్లో॥ సర్వధర్మోజ్ఝితావాపి బ్రహ్మచర్యవివర్జితాః ।
వైశాఖమాసనిరతా యాంతిమత్పదమవ్యయమ్ ॥ 41

తా॥ సమస్తధర్మములను విడిచినవారయినను, బ్రహ్మచర్యమును విడిచినవారయినను వైశాఖమాస ధర్మములను జేయుటయం దాసక్తిగలవారు నాశనరహితమగు నాస్థానమును బొందుదురు.

శ్లో॥ యద్దురాపంతపోభిశ్చ సాంఖ్యాయోగైర్మఖైరపి ।
తద్ధామపరమంయాంతి వైశాఖనిరతానరాః ॥ ౮౨

తా॥ సాంఖ్యులు మొదలగువారు తపస్సులచేతను, యోగములచేతను, యజ్ఞములచేతను యేస్థానమును బొందలేరో, అటువంటి యుత్తమస్థానమును వైశాఖమాస ధర్మములను జేయువారు పొందుదురు.

శ్లో॥ అపిపాపసహస్రంవా మాసోయంహరతేనఘ ।
ప్రాయశ్చిత్తవిహీనంవా మత్పాదస్మరణంయథా ॥ ౮౩

తా॥ ఓ దోషరహితుఁడా! ఈ వైశాఖమాసము వెయ్యి దోషములనయినను హరించును. ప్రాయశ్చిత్తము జేయకున్నను నా పాదస్మరణము జేసిన సమస్తపాపములు నశించినరీతిగానే నశించును.

శ్లో॥ గురూపదిష్టఃకాంతారే వైశాఖేనిరతోభవాన్ ।
మామారాధ్యజగన్నాథం తేనాప్తమఖిలంన్నృప ॥ ౮౪

తా॥ ఓ రాజా! గురువు ఉపదేశము జేసినరీతిగా అడవియందుండినవాఁడవై వైశాఖమాస ధర్మములయం దాసక్తిగలవాఁడవై ప్రపంచమున కధిపతినగు నన్ను సేవించితివి జేని సమస్తమును బొందగలవు.

శ్లో॥ ధర్మేణానేనసంప్రీతః ప్రత్యక్షోహంభవామితే ।
భుక్త్వాభోగాన్యథాకామాన్ దేవైరపిసుదుర్లభాన్ ॥ ౮౫

తా॥ ఓరాజా! నీవుచేసిన ధర్మములచే సంతోషించినవాఁడనై నీకు ప్రత్యక్షమైతిని. కాఁబట్టి దేవతలకయినను పొంద శక్యముగాని యీ సమస్త భోగములను నీయిష్టానుసార మనుభవించి జన్మాంతంబున నాలోకమును బొందగలవు.

శ్లో॥ ఇతితస్మైవరందత్వా దేవదేవో జనార్దనః ।
పశ్యతామేవసర్వేషాం తత్రైవాంతరధీయత ॥ ౮౬

తా॥ దేవతలకు దేవుండగు విష్ణుమూర్తి యీ ప్రకారము ప్రతికి యారాజునకు కోరిన వరముల నిచ్చి వారందఱు చూచుచుండఁగా నదృశ్యుండాయెను.

శ్లో॥ తతోభూపాలవర్యోసౌ ఋభూవాత్యంతవిస్మితః ।
హృష్టపుష్టతనుర్భూప లబ్ధసర్వమనోరథః ॥ ౮౭

తా॥ ఓరాజా! అనంతరమారాజు మిక్కిలి యాశ్చర్యముగలవాఁడై సంతోష ముతో గూడినట్టియు, బలసినట్టియు శరీరముగలవాఁడై దొరకబడిన ధనము పోయిన వాఁడువలెనే యాశ్చర్యమునొందెను.

శ్లో॥ తతశ్శశాసతత్పృధ్వీం తచ్చిత్తస్తత్పరాయణః ।
మహద్భిర్బోధితోనిత్యం గురుభిశ్చనిరంతరమ్ ॥

తా॥ అనంతర మారాజు ఆభగవంతునియందు చిత్తముగలవాఁడై ఆయననే నిత్యముస్మరింపుచు నెల్లప్పుడు మహానుభావులచేతను,గురువులచేతను బోధింపబడుచు భూమిని పరిపాలించుచుండెను.

శ్లో॥ నాన్యంప్రియతమంమేనే వాసుదేవమృతేనృపః ।
యత్సపర్యాప్రియాఆసన్ దారామాత్యసుతాదయః ॥

తా॥ ఆ రాజు విష్ణుమూర్తిని గాక మరియొకరిని ప్రియమైనవానిగా దలఁచ లేదు. భార్య, పుత్రుడు, మంత్రి మొదలగువారినికూడ విష్ణుమూర్తియొక్క అను గ్రహమువలననే ప్రియమైనవానినిగా తలఁచును.

శ్లో॥ సర్వాన్ధర్మాంశ్చకారాసౌ వైశాఖోక్తాన్పునఃపునః ।
తేనపుణ్యప్రభావేన పుత్రపౌత్రాదిభిర్వృతః ॥ ౫౦

తా॥ ఆ రాజు వైశాఖమాసములో జేయఁదగిన సమస్త ధర్మములను మాటి మాటికిని జేయుచుండెను. ఆరాజు ఆపుణ్యవిశేషముచేతనే పుత్రుఁడు, పౌత్రుఁడు మొదలగు సమస్తసంపత్తులతో గూడుకొనెను.

శ్లో॥ భుక్త్వేమన్ రథాన్సర్వాన్ దేవానామపిదుర్లభాన్ ।
అంతేజగామసాయుజ్యం విష్ణోర్దేవస్యచక్రిణః ॥ ౫౧

తా॥ ఆ రాజు దేవతలకయినను పొందశక్యముగాని సమస్త భోగికల ననుభ వించి జన్మాంతమందు చక్రమును ధరించినవాఁడును, దేవుఁడు నగు విష్ణుమూర్తి యొక్క సాయుజ్యమును బొందెను.

శ్లో॥ యఇదంపరమాఖ్యానం శృణ్వంతి శ్రావయంతిచ ।
తేసర్వేపాపనిర్ముక్తా యాంతివిష్ణోః పరంపదమ్ ॥ ౫౨

తా॥ ఉత్తమమైన యీ చరిత్రము నెవరు వినుచున్నారో, ఇతరులకు విని

పించుచున్నారో వారందఱు సమస్త పాపములవలనను విడువఁబడి విష్ణుమూర్తి యొక్క యుత్తమమగు లోకమును బొందుదురు.

నారదాంబరీష సంవాదే పాంచాలాధిపతే సాయుజ్య
ప్రాప్తిర్నామ షోడశోధ్యాయ స్సమాప్తః.

## అథ సప్తదశోధ్యాయః.

శ్రుతకీర్తిః॥ శ్లో॥ వైశాఖస్యాస్యసఖిలా నిహాముత్రఫలప్రదాన్ ।
భూయోపి శ్రుణుతశ్చాసీ త్తృప్తిర్నాద్యాపిమానద ॥

తా॥ కీర్తినిచ్చువాఁడా! ఐహికాముష్మిక ఫలముల నిచ్చునట్టి వైశాఖమాస ధర్మముల నన్నియును మాటిమాటికి వినినప్పటికి నింతవరకు తృప్తికాలేదు.

శ్లో॥ యత్రచాకైతవోధర్మో యత్రవిష్ణుకథాశ్శుభాః ।
తచ్ఛాస్త్రంశృణ్వతోనైవ తృప్తిఃకర్ణరసాయనమ్ ॥ ౨

తా॥ ఏది కపటములేని ధర్మమో దేనియందు విష్ణుకథలను జెప్పఁబడునో శ్రవణానందకరమైన యట్టిశాస్త్రము నెంతవినినను తృప్తికలుగదు.

శ్లో॥ పూర్వజన్మకృతంపుణ్యం దిష్ట్యాపారముపాగతం ।
అతిథ్యవ్యపదేశేన యద్భవాన్ గృహమాగతః ॥ 3

తా॥ ఓబ్రాహ్మణుఁడా! అతిథివనెడు యుద్దేశ్యముచే నీవు నాగృహమునకు వచ్చిన కారణమున నేను పూర్వజన్మంబున చేసిన పుణ్యము దైవయోగమున పరిపక్వమొంది సిద్ధించినది.

శ్లో॥ వచోమృతం ముఖాంభోజ నిస్సృతంపరమాద్భుతం ।
పీత్వాతృప్తః పారమేష్ఠ్యం మోక్షంవాచ నకామయే ॥ ౪

తా॥ నీ ముఖపద్మమువలన పుట్టుచున్నదియు, మిక్కిలి యాశ్చర్యకరమైన నీ వాక్కులనెడు యమృతమునుపానముజేసి తృప్తిజెందినవాఁడనై బ్రహ్మలోకమును గాని మోక్షమునుగాని కోరను.

శ్లో॥ తస్మాత్త్వాన్నేవధర్మాన్మే భుక్తిముక్తిప్రదాయకాన్ ।
విష్ణుప్రీతికరాన్ దివ్యాన్ భూయోపి స్తరతోవద ॥ ౫

తా॥ ఆ కారణమువలన నిహలోక పరలోక సుఖముల నిచ్చునవియు, విష్ణు

మూ ర్తికి సంతోషకరములగుననియు, శ్రేష్ఠములగు నా వైశాఖధర్మములచే తిరిగి సవిస్తరముగా నాకు జెప్పవలయును.

శ్లో॥ ఇత్యుక్తస్తుపునారాజ్ఞా శ్రుతదేవోమహాయశాః ।
సంప్రాప్తాత్మశుభాః ధర్మాన్పునర్వ్యాహర్తుమారభే ॥ ౬

తా॥ ఈప్రకారము శ్రుతకీర్తిమహారాజు తిరిగి యడుగఁగా విశేషకీర్తిగల శ్రుతదేవుఁడు సంతుష్టాంతరంగుఁడై శుభముల నొసఁగునట్టి వైశాఖమాసధర్మములను తిరిగి చెప్పుటకు ప్రారంభించెను.

శ్రుతదేవః॥ శ్లో॥ శ్రుణురాజన్ప్రవక్ష్యామి కథాంపాపప్రణాశనీం ।
వైశాఖధర్మవిషయాం భావితాం మునిభిర్మహాః ॥ ౭

తా॥ శ్రుతదేవుఁడు చెప్పుచున్నాడు. ఓరాజా! పాపములను బోఁగొట్టునదియు మునీశ్వరులచే నెల్లప్పుడు గౌరవింపఁబడునదియు వైశాఖమాస ధర్మములను గుఱించిన యొకకథను జెప్పెదను వినుము.

శ్లో॥ పంపాతీరేద్విజఃకశ్చి చ్ఛంఖోనామ మహాయశాః ।
గురౌసింహగతేచాగా న్నదీం గోదావరీం శుభామ్ ॥

తా॥ పూర్వకాలంబున గొప్ప కీర్తిగలవాఁడును, శంఖుఁడనెడు పేరుగల యొకబ్రాహ్మణుఁడు పంపానదీతీరమందు నివసించుచుండెను. ఆయన యొకప్పుడు సింహరాశియందు బృహస్పతి ప్రవేశింపగా పుణ్యకరమైన గోదావరీనదికి వచ్చెను.

శ్లో॥ తీర్త్వాభీమరథీంపుణ్యాం కాంతారేకంటకాచలే ।
నిర్జలే నిర్జనే ఘోరే వైశాఖాతపకర్శితః ॥
వృక్షేచోపవివేశాసౌ మధ్యాహ్నసమయేద్విజః ॥

తా॥ ఆబ్రాహ్మణుఁడు పుణ్యంబగు భీమరథీనదిని దాటి ముండ్లు రాళ్ళు గలదియు, జలము మనుష్యులు లేనిదియు నగు నడవిలో వెళ్ళుచు వైశాఖమాసము కాఁబట్టి మధ్యాహ్నకాలమందు విశేషము తీక్ష్ణముగానుండిన యెండ వేడిమిచే తపింపఁబడి యొక చెట్టుక్రింద విశ్రమించెను.

శ్లో॥ తదాకశ్చిద్దురాచారో వ్యాధశ్చాపధరశ్శరః ॥ నిర్ఘృణస్సర్వభూతేషు కాలాంతక ఇవాపరః । తం కుండలధరం విప్రం దీక్షితం భాస్కరోపమమ్ ॥ దృష్ట్వాబధ్వాసజగ్రాహ కుండలాదికము గ్రధీః । ఉపానహౌచ ఛత్రంచ కమండలం కమండలుమ్ ॥ ౧౨

తా॥ ఆసమయంబున దుష్టప్రవర్తనగలవాఁడును, కల్లులు చేబూనినవాఁడును, మూర్ఖుఁడును. సర్వప్రాణులయందును దయలేనివాఁడును, రెండవ యముఁడువలెనే యుండిన యొకకిరాతుఁడు యాచెట్టువద్దకు వచ్చి మకరకుండలములను ధరించినవాఁడును, యజ్ఞాదులను జేసినవాఁడును, సూర్యుఁడువలెనే ప్రకాశించుచున్న యా బ్రాహ్మణుని జూచి కట్టి క్రూరబుద్ధిగలవాఁడై యాబ్రాహ్మణుని మకరకుండలములను, పాదుకలను, గొడుగును, కమండలమును, చంకయందుండుమూటను తీసికొనెను

శ్లో॥ పశ్చాద్విసృజ్యతంవిప్రం గచ్ఛేత్వ్యాహావిమూఢధీః ॥

తా॥ మిక్కిలి మూఢుఁడగు యాకిరాతుఁడు యిట్లు దొంగిలించి యనంతరము ఆ బ్రాహ్మణుని విడిచిపెట్టెను.

శ్లో॥ తత స్సగచ్ఛ న్పథి శర్కరావిలే సూర్యాంశుత ప్తే జల వర్జితేఖరే । సంత ప్తపాద స్తృణఛాదితే స్థలే క్వచిచ్చచారో పయ నూర్ధ్వరేతాః ॥ సవై దుఃతం సంపదన్నాప్యపి తిష్ఠన్ హాహేతివాచీ స జగామతూర్ణమ్ ॥

తా॥ అనంతరమాబ్రాహ్మణుఁడు రాళ్ళతోనిండియున్నదియు, సూర్యకిరణములచే కాలుచున్నదియు, జలము లేనిదియు, కఠినమగు యా మార్గంబున నడచుచు కాళ్ళుకాలిన సమయంబున గడ్డిచే నావరింపఁబడిన ప్రదేశమందు పాదములఁ బెట్టుకొనుచు, శీఘ్రముగా నడచుచు నొకానొకచోట నిలుచుండియును యెంత కష్టము సంభవించెనని పలుకుచు ప్రాణముల బిగబట్టుకొని వెళ్ళుచుండెను.

శ్లో॥ దృష్ట్వా మునిం ఖిద్యమానం పృథివ్యాం మధ్యంగతే ఘృణ్ణిదయోరాంబభూవ । వ్యాధస్య ధర్మవిముఖస్యచ పాపబుద్ధేఃతస్మై దదామీతి చ పాదరక్షామ్ ॥ ౧౫

తా॥ ఈ ప్రకారము పగలు రెండుజాముల సమయంబున కఠినమార్గము గల నేలను నడచుచు దుఃఖించుచున్న యా బ్రాహ్మణుని జూచి ధర్మము చేయనివాఁడయినను, పాపబుద్ధిగలవాఁడైనను యా కిరాతుఁడు యా బ్రాహ్మణుని పాదుకలను తిరిగి యియ్యవలయునని దయకలిగెను.

శ్లో॥ చౌర్యేణైవస్వధర్మేణ యద్గృహీతం వనాంతరే ।
తదీయమేవ తత్సర్వం వ్యాధానాం ధర్మనిర్ణయః ॥ ౧౬

తా॥ అరణ్యములో తమ కులవృత్తియగు దొంగతనముచే సంపాదింపఁబడిన ద్రవ్యమంతయు దొంగతనము చేసినవాని హక్కుగలదేయని కిరాతులధర్మముల యందు నిర్ధారణ చేయఁబడియున్నది.

శ్లో॥ తస్మాదుపానహౌదాస్యే ముహుర్దుఃఖాపనుత్తయే ।
తేన శ్రీయోభవేద్యచ్ఛ తద్భవేన్మమపాపినః ॥ ౧౭

తా॥ ఆ కారణమువలన యీపాదుకలను మాటిమాటికి దుఃఖించుచున్న యీ బ్రాహ్మణుని బాధ పోవుటకు నిచ్చెదను. నేను పాపాత్ముఁడనైయుంటిని గనుక ఆందువలన యేనైనను కొంతపుణ్యము లభించును.

శ్లో॥ జీర్ణేచోపానహౌదివ్యే వర్తేతేమమపాదయోః ।
నవాభ్యామస్తిమేకృత్యం తస్మాత్తేవై దదామ్యహమ్ ॥ ౧౮

తా॥ నా కాళ్ళకు పాతవియు గట్టివియు నగు చెప్పులుగలవు. ఈ చెప్పులతో నాకేమియు పనిలేదు. కాబట్టి ఆ చెప్పులను ఆయనకిచ్చెదను.

శ్లో॥ ఇతినిశ్చిత్యమనసి తూర్ణంగత్వాదదౌచతే ।
శర్కరాతప్తపాదాయ ద్విజవర్యాయసీదతే ॥ ౧౯

తా॥ ఈ ప్రకారము మనస్సునందు నిశ్చయముచేసికొని యెండ వేడిమిచే కాళ్ళు కాలుటచేతను, రాళ్ళు యొత్తికొనుటచేతను బాధపడుచుండిన యాబ్రాహ్మణునకు శీఘ్రముగా వెళ్ళి చెప్పులనిచ్చెను.

శ్లో॥ ఉపానహౌగృహీత్వాతే నిర్వృతింపరమాం యయౌ ।
సుఖీభవేతితం వ్యాధ మాశీర్భి రభినంద్యచ ॥
నూనం సుపక్వపుణ్యోయం వైశాఖేదత్తవానమూ ।
వ్యాధస్యాపిచ దుర్బుద్ధేః ప్రాయోవిష్ణుః ప్రసీదతి ॥ ౨౧

తా॥ బ్రాహ్మణుఁడా చెప్పులను ధరియించి మిక్కిలి సుఖమునుబొంది నీవు చిరకాలము జీవింపుమని దీవించి యిట్లు పొగడుచున్నాఁడు. వైశాఖమాసములో యీచెప్పుల నిచ్చుటవలన నితనిపుణ్యము పరిపక్వమైనది. ఇట్టి పుణ్యవంతుఁడౌ కావున యాకిరాతుఁడు మొదటదుర్బుద్ధిగలవాఁడైనప్పటికి విష్ణుమూర్తి ప్రసన్నుడగును.

శ్లో॥ "సర్వస్యాప్యాచ భూయోపి యత్సుఖం తదభూన్మమ ।
తతోభిశ్రుత్య తద్వాక్యం కిమేతదితివిస్మితః ॥ ౨౨
వ్యాజహారపునర్విప్రం బ్రహిష్ఠం బ్రహ్మవాదినం ।
త్వదీయంతుమయాదత్తం కథంపుణ్యాంభవేన్మమ ॥ ౨౩

తా॥ ఇప్పుడు చెప్పులను తొడిగికొనుట వలన సమస్త సుఖములను బొందినట్లుగా సుఖించితిని. ఇట్లు ఆబ్రాహ్మణుఁడుపలికిన వాక్యమును విని బ్రహ్మజ్ఞానము

గలవాఁడును, బ్రహ్మనిష్ఠయునుగల యా బ్రాహ్మణునితో కిరాతుఁడిట్లు పలుకు చున్నాఁడు. ఓ బ్రాహ్మణుఁడా! ఇదియేమి, నీవు పలికినమాట మిక్కిలి యాశ్చర్యముగా నున్నది. నీవస్తువులనే నీకిచ్చినందువలన నాకు పుణ్యమెట్లుకలుగును?

శ్లో॥ ప్రశంససిచ వైశాఖం హరిస్తుష్టోభవేదితి ।
ఏతదాచక్ష్వమేబ్రహ్మన్ కోవైశాఖస్తు కోహరిః ।
కోధర్మః కింఫలంతస్య శుశ్రూషోర్మే దయానిధే ।
ఇతివ్యాధవచశ్శ్రుత్వా శంఖస్తుష్టమనాఅభూత్ ॥ ౨౫

తా॥ వైశాఖమాసమునందు ధర్మములను జేసిన యెడల విష్ణుమూర్తి సంతోషించునని ప్రశంస జేయుచున్నావు. వైశాఖమాసమేమిటి? హరియెవరు? ధర్మమేమిటి? ఆలా చేసినందువలన గలుగు ఫలమేమిటి?దయామయుండవగు నో బ్రాహ్మణుఁడా! నీకు శుశ్రూషచేసెదను. కావున నేనడిగిన ప్రశ్నములకు విశదముగా నుత్తరముల జెప్పుమని విధేయుఁడై యడుగఁగా నా కిరాతుని వాక్యమును కర్ణముని విని సంతుష్టాంతరంగుఁడాయెను.

శ్లో॥ ప్రశంసన్ సచ వైశాఖం పునర్విస్మితమానసః ।
ఇదానీం దత్తవాన్ పాద త్రాణే మే లుబ్ధకశ్చరః ॥ ౨౬.

తా॥ ఆ బ్రాహ్మణుఁడు తిరిగి వైశాఖ ధర్మములను ప్రశంస జేయుచు నాశ్చర్యమునుబొంది యిట్లు పలుకుచున్నాఁడు. కిరాతుఁడు మూర్ఖుఁడయినను నా ప్రాణములను కాపాడునట్టి పాదరక్షల నిచ్చినాఁడు.

శ్లో॥ యద్దుర్బుద్ధేశ్చవైషమ్యం జాతంచిత్రమహోబత ।
సర్వేషామేవధర్మాణాం ఫలంజన్మాంతరేషుచ ॥
వైశాఖమాసధర్మాణాం ఫలంసద్యః క్షణంనృణామ్ ॥

తా॥ ఈ కిరాతునికి మొదటినుండి దుష్టబుద్ధియే స్వభావమయినను యిప్పుడు ఆబుద్ధియంతయు మాఱిపోయి మంచిబుద్ధిగలిగినది. ఎంతయాశ్చర్యము సమస్తధర్మములయొక్క ఫలములు మఱియొకజన్మంబునకలుగును. వైశాఖమాసధర్మముయొక్క ఫలమైతే ఆజన్మమునందే మనుష్యులకు శీఘ్రముగా గలుగును.

శ్లో॥ పాపాచారస్యదుర్బుద్ధే ర్వ్యాధస్యాపి దురాత్మనః ।
దైవాదుపానహోర్దానా త్సత్వేశుద్ధిరభూదహో ॥

తా॥ పాపప్రవర్తనగలవాఁడును, దుష్టబుద్ధిగలవాఁడు నగు కిరాతుఁడు దైవయోగమువలన పాదుకలను యిచ్చుటవలన చిత్తశుద్ధిగలిగి మంచిగుణమేర్పడినది.

శ్లో॥ యచ్చవిష్ణోః ప్రియంకర్మ యత్తత్సంతోషనిర్మలమ్ ॥
తదేవధర్మమిత్యాహు ర్మన్వాద్యాధర్మవిత్తమాః ।
ధర్మామాధవమాసీయాః ప్రియావిష్ణోరతీవతే ॥ 30

తా॥ ఏధర్మము విష్ణుమూర్తికి సంతోషకరమైనదో, ఏది సంతోషస్వభావముతో జేయఁబడునో దానినేధర్మమని ధర్మములను దెలిసిన మనువు మొదలగువారు చెప్పిరి. మఱియు వైశాఖమాస సంబంధములగు ధర్మము లన్నియు విష్ణుమూర్తికి మిక్కిలి ప్రియమైనవి.

శ్లో॥ ధర్మైర్మాధవమాసీయై ర్యథాతుష్యతి కేశవః ।
నతథాసర్వదానైశ్చ తపోభిశ్చమహామఖైః ॥ 3౧

తా॥ వైశాఖమాస ధర్మములచే విష్ణుమూర్తి సంతోషించునట్లుగానే దానములుచేసినను, యే తపస్సులుచేసినను, యే యజ్ఞములుచేసినను సంతోషింపడు.

శ్లో॥ నానేనసదృశోధర్మ స్సర్వధర్మేషువిద్యతే ।

తా॥ దీనితో సమానమగు ధర్మము యేధర్మము కాదు.

శ్లో॥ మాగయాయాంతుమాగంగాం మాప్రయాగంతుపుష్కరం ॥
మాకేదారం కురుక్షేత్రం మాప్రభాసం శ్యమంతకం ।
మాగోదాం మాచకృష్ణాంచ మాసేతుంమామరుద్వృథమ్ ॥

తా॥ ఈ వైశాఖధర్మములను జేయువారు గయ, గంగానది, ప్రయాగ, పుష్కరము, కేదారక్షేత్రము, ప్రభాసతీర్థము, శ్యమంతకక్షేత్రము, గోదావరి, కృష్ణానది, సేతువు, మరుద్వృథము మొదలగుపుణ్యప్రదేశములకు వెళ్ళనక్కరలేదు.

శ్లో॥ వైశాఖధర్మమాహాత్మ్యం శతసంతీచకథాపగా ।
తత్రిస్నాతస్యవైవిష్ణు స్సద్యోహృద్యవరుధ్యతే ॥ 3౪

తా॥ వైశాఖమాస ధర్మమును చెప్పడమనెడు నదిలో స్నానము జేసినవారికి (అనఁగా కథను విన్నవారు) శీఘ్రముగా విష్ణుమూర్తి ప్రత్యక్షమై వారి హృదయమున నివసించగలఁడు.

శ్లో॥ మాసేమాధవసంజ్ఞేస్మిన్ యత్స్వల్పేనైవసాధ్యతే ।
నతద్బహువ్యయైర్దానై నధర్మైర్నాపివైమఖైః ॥ 3౫

తా॥ వైశాఖమాసములో కొంచెముద్రవ్యమైనను వ్యయపఱచి ధర్మముచేసినందువలన గలిగినఫలమును యితర కాలములయందు విశేషధనమును ఖర్చుపెట్టి

యనేక దానములు, ధర్మములు, యజ్ఞములు మొదలగువానిని జేసినను బొందడు.

శ్లో॥ మాసోయంమాధవోనామ వ్యాధపుణ్యవివర్ధనః ।
తస్మిన్మహ్యం త్వయాదత్తే పాదుకే పాపనాశనే ॥ 3౮

తా॥ ఓ కిరాతుఁడా! ఈ వైశాఖమాసము పుణ్యమును వృద్ధిపొందించునది, అట్టి వైశాఖమాసమందు నాకు పాదుకలనిచ్చుటచే నాబాధ తగ్గిపోయినది.

శ్లో॥ తేనతేపూర్వకాలీనం పుణ్యంపాకముపాగతం ।
తుష్టస్తుభగవాన్ప్రియః శ్రేయోవ్యాధభవిష్యతి ॥ 3౯

తా॥ ఓ కిరాతుఁడా! నీవు పూర్వజన్మమునందు జేసినపుణ్యము పరిపక్వము పొందినది. భగవంతుఁడు నీ యిష్టముగా సంతోషించి శ్రేయస్సు నివ్వగలడు.

శ్లో॥ అన్యథాతేకథంభూయా ద్బుద్ధిరేతాదృశీశుభా ।
మునావేవంబ్రువాణేచ మృత్యునాప్రేరితోబలీ ॥
సింహోవ్యాఘ్రవధార్థాయ ప్రాద్రవత్క్రోధవిహ్వలః ॥

తా॥ మునుపు నీకు శుభము కలుగకుండెనేని యిటువంటి మంచిబుద్ధి కలుగనేరదు. అని మునీశ్వరుఁడు పలుకుచుండఁగా నింతలో నా యరణ్యంబున నొక చోట సింహము మృత్యుదేవతచే ప్రేరేపింపఁబడి మిక్కిలి క్రోధముగలదియగుచు పెద్దపులిని జంపుటకు పరుగెత్తి వెళ్ళుచుండెను.

శ్లో॥ మధ్యేదృష్ట్వాచమాతంగం దైవాద్దేవేనకల్పితం ॥
తంహంతుముద్యతోగచ్ఛ త్పదాక్రాంతంవ్యవస్థితం ।
తయోర్యుద్ధమభూద్రాజా సింహమాతంగయోర్వనే ॥ ౪౦

తా॥ ఇట్లు పరుగెత్తుచుండఁగా దారిలో నీశ్వరునిచే కల్పితమగు నేనుఁగ దైవవశమున నగపడఁగా దాని కాలుపట్టుకొని చంపుటకు నుద్యుక్తమైనదై యుండఁగా నప్పుడా సింహమునకును, ఏనుఁగకును అడవిలో గొప్ప యుద్ధము జరిగెను.

శ్లో॥ శ్రాంతౌయుద్ధాచ్చవిరతౌ నిరీక్షతౌచతస్థతుః ।
వ్యాధముద్దిశ్యయచ్ప్రోక్తం మునినాచమహాత్మనా ॥
సమస్తపాతకధ్వంసి దైవాచ్ఛ్రావతుశ్చతౌ ॥

తా॥ ఆ గజసింహము లిట్లు యుద్ధముజేయుచు వలసి చాలించుచు యిటు నట్టు చూచుచుండగ మహానుభావుఁడగు కర్షణమునీశ్వరుఁడు కిరాతునితో జెప్పుచున్నదియు సమస్తపాపములను పోగొట్టునదియు వైశాఖమాస ధర్మములను, తలవని తలంపుగా నా గజ సింహములు వినుట సంభవించెను.

శ్లో॥ తేనైవమాసమాహాత్మ్య శ్రవణేనామలాశయా ॥ శాపా
న్ముక్తౌచతౌదేహౌ త్యక్త్వాయుక్తౌ దివంగతౌ । దివ్యరూపధరౌదివ్యౌ
దివ్యగంధానులేపనౌ । దివ్యంవిమానమారూఢౌ దివ్యనారీనిషేవితౌ।
సద్యోవనతమూర్ధానౌ ।ప్రాంజలీచోపతస్థతుః ॥ ౪౪

తా॥ ఆ గజ సింహములు రెండును కిరాతునితో మునిశ్రేష్ఠుడు చెప్పుచున్న వైశాఖమాస మహాత్మ్యమును వినుటవలనఁ జేసి పాపములు నశించుటచే శాపమునుండి విముక్తులై అక్షణంబునఁ దేహముల విడిచి దివ్యరూపమును ధరించినవారును, దేవలోకమునం దుండు గంధముచే బూయబడినవారును, దేవతావిమానముల నెక్కినవారును, దేవతాస్త్రీలచే సేవింపఁబడుచున్న దేవతాస్వరూపముగలవారై యాకాశమార్గమునందున్న వారలగుచు దోసిలిపట్టుకొని నమస్కారముజేసిరి.

శ్లో॥ మునీంద్రోఽదర్మవక్తాచ వ్యాధముద్దిశ్యవై పథి ।
తౌదృష్ట్వావిస్మితః ప్రాహ కౌయువామితినిశ్చలః ॥ ౪౫

తా॥ కిరాతునుద్దేశించి వైశాఖమాసధర్మములను జెప్పుచున్న యా మునిశ్రేష్ఠుడు యాకాశమార్గంబున నున్న యా దివ్యపురుషులను జూచి నిశ్చలస్వభావము గలవాఁడై మీరెవరని యడిగెను.

శ్లో॥ యువాంకేనాతుకృత్యేన జన్మ యువయోర్వాకథంమృతిః ।
అహేతుర్వ్యపినేచాస్మి న్పరస్పరవధోద్యతౌ ॥ ౪౬
ఏతత్సమస్తంవిస్తార్య సమ్యగ్వదతమేనఘౌ ।
ఇత్యుక్తౌమునినాతేన వచఃప్రత్యూచతుఃపునః ॥ ౪౭

తా॥ మీకు గజ సింహ జన్మము లెట్లు సంభవించెను? ఈయడవియందు మీకిద్దఱకు వ్యర్థముగా విరోధమెట్లు గలిగెను? ఒకరినొకరు చంపుటకు నుద్యుక్తులై యుద్ధమునుజేసి యేక కాలమునందే మీకిద్దఱికీ విధంబున మృతిగలిగెను. దోషరహితులగు నో దేవతలారా! దీనినంతయు విశదముగా దెలియునట్లు చెప్పుమని మునిశ్రేష్ఠుండడుగగా వారిద్దఱు చెప్పుచున్నారు.

శ్లో॥ మతంగస్యమునేఃపుత్రౌ దంతిలఃకోహలోపరః ।
శాపదోషేణతౌజాతౌ నామ్నా దంతిలకోహలౌ ॥ ౪౮

తా॥ మతంగమహామునికి దంతిలుఁడనియు, కోహలుఁడనియు నిద్దఱుపుత్రులు గలిగిరి. ఆ దంతిల కోహలు లిద్దఱు శాపవశమున భూలోకమున దంతిల కోహల శబ్దంబులచే జెప్పఁబడుచున్నారు.

శ్లో॥ రూపయౌవనసంపన్నౌ సర్వవిద్యావిశారదౌ ।
ఆవాముద్దిశ్య ప్రోవాచ పితా ధర్మార్థకోవిదః ॥ ౪౯

తా॥ సౌందర్యము యౌవనము గలవారును సమస్త శాస్త్రములను జదివినవారము నగు మమ్ము నుద్దేశించి సమస్తధర్మముల యదార్థమును దెలిసికొనిన మునీశ్వరుండు యిట్లు చెప్పెను.

శ్లో॥ మతంగోనామబ్రహ్మర్షి స్సర్వధర్మవిదుత్తమః। వైశాఖే మాసితనయౌ మధుసూదనవల్లభే ॥ ప్రపాంకురుతమార్గేచ జనాన్వీజయతంక్షణం । మార్గేస్థాయాంవిధత్తాంచ భూర్యన్నంశీతలాంబుచ । కురుతంస్నానముషసి తద్వైవార్చయతం విభుం । కథాంచశ్రుణుతం నిత్యం యయాబంధోనివర్తతే ॥ ౫౨

తా॥ సమస్తధర్మవేత్తలలో నగ్రగణ్యుఁడగునట్టివాఁడును, బ్రహ్మర్షియునగు మతంగమహాముని యిట్లు చెప్పుచున్నాడు. విష్ణుమూర్తికి ప్రియకరమగు వైశాఖ మాసములో దారియందు మంచినీళ్ళ నిచ్చునట్టి చలివేంద్ర నొకదాని నేర్పఱచుటయు, ఎండచే నలసిన జనులకు వీచుటయు దారిలో నీడగానుండునట్లు పందిళ్ళను నిర్మించుటయు, విశేషముగా అన్నమును చల్లని మంచితీర్థము నిచ్చుటయు, ప్రాతఃకాలంబున స్నానము జేయుటయు, సంసారబంధమును నివర్తింపచేయునట్టి భగవంతుని పూజించుటయు, ఆతని కథను వినుటయు జేయుచుండవలయును.

శ్లో॥ ఏవంచబహుభిర్వాక్యై ర్బోధితావపిదుర్మతీ ।
క్రీడ్ధోభవందంతిలోహం మత్తోహంకోహలాహ్వయః ॥ ౫౩

తా॥ ఈ ప్రకారము ఆ మతంగమహాముని యనేకవిధములగు వాక్యములు జెప్పి బోధించినను దుష్టస్వభావముగల దంతిల కోహలుల నే మేమిద్దఱము కోపించి మదించియుండి యా ధర్మములను జేయమైతిమి.

శ్లో॥ క్రుద్ధశ్శాపనౌసద్యః పితాధర్మేషులాలసః ॥
పుత్రంచధర్మవిముఖం భార్యాంచాప్రియవాదినీమ్ ॥
అబ్రహ్మణ్యంచరాజానం త్యజేత్సద్యోనచేత్పతేత్ ॥

తా॥ మా తండ్రి యా వైశాఖమాసములయం దాసక్తిగలవాఁడగుటవలన మేము చేయకుండుటచే ఆక్షణంబుననే కోపించి యట్లనెను. ధర్మములనుజేయని తనయుని, అయిష్టముగా మాట్లాడు భార్యను, దుష్టులను హింసించుట కూడ తగదని

చెప్పినట్టి రాజు కొలువును శీఘ్రముగా విడువవలయును. అట్లా విడువకుండిన యెడల నష్టముకల్గును.

శ్లో॥ దాక్షిణ్యాదర్థలోభాద్వా సంసర్గంయేప్రకుర్వతే ।
తేసర్వేనరకంయాంతి యావదింద్రాశ్చతుర్దశ ॥

తా॥ పూర్వమందు జెప్పఁబడిన భార్యాపుత్రులను ప్రేమచే స్వీకరించినను ధనము నిచ్చునను యుద్దేశ్యముతో రాజును విడువకున్నను అట్టివారు పదునాలుగు ఇంద్రకల్పము లగుపర్యంతము నరకమునందు నివసింతురు.

శ్లో॥ ఇతిజ్ఞాత్వాశశాపావాం మదక్రోధపరిప్లుతః ।
కుద్ధోహాందంతిలోభూయాం సింహః క్రోధపరిప్లుతః ।
మత్తస్తుకోహాలోభూయాం మత్తోమాతంగయూధపః॥ ౪౭

తా॥ ఈప్రకారమయిన ధర్మశాస్త్రమును దెలిసినవాఁడుగావున మా తండ్రి మదముచేతను, క్రోధముచేతను నిండియుండిన మమ్ములను శపింపఁగా క్రోధస్వభావముగల దంతిలుఁడనగు నేను సింహమునైతిని. మదించియున్న కోహాలుడనగు నేను మదించిన యేనుఁగనైతిని.

శ్లో॥ కృతానుతాపౌపశ్చాత్తు ప్రార్థయావోవిమోచనం ।
ఆవాభ్యాంప్రార్థితోభూయో విశాపంచదదాపితా ॥ ౪౮

తా॥ అనంతరము పశ్చాత్తాపముగలవారమై శాపవిముక్తికొఱకు ప్రార్థింపగా మాతండ్రి తిఱిగి శాపము నిట్లు త్రిప్పివేసెను.

శ్లో॥ యువాంప్రాప్యచమర్త్యేనిం కియత్కాలాంతరేపిచ ।
సంగమోభవితాతత్ర పరస్పరవధైషిణౌ ॥ ౪౯

తా॥ ఓపుత్రులారా! నాశాపప్రకారముగా మృగములగు గజ సింహ జన్మములనెత్తి కొంతకాల మఱిగినపిమ్మట ఆవనములో నొకప్పుడు కలసి మీరు యొకరితో నొకరు యుద్ధముచేసి యుద్ధము నేకకాలంబున మృతినొందుదురు.

శ్లో॥ తస్మిన్నేవంహిసమయే సంవాదంవ్యాధశంఖయోః ।
వైశాఖధర్మవిషయో దైవాద్వాంశ్రవణస్యచ ॥
గమిష్యతిక్షణాదేవ తస్మాద్ముక్తిర్భవిష్యతి ॥

తా॥ మీరు యుద్ధము జేయు సమయములో శంఖుఁడనునట్టి మునీశ్వరుఁడు యొక కిరాతునకు వైశాఖమాస ధర్మములను జెప్పుచుండును. దైవయోగముచే ఆధర్మములను మీరు వినుటచే అప్పుడే మీకు ముక్తికలుగును.

శ్లో॥ శాపాన్ముక్తౌ పూర్వమేవ రూపమాస్థాయపుత్రకౌ ।
మామేవ ప్రాప్స్యవస్తతం నాన్యథా మేవచోభవేత్ ॥

తా॥ ఓ పుత్రులారా! అప్పుడు శాపవిమోచనముగలిగి మీ పూర్వస్వరూపమును పొంది నావద్దకు రాగలరు. కావున నేఁ జెప్పినప్రకారము జరుగును గాని నా వాక్యము వ్యర్థముగాదు.

శ్లో॥ ఇతిశప్తౌచ గురుణా మృగవ్యాఘ్రత్వమాగతౌ। ప్రాప్యదైవాత్సంగతించ పరస్పరవధైషిణౌ. సంవాదంయుపయోర్దివ్యం శుభంతంశుశ్రువానహే ॥ తేనసద్యోవిముక్తిశ్చ క్షణాదేవానయోరభూత్ ॥ ౬౩

తా॥ ఈప్రకారము మాతండ్రిచే శపింపఁబడి హీనజన్మములగు మృగజన్మముల నెత్తి దైవయోగమున కలసికొని యొకరినొకరు చంప నుద్యుక్తులమై యుద్ధము జేయుచుండ శ్రేష్ఠంబగు మీ ఇద్దఱు చెప్పుకొనుచుండెడి యీ వైశాఖమహాత్మ్యమును వింటిమి కావున ఆక్షణకాలములోనే యీ గజసింహ జన్మములకు విముక్తి కలిగెను.

శ్లో॥ ఇతిసర్వంసమాఖ్యాయ ప్రణమ్యచమునీశ్వరమ్ ॥
సమామంత్ర్యతతోఽనుజ్ఞాతౌ జగ్మతుఃపితురంతికమ్ ॥

తా॥ ఈప్రకారము తమ వృత్తాంతమునంతయు మాతంగకుమారులు కర్షణమునితోఁ జెప్పి నమస్కరించి ఆయనవలన ననుజ్ఞఁగొని వారితండ్రిగారి సమీపమునకు వెళ్ళిరి.

శ్లో॥ తదేవసంప్రపశ్యాహం మునిర్వ్యాధందయానిధిః ।
పశ్య వైశాఖమాహాత్మ్య శ్రవణస్యఫలంమహత్ ।
ముహూర్తంశ్రవణాదేవ తయోర్ముక్తిః కరేస్థితా । ౭౮

తా॥ దయాస్వరూపము గల యా మునీశ్వరుఁడు కిరాతునితో నిట్లు చెప్పుచున్నాఁడు ఓ కిరాతుఁడా! ఇదిగో వైశాఖమహాత్మ్యఫలమును జూచితివా? వైశాఖమాస ధర్మములను నొకక్షణకాలము వినుటతోడనే ఆమునికుమారుల కిద్దఱికిని మోక్షము శీఘ్రముగా లభించెను.

శ్లో॥ ఇతిబ్రువాణం మునిపుంగవంతం దయానిధిం నిస్పృహమగ్ర్యబుద్ధిం । విశుద్ధమత్యం సుకృతైకపాత్రం సస్యత్తశస్త్రః పునరాహ వ్యాధః ॥

తా॥ ఈప్రకార మా మునీశ్వరుఁడు చెప్పఁగా నా కిరాతుఁడు విని చేతిలో నున్న బాణములను విసర్జించి మంచి స్వభావముగలవాఁడై దయకు సముద్రమువంటివాఁడును, కోటికరహితుఁడును, శ్రేష్ఠమగు బుద్ధిగలవాఁడును. చిత్తశుద్ధిగలవాఁడును

పుణ్యాత్ములకు స్థానభూతమయినవాఁడును నను ఆ మునిశ్రేష్ఠునితో తిరిగి చెప్పఁబోవుచున్నాఁడు.

నారదాంబరీష సంవాదే దంతిల కోహల ముక్తిప్రాప్తిర్నామ సప్తదశోధ్యాయ సమాప్తః.

## అథాష్టాదశోధ్యాయః.

వ్యాధః॥ శ్లో॥ భవతానుగృహీతోస్మి మునే పాపోతిదుష్టధీః ।
దయాళవో మహాంతోహి స్వభావాదేవసాధవః ॥

తా॥ కిరాతుఁడు చెప్పుచున్నాఁడు. ఓ మునీశ్వరా! పాపాత్ముఁడను మిక్కిలి దుష్టస్వభావముగలవాఁడనను నేను మీచే ననుగ్రహింపఁబడితిని. అది యుక్తమేను. మహానుభావు లగు సత్పురుషులు స్వతస్సిద్ధముగానే సమస్త ప్రాణులయందు దయ గలవార లయ్యెదరు.

శ్లో॥ క్వనావ్యాధల్పాకులీనోహం క్వచ వామతిరీదృశీ ।
కేవలంభవత మేవ మన్యేనుగ్రహముత్తమమ్ ॥ ౨

తా॥ ఓస్వామీ! దుర్వృత్తులతో వ్యాధకులంబునను కిరాతుండనైన నేనెక్కడ. మోక్షమొసఁగునట్టి వైశాఖమాసధర్మములయం దాసక్తిగల బుద్ధియెక్కడ. ఇట్టి బుద్ధిగలుగుట శ్రేష్ఠంబగు తమ యనుగ్రహముగానే దలఁచుచున్నాను.

శ్లో॥ అథసాధోశ్చశిష్యోస్మి కృపాపాత్రోస్మిమానద ।
అనుగ్రాహ్యోస్మిత్రోస్మి కృపాంకురుదయానిధే ॥ 3

తా॥ మానదమండ నను నా సత్పురుషుఁడా! నీకు శిష్యుఁడను. నీ దయకు పాత్రుఁడను. నీ కుమారునితో సమానమైనవాఁడను. నీచేననుగ్రహింపఁదగినవాఁడను కావుట్టి యో దయానుగ్రుఁడా! నాయందు దయనుంచుము.

శ్లో॥ యథామేనపునర్భూయా దసన్మతిరనర్థదా ।
సద్భిస్తుసంగితిః క్వాపి నభూయోదుఃఖమశ్నుతే ॥ ౪

తా॥ అనర్థములను గలుగజేయునట్టి అజ్ఞానబుద్ధి నాకు తిరిగి యెన్నటికిగలుగకుండునటు లనుగ్రహింపుము. సత్పురుషుల సహవాసముగలవాఁ డెన్నటికిని తిరిగి దుఃఖమును బొందఁడు.

శ్లో॥ తస్మాద్బోధయమాంవిప్ర సూక్తైస్తైర్వృజినాపహైః ।
యేనచాద్ధాతరిష్యంతి సంసారాబ్ధింముముక్షవః ॥ ౫

తా॥ మోక్షేచ్ఛగలవారు యెట్టి వాక్యములచే బోధింపఁబడినవారై సంసాం

సముద్రమును దాటఁగలరో, ఓ బ్రాహ్మణుఁడా ! పాపములను బోఁగొట్టునట్టి యా వాక్యములను జెప్పి నన్ను బోధింపుము.

శ్లో॥ సాధూనాంసమచిత్తానాం తథాభూతదయావతాం ॥
సహీనస్తూత్తమఃక్వాపి నాత్మీయోపిపరస్తథా ॥ ౭

తా॥ సమస్తమైనవారియందు సమమగు స్వభావముగలవారును, సమస్తప్రాణులయందు దయగల సత్పురుషులకు ఒకఁడు అధికుఁడనియును, తనవాఁడనియును భేదబుద్ధి యెన్నటికి నుండదు.

శ్లో॥ ఏకాగ్రేణవిచిన్వంతి చిత్తశుద్ధించపృచ్ఛతి । సర్వదోషయుతోవాపి సర్వ ధర్మోజ్ఝితోపివా ॥ కృతానుతాపశ్చయదా యదా పృచ్ఛతివైగురుం । తదైవాదిశంత్యత్రజ్ఞానంసంసారమోచకమ్ ॥ ౮

తా॥ సత్పురుషులు శిష్యునిగుణము లెట్టులుండునా యని రహస్యముగా పరిశీలన జేయుచుందురు. చిత్తశుద్ధిని తెలిసికొనుచుందురు. మఱియు సమస్తదోషములు గలవాఁడయినను, సమస్తధర్మములను విడిచిపెట్టినవాఁడయినను తన దుష్టప్రవర్తనకు పశ్చాత్తాపము జెంది యెప్పుడు గురువు నాశ్రయించి యడుగునో జ్ఞానులగువారు అప్పుడే సంసారబంధమును వదలించునట్టి జ్ఞానము నుపదేశించుచున్నారు.

శ్లో॥ యథాగంగామనుష్యాణాం పాపనాశస్వభావినీ ।
తథామంనసముద్ధార స్వభావాస్సాధవస్స్మృతాః ॥ ౯

తా॥ గంగానది సమస్తమనుష్యుల పాపమును నశింపఁజేయు స్వభావముగలది యగుచుండును. కావునసే సత్పురుషులు మూఢుల జన్మమును తరింపఁజేయు స్వభావముగలవారుగా జెప్పఁబడిరి.

శ్లో॥ మావిచారయమాంబోద్ధుం దయాళోభక్తవత్సల ।
శుశ్రూషత్వాన్నతత్వాచ్చ శుద్ధత్వాత్తవసంగతేః ॥ ౧౦

తా॥ దయాస్వభావము గలవాఁడవును, భక్తులయందు ప్రేమగలవాఁడవునగు నోస్వామీ ! తమ స్నేహముచే పరిశుద్ధమైనవాఁడను మీకు శుశ్రూష జేయుచున్నవాఁడను. మీకు నమస్కరించినవాఁడ. నగుటచే ధర్మములను వినుటకు పాత్రుఁడనైతిని. కాఁబట్టి నాకు నుపదేశము జేయుటయందు మీరు విచారించ నవసరము లేదు.

శ్లో॥ ఇతివ్యాధవచశ్శ్రుత్వా పునర్విస్మితమానసః ।
సాధుసాధ్వితిసంభాష్య ధర్మానేతానువాచహ ॥ ౧౧

తా॥ ఇట్లు కిరాతుఁడు చిత్తశుద్ధిగలవాఁడై పలికిన మాటలను అకర్షణుఁడను మునీశ్వరుఁడు విని మిక్కిలి యాశ్చర్యము జెంది బాగుగా పలికితివని కొనియాడి తిరిగి ధర్మములను జెప్పుటకు ప్రారంభించెను.

శంఖః॥ శ్లో॥ విష్ణుప్రీతికరాన్దివ్యాన్ సంసారాబ్ధివిమోచకాన్ ।
కురుధర్మాంశ్చవైశాఖే యదివ్యాధశమిచ్ఛసి ॥ ౧౨

తా॥ కర్షణుఁడను రెండవ పేరుగల శంఖుఁడు చెప్పుచున్నాడు. ఓ కిరాతుఁడా! నీవు సుఖములను బొందవలయునని యిచ్ఛగలవాఁడవైతివేని విష్ణుమూర్తికి ప్రియమైనవియు, సంసారసముద్రమును తరింపజేయునవియు శ్రేష్ఠమయిన వైశాఖమాసధర్మములను జేయుము.

శ్లో॥ అతపోబాధతేఘోరో నాచ్ఛాయానాంబుచాత్రచ ।
తస్మాత్స్థలాంతరంయామో యత్రచ్ఛాతుయావర్తతే ॥ ౧౩

తా॥ ఇక్కడ తీక్ష్ణమయిన యెండ బాధించుచున్నది. ఇక్కడ చెట్లనీడగాని, జలముగాని లేదు. కావున చెట్లనీడయుండిన మఱియొక ప్రదేశమునకు వెళ్ళుదము.

శ్లో॥ తత్రగత్వాజలంపీత్వా సుచ్ఛాయాంచసమాశ్రిత ః ।
తత్రతేవర్ణ యిష్యామి మాహాత్మ్యంపాపనాశనమ్ ॥
విష్ణోర్మాధవమాసస్య యథాదృష్టం యథాశ్రుతం ।
ఇత్యుక్తోమునినాతేన వ్యాధఃప్రాహకృతాంజలిః ॥ ౧౪

తా॥ అక్కడికి వెళ్ళి జలపానముజేసి దట్టమయిన నీడయందు విశ్రమించి నేను వినినట్టిగను, చూచినట్టియు, సమస్త పాపములను బోఁగొట్టునట్టియు విష్ణుకథలను వైశాఖమాసధర్మముల నక్కడ జెప్పెదను. అని యీప్రకారము మునీశ్వరుఁడు పలుకఁగా కిరాతుఁడు అంజలివేసి యిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ ఇతోవిదూరేసలిలం వర్తతేచ. నరోవరే ।
కపిత్థాస్తత్రవైసంతి ఫలభారేణపీడితాః ॥
గచ్ఛావస్తత్రసంతుష్టి ర్భవితానాత్రసంశయః।
వ్యాధేనైవంసమాదిష్ట స్తేనసాకం యయౌముని॥ ౧౫

తా॥ ఇక్కడకు సమీపములో నొక సరస్సుగలదు. దానిలో శుభ్రమయిన జలముగలదు. ఆ సరస్సుయొద్దున పండ్లతో నిండియుండిన వెలగచెట్లుగలవు. అక్క

డకు మనము వెళ్ళినయెడల సుఖముగానుండును. సందేహములేదు. అని కిరాతుఁడు చెప్పగా నా మునీశ్వరుఁడు వానితోఁగలసి యా సరస్సువద్దకు వెళ్ళెను.

శ్లో॥ కియద్దూరంతతోగత్వా దదర్శాగ్రేసరోవరం ।
బకకారండవాకీర్ణం చక్రవాకోపశోభితమ్ ॥
హంససారసక్రౌంచాద్యైః స్సమంతాత్పరిశోభితమ్ ॥

తా॥ వారు అక్కడనుండి బయలుదేరి కొంతదూరము వెళ్ళఁగా ముందు నొక సరస్సును జూచిరి. ఆ సరస్సు యేతీరుగా నుండెననఁగా- కొంగలు, కన్నె లేడులు, జక్కవలు, హంసలు, బెగ్గురుపక్షులు, బక్కకొంగలు మొదలగు పక్షులచే నంతటను వ్యాపింపఁబడి ప్రకాశింపఁబడుచున్నదియు నగు సరస్సును జూచిరి. అని ముందున్న క్రియాపదముతో గూర్చుకొనవలయును. (ఇట్లే ప్రతిశ్లోకంబున జెప్పికొనవలెను)

శ్లో॥ కీచవంచకవాద్యైశ్చ కూజితంభ్రమరైరపి ॥
సక్రీకచ్ఛసమీనాద్యై రగాధ్యాంసుమనోహరం ।
కుముదోత్పలకల్హార పుండరీకాదిభిర్మహత్ ॥ ౨౦

తా॥ వెదుళ్ళు, బొంగువెదుళ్ళు, తుమ్మెదలు మొదలగువానిచే ధ్వనిజేయఁబడుచున్నదియు, మొసళ్ళు, తాబేళ్లు, చేపలు మొదలగు జలజంతువులతోఁగూడినదియు, లోతుగానుండినదియు, మనోహరముగా నుండినదియు, తెల్లగలువ, నల్లగలువ, యెఱ్ఱగలువ, తెల్లపద్మము మొదలగు పుష్పములచే వ్యాపింపఁబడినదియు, గొప్పదియు నగు నా సరస్సును జూచిరి.

శ్లో॥ శతపత్రైఃకోకనదై స్సమంతాత్పరిశోభితం ।
పక్షిణాంచకలారావై ర్ముఖరన్నయనోత్సవమ్ ॥ ౨౧

తా॥ నూఱురేకులుగల పద్మములచేతను, యెఱ్ఱగలువలచేతను కండ్లకు జూచుటకు నిండుగానుండునట్లుగా నంతట వ్యాపించి వికాసమును జెందియున్నదియు పక్షుల అవ్యక్తమధురధ్వనులచే ధ్వనిజేయఁబడుచున్నదియు నగు నా సరస్సును జూచిరి.

శ్లో॥ తటేకీచకగుల్మైశ్చ తథావృక్షైశ్చశోభితం ।
వటైఃకరంజై ర్నీపైశ్చ చించిణీభి స్తథైవచ ॥ ౨౨

తా॥ తీరమందుండు వెదుళ్ళపొదలచేతను, మఱియు నితర వృక్షములచేతను, మఱ్ఱివృక్షములచేతను, గానుగవృక్షములచేతను, కడిమివృక్షములచేతను, చింతచెట్లచేతను గూడియుండి ప్రకాశించునదియు,

శ్లో॥ నింబప్లక్షప్రియాళైశ్చ చంపకైరర్కశైస్తథైః ।
పున్నాగైస్తుంబరైశ్చైవ కపిత్థామలకైరపి ॥ ౨౩

తా॥ వేప, జువ్వి, మొరదు, చంపకము, కొండ, పున్నాగము, తుంబరము వెలగ, ఉసిరిక మొదలగు కోటప్రకారములగు వృక్షములతో వ్యాపించియున్నదియు,

శ్లో॥ నిమ్నైపక్వైశ్చజంబూభి స్సమంతాత్సరిశోభితం ।
వన్యమాతంగనాగాంగ వరాహామహిషాదిభిః ॥ ౨౪

తా॥ పండినపండ్లుగల నేరేడుచెట్లచేత వంతటను వ్యాపింపబడి ప్రకాశించుచున్నదియు, అడవియేనుగులు లేళ్ళు, అడవిపందులు, అడవిదున్నలు మొదలగు జంతువులచే వ్యాపింపబడినదియు.

శ్లో॥ శశైశ్చసల్లకైశ్చైవ గవయైరుపశోభితం।
ఖడ్గనాభిమృగాద్యైశ్చ వ్యాఘ్రైస్సింహైర్వృకైరపి ॥ ౨౫

తా॥ కుందేళ్లు, గోపద్యశమృగములు, కస్తూరీమృగములు, పెద్దపులులు, తోడేళ్ళు మొదలగు మృగములచేత గూడియున్నదియు,

శ్లో॥ ఖరాంతకైశ్చశరభై శ్చమరీభిస్సుమండితం ।
శాఖాచ్ఛాఖాంతరంశీఘ్రం ప్లవమానైః ప్లవంగమైః ॥ ౨౬

తా॥ గాడిదెలను సంహరించునట్టి మృగములును, శరభమృగములు, చమరీమృగములు, ఒకకొమ్మనుండి మఱియొకకొమ్మమీదికి దుముకుచుండెడి కోతులు మొదలగు మృగములచేతను అలంకరింపబడినదియు.

శ్లో॥ మార్జారైశ్చైవ భల్లూకై ర్భీషణం రురుభిస్తథా ।
ఝిల్లీశబ్దైశ్చ క్రేంకారైః కీచకానాంరవైస్తథా ॥ ౨౭

తా॥ పిల్లులు, యెలుగుబంట్లు, తెల్లచారలుగల దుప్పులు మొదలగువానిచే భయంకరముగా నుండినదియు, ఈలపురుగుల ధ్వనులచేతను, వెదుళ్ళధ్వనులచేతను వ్యాపించినదియు,

శ్లో॥ ఘోరవాయువినిర్ఘాత దారుభారైస్సమన్వితం ।
పతాదృశంపరోదివ్యం వ్యాధేనైవప్రదర్శితమ్ ॥
దదర్శమునిశార్దూల స్తృషయాబాధితోభృశమ్ ॥

తా॥ గొప్పగాలి విసరుటచే నచ్చటచ్చట విఱిగిపడియున్న వృక్షములచే వ్యాపించియున్నదియు నగు శ్రేష్ఠమైన సరస్సును కిరాతుఁడు జూపగా ఆ మునీ రుఁడు జూచెను. మఱియు ఆకలిచే మిక్కిలి బాధింపఁబడుచుండెను.

శ్లో॥ స్నాత్వామధ్యాహ్న వేళాయాం సరస్యస్మిన్మనోరమే ॥
వాససీపరిధాయాథ కృత్వామాధ్యాహ్నికాః క్రియాః ॥ దేవపూజాం
తతః కృత్వా భుక్త్వా ఫల మనుత్తమం ॥ వ్యాధోపనీతంసుస్వాదు
కపిత్థ శ్రమహారిచ । సుఖోపవిష్ట ప్రపచ్ఛ వ్యాధం ధర్మరతంపునః॥ 3౧

తా॥ మనోహరమైన యాసరస్సులో మధ్యాహ్న కాలమందు స్నానముజేసి శుచియగు వస్త్రములనుధరించి మాధ్యాహ్నిక సంధ్యావందనాదుల నెఱవేర్చి యనంతరము దేవతార్చన జేసికొని రుచిగలవియు, ఆయాసమును బోఁగొట్టునవియు, కిరాతుఁడు తీసికొనివచ్చిన వెలగపండ్లను భుజించి స్వస్థతజెందిన మనస్సుగలవాఁడైసుఖముగాగూర్చుండి ధర్మములయందాసక్తిగలయాకిరాతునితిఱిగి యిట్లడుగుచున్నాడు,

శ్లో॥ కింకర్తవ్యంమయాహృద్యం తదాదౌధర్మతత్పరః ।
ధర్మాశ్చ బహవస్సంతి నానామార్గాః పృథగ్విధాః ॥ 3౨

తా॥ ధర్మమునందాసక్తిగల యో కిరాతుఁడా ! ఇప్పుడు ముందుగా నీకు శ్రోత్రానందకరమగు యేధర్మమును జెప్పవలయును. అనేక రీతులచే ననేక భేదములు జెందినవై ధర్మము అనేకము లుండియున్నవి.

శ్లో॥ తత్రవైశాఖమాసోక్తా సూనత్మ్యాఅపిమహార్థదాః ।
సర్వేషామేవజంతూనా మిహాముత్రఫలప్రదాః ॥ 33

తా॥ ఆధర్మములలో వైశాఖమాసమును గుఱించి చెప్పఁబడిన ధర్మములు సూక్ష్మములైనను విశేషఫలము నిచ్చునట్టివియై సమస్త ప్రాణులకు నిహలోక పరలోక సౌఖ్యముల నొసఁగుచున్నవి.

శ్లో॥ యత్త్వష్టవ్యంమనసితే యచ్చాదౌతచ్చపృచ్ఛతాం ।
ఇత్యుక్తోమునినాతేన వ్యాధఃప్రాంజలిరబ్రవీత్ ॥ 3౪

తా॥ నీమనస్సులో దేనిని తెలిసికొనవలయునని కోరికగలదో దానినే ముందుగా నడుగుము. అని మునీశ్వరుఁడు పలుకఁగా కిరాతుఁడు దోసిలిపట్టి యిట్లు పలుకుచున్నాఁడు.

వ్యాధః॥ శ్లో॥ కేనవాకర్మణాచాసీ ద్వ్యాధజన్మతమోమయం ।
కేనవాచేదృశీబుద్ధి స్సంగతిర్వామహాత్మనః ॥
ఏతచ్చాశ్చర్యంమమాచక్ష్వ యదిమాంమన్యసేప్రభో ।
ఇత్యుక్తఃపునరప్యాహ శంఖోనామమహామునిః ॥ 3౬
మేఘగంభీరయావాచా స్మయమానముఖాంబుజ ॥

తా॥ కిరాతుఁడు చెప్పుచున్నాఁడు. ఓ స్వామీ ! కేవల మజ్ఞానముతో నిండియున్న యీకిరాతజన్మ మే కర్మములను జేయుటవలన సంభవించినది? ఏసుకృతమున మంచిబుద్ధియు, మీబోటి మహానుభావుల సహవాసము సంభవించెను? నేను ధర్మములను వినుటకు తగినవాఁడనని మీకు తోఁచినయెడల దీనినంతయు సవిస్తరముగా జెప్పుమని యడుగఁగా శంఖుఁడనెడు యాముని శ్రేష్ఠుఁడు చిఱునవ్వుగల ముఖముగలవాఁడై మేఘధ్వనులతో సమానమగు గంభీరవాక్యములచే నిట్లు తిరిగి పలుకుచున్నాఁడు.

శంఖః॥ శ్లో॥ శాకలేనగరేపూర్వం ద్విజస్త్వంవేదపారగః ।
స్తంభోనామమహాతేజా స్తథాశ్రీవత్సగోత్రజః ॥

తా॥ శంఖుఁడు చెప్పుచున్నాఁడు. ఓ కిరాతుఁడా! నీవు పూర్వజన్మంబున వేదశాస్త్రములను జదివినట్టియు, విశేష తేజస్సుగలిగినట్టియు, శ్రీవత్సగోత్రము నందుఁ బుట్టినట్టియు స్తంభుఁడను పేరుగల బ్రాహ్మణుఁడవు.

శ్లో॥ తవేష్టాగణికాకాచి దాసీ త్తత్సంగదోషతః ॥ 3౭
త్యక్త్వానిత్యక్రియాంనిత్యం శూద్రవద్గృహమాగతః॥

తా॥ అప్పుడు నీకు యొకభోగముచున్నది యిష్టమైయుండెను. దాని సాంగత్యమువలన నీవు నిత్యము జేయవలసిన బ్రాహ్మణకృత్యములను మానివేసి శూద్రుఁడవువలెనే గృహమునందు వ్యవహరించుచుంటివి.

శ్లో॥ శూన్యాచారస్యదుష్టస్య పరిత్యక్తక్రియస్యచ ॥
బ్రాహ్మణీచ తదాచాసీ ద్భార్యాకాంతిమతీతవ ॥

తా॥ ఇట్లు ఆచారశూన్యుఁడవును, దుర్మార్గుఁడవును, బ్రాహ్మణకృత్యములను విడిచిపెట్టియున్న నీకు కాంతిమతియనెడు యొకబ్రాహ్మణస్త్రీ భార్యగానుండెను.

శ్లో॥ సాత్వాంపర్యచరత్సుభ్రూ స్సవేశ్యంబ్రాహ్మణాధమం॥
ఉభయోఃపోషయంతీచ పాదాస్త్వత్ప్రియకారిణీ ॥ ౪౦

తా॥ ఆచిన్నది యిట్లు బ్రాహ్మణహీనుఁడవుగా నుండిన నీకును నీవుంచుకొనిన వేశ్యకును శుశ్రూషఁజేయుచు నీయందుండిన ప్రేమవలన మీ యుభయుల పాదములను ప్రక్షాళన జేయుచుండెను.

శ్లో॥ ఉభయోరన్నశేషాణి ఉభయోర్వచనేరతా।
వేశ్యయావాక్యమానాపి పాతివ్రత్యవ్రతస్థితా॥

తా॥ నీవును భోగముస్త్రీయు నిద్దఱు పరుండెడి శయ్యలకంటె క్రిందుగా పండుకొనుచు వారిమాటలను వినుచు పతివ్రతయైనందున భోగముస్త్రీ వద్దని చెప్పినప్పటికిని నీభార్య మీయిద్దఱకు శుశ్రూష చేయుచుండెను.

శ్లో॥ ఏవంశుశ్రూషయంత్యాహి భర్తారం వేశ్యయాసహ॥
జగామసుమహాన్కాలో దుఃఖితాయామహీతలే॥

తా॥ ఈప్రకారము వేశ్యతో గూడియున్న పెనిమిటికి శుశ్రూషఁజేయుచు దుఃఖించుచు నిట్లు చాలకాలము వెళ్ళఁబుచ్చెను.

శ్లో॥ అపరస్మిన్దినేభర్తా మాహిష్యంమూలకాన్వితం।
అభక్షయచ్ఛూద్రధర్మా న్నిష్పావాం స్తిలమిశ్రితాన్।
తదపథ్యమశిత్వాతు వమంశ్చైవవిరేచయత్॥ ౪౪

తా॥ మఱియొకదినమునందు పెనిమిటివగు నీవు శూద్రధర్మము నవలంబించి గేదెపెరుగు, ముల్లంగిగుంపలు, నువ్వులు కలిసిన అనుములు మొదలగువానిని భక్షించితివి. అపథ్యపదార్థములను భక్షించుటచే జీర్ణింపక డోకులు విరేచనములాయెను.

శ్లో॥ అపథ్యాద్దారుణోరోగో వ్యజాయతభగందరః।
సదహ్యమానోరోగేణ దివారాత్రింతుభూరిశః॥ ౪౫

తా॥ అపథ్యదోషమువలన మూత్రస్థానమందు మిక్కిలి బాధకరమైన భగందరమనెడు రోగము సంభవింపఁగా నారోగముచే రాత్రింబవళ్ళు బాధపడుచుండెను.

శ్లో॥ యావదాస్తే గృహేవిత్తం తావద్వేశ్యాచ సంస్థితా।
గృహీత్వాతస్య సావిత్తం పశ్చాన్నోషవా న మందిరే॥ ౪౬

తా॥ ఆ బ్రాహ్మణుని గృహమునందు యెంతవఱకు ధనముండెనో అంతవఱకు భోగముచిన్నది యుండి ఆయనవద్దనుండు ధనము వంతయు సంగ్రహించి దరిద్రుఁడైన పిమ్మట నాబ్రాహ్మణునివద్దనుండక వెళ్ళిపోయెను.

శ్లో॥ అన్యస్య పార్శ్వమాసాద్య గతాఘోరాసునిష్ఠురా ।
తత స్సుదీనవచనో వ్యాధిబాధాసుపీడితః ॥
ఉక్తవాన్సకరుణాన్ భార్యాం రుజావ్యాకులమానసః ।

తా॥ ఆభోగము స్త్రీ యీ బ్రాహ్మణునివద్ద ధనము నశింపఁగానే యెంతమాత్రము దయలేనిదై మఱియొక పురుషు నాశ్రయించియుండెను. అనంతరము బ్రాహ్మణుఁడు రోగబాధచే పీడింపబడుచు స్వస్థతలేని మనస్సుగలవాఁడగుచు యేడ్చుచు మిక్కిలి దీనవాక్యములను భార్యతో నిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ పరిపాలయమాం దేవి వేశ్యాసక్తం సునిష్ఠురం ।
నమయోపకృతంకించి త్త్వయిసుందరి పాపినా ॥

తా॥ ఓ ప్రాణేశ్వరీ! వేశ్యాస్త్రీలయందు ఆసక్తిగలవాఁడను, దుర్మార్గుఁడను నన్ను రక్షింపుము. ఓ సౌందర్యవతీ! నీవు నాకు అనేకవిధములుగా శుశ్రూషఁ జేసినను విశ్వాసముంచక పాపాత్ముఁడనై యుపకారమేమియు జేయనైతిని.

శ్లో॥ కోభార్యాం ప్రణతాంపాపో నానుమన్యేతగర్హితః ।
సషండోభవితాభద్రే దశజన్మసుపంచసు ॥

తా॥ ఓ ప్రాణేశ్వరీ ! పాపాత్ముఁడగు నెవ్వఁడు భార్య భక్తిశ్రద్ధలతో శుశ్రూషఁ జేయుచున్నను దూషించుచు నవమానముఁజేయునో అట్టివాఁడు పదిహేను జన్మములపర్యంతము నపుంసకుఁడై పుట్టుచుండును.

శ్లో॥ దివారాత్రిం మహాభాగే నిందితస్సాధుభిర్జనైః ॥ ౨౦
పాపయోనిమవాప్నోమి త్వాంసాధ్వీమవమన్యవై ॥

తా॥ ఓ పూజ్యురాలా ! సత్పురుషులచే నెల్లప్పుడు నేను దూషింపబడితిని. పాపాత్ముఁడ నగుటవలనను, పతివ్రతవగు నన్ను పరాభవము జేయుటవలనను నేను హీనజన్మము నెత్తవలసివచ్చెను.

శ్లో॥ అహంక్రోధేనదగ్ధోస్మి తవానుశయజేనవై ।
ఏవంబ్రువాణంభర్తారం కృతాంజలిపుటాబ్రవీత్ ॥

తా॥ ఓ చిన్నదానా! నీవు నాకు ననేకభంగుల పరిచర్యజేసినను సంతోషింపక నిన్ను తిరస్కారము జేసినందువలన నీకు గలిగిన కోపాగ్నిచే నే దహింపఁబడితిని. అని దీనోక్తులుపలుకుచున్న పెనిమిటిని జూచి యాచిన్నది కృతాంజలియై యిట్లు పలికెను.

శ్లో॥ నదైన్యంభవతాకార్యం నవ్రీడా కాంతమాం ప్రతి ॥
నచాపిత్వయమేక్రోధో యేనదగ్ధేతి వక్ష్యతి ॥

తా॥ ఓ ప్రాణనాథా! నీవు దీనవచనములను పల్కగూడదు. నన్నుగురించి సిగ్గుపడగూడదు. నా క్రోధముచే దహింపబడుచున్నానని మీరు పల్కితిరి. అట్టి కోపమేమియు నాకు మీయందు లేదు.

శ్లో॥ పురాకృతానిపాపాని దుఃఖానీహ భవంతిహి ॥ ౫౩
తానియాక్షమతేనారీ పురుషోవాసఉత్తమః ॥

తా॥ పూర్వమందు జేసికొనఁబడిన పాపములే దుఃఖములను గలిగించుచున్నవి. కాన అట్టి దుఃఖములను యే పతివ్రతాశిరోమణిగాని, ఏ పురుషుఁడుగాని సహించుచున్నారో వారే యుత్తములు.

శ్లో॥ యన్మయా పాపయాపాపం కృతంవై పూర్వజన్మని ॥
తద్భుజంత్యానమేదుఃఖం నవిషాదఃకథంచన ।
ఇత్యేవముక్త్వాభర్తారం సాసుభ్రూ స్తంచ పాలయేత్ ॥ ౫౫

తా॥ ఓ స్వామీ ! పాపాత్మురాలనగు నేను పూర్వజన్మంబున జేసికొనఁబడిన పాపముయొక్క ఫలము ననుభవించుటవలన నేవిధముగానయినను దుఃఖముగాని, విచారముగాని లేదు. ఈ ప్రకార మా చిన్నది పెనిమిటితో బలికి ఆ పెనిమిటిని సంరక్షించుచుండెను.

శ్లో॥ ఆనీయ జనకా ద్విత్తం బంధుభ్యో వరవర్ణినీ ।
క్షీరోదవాసినందేవం భర్తారంచైవచింతయత్ ॥ ౫౬

తా॥ ఆ చిన్నది తన తండ్రివద్దనుండియు, బంధువులవద్దనుండియు ధనమును దెచ్చి పెనిమిటిని పోషింపుచు తన పెనిమిటిని పాలసముద్రమునందు శయనించియుండు నారాయణమూర్తినిగా జూచుచుండెను.

శ్లో॥ శోధయంతీదివారాత్రౌ పురీషంమూత్రమేవచ ।
నఖేనకర్షతీభర్తుః కృమీన్ కష్టాచ్ఛనైశ్శనైః ॥ ౫౭

తా॥ రాత్రింబవళ్లును పెనిమిటియొక్క మూత్ర పురీషములను దీసివేసిబాగు పఱచుచు పుండ్లయందు కలుగుచుండెడి పురుగులను గోళ్ళతో మెల్లమెల్లగా నతి కష్టముతో తీసివేసి సంరక్షణ జేయుచుండెను.

శ్లో॥ నసాస్వపితి రాత్రౌతు నదివా వరవర్ణినె ।
భర్తుర్దుఃఖేనసంతప్తా దుఃఖితేద మవోచత । ౫౮

తా॥ ఆచిన్నది రాత్రిగాని, పగలుగాని నిద్రించుటలేదు. పెనిమిటికి సంభవించిన దుఃఖముచే తాను దుఃఖపడుచు నిట్లు పలుకుచున్నది.

శ్లో॥ దేవాశ్చ సాంతుభర్తారం పితరోయేచవిశ్రుతా । ౫౯
కుర్వంతు రోగహీనంమే భర్తారంగతకల్మషమ్ ॥

తా॥ దేవతలను, ప్రసిద్ధిజెందియున్న పితృదేవతలు నా పెనిమిటిని రక్షింతురుగాక. నా పెనిమిటిని రోగములేనివానిగను, పాపరహితునిగాను జేయుదురుగాక.

శ్లో॥ చండికాయైప్రదాస్యామి రక్తమాంససముద్భవం । ౬౦
సుష్టన్నం మాహిషోపేతం భర్తురారోగ్యహేతవే ॥

తా॥ నా పెనిమిటి దేహమునందారోగ్యగా నుండుకొరకు రక్తము మాంసము నెయ్యి పెరుగు మొదలగు పదార్థములతో గూడిన యన్నమును దుర్గాదేవికి సమర్పించెదను.

శ్లో॥ మోదకాన్కారయిష్యామి విఘ్నేశాయమహాత్మనే ।
మందవారేకరిష్యామి చోపవాసాన్దశైవతు ॥ ౬౧

తా॥ మహానుభావుండైన విఘ్నేశ్వరునకు కుడుములను నివేదనము జేసెదను. పది శనివారములయందు నుపవాసము చేసెదను.

శ్లో॥ నోపభుంజామిమధురం నోపభుంజామివై ఘృతం ।
తైలాభ్యంగవిహీనాహం స్థాస్యేనైవాత్ర సంశయః ॥ ౬౨

తా॥ ఆ యుపవాసమునందు మధురపదార్థముగాని, నెయ్యి మొదలగు నే పదార్థముల ననుభవింపక శుష్కోపవాసము జేసెదను. మఱియు అభ్యంగనము తైలాలంకారములను జేయకుండును ఇందువిషయమై యేమియు సందేహములేదు. అని దీక్షవహించికొనెను.

శ్లో॥ జీవతాంరోగహీనోయం భర్తామేశరదాంశతం ।
ఏవంసావ్యాహరద్దేవీ వాసరేవాసరేగతే ॥
తదాచాగాన్మునిఃకశ్చిన్మహాత్మాదేవలాహ్వయః ।
వైశాఖేమాసిధర్మాత్మాసాయాహ్నేతస్యవైగృహామ్॥ ౬౩

తా॥ నా పెనిమిటి రోగములేనివాడై నూఱుసంవత్సరముల పర్యంతము జీవింపవలయును. అని యా చిన్నది దీక్షవహించి దేవతాప్రార్థన జేయుచుండగా కొంత కాలము గడచినపిమ్మట నప్పుడు మహానుభావుండును. ధర్మస్వభావుండును దేవలుడను పేరుగల యొక మునీశ్వరుడు వైశాఖమాసములో సాయంకాలమునందు ఆమె గృహమునకు వచ్చెను.

శ్లో॥ తదావై భార్యయాచోక్తం భిషగ్వ్యగృహమాగతః ॥
తేనవైరోగహానిస్స్యాత్తస్యాతిథం కరోమ్యహమ్ ॥ ౬౫

తా॥ బ్రాహ్మణునకు నతిథిపూజఁ జేసినయెడల రోగముమానును- అనుగ్యుద్ధేశ్యమున భార్య పిలువఁగా వైద్యుండగు ఆమునీశ్వరుఁడు గృహములోనికి వెళ్ళెను.

శ్లో॥ జ్ఞాత్వా త్వాంధర్మవిముఖం భిషగ్వ్యాజేన వంచిత: ।
పాదావనేజనంకృత్వా తజ్జలంమూర్ధ్నిసా క్షిపత్ ॥ ౬౬

తా॥ నీ వెప్పుడుధర్మము జేయ నిష్టపడవుగాన దానిని తెలిసికొని ఆమునీశ్వరుని గృహములోనికి పిలిచి దేనో ముక్కుపెట్టి పాదప్రక్షాళనజేసి యాజలములను పెనిమిటిశిరస్సున జల్లెను.

శ్లో॥ పానకంచదదౌతస్మై ఘర్మార్తాయమహాత్మనే ।
త్వయానుమోదితాసాయం ఘర్మతాపనివారకమ్ ॥ ౬౭

తా॥ మహానుభావుఁడును, ఎండ వేడిమిచే పీడింపఁబడిన యామునిశ్వరునకు గ్రీష్మ తాపమును బోఁగొట్టునట్టి పానకమును నీచే యనుజ్ఞగొని సాయంకాలమందు ఆచిన్నది యిచ్చెను.

శ్లో॥ సప్రాతరుదితేసూర్యే మునిఃప్రాయాద్యథాగతః ।
అథచాల్పేనకాలేన సన్నిపాతో భవత్తవ ॥ ౬౮

తా॥ తరువాత నాబ్రాహ్మణుఁడు ప్రాతఃకాలంబున లేచి యింటికివెళ్ళెను. ఆటుతర్వాత కొద్దికాలములోనే నీకు సంధివ్యాధి కలిగెను.

శ్లో॥ త్రికూట నీయమావాయాం భర్తాంగుళిమఖండయత్ ।
ఉభయోర్దంతయోశ్లేష్మ సహాసాసమవద్యత ॥ ౬౯

తా॥ ఆరోగ్యనివారణముకొఱకు గరళమును నోటిలో నుంచబోగా యామె యొక్క వ్రేలును పెనిమిటివగు నీవుకొఱకితివి, రెండుదంతములమధ్యను శ్లేష్మము. శీఘ్రముగా పెరుగుచుండెను,

శ్లో॥ తత్ఖండమంగుళింపశ్చాత్తస్థితంభర్తుస్సుకోమలం ।
ఖండయిత్వాంగుళింభర్తా పంచత్వమగమత్తదా ॥ ౭౦

తా॥ అప్పుడు తనవ్రేలిని పెనిమిటి కొఱకగా నామె పెనిమిటినోటిలోనున్న తునకను తనవేళ్ళతో బయటికితీసెను. ఇట్లుభార్యయొక్క ఆవ్రేలిని కొఱికి వెంటనే పెనిమిటి మృతినొందెను.

శ్లో॥ శయ్యాయాంసుమనోజ్ఞాయాం స్మరంస్తాంపుంశ్చలింశుభాం।
మృతంవిజ్ఞాయభర్తారం భార్యాకాంతిమతీతవ ॥ విక్రీత్వాచాపివలయం

గృహీత్వా చేంధనం బహు । చక్రే చితిం తేనసాక్షీ మధ్యే కృత్వా పతింతదా ॥ అవగుహ్య భుజాభ్యాంచ పాదౌ చాశ్లిష్య పాదయోః ॥ ముఖే ముఖం వినిక్షిప్య హృదయే తథా ॥ జఘనే జఘనం దేవి హిత్వా తాన్మనం సన్ని వేశ్య చ । దాహయామాస కల్యాణీ భర్తృ దేహం సుజాన్వితమ్॥ ఆత్మనా సహ కల్యాణీ జ్వలితే జాతవేదసి ॥ ౨౮

తా॥ మనోహరమైన శయ్యయందు పరుండి మొదట నుంచుకొనిన భోగము దానిని తలఁచికొనుచు నీవు ప్రాణములను విడువఁగా భార్యయగు కాంతిమతి తెని మిటివగు నిన్ను మృతినొందినవానిఁగా తెలిసికొని తనచేతియందున్న కడియము నమ్మివేసి చాలాకట్టెలనుకొని కాష్ఠమును చేర్పించి దానిమధ్యను పెనిమిటివగు నిన్ను పరుండఁబెట్టి నీభుజములతో భుజములు, పాదములతో పాదములు, ముఖముతో ముఖము, హృదయముతో హృదయము, కటిప్రదేశముతో కటిప్రదేశము కలసి కొనునట్లుగా నీశరీరముతోని మంగళప్రదురాలగు నాకాంతిమతి తనశరీరము నుంచి మండుచున్నయగ్ని హోత్రములో తనశరీరముతోగూడా రోగముచే పీడింపఁబడి మృతిజెందిన పెనిమిటివగు నీశరీరమును దహింపజేసెను.

శ్లో॥ విముచ్య దేహం సహసా జగామ పతిం సమాలింగ్య మురారి లోకం । పానీయ దానేన చ మాధవేస్మిం న్నాప్రదావనే జా దపి యోగి గమ్యమ్ ॥ ౨౯

తా॥ నీ భార్యయగు కాంతిమతి నీ శరీరమువంటు తన శరీరమునుగూడ జేర్చి దహింప జేసికొనుటవలనను, వైశాఖమాసములో మంచితీర్థమును దానము చేయుట చేతను, ఆబ్రాహ్మణుని పాదప్రక్షాళన చేయుటవలనను యోగీశ్వరులచే పొందఁదగిన విష్ణులోకమును బొందెను.

శ్లో॥ త్వమంతకాలే గణికావిచింతయా దేహంత్యక్త్వాసక్త సమస్త కిల్బిషః । జన్మవ్యాధం ప్రాప్తవాన్ ఘోరరూపం హింసా సక్తస్సర్వదో ద్వేగకారి ॥ ౨౬

తా॥ నీవు మరణకాలంబున భోగముదానిని తలఁచుచు ప్రాణములను విడుటచే సమస్తపాపములను బొందినవాడవై శరీరము చాలించి క్రూరమగు కిరాతజన్మము నొంది ప్రాణులను వధించుచు నెల్లప్పుడు దుర్మార్గుఁడవుగా నుంటివి.

శ్లో॥ దత్తాత్వయా పానకస్యాపి దానే మాసేమజ్ఞా మాధవేమాస వర్యే । వ్యాధోజాత స్తేనజాతా సుబుద్ధి ర్ధర్మాన్ ప్రష్టుం సర్వసౌఖ్యైక హేతూన్ ॥ ౨౭

తా॥ అన్ని మాసములలో శ్రేష్ఠమైన వైశాఖమాసములో నీభార్య పానకము నిచ్చుచుండఁగా ననుజ్ఞ నిచ్చితివిగాన యాపుణ్యవశముచే నీవు కిరాతజన్మ మెత్తినను సమస్త సౌఖ్యములనొసఁగునట్టి ధర్మములను దెలిసికొనవలయునని నెడుబుద్ధి కలిగినది.

శ్లో॥ ధృతఃమూర్ధ్నా పాదశౌచావశిష్టం జలం మునే స్సర్వపాప
హారి । తే నేయం తే సంగతి ర్మే వనేస్మి న్భయా భూయా
త్సంపద స్సంతతి శ్చ ॥ ౨౮

తా॥ పాపములను బోఁగొట్టునట్టి ఆ మునీశ్వరుని పాదప్రక్షాళనము జేసిన యుదకమును నీశిరస్సునధరించుటచే నీ కీవనమందు నాతో సహవాసముకలిగెను. మరియు సంపత్తులు సంతతులు కూడ నొఁదగియున్నవి.

శ్లో॥ ఇత్యేతత్సర్వమాఖ్యాతం పూర్వజన్మని యత్కృతం ।
కర్మపుణ్యం పాపకంచ దృష్టం దివ్యేనచక్షుషా ॥ ౨౯

తా॥ ఓ కిరాతుఁడా! ఈప్రకారముగా నీవు పూర్వజన్మమునందు జేయఁబడిన పుణ్యకర్మనుగాని, పాపకర్మనుగాని దివ్యదృష్టిచే జూచి నీపూర్వజన్మమునందు జరుగబడిన వృత్తాంతమునంతయు జెప్పితిని.

శ్లో॥ గోప్యంవాతేప్రవక్ష్యామి యద్భవాంచ్ఛ్రోతుమిచ్ఛతి ।
జాతా తేచిత్తశుద్ధిర్వై స్వస్తిభూయా న్మహామతే ॥ ౩౦

తా॥ ఓ కిరాతుఁడా! రహస్యముగానుండిన యేధర్మమునైనను నీవు వినవలయునని కోరిగా నుండినయెడల చెప్పెదనడుగుము. మిక్కిలి బుద్ధిగలవాఁడా! నీకు చిత్తశుద్ధి కలిగినది. నీకుశుభమగుగాక.

నారదంబరీషసంవాదే కిరాత రహస్యధర్మంనామ అష్టాదశో
ధ్యాయ స్సమాప్తః

## అథైకోనవింశోఽధ్యాయః.

వ్యాధః॥ శ్లో॥ విష్ణుముద్దిశ్యకర్తవ్యా ధర్మాభాగవతాశ్శుభాః।
తత్రాపిమాధవప్రీత్యశ్చ ఇత్యుక్తంతుత్వయాపురా॥

తా॥ కిరాతుఁడు చెప్పుచున్నాఁడు. ఓ బ్రాహ్మణుఁడా! విష్ణుని గురించి జేయఁదగిన ధర్మములను జెప్పుచు వానిలో శ్రేష్ఠమైనవియు, భగవత్సంబంధమైనవియు, శుభముల నొసఁగునవియు నగు వైశాఖమాసధర్మములను ముఖ్యముగా జేయవలయునని చెప్పితివి.

శ్లో॥ సవిష్ణుఃకీదృశో బ్రహ్మన్కింవాతస్యహిలక్షణం ।
కింప్రమాణంతస్యసద్భావే కైర్జ్ఞేయోభగవాన్విభుః ॥ ౧

తా॥ ఓ బ్రాహ్మణుడా! ఆ విష్ణుమూర్తి యెటువంటివాఁడు? ఆయన యొక్క లక్షణములేమిటి? ఆయన ఉన్నాఁడని చెప్పుటకు ప్రమాణమేమి? ఆ భగవంతుని యెటువంటివారు తెలిసికొనుచున్నారు?

శ్లో॥ కీదృశా వైష్ణవాధర్మాః కేనాసౌప్రీయతే హరిః ।
ఏతదాచక్ష్వమే బ్రహ్మన్ కింకరాయమహామతే ।

తా॥ విశేషబుద్ధిశాలివగు నో బ్రాహ్మణుఁడా! విష్ణుసంబంధములగు ధర్మము లేవి? ఏ ధర్మములచే విష్ణుమూర్తి సంతోషించును? దీనినంతయు మీకు శిష్యుఁడనగు నాకు జెప్పవలయును.

శ్లో॥ ఇతిపృష్టస్తు వ్యాధేన పునఃప్రాహసవై ద్విజః ।
ప్రణమ్య జగతామీశం నారాయణమనామయమ్ ।౮

తా॥ ఈ ప్రకారము కిరాతుఁడడుగఁగా నా బ్రాహ్మణుఁడు ప్రపంచమున కధిపతియు సర్వబాధారహితుఁడునగు విష్ణుమూర్తికి నమస్కరించి తిరిగి యిట్లు చెప్పుచున్నాఁడు.

శంకః శ్లో॥ శృణు వ్యాధప్రవక్ష్యామి విష్ణురూపమకల్మషమ్ ।
యదచింత్యంవిరించాద్యై ర్మునిభిర్భావితాత్మభిః । ౯

తా॥ శంఖుఁడు చెప్పుచున్నాఁడు. ఓ కిరాతుఁడా! పాపరహితమైనదియు బ్రహ్మ మొదలగు దేవతలచేతను. మహానుభావులగు మునీశ్వరులచేతను విచారింప శక్యముగాని విష్ణుస్వరూపమును జెప్పెదను వినుము.

శ్లో॥ పూర్ణశక్తిః పూర్ణగుణో నిర్దోషసకలేశ్వరః ॥
నిర్గుణో నిష్కలోనంత సచ్చిదానందవిగ్రహః ॥ ౧౦

తా॥ విష్ణుమూర్తి సంపూర్ణమైనశక్తిగలవాఁడుః సంపూర్ణమైన గుణములుగల వాఁడు. దోషరహితుఁడు. సమస్తమునకు నధిపతి, గుణరహితుఁడు, నిమేషాది శూన్యుఁడు. పరిమితి లేనివాఁడు. సచ్చిదానందస్వరూపుఁడునై యుండెను.

శ్లో॥ యదేతమఖిలం విశ్వం చరాచరమనీదృశం ।
సాధీశంసాశ్రయంయచ్చ యద్వశంనియతంస్థితమ్। ౧౧

తా॥ సంచరించుచుండెడి మనుష్యాదులును, సంచరింపని పర్వతాదులునుగల ప్రపంచమేదిగలదో ఆ ప్రపంచమంతయు నెప్పుడీకీతిగానే యుండెను. మఱియు నీ ప్రపంచము అధిపతితో గూడినదియు నొకని యాధారము గలదియు నొకరిని యాశ్రయించియున్నదియు, నియతముగా నొకరి స్వాధీనములో యున్నదియునై యుండెను.

శ్లో॥ అథ తేలక్షణంవచ్మి బ్రహ్మణః పరమాత్మనః । ఉత్పత్తిస్థితిసంహారా హ్యావృత్తి ర్నియమస్తథా ॥ ప్రకాశోబంధ మోక్షౌచ వృత్తిర్యస్మాద్భవంత్యమూ । సవిష్ణుర్బ్రహ్మసంజ్ఞో సౌకవీనాం సమ్మతో విభుః॥ ౮

తా॥ పరమాత్ముండైన పరబ్రహ్మముయొక్క లక్షణములు చెప్పుచున్నాను ప్రపంచము ఉత్పత్తియు, నిలకడయు, సంహారమును, రాకపోకలును, నియంతృత్వము, ప్రకాశము, బంధము, మోక్షము మొదలగు వృత్తులెవరివలన జఱుగుచుండునో ప్రభువగు నట్టి విష్ణుమూర్తియే పరబ్రహ్మమని విద్వాంసుల యభిప్రాయమై యున్నది.

శ్లో॥ సాక్షాద్బ్రహ్మేతితం ప్రాహుఃపశ్చాద్బ్రహ్మాదికానపి ।
బ్రహ్మశబ్దం సోపపదం బ్రహ్మాదిషువిదోవిదుః । ౯

తా॥ యథార్థజ్ఞానము గలవారు నారాయణమూర్తినే ప్రత్యక్ష పరబ్రహ్మముగా తెలిసికొనుచున్నారు. చతుర్ముఖబ్రహ్మ మొదలగువారియందు కూడ బ్రహ్మశబ్దమును జెప్పుచుండిరిగాని వారియందు చెప్పఁబడిన బ్రహ్మశబ్దము రూఢియే గాని యౌగికముకాదు.

శ్లో॥ నాన్యేషాంబ్రహ్మతాక్వాపి తచ్ఛక్త్యేకాంతభాగినాం ।
తతేతచ్ఛాస్త్రగమ్యంహి జన్మాద్యస్యమహావిభోః ॥ ౧౦

తా॥ ఆ నారాయణమూర్తియొక్క శక్తిలో యేదో కొంచెమంశము వలన కలిగి చతుర్ముఖబ్రహ్మ మొదలగువారికి పరబ్రహ్మత్వమెట్లు సిద్ధించును. కాబట్టి "జన్మాద్యస్యయతః,, అను సూత్రమువలన నారాయణుండే సర్వభూతవ్యాపక పరబ్రహ్మమని వేదాంతశాస్త్రముచే నిర్ణయింపఁబడినది.

శ్లో॥ శాస్త్రంచ వేదాస్స్మృతయః పురాణంచ్చైతదాత్మకం ।
ఇతిహాసః పాంచరాత్రం భారతంచమహామతే । సర్వైరేవమహావిష్ణుర్జ్ఞే యోనాన్యైఃకథంచన నావేదవిదమ్ముం విష్ణుః మనుతేచనరః క్వచిత్ । ౧౩

తా॥ మంచిజ్ఞానముగలవాఁడా! శాస్త్రములు, వేదములు, స్మృతులు పురాణములు, ఇతిహాసములు, పాంచరాత్రాద్యాగములు, భారతము యీ మొదలగువానిచేతనే ఆ విష్ణుమూర్తిని తెలిసికొనవలయునుగాని మఱియొకదానిచే తెలియబడఁడు. కాబట్టి వేదవేత్తకాని పురుషుఁడెన్నటికిని ఆ విష్ణుమూర్తిని తెలిసికొనఁడు.

శ్లో॥ నేంద్రియైర్నానుమానైశ్చ నతర్కైశ్శక్యతేవిభుం ।
జ్ఞాతుం నారాయణందేవం వేదవేద్యంసనాతనమ్ ॥ ౧౪

తా॥ ప్రభువును, ప్రకాశించువాఁడును. వేదములచే తెలియఁదగినవాఁడును, పురాణపురుషుఁడునగు నారాయణమూర్తిని తెలిసికొనుటకు శ్రోత్రాదీంద్రియములుగాని, ప్రత్యక్షాది ప్రమాణములుగాని, తర్కాదియుక్తులుగాని సమర్థమైనవి గావు.

శ్లో॥ అస్యైవజన్మకర్మాణి గుణాన్ జ్ఞాత్వాయథామతి
ముచ్యంతే జీవసంఘాశ్చ సదాతద్వశవర్తినః ॥ ౧౫

తా॥ జీవసమూహములు ఆ భగవంతుని యవతారాదులను కృత్యములను గుణములను తనబుద్ధికి తెలిసినకొలఁది యెఱిఁగినయెడల యెల్లప్పుడు ఆయన సన్నిధానమందుండి ముక్తిని బొందుచున్నవి.

శ్లో॥ క్రమాద్విష్ణోశ్చమాహాత్మ్యం యథాసాతిశయంభవేత్ ।
వ్యక్తైకస్మిన్ స్థితాశక్తి ర్దేవర్షి పితృమాతృక్తైః ॥ ౧౬

తా॥ అదికముగా నుండునట్టి విష్ణుచరిత్రమును క్రమముగా తనకు తెలిసినకొలది యెఱుంగవలయును. ఈయన సర్వశక్తియుతుఁడు. ఇతరులగు దేవతలు మునీశ్వరులు పితృదేవతలు మొదలగువారు ఒక్కొక్కశక్తినే గలిగియున్నారు.

శ్లో॥ ప్రత్యక్షేణాగమేనాపి తథైవానుమయాదపి ।
ఆదౌనరోత్తమంవింద్యా ద్బలేజ్ఞానేసుఖేతథా ॥ ౧౭

తా॥ బలము, జ్ఞానము, సుఖము మొదలగునవి గలుగుటచే ప్రత్యక్షము, ఆగమము, అనుమానము మొదలగు ప్రమాణములచే ప్రాణులన్నింటిలో మనుష్యుని అధికునిగా తెలిసికొనవలయును.

శ్లో॥ తస్మాద్భూపంశతగుణం విద్యాత్ జ్ఞానాదిభిర్భువి ।
భూపాన్మనుష్యగంధర్వా న్విద్యాచ్ఛతగుణాధికాన్ ౧౮

తా॥ ఆ మనుష్యునికంటె జ్ఞానము మొదలగువానితో గూడిన రాజు నధికునిగా జెప్పిరి. వానికంటె మనుష్యగంధర్వులను నూఱురెట్లు అధికులనుగా జెప్పిరి.

శ్లో॥ తత్త్వాభిమానినో తేనాం స్తేభ్యోవిద్యాచ్ఛతాధికాన్
తత్త్వాభిమానిదేవేభ్య స్సప్తైనఋషయస్తదా ౧౯

తా॥ ఆ మనుష్యగంధర్వులకంటె తత్త్వజ్ఞానముగల దేవతలను నూఱురెట్లు అధికులనుగా జెప్పిరి. వేదాంతజ్ఞానముగల దేవతలకంటె సప్తఋషులను నూఱురెట్లు అధికులనుగా దెలిసికొనవలయును.

శ్లో॥ సప్తర్షిభ్యోవరోహ్యగ్ని రగ్నేస్సూర్యాదయస్తథా ।
సూర్యాద్గురుర్గురోః ప్రాణః ప్రాణాదింద్రోమహాబలః ॥ ౨౦

తా॥ సమస్తఋషీశ్వరులకంటె అగ్నిహోత్రుఁడును, అగ్నిహోత్రునికంటె సూర్యుడును, సూర్యునికంటె గురువును, గురువుకంటె ప్రాణము, ప్రాణముకంటె ఇంద్రుఁడును మిక్కిలి బలముగలవారుగా జెప్పఁబడిరి.

శ్లో॥ ఇంద్రాచ్ఛగిరిజాదేవీ దేవ్యాశ్శంభు ర్జగద్గురుః । ౨౧
శంభోర్బుద్ధిర్మహాదేవీ బుద్ధేఃప్రాణోబలాత్మకః ॥

తా॥ ఇంద్రునికంటె పార్వతీదేవియు, పార్వతీదేవికంటె జగద్గురువగుసాంబమూర్తియు, ఆయనకంటె మిక్కిలి ప్రకాశించుచుండెడి బుద్ధియు, ఆ బుద్ధికంటె ప్రాణము నధికశక్తులు కలవిగా జెప్పబడినవి.

శ్లో॥ నప్రాణాత్పరమంకించి త్ప్రాణేసర్వం ప్రతిష్ఠితం ।
ప్రాణాజ్జాతమిదంవిశ్వం ప్రాణాత్మకమిదంజగత్ ॥ ౨౨

తా॥ ప్రాణముకంటె నధికమైనదేదియును లేదు. సమస్తము ప్రాణమునందే యున్నది. ఈ ప్రపంచమంతయు ప్రాణమువలననే కలిగినది. ఈ ప్రపంచము ప్రాణయుక్తమై యున్నది.

శ్లో॥ ప్రాణేప్రోతమిదంసర్వం ప్రాణాదేవహిచేష్టతే ।
సర్వాధారమిమం ప్రాహుస్సూత్రం నీలాంబుదప్రభమ ॥ ౨౩

తా॥ ఈ ప్రపంచమంతయు ప్రాణమునందే కూర్చబడినది. ప్రాణము వలననే వ్యాపారమును జేయుచున్నది. కాబట్టి నీలమేఘముతో సమానకాంతి గల యా నారాయణమూర్తిని సర్వమున కాధారమగు దారమునుగ జెప్పి ప్రపంచమున కంతయు నాధారమైనవానిగా జెప్పియున్నారు.

శ్లో॥ లక్ష్మీకటాక్షమాత్రేణ ప్రాణస్యాస్యస్థితిర్భవేత్ ॥

తా॥ లక్ష్మీదేవికి పెనిమిటియగు నారాయణమూర్తి యనుగ్రహముచేత ప్రాణము నిలిచియుండును.

వ్యాఘ్రః॥ శ్లో॥ సాలక్ష్మీర్యేనదేవస్య కృపాలేశైకభాజినీ ॥
సవిష్ణుః పరమంకించి న్నసమోవాకథంచన ।
కథంజీవేషుయాప్రాణ స్సూత్రినామాధికోభవత్ ॥ ౨౪

తా॥ ఆ లక్ష్మీదేవి దేవదేవుండగు విష్ణుమూర్తియొక్క దయలో కొంచెము దయను బొందినదియేగదా, అనగా విష్ణుమూర్తియొక్క దయకు పాత్రురాలు. విష్ణుమూర్తికంటె నధికమైనవాడును, సమానుడును లేడు. ఈ జీవులయందు వ్యాపించియున్న ప్రాణము సూత్రమనబడునే యేతీరుగా నధికమైయున్నది.

శ్లో॥ నిర్ణయోవాకథంహ్యస్య ప్రాణాధిక్యేకథంవిభో ।
తత్రదాచక్ష్వమేబ్రహ్మన్ కథంప్రాణాద్విభుఃపరః ॥ ౨౫

తా॥ ఓ స్వామీ! ఈ విష్ణుమూర్తికి ప్రాణములకంటె నధికుడని నిర్ణయించబడుచున్నదో, లేక విష్ణుకంటె ప్రాణము అధికమైనదిగా నిర్ణయింపబడినదో ఓ బ్రాహ్మణుడా! దీనినంతయు నాకు జెప్పుము.

శంఖః॥ శ్లో॥ శృణువ్యాఘ్రప్రవక్ష్యామి యత్పృష్టం నిర్ణయంత్వయా
ప్రాణాధిక్యంసముద్దిశ్య జీవైశ్శకలైరపి॥ ౨౬

తా॥ ఓ కిరాతుఁడా ! నీవు దేనినిగురించి ప్రశ్నఁజేసితివో అట్టినిర్ణయము సమస్తజీవులచే విచారింపఁబడియున్నది కాఁబట్టి అట్టి ప్రాణాధిక్యతను గురించి చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ పురానారాయణోదేవః సద్మస్సృష్ట్వాసనాతనః ।
సృష్ట్వాబ్రహ్మాదికాన్దేవా నిదంప్రాహజనార్దనః ౨౯

తా। పురాణపురుషుఁడగు నారాయణమూర్తి బ్రహ్మాండమును సృజించుచు బ్రహ్మ మొదలగు దేవతలను సృజియించి ఆ విష్ణుమూర్తి గారితో నిట్లు పలికెను.

శ్లో॥ సామ్రాజ్యేహంస్థాపయేయం బ్రహ్మాణంవఃపతింప్రభుం। యో
యుష్మాస్వధికో దేవో యౌవరాజ్యేసురేశ్వరాః ॥ తంస్థాపయత శీలా
ఢ్యం శౌర్యౌదార్యగుణాన్వితం । ఇత్యుక్త్వావిభువాదేవా స్సర్వేశక్ర
పురోగమాః॥ ఏవంవివది రేన్యోన్య మ్మహంభూయామహంత్వితి॥ ౩౦

తా॥ ఓ దేవతలారా ! మీయొక్క దేవతా సామ్రాజ్యమునకు బ్రహ్మదేవు నధిపతిని జేయుచున్నాను. కావున మీలో మంచి స్వభావము, శౌర్యము ఔదార్యము మొదలగు సుగుణము లెవనియందుండునో వానికి యువరాజత్వమిచ్చెద. వట్టివానిని దెల్పుమనఁగా నింద్రుఁడు మొదలగు సమస్తదేవతలును నేను అధికుఁడను నేనధికుఁడనని యొకరితో నొకరు పోట్లాడుకొనిరి.

శ్లో॥ సర్వేవివదమానాశ్చ సూర్యంకేచిత్పరంవిదుః ।
శుక్రంచిత్పరంకామం కేచిత్తూష్ణీంతుతస్థిరే ।
తేనిర్ణయమపశ్యంతః ప్రష్టుంనారాయణంయయుః ౩౧

తా॥ ఈ ప్రకారము వారుపోట్లాడుకొనుచు కొందరు సూర్యుడధికుడనియు కొందఱు దేవేంద్రుఁడధికుడని యు చెప్పిరి. మఱికొందరు యూరకుండిరి, ఇట్లు ఆ దేవతలు తమలో నెవరధికులో నిర్ణయించుకొనలేక విష్ణుమూర్తి యొద్దకు వెళ్ళిరి.

శ్లో॥ నమస్కృత్యపురఃప్రాహు స్సర్వేప్రాంజలయోమరాః ॥
విచారితం మహావిష్ణో సర్వైరస్మాభిరంజసా । అస్మాసుదేవమధికం
నైవవిద్మఃకథంచన।త్వమేవనిర్ణయంబ్రూహి దేవాస్సంశయినోఇమే॥

తా॥ సమస్తమైనదేవతలు తిరిగి విష్ణుమూర్తి యొద్దకు వెళ్ళి దోసిలిపట్టినమస్కా

రము చేసి యిట్లు పలుకుచున్నారు. ఓ విష్ణుమూర్తీ! మేమందరము మీరు చెప్పగా శీఘ్రముగా నాలోచించితిమిగాని మాలో నెవరధికులో తెలిసికొనజాలమైతిమి. ఈ దేవతలందరు సందేహముగలవారలై యుండిరిగాన నీవే నిర్ణయింపుము.

శ్లో॥ ఇతిపృష్టామరైస్సర్వైః ప్రహసన్విదమబ్రవీత్ ॥

తా॥ ఈ ప్రకారము దేవతలందరడుగగా నా విష్ణుమూర్తి చిరునవ్వుగలవాడై యిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ దేహాద్యస్మాద్బహిర్యాతే దేహోయంపతితో భవేత్ ॥
ప్రతివ్యక్తిప్రవిష్టేతు యస్మిన్వ్యాపృతిర్భవేత్ ।
న దేవోహ్యధికో నూనం నాపరస్తుకథంచన॥ 3౬

తా॥ ఈ స్థూలదేహము జాగ్రదవస్థ గలిగియుండునప్పుడీ దేహమునుండి యే దేవత బయటికివచ్చిన చేతనములేనిదియై యీ దేహము పడిపోవునో తిరిగి యే దేవత యీ శరీరమునందు ప్రవేశించిన చేతనముగలదియై వ్యాపారము జేయునో ఆదేవతయే అధికమైనవాడు. మఱియొక దేవత అధికమైనది కాదు,

శ్లో॥ ఇత్యుక్తాస్తేతతస్సర్వే తథాస్త్వితివచోబ్రువన్
నిశ్చక్రామజయంతాహ్వః పాదాత్పూర్వం సురేశ్వరః॥ 3౭

తా॥ ఇట్లు దేవతలందరితోడను విష్ణుమూర్తి పలుకగా వారు అలాగేనని యొప్పుకొనిరి. అనంతరము జయంతుడను దేవశ్రేష్ఠుడు పాదములను విడచి బయటికివచ్చెను.

శ్లో॥ తదాపంగుమముంప్రాహుర్న దేహఃపతితస్తదా ।
శృణ్వన్పిబన్వదన్జిఘ్రన్ పశ్యన్నాస్తే చలన్నపి॥ 3౮

తా॥ పాదములు పాదేంద్రియరహితములగుటవలన కుంటివాడైయుండెనుగాని శరీరము పడిపోక వినుట, త్రాగుట, మాటలాడుట, వాసనజూచుట చూచుట కదలుట మొదలగు వ్యాపారములను జేయుచుండెను.

శ్లో॥ పశ్చాద్గుహ్యాద్వినిష్క్రాంతో దక్షోనామప్రజాపతిః॥
తదాషండమముంప్రాహుర్న దేహఃపతితస్తదా॥
శృణ్వన్పిబన్వదన్జిఘ్రన్ పశ్యన్నాస్తే చలన్నపి ॥

తా॥ అనంతరము మర్మస్థానములనుండి దక్షుఁడను బ్రహ్మ బయలు వెడలఁగా నపుంసకుఁడాయెనుగాని శరీరము పడిపోలేదు. వినుట మొదలగు సమస్తవ్యాపారములను జేయుచునేయుండెను. (వెనుకటిశ్లోకములలో ఆ వ్యాపారములన్నియు చెప్పఁబడెనుగాన యీ శ్లోకములో విభజన జెప్పక "మొదలగు" అనే పదము ప్రయోగింపఁబడెను. ఇకముందు శ్లోకములన్నింటిలో నీ రీతిగానే జెప్పఁబడును.

శ్లో॥ పశ్చాద్ధస్తాద్వినిష్క్రాంత ఇంద్రస్సర్వామరేశ్వరః ॥ హస్త
హీనమముం ప్రాహు ర్న దేహః పతిత స్తదా । శృణ్వన్విబన్వ
దన్ జిఘ్రన్ పశ్యన్నాస్తే చలన్నపి॥ ౪౧

తా॥ అనంతరము సమస్తదేవతలకు నధిపతియగు దేవేంద్రుడు హస్తముల నుండి బయలువెడలిరాగా నింద్రియరహితమగుటచే చేతులవ్యాపారము లేక కుంటి చేయివాఁడువలెనే యుండెనుగాని దేహము పడనిచ్చియుండి వినుట మొదలగు సమస్తవ్యాపారములను జేయుచునేయుండెను.

శ్లో॥ లోచనాభ్యాం వినిష్క్రాంత సూర్యస్తేజస్వినాం వరః । తదా
కాణమముం ప్రాహు ర్న దేహః పతిత స్తదా ॥ శృణ్వన్వి
బన్వదన్ జిఘ్రన్ పశ్యన్నాస్తే చలన్నపి॥ ౪౨

తా॥ అనంతరము ప్రకాశముగలవారలలో శ్రేష్ఠుఁడగు సూర్యుఁడు నేత్రములనుండి వెడలిరాగా నేత్రేంద్రియము లేక గ్రుడ్డివాఁడైయుండెనుగాని దేహము పడిపోలేదు. వినుట మొదలగు సమస్తవ్యాపారములను జేయుచునేయుండెను.

శ్లో॥ ఘ్రాణాత్పశ్చాద్వినిష్క్రాంతౌ నాసత్యౌ విశ్వభేషజౌ ।
అజిఘ్రాణమముం ప్రాహు ర్న దేహః పతిత స్తదా ।
శృణ్వన్విబన్వదన్ జిఘ్రన్ పశ్యన్నాస్తే చలన్నపి ॥ ౪౩

తా॥ అనంతరము దేవవైద్యులగు అశ్వినీదేవతలు నాసికమునుండి వెడలిరాఁగా ఘ్రాణేంద్రియము లేకపోవుటచే వాసన తెలియకుండెనుగాని వినుట మొదలగు సమస్త వ్యాపారములను జేయుచునేయుండెను.

శ్లో॥ శ్రోత్రాద్దిశో వినిష్క్రాంతా న దేహపతి స్తదా ।
తతోముం బధిరం ప్రాహు ర్నమృతేతి కథంచన ।
శృణ్వన్విబన్వదన్ జిఘ్రన్ పశ్యన్నాస్తే చలన్నపి ॥ ౪౪

తా॥ చెవులనుండి దిక్కులు వెడలిపోగా శ్రోత్రేంద్రియము లేకపోవుటచే చెవిటివాడైయుండెనుగాని శరీరము పడిపోలేదు. వినుట మొదలగు సమస్తవ్యాపారములను జేయుచునేయుండెను.

శ్లో॥ వరుణోరసనాయాస్తు వినిష్క్రాంత స్తతఃపరం
తదారసజమేవాహు ర్న దేఃపతిత స్తదా ।
జీవన్చలన్నదన్నాసే తథాజానన్ శ్వసన్నపి

తా॥ ఆటుపిమ్మట వరుణుడు నాలుకనుండి వెడలిపోగా రుచే గుర్తెరుంగకుండెనుగాని శరీరము పడిపోలేదు. జీవించియు, కదలుచును, భక్షింపుచు నిట్టూర్పులు విడుచుచు గుర్తెరుంగుచునేయుండెను.

శ్లో॥ తతోవాచోవినిష్క్రాంతో వహ్నిర్వాగీశ్వరోవిభుః
తదామూకమముంప్రాహు ర్న దేహఃపతిత స్తదా ॥
జీవన్చలన్నదన్నాస్తి తదాజానన్ శ్వసన్నపి

తా॥ అనంతరము వాగింద్రియమునకు నధిపతియగు అగ్నిహోత్రుడు వెడలిరాగా ఇంద్రియము లేకపోవుటచే మూగవాడైయుండెనుగాని శరీరము పడిపోలేదు. జీవించుట మొదలగు సమస్తవ్యాపారములగు కలదియగుచునేయుండెను.

శ్లో॥ పశ్చాచ్చంద్రోవినిష్క్రాంతో మనసాబోధనాత్మకః॥
తదాజడమముంప్రాహు ర్న దేహఃపతిత స్తదా॥
జీవన్చలన్నదన్నాస్తి తదాజానన్ శ్వసన్నపి॥ ౨౮

తా॥ అనంతరము జ్ఞానస్వరూపుడగు చంద్రుడు మనస్సునుండి వెడలిపోగా తెలివిలేనివాడైయుండెనుగాని శరీరము పడిపోలేదు, జీవించుట మొదలగువ్యాపారములు కలదియగుచునేయుండెను.

శ్లో॥ పశ్చాత్ప్రాణోవినిష్క్రాంతో మృతమేనంతదావిదుః
పునరేవంతదాప్రాహు ర్దేవావిస్మితమానసాః॥ ౨౯

తా॥ అనంతరము ప్రాణము వెడలిపోగా శరీరము పడిపోయినందున మృతినొందినవానిగా తెలిసికొని యా దేవతలందరు యాశ్చర్యముగలవారై యప్పుడుతిరిగి యిట్లు పలుకుచున్నారు.

శ్లో॥ దేహముత్థాపయేద్యస్తు పునరేవంవ్యవస్థితః ।

సపవహ్యాధికోస్మాసు యువరాజాభవిష్యతి ॥ ౫౦

తా॥ ఎవఁడు తిఱిగి యీ దేహములో ప్రవేశింపఁగానే బ్రతికింపగలఁడో వాఁడే మనలో నధికుఁడనుగాన వాఁడే యువరాజుకు తగినవాడు.

శ్లో॥ ఇత్యేవంతు ప్రతిశ్రుత్య వివిశుశ్చయథాక్రమం ।
జయంతప్రావిశత్పాదౌ నోత్తస్థౌ తత్కళేబరమ్ ॥ ౫౧

తా॥ ఈ ప్రకారము వారు ప్రతిజ్ఞ జేసికొని ఆ దేవతలందరు యే స్థానమువలన యే దేవత బయలువెడలునో ఆయాస్థానములట ఆయాదేవతలు తిరిగి ప్రవేశింపమొదలిడిరి. వారిలో ముందుగా పాదములనుండి బయలువెడలివచ్చిన జయంతుఁడు తిరిగి పాదములను ప్రవేశింపగా ఆ శరీరము మృతినొందియుండెనేగాని జీవించలేదు.

శ్లో॥ గుహ్యంచప్రావిశద్దక్షో నోత్తస్థౌతత్కళేబరం ।
ఇంద్రోహస్తౌవివేశాథ నోత్తస్థౌ తత్కళేబరమ్॥ ౫౨

తా॥ అనంతరము దక్షప్రజాపతి గుహ్యస్థానమును, ఇంద్రుఁడు హస్తములను బ్రవేశించిరిగాని ఆ శరీరము జీవించలేదు.

శ్లో॥ చక్షుస్సూర్యప్రవిష్టాభూ నోన్నత్తస్థౌ తత్కళేబరమ్॥
దిశశ్శ్రోత్రే ప్రవివిశు ర్నోన్నత్తస్థౌ తత్కళేబరమ్॥ ౫౩

తా॥ సూర్యుఁడు నేత్రములను, దిక్కులు కర్ణములను బ్రవేశించిరిగాని యా శరీరము బ్రతుకలేదు.

శ్లో॥ వరుణః ప్రావిశజ్జిహ్వాం నోత్తస్థౌ తత్కళేబరం ।
నాసాంవివిశతుర్దస్రౌ నోత్తస్థౌ తత్కళేబరమ్ ౫౪

తా॥ అనంతరము వరుణుఁడు నాలుకను, లశ్వినీదేవతలు నాసికమును బ్రవేశించిరిగాని యా శరీరము బ్రతుకలేదు.

శ్లో॥ వహ్నిశ్చప్రావిశద్వాచం నోత్తస్థౌ తత్కళేబరమ్
మనశ్చప్రావిశద్రుద్రో నోత్తస్థౌ తత్కళేబరమ్॥ ౫౫

తా॥ అనంతరము అగ్నిహోత్రుఁడు వాక్కును, మనస్సును రుద్రుఁడు ప్రవేశించిరిగాని శరీరము బ్రతుకలేదు.

శ్లో॥ పశ్చాత్ప్రాణోవివేశాసౌ తదోత్తస్థౌ కళేబరం। తదా దేవావినిశ్చిత్య ప్రాణం దేవాధికం విభుమ్ ॥ బలేజ్ఞానేచ వైరాగ్యే ప్రాణనేపిచ । తత్రోభిషేచయాంచక్రు ర్యౌవరాజ్యే మహాప్రభుమ్॥

తా॥ అనంతరము ప్రాణము ప్రవేశింపగా ఆశరీరము బ్రతికిలేచెను. అప్పుడు బలము, జ్ఞానము, ధైర్యము, వైరాగ్యము, బ్రతికించుట మొదలగువానియందు ఆ ప్రాణమునే అధికమైనవానిగాను, దేవతలందరికిని ప్రభువునుగాను నిశ్చయము జేసికొని పిమ్మట ప్రభువగు నా ప్రాణమును యువరాజ్యాధికారమునందు నియమించిరి.

శ్లో॥ ఉత్క్రాంతప్రస్థితి హేతుత్వా దుక్థమేకంతదాజగుః ।
తస్మాత్ప్రాణాత్మకం విశ్వం సర్వం స్థావరజంగమమ్॥ ౫౮

తా॥ ప్రాణము శరీరము బ్రతుకుటకు కారణమైనందున దానినే యధికమైన దానినిగా జెప్పిరి. కావున చరాచర ప్రపంచమంతయు ప్రాణముచే నిండియున్నది.

శ్లో॥ అంశైః పూర్ణైర్బలాద్యైశ్చ పూర్ణోయం జగతాంపతిః ।
నప్రాణహీనంజగద స్తికించి త్ప్రాణేనహీనం నచవైసమేతే॥

తా॥ ఈ ప్రాణము బలముగల తన పూర్ణమైన అంశముచేత ప్రపంచమంతయు నిండి ప్రపంచమునకు అధిపతియై యుండెను. కావున ప్రపంచములో ప్రాణములేని వస్తువులేదు. ప్రాణములేనివస్తువుయొక్క వృద్ధిపొంద నేరదు.

శ్లో॥ ప్రాణేనహీనంస్థితిమన్నకించి త్ప్రాణేనహీనం నచకించదస్తి
తస్మాత్ప్రాణస్సర్వజీవాధికోసౌ బలాధికస్సర్వజీవాంతరాత్మా

తా॥ ప్రాణములేనివస్తువు నిలుచుటలేదు. కావున ప్రాణములేని దేదియు లేదు. కావున ప్రాణము సమస్తజీవులకంటె నధికమైనదియు, బలముగలదియు, సమస్తజీవులకు నంతరాత్మయునై యున్నది.

శ్లో॥ ప్రాణాత్కోపి హ్యధికోవా సమోవా శాస్త్రేదృష్ట
శ్శ్రుత పూర్వోనచాస్తే॥

తా॥ ఎవడైనను ప్రాణముకంటె నధికమైనవాడుగాని, ప్రాణముతో సమానమైనవాడుగాని యుండినట్లు నే జూడలేదు. శాస్త్రమువలనను వినియుండలేదు.

శ్లో॥ తత్తత్కార్యానుగః ప్రాణో హ్యేకో దేవో హ్యనేకధా ।
తస్మాత్ప్రాణం పరం ప్రాహుః ప్రాణోపాసన తత్పరాః॥

తా॥ దేవుండగు ప్రాణము తానొక్కడయ్యును ఆయా కార్యముల ననుసరించి అనేకస్వరూపములు గలవాడగుచున్నాడు. కాబట్టి ప్రాణము నుపాసనజేయువారు ప్రాణమునే అధికమైనదానిగా జెప్పుచున్నారు.

శ్లో॥ లీలయైన జగత్స్రష్టుం హంతుం పాలయితుం ప్రభుమ్ ।
శేషాహీశ శివ శక్రాద్యాశ్చేతనాశ్చ జడా అపి ।
వాసుదేవాదృతే కోఽపి నైనం పరిభవిష్యతి॥ ౬౩

తా॥ ప్రాణుండు విలాసముగానే ప్రపంచమును సృజించుటకును పోషించుటకును, నశింపజేయుటకును సమర్థుడైయున్నాడు. విష్ణువుగాక మిగిలిన ఆదిశేషుడు శివుడు, ఇంద్రుడు మొదలగు చేతనములు అచేతనములు అన్నియును ఈ ప్రాణుని తిరస్కరించలేవు.

శ్లో॥ సర్వదేవాత్మకః ప్రాణ స్సర్వదేవమయో విభుః
వాసుదేవానుగో నిత్యం తథా విష్ణువశస్థితః। ౬౪

తా॥ సమస్తదేవతల యంతర్వర్తియు సమస్తదేవతా స్వరూపుడును, సమర్థుడనగు ప్రాణుడు విష్ణుమూర్తి ననుసరించి యా భగవంతుని వశవర్తియై యుండును

శ్లో॥ వాసుదేవప్రతీపం తు సప్రాణో తిన పశ్యతి ।
దేవాః ప్రతీపం కుర్వంతి రుద్రేంద్రాద్యాస్సురేశ్వరా॥

తా॥ ప్రాణుడు విష్ణుమూర్తికి వ్యతిరేకమైన విషయమును వినడు, చూడడు. రుద్రుడు, ఇంద్రుడు మొదలగువారు ఒకానొకప్పుడు విష్ణుమూర్తికి వ్యతిరేకమును జేయుటయును గలదు.

శ్లో॥ ప్రతిపం క్వాపి కురుతే న ప్రాణ స్సర్వగోచరః ।
తస్మాత్ప్రాణో మహావిష్ణో ర్బలమాహు ర్మనీషిణః॥ ౬౬

తా॥ సమస్తప్రదేశములయందు వ్యాపించియుండినట్టి ప్రాణుడు విష్ణుమూర్తికి నెప్పుడును వ్యతిరేకమును జేయడు. ఆ కారణమువలన శ్రీ మహావిష్ణువునకు ప్రాణము బలముగానుండెనని విద్వాంసులు చెప్పిరి.

శ్లో॥ ఏవంజ్ఞాత్వామహావిష్ణో ర్మాహాత్మ్యం లక్షణాంతథా ।
పూర్వబంధానుగంలింగం జీర్ణాంత్వచమివోరగః॥
విసృజ్యపరమంయాతి నారాయణమనామయమ్॥

తా॥ ఈ ప్రకారము శ్రీ విష్ణుమూర్తియొక్క మహత్తును లక్షణముల నెఱింగి పూర్వజన్మంబునచేసిన కర్మవశముచే సంప్రాప్తంబైన శరీరత్రయ రూపమగుసంసార బంధమును సర్పము కూపమును విడిచిపెట్టినట్లుగా విడిచిపెట్టి నాశనరహితుండును, పరమపురుషుండునగు నారాయణమూర్తిని బొందుచున్నాండు.

శ్లో॥ శ్రుత్వాశంఖోదితం వాక్యం ప్రసన్నాత్మాథః ప్రసన్నధీః
ప్రశ్రయావనతో భూత్వా పునఃప్రపచ్ఛతంమునిమ్॥

తా॥ ఈ ప్రకారము శంఖమునీశ్వరుండు చెప్పినవాక్యమును విని ఆకిరాతుడు నిర్మలచిత్తముగలవాండై వినయవిధేయతలతోగూడి నమస్కరించి తిరిగి యామునీశ్వరునితో నిట్లు పలుకుచున్నాండు.

శ్లో॥ బ్రహ్మన్మహానుభావస్య ప్రాణస్యాస్యజగద్గురోః । నఖ్యాతో మహిమాలోకే కథంసర్వేశ్వరస్యవై । దేవానాంచ మునీనాంచ భూపానాంచ మహాత్మనామ్ । మహిమాశ్రూయతేలోకే పురాణేషు సహస్రశః ।ఏతదాచక్ష్వమేబ్రహ్మన్ శ్రోతుంకౌతూహలంహిమే॥ ౨౦

తా॥ ఓ బ్రాహ్మణుండా! మహానుభావుండును, ప్రపంచమునకు గురువునగు ఈ ప్రాణముయొక్క మహత్తు లోకములో నెచ్చటైనను ప్రసిద్ధిజెందియుండలేదు ఏమికారణము? దేవతలయొక్కయు, మునీశ్వరులయొక్కయు, రాజులయొక్కయు, సత్పురుషులయొక్కయుమహత్తు లోకంబులో పురాణములయందు ప్రసిద్ధిజెందియున్నది ఏమికారణము? ఓ బ్రాహ్మణుండా! నాకు వినుటకు కుతూహలముగలిగియున్నది. కాంబట్టి దీనివిషయము సవిస్తరముగా జెప్పవలయును.

శంఖః శ్లో॥ పురాప్రాణోహరిందేవం నారాయణమనామయం ।
ఇష్ట్వామేధైర్బహుకామో గంగాతీరంయయౌముదా॥ ౨౧

తా॥ శంఖమహాముని చెప్పుచున్నాండు. పూర్వకాలంబున ప్రాణుండు సంతోషచిత్తముగలవాండై నాశనరహితుండగు విష్ణుదేవునిగురించి అశ్వమేధయజ్ఞమును జేయదలంచి గంగానదీతీరమునకు వచ్చెను.

శ్లో॥ హలైశ్చకారభూశుద్ధిం నానామునిగణైర్యుతః ।
అంతర్వల్మీకలీనస్తు కణ్వోనామసమాధిగః ।
హలోత్కృష్టవినిష్క్రాంతః క్రోధాదిదమువాచహః

తా॥ ఆసంగాతీకమందు బ్రాహ్మణుడు భూశుద్ధినిజేయుటకు నాగలితోదున్నించు చుండగా నొకపుట్టలో సమాధినిష్ఠుడైయుండిన కణ్వుడను మునీశ్వరునకు నాగలి వట్టుటవలన యా కణ్వుడు బయటికివచ్చి కోపముగలవాడై యిట్లు పలుకు చున్నాడు.

శ్లో॥ దృష్ట్వాపురస్థితం బ్రాహ్మణం శశాపహామహావిభుం ।
అద్యప్రభృతినఖ్యాతిం మహిమాభువనత్రయే ।
తవనాప్నోతి దేవేశ భూలోకేతువిశేషతః॥ 25

తా॥ మహానుభావుడగు యా కణ్వుడు తన ముందున్న యా బ్రాహ్మణుని జూచి యిట్లు శపించుచున్నాడు. ఇది మొదలు మూడులోకములయందును నీకీర్తి ప్రసిద్ధి బొందకయుండును. అందునను భూలోకములో నేమియును ప్రసిద్ధిజెందదు.

శ్లో॥ ప్రఖ్యాతాస్తేభవిష్యంతి హ్యవతారాజగత్త్రయే ।
ఇత్యుక్తోమునినా తేన వాయుఃక్రోధాత్తదాబ్రవీత్ ॥ 26

తా॥ మూడులోకములయందును రామకృష్ణాద్యవతారములే ప్రసిద్ధిజెంది యుండును అని మునీశ్వరుడు శపింపగా వాయువుగూడ మిక్కిలి కోపము గలిగి యిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ వినాపరాధంశప్తోసి తితిక్షుర్మాంనిరాగసం
తస్మాత్కణ్వమహాబాహో గురుద్రోహీంభవాశుచ॥ 22

తా॥ ఓ కణ్వమునీశ్వరా! నాయందేమియు నపరాధము లేకుండినను నన్ను నీవు యోర్పుగలవాడవై యుండియు నిష్కారణముగా శపియించితివిగాన నీవుశీఘ్రముగానే గురుద్రోహము గలవాడవగుదువు.

శ్లో॥ లోకేనిందితవృత్తిశ్చ భవేత్యాహసదాగతిః ।
తతఃప్రభృతిలోకేస్మిన్ ప్రాణస్యాస్య మహాప్రభోః ।
నఖ్యాతోమహిమాలోకే భూలోకేతువిశేషతః ॥

తా॥ మఱియు దూషితిమైన ప్రవర్తనగలవాడవగుదువు. అని వాయువు

తిరిగి కణ్వమహామునికి శాపమిచ్చెను. కాబట్టి అది మొదలు యీ లోకములో ప్రభువగు వాయువునకు ప్రసిద్ధిలేకయుండెను. మరియు భూలోకంలో నేమియు లేదు.

శ్లో॥ శాపాత్కణ్వోగురుంజగ్ధ్వా సూర్యశిష్యోభవత్తదా ।
ఇత్యేతత్కథితంసర్వం యత్పృష్టంతుత్వయాధునా ।
యచ్ఛ్రోతవ్యమిత్యో వ్యాధపృచ్ఛమాంమావిచారయ॥ ౨౦

తా॥ ఓ కిరాతుడా! ఇట్లు వాయువుచే శపింపఁబడి కణ్వమహాముని గురువును భక్షించి పిమ్మట సూర్యునకు శిష్యుఁడాయెను. కాఁబట్టి నీవడిగినదానినంతయును జెప్పితిని. కాన యికముందు నేదయినను వినదగినది యున్నయెడల నడుగుము. ఆలోచింపవలదు.

వాయుశాపకథనం నామ ఏకోనవింశోధ్యాయ సంపూర్ణః

---

## అథ వింశోధ్యాయః

వ్యాధః॥శ్లో॥ కింజీవాభునాసృష్టా కోటిశోధసహస్రశః ।
దృశ్యంతేభిన్నకర్మాణో నానామార్గాస్సనాతనాః ।
నైకస్వభావా ఏతేహి కుతఏవ మహామతే ।
సర్వంతత్పృచ్ఛేతేమహ్యం విస్తరాత్తత్వతోవద॥

తా॥ కిరాతుఁడడుగుచున్నాఁడు. విశేషబుద్ధిగల యో మునీశ్వరా! ప్రభువగు నారాయణమూర్తిచే అనేక కోట్లకొలఁది జీవులు సృజింపబడినవి యేమికారణము? ఈ జీవులు అనేకస్వభావములు గలవారై అనేక మార్గములననుసరించి చిరకాలమునుండియు వచ్చుచున్న యీ జీవులనేకకర్మములను జేయుచుండిరి. యేమి కారణము? ఓ స్వామీ! దీనినంతయు వినవలయునని కుతూహలము గలిగియుంటిని. కాఁబట్టి విశదముగా జెప్పవలయును.

శంఖః॥శ్లో॥ త్రివిధాజీవసంఘాహి రజస్సత్వతమోగుణాః ।
రాజసారాజసంకర్మ తామసాస్తామసంతథా।
సాత్వికాసాత్వికంకర్మ కుర్వంత్యే తేయథాక్రమమ్

తా॥ శంఖమునీశ్వరుఁడు చెప్పుచున్నాఁడు. జీవసమూహములు సత్వగుణము రజోగుణము, తమోగుణమునని గుణత్రయభేదముచే మూడువిధములనుబొంది సాత్వికగుణముగలవారు సాత్వికకర్మమును, రజోగుణముగలవారు రాజకర్మమును, తమోగుణముగలవారు తామసకర్మమును క్రమప్రకారముగా జేయుచుందురు.

శ్లో॥ క్వచిచ్చగుణవైషమ్యమేతేషాం సంసృతౌభవేత్ ।
॥ తేనైవోచ్చావచంకర్మ కుర్వంతఃఫలభాగినః ॥

తా॥ ఈ జీవులు జన్మమెత్తి సంసారమును బొంది యుండగా నొకానొకప్పుడు గుణముల వ్యత్యాసము కలుగుచుండును. ఆ గుణముల న్యూనాధికమువలన న్యూనాధిక ధర్మములను జేయుచు అధికకర్మమున కధికఫలమును, తక్కువకర్మమునకు తక్కువఫలము ననుభవించుచుందురు.

శ్లో॥ క్వచిత్సుఖం క్వచిద్దుఃఖం క్వచిచ్చాభయమేవచ ।
గుణానామేవవైషమ్యాత్ప్రాప్నువంతి నరాఇమే॥

తా॥ ఒకప్పుడు సుఖము నొకప్పుడు దుఃఖము నొకప్పుడు భయము ఒకప్పుడు భయములేకపోవుట యీరీతిగా నీ మనుష్యులు గుణముల వ్యత్యాసమువలన ఫలములను బొందుచున్నారు.

శ్లో॥ ప్రకృతిస్థాఇమేజీవా బద్ధాప్తైర్గుణైస్త్రిభిః ।
గుణకర్మానురూపేణ కర్మణోవ్యత్యయఃఫలం ।
గుణానుగుణ్యంభూయస్తే ప్రకృతింయాంత్యమీజనాః॥ ౭

తా॥ ఈ జీవులు మాయలోనుండి సత్వరజస్తమోగుణములచే బద్ధులై గుణములకు తగిన కర్మములనుజేయుచు కర్మములకు తగినఫలములను బొందుచు మరల మాటి మాటికి గుణములననుసరించి యీ మనుష్యులు మాయనేపొంది తగినఫలము ననుభవింతురు.

శ్లో॥ ప్రకృతిస్థాప్రాకృతికా గుణకర్మాభిమూర్తితాః।
గతింప్రాకృతికంయాంతి వ్యత్యయః ప్రకృతేర్నహి॥

తా॥ మాయాసంబంధముగల యీ జీవులు మాయకు లోబడి గుణకర్మముల ననుసరించి జన్మంబులనెత్తుచు మాయాసంబంధమగు మార్గమునే యనుసరించుచున్నారు. మాయననుసరించిన జీవులకేగాని భేదము మాయకేమియువిపర్యాసములేదు.

శ్లో॥ తామసాదుఃఖబహులాస్సదాతామసవృత్తయః ।
నిర్దయానిష్ఠురాలోకే సదాద్వేషైకజీవినః ।
రాక్షసాద్యాఃపిశాచాంతాస్తామసీంయాంతివైగతిమ్ ॥

తా॥ తామసవృత్తిగలవారలు యెల్లప్పుడు విశేషదుఃఖములను బొందువారును దయలేనివారును కఠినులునై ఈ లోకములో నెల్లప్పుడు విరోధము గలిగియుండియే జీవించుచు రాక్షసజన్మము మొదలు పిశాచమువఱకునుండు జన్మములనెత్తుచు తమోగుణసంబంధమైన మార్గములనే యనుసరించుచుందురు.

శ్లో॥ రాజసామిశ్రమతయః కర్తారః పుణ్యపాపయోః ।
పుణ్యస్య స్వర్గం ప్రాప్నువంతి క్వచిత్పాపాచ్చ యాతనాం ।
అతఏతేమందభాగ్యా ఆవర్తంతే పునఃపునః ॥ ౧౧

తా॥ రజోగుణముగలవారు మిశ్రమమగు బుద్ధిగలవారై పుణ్యపాపముల రెంటిని చేయుచుందురు. అప్పుడు పుణ్యమధికముగా నుండినయెడల స్వర్గలోకమును పాపమధికమైనయెడల నరకమును బొందుచుందురు. కావున జ్ఞానము లేనట్టివారు పుట్టిపుట్టికి నీ సంసారచక్రములో తిరుగుచుందురు.

శ్లో॥ ధర్మశీలాదయావంత శ్శ్రద్ధావంతో నసూయకాః ।
సాత్వికాస్సాత్వికీంవృత్తి మనుతిష్ఠంతఆనతే॥ ౧౨

తా॥ ధర్మస్వభావము గలవారును, దయగలవారును, శ్రద్ధగలవారును, అసూయ లేనివారును, సాత్వికగుణముగలవారునగు సత్పురుషులు మంచికర్మముల నాచరింపుచు నేయుందురు.

శ్లో॥ తేచోర్ధ్వంయాంతివిమలా గుణాపాయేమహౌజసః ।
అతోవిభిన్నకర్మాణః పృథగ్భావాఃపృథగ్విధాః ॥ ౧౩

తా॥ ఆ సత్పురుషులు మిక్కిలి తేజస్సుగలవారై నిర్మలులై త్రిగుణముల నతిక్రమించి యూర్ధ్వలోకమును బొందుదురు. కాబట్టి జీవులు వేలువేలుగా కర్మలు, వేలువేలు స్వభావములు, వేరువేరు ప్రవృత్తులు గలవారలైయుందురు.

శ్లో॥ గుణకర్మానురూపేణ తేషాంవిష్ణుర్మహాప్రభుః ।
కర్మాణికారయేత్ జ్ఞానీస్వస్వరూపాప్తయేవిభుః ॥ ౧౪

తా॥ మహానుభావుడగు విష్ణుమూర్తి వారి వారి కర్మలను గుణములననుసరించి కర్మలను జేయించుచున్నాడు. జ్ఞానముగలవాడు స్వకీయరూపమును బొందుటకు సమర్థుడైయున్నాడు.

శ్లో॥ విష్ణోస్త్వవైషమ్యనైర్ఘృణ్యే పూర్ణకామస్యవై సహి।
స్మృష్టింస్థితింహ్యాంతంచైవ సవమేవకరోత్యయమ్ ।
స్వగుణాదేవతేసర్వే కర్మణఃఫలభాగినః ః ౧౫

తా॥ సంపూర్ణకోరికలు గలవాడైన విష్ణుమూర్తికి భేదబుద్ధిగాని, దయలేకుం డుటగాని లేక సృష్టిస్థితిలయములను సమానముగానే జేయుచున్నాఁడు. కాబట్టి సమస్తజీవులు తమ కర్మానుసారముగానే ఫలమును బొందుచున్నారు.

శ్లో॥ ఆరామోప్తాయథాసర్వాం త్సమంవర్ధయతిద్రుమాన్ ।
ఏకకుల్యాజలంగాత్రిహ్యాం దుత్రిమాశ్చప్రికృతింగతాః ।
నారామోప్తరివైషమ్యం నైర్ఘృణ్యంవాంధంచనః ॥

తా॥ తోటవేసినవాడు చెట్లకు నొక్కప్రదేశమందుండునట్టి జలమునుదెచ్చి పోసి సమానముగా పోషించినప్పటికిని యా వృక్షములు వాటిస్వభావమునే పొంది యుండును. (అనగా కొన్ని మంచివిగాను, మరికొన్ని చెడ్డవిగాను పెరుగును) కాబట్టి తోటవేసినవానికి వైషమ్యనైర్ఘృణ్యము మొదలగు భేదబుద్ధులు లేవుగదా.

వ్యాధః శ్లో॥ జానానాంపూర్ణభోగానాం కదాముక్తిర్భవేన్మునే ।
స్మృష్టికాలేథవాహ్యాంత కాలేవాస్థాపనస్యచ॥ ౧౭

తా। ఓ మునీశ్వరుఁడా! సంపూర్ణ జ్ఞానైశ్వర్యముగల జనులకు సృష్టికాలం బో ప్రళయకాలంబో స్థితికాలములో ఎప్పుడు ముక్తికలుగునో చెప్పుము.

శ్లో॥ క్వచిచ్చస్మృష్టికాలస్య సంహారస్యాపివైస్థితేః ।
ఏతద్విస్తార్యమేఃబ్రహ్మన్ భగవచ్చేష్టితంవద॥ ౧౯

తా॥ ఒకప్పుడు సృష్టిగా గనుపించుచున్నది. ఒకప్పుడు స్థితినిబొందుచు న్నది. ఒకప్పుడు నాశనమును బొరిగుచున్నది. ఈ మూడు కాలములలో నెప్పుడు ముక్తిని పొందుదురు? ఓ బ్రాహ్మణుఁడా! భగవంతుని చరిత్రము నెరుగవలెనని యున్నది. కావున నాకు సవిస్తరముగ జెప్పుమని కిరాతుడడిగెను.

శంఖః॥ శ్లో॥ చతుర్యుగసహస్రాణి బ్రహ్మణోదివముచ్యతే ।
రాత్రిశ్చతావతీతస్య హ్యహోరాత్రందివంభవేత్ ॥ ౨౦

తా॥ శంఖమహాముని చెప్పుచున్నాడు. నాలుగువేల యుగములు బ్రహ్మ

దేవునకొక పగలగును. అన్ని యుగములు తిరిగియొకయెడల ఒకరాత్రియు నగును. ఇట్టి పగలురాత్రి కలసి బ్రహ్మదేవున కొకదినమగును.

శ్లో॥ దశపంచదినాన్యాహుః పక్షంమాసోద్వయాత్మకః ।
మాసద్వయంబుతుంప్రాహు రయనంచబుతుత్రయం ।
అయనేద్వేవత్సరస్స్యా త్తాదృక్శతసమాయది ।
గచ్ఛంతిబ్రహ్మణోహ్యస్య బ్రహ్మకల్పాంతదావిదుః ॥

తా॥ పదిహేనుదినము లొకపక్షమగును. రెండుపక్షము లొకమాసమును, రెండుమాసము లొకఋతువును, మూడుఋతువు లొక అయనమును, రెండుఅయనములు ఒక సంవత్సరమునుఅగును. అట్టి నూరుదివ్యసంవత్సరములు బ్రహ్మకుగడచిన పిమ్మట బ్రహ్మకల్పము అప్పుడు జరుగునని పెద్దలు వచియించిరి.

శ్లో॥ తావాత్కాహింప్రళయకాల ఇతి వేదవిదాంమతమ్ ॥

తా॥ పూర్వము చెప్పిన కాలనిర్ణయమునుచొప్పున జరిగెనది ప్రళయమని వేద వేత్తల యభిప్రాయమైయున్నది.

శ్లో॥ ప్రళయస్త్రినిధఃప్రోక్తో మానవోమానవాత్యయే ।
దైనందినోద్వితీయోహి బ్రహ్మణోదివసాత్యయే ।
బ్రహ్మణోధలయేపశ్చా ద్బ్రహ్మంచప్రళయంవిదుః॥ ౨౮

తా॥ ప్రళయము మూడువిధములుగా జెప్పబడినది. అది యేలాగుననగా మనుష్యులందరు నశించినప్పుడు కలిగినది మానవ ప్రళయమనియు, బ్రహ్మదేవునకు నొకదినము గడచినపిమ్మట జరిగినది దినప్రళయమనెడు రెండవదియనియు, నూరు సంవత్సరములు గడచినపిమ్మట బ్రహ్మనశింపగా జరిగినది మూడవది బ్రహ్మ ప్రళయమనియు నిట్లు మూడువిధములుగా జెప్పిరి.

శ్లో॥ బ్రహ్మణస్తుముహూర్తేతు మనోస్తుప్రళయంవిదుః ।
ప్రళయేతువ్యతీతేషు చతుర్దశసువై క్రమాత్ ।
దైనందినలయంప్రాహుః ప్రళయానాంస్థితింపునః

తా॥ బ్రహ్మదేవునకు నొక ముహూర్తమైనయెడల మనువునకు ప్రళయమగును. క్రమముగా పదునాలుగు ప్రళయములు జరిగిన పిమ్మట దినప్రళయములు జరుగు చుండును. కాబట్టి ప్రళయములస్థితి యిట్టిది.

శ్లో॥ త్రయాణామేవలోకానాం లయోమన్వంతరేభవేత్ ।
చేతతవానాంతదానాశో సలోకానాంక్షయోభవేత్ ।
ఉదక్తై రేవప్రా ప్తిశ్చ యథాపూర్వం తథాపునః॥ ౨౭

తా॥ మన్వంతరమందు మూడులోకములు నశించును. అప్పుడు చేతనములు మాత్రమునశించి స్థావరరూపముగానుండి లోకములునశింపక పూర్వమువలెనే యుదకములచేత నిండియుండును.

శ్లో॥ మన్వంతరాంతేభూయాత్తు చేతనానాంపునర్భవః ।
దైనందినలయేవ్యాధ సర్వస్యాపిక్షయోభవేత్ ॥ ౨౮

తా॥ మన్వంతరము సంపూర్తియైన పిమ్మట చేతనములు తిరిగి జనియించును. ఓ కిరాతుఁడా! దినదినము జరుగునట్టి ప్రళయమునిలో సమస్తము నశించును.

శ్లో॥ సత్యలోకంవినాసర్వే లోకానశ్యంతిసాధిపాః ।
సచేతనాస్సాధిభూతాః ప్రసుప్తే చతురాననే॥ ౨౯

తా॥ బ్రహ్మదేవుడు నిద్రించగా దినప్రళయము జరిగి అప్పుడు బ్రహ్మలోకముగాక మిగిలిన సమస్తలోకములు అధిపతులతోడను, చేతనములతోడను, అధిదేవతలతోడను గూడ నశించిపోవును.

శ్లో॥ తత్వాభిమానినోదేవాః కేచిచ్చమునయస్తథా ।
శిష్యంతిసుప్తాస్సర్వేపి సత్యలోకవ్యవస్థితాః ॥ ౩౦

తా॥ వేదాంతజ్ఞానమునందు పూర్ణులైన కొందరు దేవతలు, కొందరు మునీశ్వరులు మఱియు నెవరైనను జ్ఞానముగలవారందరును దినప్రళయమునందు నశింపక మిగిలియుండి సత్యలోకములో బ్రహ్మతోగూడ నిద్రించుచుందురు.

శ్లో॥ తిష్ఠంతిసుప్తిమాపన్నా యావత్కల్పమతీంద్రియాః ।
పునర్నిశాత్యయేబ్రహ్మ యథాపూర్వమకల్పయత్॥ ౩౧

తా॥ అజ్ఞానులు దినకల్పముగునంతపర్యంతము నిద్రించుచు విషయవ్యాపారరహితులైయుందురు. ఇట్లు రాత్రి గడచినపిమ్మట బ్రహ్మదేవుడు తిరిగి పూర్వము సృజియించినరీతిగా ప్రపంచమును సృజియించును.

శ్లో॥ ఋషీన్దేవాన్పితౄన్లోకా న్ధర్మాన్వర్ణాన్పృథక్పృథక్ ।
పునర్దశావతారాహి విష్ణోర్దేవస్యచక్రిణః॥ ౩౨

తా॥ మునీశ్వరులను, దేవతలను. పితృదేవతలను, భూరాదిలోకములను ధర్మములను వేరువేరుగా వర్ణములను, దేశములను చక్రధారియగు విష్ణుమూర్తియొక్క అవతారములను సృజియించెను.

శ్లో॥ నియమేనభవంత్యేతే తథాన్యేపిచభూరిశః ।
దేవతాఋషయశ్చైవ ఆకల్పాంచగిరాంపతేః॥

తా॥ ఈ దేవతలును, మునులును మఱియు సమస్తదేవతలును బ్రహ్మదేవుని కల్పాంతమువరకు నియతముగా నివసించియేయుందురు.

శ్లో॥ పునరేవాభివర్తంతే బ్రహ్మణాసహాముక్తిగాః ।
భూపాశ్చసాధవోయేచ సిద్ధింప్రాప్తాఃపరంగతా ।
తేనైవచాభివర్తంతే సత్యలోకవ్యవస్థితాః ॥ 38

తా॥ ముక్తినిబొందినవారును, న్యాయపరిపాలనజేసిన రాజులును, సిద్ధినిబొందిన విరాగులును వీరందరును బ్రహ్మలోకమునందుండి బ్రహ్మదేవునితో గూడ నిద్రించుచు తిరిగి లేచుచుందురు.

శ్లో॥ తదాశ్రితాఃపునర్యాంతి తన్నామ్నాశుశ్రితిసంస్థితాః ।
తత్తద్గోత్రేషుజాయంతే తత్తత్కర్మరతాస్సదా॥

తా॥ ఆయాశాఖలయందుండిన దేవతలు, మునులు మొదలగువారు వారివారికి విధియైయుండు వేదానుసారులై ఆయాగోత్రములయందు జనియించి యెల్లప్పుడు వారివారికి విధ్యుక్తకర్మములను జేయుచుందురు.

శ్లో॥ దైత్యానామపి సర్వేషాం యదాకలియుగాత్యయః ।
కలినాసహాగచ్ఛంతి స్వాంగతింనిరయాలయాః ।
తేషాంచరాశి సంస్థాయేతన్నామానోపరేపిచ ।
జాయంతేకర్మణాస్వేన తత్తత్కర్మవిధాయకాః ॥

తా॥ కలియుగమంతమైన పిమ్మట రాక్షసులు, పిశాచములు మొదలగువారు తమస్థానమగు నరకస్థానములను కలిపురుషునితో గూడ పొందుదురు. ఆ పిశాచగణములయందుండినవారును, ఆయాపేరుగల యితరులును తమతమ కర్మానుగుణ్యముగా జనియించి ఆయాకర్మములను జేయుచుందురు.

శ్లో॥ సృష్టికాలంప్రవక్ష్యామి ముక్తికాలంతథైవచ ।

బ్రహ్మాదీనాంచ దేవానాం సమాహితమనాభవ ।

తా॥ ఓ కిరాతుఁడా! బ్రహ్మ మొదలగు సమస్తదేవతల సృష్టికాలమును ముక్తికాలమును జెప్పుచున్నాను. సావధానచిత్తముగలవాడవై యుండుము.

శ్లో॥ నిమేషో దేవదేవస్య బ్రహ్మకల్పసమోమతః ।
తస్యావసానేచోన్మేషో దేవదేవశిఖామణేః ।
నిమేషాంతేభ వేదిచ్ఛా స్రష్టుంలోకాంశ్చకుక్షిగాన్॥ ౮౦

తా॥ దేవతలకు దేవుఁడగు ఆ విష్ణుమూర్తియొక్క కన్నుమూయుట బ్రహ్మదేవునకు కల్పమగును. ఆ కల్పమంతమైనపిమ్మట దేవతాసార్వభౌముండగు ఆభగవంతుని కన్నుదెఱచుట సంభవించును. ఇట్లు కల్పమంతమైనపిమ్మట భగవంతుని హృదయమందున్న లోకములను తిరిగి సృజించవలయునని కోరికకలుగును.

శ్లో॥ సోపశ్యత్స్వోదరేసర్వా స్జీవసంఘాననేకశః ।
సృజ్యాన్ముక్తానముంలింగం లింగభంగముపాగతాన్ ॥ ౮౧

తా॥ ఆ భగవంతుఁడు తన హృదయమందుండినదియు సృజింపదగినవారును లింగశరీరముతోఁగూడినవారును, లింగశరీరభంగమైనవారునునగు అనేక జీవసమూహములను సృజింపవలెనని నిచ్ఛగలవాఁడాయెను.

శ్లో॥ సుప్తాస్సుప్రతిష్ఠాస్సర్వేపి తమోగాఅపిసర్వశః । పూర్వకల్పే లింగభంగ మాపన్నావిధిపూర్వకమ్। మానవాంతాజీవకోశా జీవన్ముక్తాశ్చముక్తిగాః। పూర్వకల్పేవిముక్తాశ్చ బ్రహ్మాద్యా మానవాంతకాః।ధ్యానసంస్థాహితిష్ఠంతి విష్ణుకుక్షిగతాఅపి॥

తా॥ నిద్రించుచున్నవారును, జాగ్రితకలిగియున్నవారును, అజ్ఞానదశయందున్నవారును, పూర్వకల్పములో విధిప్రవతారముగా లింగశరీరభంగముగలవారును పిపీలిక మొదలు మనుష్యుఁడంతముగాగల జీవులును, ముక్తినిబొందినవారును, జీవన్ముక్తిగలవారును, పూర్వకల్పముతో బ్రహ్మమొదలు మనుష్యపర్య తము ముక్తిని బొందినవారునగు సమస్తజీవరాసులు ప్రళయకాలమునందు విష్ణుమూర్తియొక్క హృదయమునందుండి ధ్యానముచేయుచుందురు,

శ్లో॥ ఉన్మేషప్రథమేభాగే చతుర్వ్యూహాత్మకోవిభుః ।
భూత్వాతుపూర్వపాద్మన్యా ద్వాసుదేవాచ్చవ్యూహగాత్ ।

దత్వాతుబ్రహ్మణోముక్తిం సాయుజ్యాఖ్యాంమహావిభుః॥ ౪౫॥

తా॥ కన్ను తెరచినంతటనే షడ్గుణైశ్వర్యసంపన్నుఁడగు విష్ణుమూర్తి వాసుదేవాది నాలుగువ్యూహమును గలవాడగుటవలన వాసుదేవవ్యూహము ననుసరించి బ్రహ్మదేవునకు సాయుజ్యమనెడు ముక్తినిచ్చెను.

శ్లో॥ దత్వాతదనుసాయుజ్యం తత్వజ్ఞానంమహాత్మనాం ।
సారూప్యంచైవకేషాంచి త్సామీప్యంచతథావిభుః ॥
సాలోక్యంచతథాన్యేషాం దత్వాదేవోజనార్దనః ।
అనిరుద్ధవశేసర్వాన్ స్థితాన్ లోకానలోకయత్ ॥ ౪౬

తా॥ బ్రహ్మదేవునకు సాయుజ్యముక్తి నిచ్చినపిమ్మట మఱియు కొందరు మహానుభావులకు తత్వజ్ఞానమును, కొందరకు సారూప్యముక్తియును కొందఱకు సామీప్యముక్తియును, కొందరకు సాలోక్యముక్తియును ప్రభువగు విష్ణుమూర్తి యిచ్చెను. మఱియు అనిరుద్ధవ్యూహము ననుసరించి భగవంతుని కుక్షియందుండిన సమస్తలోకములను జూచుచుండును.

శ్లో॥ ప్రద్యుమ్నస్యవశేదత్వా సృష్టింకర్తుం మనోదధే ।
మాయాంజయాంకృతింశాంతి ముపయేమేస్వయంహరిః ॥

తా॥ ఆవిష్ణుమూర్తి ప్రద్యుమ్నవ్యూహములోనుండి సృష్టినిజేయుటయందిచ్ఛ గలవాడగును. ఈ విష్ణుమూర్తి మాయ, జయ, కృతి, శాంతి అనునాలుగు శక్తులను వాసుదేవము, అనిరుద్ధము, ప్రద్యుమ్నము, సంకర్షణము అను నాలుగు వ్యూహముల యందుండి క్రమముగా వరియించెను.

శ్లో॥ చతుర్వ్యూహైఃపూర్ణగుణై ర్వాసుదేవాదికైః క్రమాత్ ।
తాభిర్యుక్తోమహావిష్ణు శ్చతుర్వ్యూహాత్మకోవిభుః ।
భిన్నకర్మాశయంలోకం పూర్ణకామోవ్యజీజనత్ ॥

తా॥ ప్రభువగు విష్ణుమూర్తి పూర్ణమైన గుణములుగల వాసుదేవము మొదలుగాగల నాలుగువ్యూహములు గలవాడై మాయ మొదలగు నాలుగుశక్తులతో గూడి సంపూర్ణమైన కోరికలు గలవాడగుచు ప్రపంచమును వేరువేరుకర్మములు అభిప్రాయలు గలదానిగా సృజియించెను.

శ్లో॥ ఉన్మేషాంతేపునస్విష్ణు ర్యోగమాయాంసమాశ్రితః ।
సంకర్షణాద్వ్యూహగాచ్చ హరత్యేతచ్చరాచరం ।
త - తత్సర్వమాఖ్యాతం కార్యంచింత్యంమహాత్మనః॥ ౫౧

తా॥ ఈ ప్రకారముగా బ్రహ్మదేవునకు పగలు అగునంతకాలము సృష్టి జేసినపిమ్మట విష్ణుమూర్తి యోగమాయనాశ్రయించి కన్నులుమూయగా బ్రహ్మదేవునకు రాత్రియగును. అప్పడు విష్ణుమూర్తి సంరక్షణమను వ్యూహమునుబొంది జంగమస్థావరాత్మకమైన యీ ప్రపంచమునంతయు నశింపజేయును. కాబట్టి మహానుభావుడగు విష్ణుమూర్తి యొక్క కృత్యమీరీతిగా జరుగుచుండును. కాన విచారించి దానినంతయును జెప్పితిని.

శ్లో॥ యదచింత్యందుర్విభావ్యం బ్రహ్మాదైరపియోగిభిః ॥

తా॥ ఓ కిరాతుడా ! ఆ భగవంతుని కృత్యములు బ్రహ్మ మొదలగుదేవతల చేతను, యోగీశ్వరులచేతను తెలిసికొన శక్యముకానివైయుండును.

వ్యాధః॥శ్లో॥ కేవాభాగవతాధర్మాః కైర్విష్ణుశ్చప్రసీదతి।
తానహంశ్రోతుమిచ్ఛామి సాంప్రతంవదనాన్మునేః ॥ ౫౨

తా॥ కిరాతుడడుగుచున్నాడు. ఓ మునీశ్వరా ! భగవత్సంబంధములగు ధర్మములెవ్వి ? ఏ ధర్మములనుజేసిన విష్ణుమూర్తి యనుగ్రహముకలవాడగును ? మునీశ్వరుడవగు నీ ముఖమువలన వినవలయునని నేను కోరికగలవాడనైయుంటిని-కాబట్టి చెప్పవలయును.

శంఖః॥శ్లో॥ యేనచిత్తవిశుద్ధిస్స్యా ద్యస్సతాముపకారకః । తంవిద్ధిసాత్వికంధర్మం యశ్చకేనాప్యనిందితః । శ్రుతిస్మృత్యుదితోయస్తు యదినిష్కామకోభవేత్ । యస్తులోకావిరుద్ధోపి తంధర్మం సాత్వికంవిదుః॥

తా॥ శంఖమునీశ్వరుడు చెప్పుచున్నాడు. ఏ ధర్మము మనస్సునందుండెడి దుర్గుణములను బోగొట్టునో, ఏ ధర్మము సత్పురుషులకు నుపకారియగునో యే ధర్మము ఎవనిచేతను దూషింపబడకుండునో, ఏ ధర్మము వేదములయందు, ధర్మశాస్త్రములయందు చెప్పబడునో, యేది కోరికరహితునిగా జేయునో, యే ధర్మము లోకమునకు అనుకూలమైయుండునో ఆ ధర్మమునే సాత్వికధర్మముగా తెలిసికొనుచున్నారు.

శ్లో॥ చతుర్విధాహి తేధర్మా వర్ణాశ్రమవిభాగతః ।
నిత్యనైమిత్తికాః కామ్యాఇతితే చ త్రిధామతాః॥

తా॥ బ్రాహ్మణాది చతుర్వర్ణమునచేతను, బ్రహ్మచర్యాది చతురాశ్రమముల చేతను నాలుగువిధములుగా నుండియున్న ధర్మములు నిత్యమనియు, నైమిత్తికమనియు కామ్యమనియు తిరిగి మూడువిధములుగా నుండెను.

శ్లో॥ తేసర్వేస్వస్వధర్మాశ్చ యదావిష్ణౌసమర్పితాః ।
తదావై సాత్వికాజ్ఞేయా ధర్మాభాగవతాశ్శుభాః ॥

తా॥ పూర్వమందు జెప్పఁబడిన నాలుగువర్ణములవారును వారివారి ధర్మములను జేయుచు విష్ణుమూర్తికి ఫలసమర్పణను జేసినయెడల నప్పుడు ఆ ధర్మములు సాత్వికధర్మములనియు, శుభములనొసఁగు భగవత్సంబంధమగు ధర్మములనియు జెప్పబడును.

శ్లో॥ దేవతాంతరదైవత్యా స్సకామారాజసామతాః : ౫౭
యక్షరక్షఃపిశాచాది దైవత్యాలోకనిష్ఠురాః :
హింసాత్మకానిందితాశ్చ ధర్మాస్తేతామసాస్మృతాః॥ ౫౮

తా॥ విష్ణుసంబంధముగాక యితర దేవతాసంబంధములగునవియు, కోరికతో గూడినదియునగు ధర్మములు రాజసధర్మములనియు, యక్షులు రాక్షసులు పిశాచములు మొదలగు దేవతాసంబంధము లగునవియు. జనులకందరకును కఠినమైనవిగా నుండుననియు. హింసాస్వరూపమైనవియు, దూష్యములగు ధర్మములు తామస ధర్మములనియు చెప్పఁబడుచున్నవి.

శ్లో॥ సత్వస్థాస్సాత్వికాన్ధర్మా న్విష్ణుప్రీతికరాంచ్ఛుభాన్ ।
కుర్వంత్యనీహయానిత్యం తేవై భాగవతాస్మృతాః ॥ ౫౯

తా॥ సాత్వికగుణముగలవారు శుభములనొసఁగుననియు, విష్ణుమూర్తికి ప్రీతికరమగు సాత్విక ధర్మములను ఫలమునపేక్షింపక నెల్లప్పుడు జేయుచుందురు. కాబట్టి వారే భాగవతులని చెప్పఁబడుదురు.

శ్లో॥ యేషాంచిత్తంసదావిష్ణౌ జిహ్వాయాంనామవైవిభోః ।
పాదాచహృదయే యేషాం తేవై భాగవతాస్మృతాః॥ ౬౦

తా॥ ఎవరియొక్క మనస్సు యెల్లప్పుడు విష్ణుమూర్తియందుండునో నాలుక ఆ భగవంతుని నామస్మరణమును జేయుచుండునో, ఆ విష్ణునిపాదములు యెవరి హృదయమునందు ధ్యానింపబడుచుండునో వారు భాగవతులు.

శ్లో॥ సదాచారరతాయేచ, సర్వేషాముపకారకాః ।
సద్దైవమమతాహీనా స్తేవై భాగవతాస్స్మృతాః॥ ౬౧

తా॥ ఎవరు యెల్లప్పుడు ఆచారముగలవారుగాను, సమస్తప్రాణులకు నుపకారము జేయువారుగాను, ఎల్లప్పుడు ఈషణములయందు మోహావేశమును వదలియుందురో వారే భాగవతులని చెప్పఁబడుదురు.

శ్లో॥ యేషాంచశాస్త్రేవిశ్వాసో గురౌసాధుషుకర్మసు ।
యేవిష్ణుభక్తాస్సతతం తేవై భాగవతాస్స్మృతాః ॥

తా॥ శాస్త్రమందు, గురువుయందు, సత్పురుషులయందు, కర్మములయందు యెవరికి విశ్వాసముండునో, ఎవరు విష్ణుమూర్తియందు భక్తిగలవారైయుందురో వారే భాగవతులని చెప్పఁబడుదురు.

శ్లో॥ యేషాంహిసమ్మతాధర్మా శ్శాశ్వతావిష్ణువల్లభాః ।
శ్రుతిస్మృత్యుదితాయేచ తేధర్మాశ్శాశ్వతామతాః॥ ౬౩

తా॥ ఎవరికిష్టమగు ధర్మములు స్థిరమైనవియు, విష్ణుసంబంధమగునవియు వేదములచేతను స్మృతులచేతను చెప్పఁబడినవియునై యుండునో అవియే శాశ్వతమగు ధర్మములని చెప్పఁబడియున్నవి.

శ్లో॥ అటనంసర్వదేశేషు వీక్షణం సర్వకర్మణాం ।
శ్రవణంసర్వధర్మాణాం విషయాసక్తచేతసామ్ ॥ ౬౪

తా॥ సమస్త పుణ్యప్రదేశములయందు సంచరించుటయు సమస్తపుణ్యకార్యములను జూచుటయు, విషయములయందు మనస్సును బోనివ్వనట్టి సమస్తధర్మములను వినుచుండుటయు జేయుచుండవలెను.

శ్లో॥ అకించిత్కరమేతేషాం షండస్యేవవరస్త్రియః ॥

తా॥ చక్కని స్త్రీలైనప్పటికిని నపుంసకునికి పనికిరానట్లు యీ ప్రపంచ భోగములన్నియు జ్ఞానులకు నుపయోగములుకావు.

శ్లో॥ సాధూనాందర్శనేనైవ మనః ప్రద్రవతి వై సతామ్ .
చంద్రిక్యకౌముదీసంగా చ్చంద్రకాంతశిలాయథా ॥

తా॥ చంద్రికిరణప్రసారమువలన చంద్రకాంతశిల కరగినట్లు సజ్జనుల దర్శన మగుటతోడనే సత్పురుషుల చిత్తములు కరగుచుండును.

శ్లో॥ క్వచిత్సచ్ఛాస్త్రశ్రవణా ద్విషయేభ్యోజ్జ్వలన్మనః । ౬౬
తిష్ఠత్యేవ సతాం పుంసాం తేజోరూపో హ్యకల్మషః ।
ధర్మబంధోఽపరిభానంగా త్సూర్యకాంతశిలాయథా॥ ౬౭

తా॥ ఒకానొకప్పుడు మంచిశాస్త్రములను వినుటవలన సత్పురుషులయొక్క మనస్సు నిర్మలమైనదై విషయములనుగుర్తించి వైరాగ్యముచే సూర్యకిరణప్రసార ముచే సూర్యకాంతమణివలెనే మండుచు ప్రకాశముగలదియగుచు నుండును.

శ్లో॥ నిష్కామైర్ద్విజనైర్యస్తు శ్రద్ధయాసముపాశ్రితః
యోవిష్ణువల్లభోనిత్యం ధర్మోభాగవతోమతః ॥ ౬౮

తా॥ కోరికరహితులగు మనుష్యులచే శ్రద్ధతోగూడి చేయఁబడినదియు విష్ణు ప్రీతికరమగునదియు నగునే ధర్మముకలదో అదియే భగవత్సంబంధమగు ధర్మమని చెప్పఁబడును.

శ్లో॥ శాస్త్రదృష్టాబహవోధర్మా ఇహాముత్రఫలప్రదాః
విష్ణుప్రీతికరాన్యాత్తా స్సర్వదుఃఖవిమోచకాః॥ ౬౯

తా॥ ఈ లోకంబునను పరలోకంబునను సుఖములనిచ్చునవియు, విష్ణుమూర్తికి సంతోషకరమైనవియు, రహస్యమైనవియు, సమస్తసుఖములను బోగొట్టు నవియు నగు ననేకధర్మములు పూర్వమునుండియు మహానుభావులగువారికి తెలియ బడియేయున్నవి.

శ్లో॥ దధ్నస్సారమివోద్ధృత్య ధర్మంవైశాఖసంభవం ।
దదౌ మే భగవానాహ లక్ష్మీరాద్ధాహితకామ్యయా॥ ౭౦

తా॥ పెరుగుచిలిచి వెన్నను తీసినట్లుగనే సమస్తధర్మములలో శ్రేష్ఠమగు వైశాఖధర్మమును విష్ణుమూర్తి లక్ష్మీదేవికి మేలుఁజేయువాఁడై పాలసముద్రంబున శయనించియుండఁగా నొకప్పుడు చెప్పెను.

శ్లో॥ మార్గచ్ఛాయావినిర్మాం ప్రపాదానంచవై తథా ।
వ్యజనై ర్వీజనంచైవ ప్రశ్రియాణాంసమర్పణమ్॥ ౭౧

తా॥ ఆ ధర్మములేవియనఁగా, మార్గములో నీడగా నుండునట్లు నిర్మించుట, చలివేంద్ర నేర్పఱచుట, విసనకఱ్ఱలతో వీచుట, మఱియునుపచారములను జేయుట యును జరుపుచుండవలయును.

శ్లో॥ ఛత్రిస్యోపానహోర్దానం దానం కర్పూరగంధయోః ।
వాపీకూపతటాకానాం నిర్మాణంవిభవేసతి । ౭౨

తా॥ గొడుగునిచ్చుట, పాదుకలనిచ్చుట, కర్పూరము మంచిగంధమునిచ్చుట భాగ్యముండినయెడల దిగుడుబావులను బావులను కట్టించుట, చెఱువులనుత్రవ్వించుటయు జేయవలయును.

శ్లో॥ సాయాహ్నే పానకస్యాపి దానంచకుసుమస్యచ ॥
తాంబూలదానంపాపఘ్నం గోరసానాంవిశేషతః ॥ ౭౩

తా॥ సాయంకాలమునందు పానకమునిచ్చుటయు, పుష్పమునిచ్చుటయు, తాంబూలమునిచ్చుటయు, పాపములనుబోగొట్టు ఆవుసంబంధమగు పాలు మొదలగువానిని విశేషముగా నిచ్చుటయు జేయవలెను.

శ్లో॥ లవణాన్వితతక్రస్య దానంశ్రాంతాయవై పథి ।
అభ్యంగచరణంచైవ ద్విజపాదావనేజనమ్ ॥ ౭౪

తా॥ ఎండవేడిమిచే నలసియున్నవానికి ఉప్పుకలిపిన మజ్జిగ నిచ్చుటయు తలంటిపోయుటయు, బ్రాహ్మణులకు పాదప్రక్షాళనజేయుటయు జేయవలెను.

శ్లో॥ కటకంబలపర్యంక దానంగోదానమేవచ
మధుయుక్తంతిలానాంచ దానంపాపవినాశనమ్। ౭౫

తా॥ చాప, కంబళి శయ్య మొదలగువాని నిచ్చుటయు, గోవునిచ్చుటయు, తియ్యని పదార్థములంగలిపిన నువ్వులను దానమిచ్చుటయు జేసినపాపములునశించును

శ్లో॥ సాయాహ్నే చేక్షుదండానాం దానమూర్వారుకస్యచ
రసాయనప్రహిణంచ పిత్తనిర్వాపనంతథా ॥ ౭౬

తా॥ సాయంకాలంబున చెఱకుగడల నిచ్చుటయును, దోసపండ్లనిచ్చుటయును మరియును రసములనిచ్చుటయును, పితృదేవతలకు తర్పణాంజలులనిచ్చుటయును జేయుచుండవలయును.

శ్లో॥ ఏతేధర్మాతిశిష్టోక్తా మాసేస్మిన్మాధవప్రియే । ప్రాతస్సూర్యోదయేస్నాత్వా బ్రాహ్మణైర్ద్విజకులేరితమ్ । నిత్యకర్మాణికృత్వైవం మధుసూదనమర్చయేత్ । కథాం మాధవమాసీయాం శృణుయాచ్చ సమాహితః ।

తా॥ ఓ కిరాతుఁడా ! ఇప్పుడు నేజెప్పిన ధర్మములన్నియు నన్నిధర్మములలో నుత్తమమైనవిగా జెప్పఁబడెనుగాన విష్ణుప్రీతికరమైన ఈ వైశాఖమాసంలో సూర్యోదయకాలంబున స్నానముజేసి బ్రాహ్మణులచే జెప్పఁబడినధర్మముల ననుసరించుచు సంధ్యావందనాది నిత్యకర్మములనుజేయుచు, విష్ణుమూర్తిని పూజించుచు సావధానచిత్తుడై వైశాఖమాసకథను వినుచుండవలయును.

శ్లో॥ తైలాభ్యంగంవర్జయేచ్చ కాంస్యపాత్రేతుభోజనం ।
నిషిద్ధభక్షణంచైవ వృధాలాపంతువర్జయేత్ । ౭౯

తా॥ నూనెతో తలనంటుకొనుటయును, కంచములో భుజించుటయును శాస్త్రములో నిషేధింపఁబడిన పదార్థములను భుజించుటయును, వ్యర్థమైన సంభాషణ జేయుటయు వైశాఖమాసములో విడువవలయును.

శ్లో॥ అలాబూంగృంజనంచైవ లశునంతిలపిష్టకం ।
ఆరనాళంభిస్సటంచ ఘృతకోశాతకీంతధా॥ ౮౦

తా॥ సొరకాయను: వెల్లుల్లి, నువ్వులపిండి, పులిగడుగు, చద్దియన్నము, నేతిబీరకాయ మొదలగువానిని విడువవలయును.

శ్లో॥ ఉపోదకీంకళింగంచ శిగ్రుశాకంచవర్జయేత్ ।
నిష్పావానికుళుత్థాని మసూరాణిచవర్జయేత్ ౮౧

తా॥ బచ్చలికూర, కొడిసపండు, ములగకాడలు, పక్వముగాని పదార్థములను, ఉలవలను, చిరుసెనగలను భుజింపకూడదు.

శ్లో॥ వృంతకాని కళింగాని కోద్రివాణిచవర్జయేత్ ।

తండులీయవశాకంచ కౌసుంభంమూలకంతథా । ౮౨

తా॥ తోడిమిగలపదార్థములను, కొడిశపండ్లను, అళ్ళను, చిత్రికూరను, యవధాన్యముయొక్క కూరను, కుసుమపువ్వులను, ముల్లంగిదుంపలను వైశాఖమాసవ్రతం గలవారు విడువవలయును.

శ్లో॥ ఔదుంబరంబిల్వఫలం తథాశ్లేష్మాంతకీఫలం ।
సర్వదావర్జయేద్విద్వాన్ మాసేస్మిన్మాధవప్రియే॥ ౮౩

తా॥ తెలిసిన విద్వాంసుఁడు విష్ణుప్రీతికరమగు వైశాఖమాసములో మేడిపండు మారేడుపండు, విరిగిచెట్టుపండ్లను భుజియించుట సమస్తపవిత్రమైన ములచేత విడువవలెను.

శ్లో॥ ఏతేష్వమన్యతమంభుక్త్వా సచండాలోభవేద్ధ్రువం ।
తిర్యగ్యోనిశతంయాతి నాత్రకార్యావిచారణా ॥ ౮౪

తా॥ ఈ చెప్పఁబడిన నిషిద్ధవస్తువులలో దేనినైనను తిననవాఁడు జీవించియుండుగా చండాలుఁడై పిమ్మట మాలజన్మముల పర్యంతము మృగజన్మ మెత్తుచుండును. నిశ్చయము. ఇందువిషయమై విచారణేమియు చేయనక్కరలేదు.

శ్లో। ఏవంమాసవ్రతంకుర్యా త్ప్రీతయేమధుఘాతినః । ఏవంవ్రతే సమాప్తేతు ప్రతిమాంకారయేద్విభోః । మధుసూదనదైవత్యాం సనస్త్రాంచసదక్షిణాం । స్వర్చితాంవిభవైస్సర్వై ర్బ్రాహ్మణాయని వేదయేత్ ॥ ౮౫

తా॥ యీ ప్రకారము విష్ణుమూర్తి ప్రీతికొరకు వైశాఖమాసవ్రతమును జేయుచు విష్ణుమూర్తి ప్రతిమను జేయించి వానికి వస్త్రమును జుట్టి తన వైభవమును ననుసరించి పూజించి యా ప్రతిమను దక్షిణసహితముగా బ్రాహ్మణునకు దానమియ్యవలయును.

శ్లో। వైశాఖాసితద్వాదశ్యాం దద్యాద్ధన్నమంజసా ।
సోదకుంభంసతాంబూలం సఫలంచసదక్షిణమ్ ।
దదామి ధర్మరాజాయ తేనప్రీణాతువైయమః ॥

తా॥ వైశాఖబహుళ ద్వాదశియందు శీఘ్రముగా పెరుగుకలిపిన యన్నమును

జలముగల కలశమును, ఫలములు దక్షిణలుగల తాంబూలము నిచ్చినయెడల ధర్మరాజు సంతోషించును.

శ్లో॥ అపసవ్యాత్సముచ్చార్య నామగోత్రే పితుస్తతః।
దద్యాద్దధ్యన్న మక్షయ్యం పితౄణాంతృప్తిహేతవే।
గురుభ్యశ్చతథాదద్యాత్పశ్చాద్దద్యాచ్చవిష్ణవే॥ ౮౯

తా॥ యజ్ఞోపవీతము నపసవ్యము జేసికొని తండ్రియొక్క గోత్రనామములను జెప్పి పెరుగుకలిపిన యన్నము గురువులకును, అనంతరము విష్ణువునకు నిచ్చినయెడల పితృదేవతలు తృప్తిజెందుదురు. నాశనరహితమగు ఫలము సంభవించును.

శ్లో॥ శీతలోదకదధ్యన్నం కాంస్యపాత్రస్థముత్తమం। సదక్షిణంసతాంబూలం సభక్ష్యంచ ఫలాన్వితమ్। తదామివిష్ణవేతుభ్యం విష్ణులోకజిగీషయా।ఇతిదత్వా యథాశక్త్యా గాంచదద్యాత్కుటుంబినే

తా॥ చల్లనియుదకమును, పెరుగుకలిపిన యన్నమును శ్రేష్ఠమగు కంచుపాత్రయందుంచి దక్షిణలు, తాంబూలము, భక్ష్యములు, ఫలములు మొదలగువాని నుంచి విష్ణుమూర్తి నుద్దేశించి కుటుంబవంతుఁడగు బ్రాహ్మణునకిచ్చి పిమ్మట తన శక్తికొలదియు గోదానమును జేసినయెడల విష్ణులోకమును బొందుదురు.

శ్లో॥ ఏవంమాసవ్రతంకుర్యా ద్యస్తుదంభేనవర్జితః। ససర్వైః పాతకైర్హీనః కులముద్ధృత్యవై శతం। పశ్యతామేవ భూతానాం భిత్వావై సూర్యమండలం।యాతివిష్ణోఃపరంధామ యోగినామపిదుర్లభం

తా॥ ఈ ప్రకారం మెవఁడు కపటములేనివాఁడై వైశాఖమాసవ్రతమును జేయునో వాఁడు సమస్తపాపములను బోఁగొట్టుకొని నూఱుతరములవారిని గూడ తరింపజేసి సమస్తభూతములు జూచుచుండఁగా సూర్యమండలమును భేదించి యోగీశ్వరులకైనను పొందశక్యముగాని విష్ణులోకమును బొందును.

శ్లో॥ వ్యాఖ్యాత్యేవం ద్విజకులవరే మాధవీయాంశ్చ ధర్మాన్। విష్ణ్వాఖ్యాతానతిమహిమకా న్వ్యాధపృష్టాంత్సమస్తాన్। వటస్కంధస్థః పశ్యతామేవభూమా వపాతాహో పంచశాఖీద్రుమేయం

తా॥ ఈ ప్రకారము ఆ బ్రాహ్మణోత్తముఁడు విష్ణువుచే నిర్ధారణజేయఁబడిన

వైశాఖమాస ధర్మములు నన్నియు కిరాతుఁడడుగగా విశదముగా జెప్పుచున్న సమయములో నక్కడనుండు అంజులుకొమ్మలుగల యొకమర్రిచెట్టు అంతరు జూచుచుండగా భూమిపైఁబడగా నాశ్చర్యమాయెను.

శ్లో॥ వృక్షాత్తస్మాత్కోటరే సంస్థితోహివ్యాళోకశ్చిద్దీర్ఘదేహీకరాళం। హిత్వాదేహం పాపయోనించ సద్యస్సవైతస్థౌ ప్రాంజలి రబ్రవమూర్ధా॥

తా॥ అప్పుడు ఆ వృక్షముయొక్క తొఱ్ఱిలోనుండి పెద్దశరీరముగలదియు భయంకరమైన యొకసర్పము బయటికివచ్చి పూర్వజన్మకృతంబైన పాపముచే సంభవించిన యా సర్పదేహమును విడిచి యప్పుడే మనుష్యరూపమునొంది యామునీశ్వరు నెదుట దోసిలిపట్టి శిరస్సువంచి నిలుచుండెను.

భాగవతధర్మకథనం నామవింశోధ్యాయస్సమాప్తః

---

## ఏకవింశోధ్యాయః

శ్రుతదేవః॥శ్లో॥ తతస్తువిస్మితోభూత్వా శంఖోవ్యాధ సమన్వితః।
కోభవానితితంప్రాహ దశైషాచకుత స్తవ। కేనవాకర్మణా
సౌమ్యామతి స్తవశుభావహా। ఆశస్మాత్తేకథంముక్తి రేతదా
చక్ష్వవిస్తరాత్॥ 1

తా॥ శ్రుతదేవుఁడు చెప్పుచున్నాఁడు. అనంతరము కిరాతునితో గూడ నక్కడుండిన శంఖమహాముని యతనినిజూచి యాశ్చర్యమునుబొంది నీ వెవరవు? నీ కిట్టియవస్థ యేలసంభవించెను? నీ వేకర్మఁ జేయుటచే నిట్టి మంచిబుద్ధి కలిగెను? శీఘ్రముగా ముక్తి యే విధముగా కలిగెను? దీనినంతయు సవిస్తరముగా జెప్పుము అని యాతనినడిగెను.

శ్లో॥ శంఖేనైవం తథాపృష్టో దండవత్పతితోభువి।
ప్రశ్రియావనతోభూత్వా ప్రాంజలిర్వాక్యమబ్రవీత్॥ 3

తా॥ ఈ ప్రకారమా మునీశ్వరుఁడడుగా నప్పుడు దండమువలెనే భూమిమీఁద బడి సాష్టాంగనమస్కారముజేసి వినేయతగలిగి శరీరమునువంచి దోసిలిపట్టి యిట్లు చెప్పుచున్నాఁడు.

నొక బ్రాహ్మణుఁడు ఆ పుణ్యక్షేత్రములయందు నివసించియుండెడి పుణ్యాత్ము లయిన బ్రాహ్మణులకు భగవద్భక్తులకు సంతోషకరమగు వైశాఖమాస ధర్మము లను వినుపించుచుండెను.

శ్లో॥ నారీనరాః క్షత్రియాశ్చ వైశ్యాశ్శూద్రా స్సహస్రశః ప్రాతస్స్నాత్వా సమభ్యర్చ్య మధుసూదనమవ్యయమ్ । కథాం శుశ్రూషంతిసతతం జయేంతేనసమీరితాం । శుచిర్భూత్వామానధరా వాసుదేవకథారతాః । వైశాఖధర్మనిరతా దంభాలస్య వివర్జితాః॥

తా॥ బ్రాహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు ననెడు నాలుగుజాతులపురుషు లును స్త్రీలును అందరును వైశాఖమాసములో ప్రాతఃకాలంబున స్నానముజేసి నాశనరహితుఁడగు విష్ణుమూర్తిని పూజించి శుచిగలవారై యితరసంభాషణములను వర్జించి విష్ణుసంబంధములగునవియు, వైశాఖసంబంధములగునవియు నగు ధర్మముల యందాసక్తి గలవారలై కపటమును మూఢత్వమును విడిచి యెల్లప్పుడు ఆ జయుం తుడు చెప్పుచుండిన కథలనే వినుచుండిరి,

శ్లో॥ తాంసభాంచప్రవిదాహం కౌతుకాచ్చదిదృక్షయా ।
సోష్ణీషేణమయామూర్ధ్నా నమస్కారోపినోమునే ।
తాంబూలంచముఖేకృత్వా కంచుకంచ మయాధృతమ్। ౧౩

తా॥ ఓ మునీశ్వరా! ఇట్లు కథాకాలక్షేపము జరుగుచుండు సమయములో నా సభను జూచుటయందు వాంచగలవాడనై చొక్కాయి తొడిగికొని తలపాగ జుట్టికొని తాంబూలమును నములుచు నా సభలోనికి వెళ్ళినవాడనై యొక్కమహాను భావునికైనను నమస్కరింపనైతిని.

శ్లో॥ కథావిక్షేపమకరం లోకవార్తాభిరంజసా ।
సర్వేషాంచిత్తచాంచల్య మభూద్వైలోకవార్తయా॥ ౧౪

తా॥ మఱియు నేను ఆ కథను వినకుండుటయేగాక వారు వినుచుండెడి కథ నాక్షేపించుచు యితరములగు లోకవార్తలను జెప్పుచు నక్కడ నుండెడివారి మన స్సులను చలించునట్లు జేసియుంటిని.

శ్లో॥ క్వచిద్వాసః ప్రసార్యాహం క్వచిన్నిందస్య_ప్యవిద్ధసన్
ఏవంకాలోమయానీతః కథాయామవతమాప్యతే॥ ౧౭

తా॥ ఒకచోట నొకనివస్త్రము లాగుచు, మఱియొకచోట నొకని నిందించుచు, నింకొకచోట మఱియొకనితో నవ్వుచు నిట్లు కథ సమాప్తియగునంతపర్యంతము పరిహాసము జేయుచుంటిని.

శ్లో॥ పశ్చాత్తేనైవదోషేణ సద్యోల్పాయుర్వినష్టధీః॥
సన్నిపాతేనపంచత్వం ప్రాప్తోహంచపరేదినే ॥ ౧౮

తా॥ అనంతరము మూఢుఁడనై అప్పుడు నే జేసిన దోషముచే నా యాయుర్దాయమంతయు శీఘ్రముగా నశించి సన్నిపాతరోగము సంభవించి యామరుదినమునంజే మృతినొందితిని.

శ్లో॥ తప్తసీసజలైః పూర్ణం నిరయంచ హాలాహాలం। ప్రాప్యభుక్త్వా
యాతనాంచ మన్వంతానిచతుర్దశ । యుక్తేష్వధచలత్సేషు
తథాచతురశీతిభిః । క్రమాద్యోనిషుజాతోహ వింధాసించావ
సందుమే ॥ దశయోజనవిస్తీర్ణే శతయోజనమున్నతే । వ్యాళోహంతామసఃక్రూర స్సప్తయోజనంకోటరే ॥ భూత్వావ
సామివిప్రశ్రే కర్మణాబాధితఃపురా । అయుతంచసమాయాతా
నిరాహారస్యకోటరే॥ ౨౦

తా॥ ఆటుపిమ్మట కాచబడిన సీసముచేతను, జలములచేతను నిండియున్న నరకమందుండి కాలకూటవిష మనుభవించుచు పదునాలుగు మన్వంతరములు యాతనల ననుభవించి పిమ్మట యెనుబదినాలుగు లక్షల జీవరాసులయందు క్రమముగా జన్మించుచు పిదప నొక సర్పమునై పదియామడలు పొడవును, నూఱామడలు యెత్తును గల యీ మఱ్ఱిచెట్టునందుండు ఏడామడలు విశాలముగల తొఱ్ఱలోనుండి తామసుఁడను క్రూరుఁడనై పూర్వజన్మంబున జేయఁబడిన పాపకర్మముచే బాధింపఁబడుచు పదివేల సంవత్సరములనుండి యాహారములేక . యీ తొఱ్ఱలో నివాసము జేయుచుంటిని.

శ్లో॥ ద్వైనాత్తముఖాంభోజ సమీరితకథామృతం ।
శ్రుత్వాచచక్షుశ్చలుకై స్సచ్యోధ్వస్తాశుభోమునే ॥

తా॥ గ్రుడ్డివానికి సమస్తమును జూపునట్టి కౌటుకవలెనే ధనమదముగలవానికి దరిద్రము, సచ్చరిత్రగల మహామహాత్ముల సహవాసము నెల్లప్పుడుండవలెను.

శ్లో॥ ఇతితంబహుధాస్తుత్వా ప్రణమ్యచ పునఃపునః ।
ప్రాంజలి ప్రణతస్తస్థౌ తూష్ణీమేవతదగ్రతః ॥ ౨౭

తా॥ ఈ ప్రకారము అనేకవిధములుగా స్తుతియించి మాటిమాటికి నమస్కరించుచు దోసిలిజేసి శిరస్సువంచి యా మునీశ్వరునెదుట నిలుచుండిపూరకుండెను,

శ్లో॥ శంఖోదోర్భ్యాం సముత్థాప్య పూర్ణప్రేమ పరిప్లుతః ।
పస్పర్శపాణినాచాంగం కృతేనచగతాగసమ్ ।
చక్రేసోనుగ్రహంతస్మి న్దివ్యరూపధరేద్విజే ।
ప్రాహతం కృపయావిష్టో భావివృత్తాంతమంజసా॥ ౨౮

తా॥ శంఖమునీశ్వరుడు మిక్కిలి ప్రేమగలవాడై చేతులతో నెత్తి కూర్చుండబెట్టి ధర్మములను వినుటచే సమస్తపాపములు నశించిన యా పురుషుని తన హస్తముచే నన్ని యవయవములను స్పృశించి శ్రేష్ఠమగు స్వరూపమును ధరించియున్న యా బ్రాహ్మణునియందు అనుగ్రహముంచి దయతోగూడినవాడై యాతనితో ముందు జరుగబోవు వాని వృత్తాంతమును జెప్ప నుపక్రమించెను.

శ్లో॥ ద్విజతేమాస మహాత్మ్య శ్రవణాచ్చ హరేరపి । మహాత్మ్య శ్రవణాత్సద్యో విధ్వస్తాఖిలబంధనః ॥ అతిహాయ కళంకంచ క్రిమాద్గత్వా పునర్భువి । దశార్ణవిషయే పుణ్యే భవితాత్వం ద్విజోత్తమః ॥ వేదశర్మేతివిఖ్యాత స్సర్వ వేదవిశారదః । తత్రతేభవి తాజాతి స్మృతిరాత్యంతికీశుభా॥ ౩౨

తా॥ ఓ బ్రాహ్మణుడా! వైశాఖమాసధర్మములను వినుటవలనను, విష్ణుమూర్తియొక్క కథలను విన్నటవలనను శీఘ్రముగానే విడపోయిన సమస్త సంసారబంధములుగలవాడవై సమస్తకలుషములను క్రిమముగా బోగొట్టుకొని తిరిగి జన్మంబున పుణ్యాకరమైన దశార్ణదేశమునందు బ్రాహ్మణుడవుగా బుట్టి వేదశర్మ యను పేరుగలవాడవై సమస్తవేదశాస్త్రముల నభ్యసించినవాడవై శుభప్రదమగు పూర్వజన్మజ్ఞానముగలవాడవై యుందువు.

శ్లో॥ తథాస్మృతానుబంధస్త్వం త్యక్తపర్వేషణశ్శుభః ।
కరోషిసకలాన్ధర్మాన్వైశాఖోక్తాన్ హరిప్రియాన్॥ 33

తా॥ పూర్వజన్మ సంబంధములను తెలిసికొనినవాఁడవై ఈషణత్రయములను విసర్జించి మేలునందే వాంఛగలిగి విష్ణుమూర్తికి ప్రీతికరమైన వైశాఖమాసధర్మము లన్నియు జేయగలవు.

శ్లో॥ నిర్ద్వంద్వో నిస్పృహోఽసంగో గురుభక్తో జితేంద్రియః ।
సదా విష్ణుకథాలాపో భవితాత్రజన్మని॥ 34

తా॥ ఆ జన్మంబున శీతోష్ణాది ద్వంద్వరహితుఁడవును, వాంఛారహితుఁడవును, మోహములేనివాఁడవును, గురువునందు భక్తిగలవాడవును, ఇంద్రియములను జయించినవాడవును, ఎల్లప్పుడు విష్ణుకథాకాలక్షేపము గలవాడవగుదువు.

శ్లో॥ తతస్సిద్ధిం సమాప్యాథ విధ్వస్తాఖిలబంధనః ।
ప్రాప్స్యసిపరమంధామ యాజ్ఞైరపిదురాసదమ్॥ 35

తా॥ ఇట్లు జేయుచుండఁగా సమస్తబంధములను విడగొట్టుకొని ఫలసిద్ధిని బొంది యజ్ఞములచేతనయినను బొంద శక్యముగాని యుత్కృష్ట స్థానమగు విష్ణులోకమును బొందగలవు.

శ్లో॥ మాభైషీఃపుత్రభద్రం తే భవితా మత్ప్రసాదతః ।
హాస్యాద్భయాత్తథాక్రోధా ద్ద్వేషాత్కామాదథాపివా ।
స్నేహాద్వాసకృదుచ్చార్య విష్ణోర్నామాఘహారిచ ।
పాపిష్ఠా అపిగచ్ఛంతి విష్ణోర్ధామ నిరామయమ్। 36

తా॥ కుమారునితో సమానమైనవాఁడా ! నీవు భయపడకుము. నా యనుగ్రహము వలన నీకు శుభము కలుగగలదు. పరిహాసముచేగాని, భయముచేగాని, కోపముచేగాని, విరోధముచేగాని, కోరికచేగాని లేక స్నేహముచేగాని, ఏ విధముగానైనను పాపములను బోగొట్టునట్టి విష్ణునామమును ఒక్కపర్యాయమైనను స్మరించినయెడల పాపాత్ములైనను నాశనరహితమగు విష్ణులోకము బొందగలరు.

శ్లో॥ కిముతశ్రద్ధయాయుక్తా జితక్రోధా జితేంద్రియాః ।
దయావంతః కథాంశ్రుత్వా గచ్ఛంతీతిద్విజోత్తమ॥ 37

తా॥ ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! శ్రద్ధగలవారును, క్రోధములేనివారును, ఇంద్రియములను జయించినవారును, దయగలవారునగు సత్పురుషులు వైకుంఠమును బొందగలరని చెప్పనక్కరయేలేదు.

శ్లో॥ కేచిత్కేవలయాభక్త్యా కథాలాపైకతత్పరాః ।
సర్వధర్మోజ్ఝితావాపి యాంతివిష్ణోః పరంపదమ్॥ ౩౯

తా॥ కొందరు సమస్తధర్మములను విడిచిపెట్టినవారైనను ముఖ్యముగా విష్ణుభక్తిసేపొంది యా భగవంతుని సంబంధమగు కథలను సంభాషించుటయందే యాసక్తి గలవారై విష్ణులోకమును బొందుచున్నారు.

శ్లో॥ ద్వేషాదినాచభక్త్యావా కేచిద్విష్ణుముపాసతే ।
తేపియాంతిపరంధామ పూతనేవాసువారిణీ॥ ౪౦

తా॥ కొందరు భక్తిచేతను, కొందరు విరోధముచేతను విష్ణువును సేవించి ముక్తిని బొందుచున్నారు. అది యేలాగుననఁగా, పూతనయను రాక్షసి కృష్ణమూర్తి యొక్క ప్రాణములను దీయవలయునని వచ్చి యాకృష్ణునిచే తానే చంపబడి వైకుంఠమును బొందినవిధముగానే పొందుచుందురు.

శ్లో॥ మహద్భిస్సంగతోనిత్యం వాగ్వ్యాపారప్రదాశ్రియః ॥
ముముక్షూణాంచ కర్తవ్య స్సువిధిశ్రుతిచోదితః॥ ౪౧

తా॥ మోక్షమునందు వాంఛగలవారు సత్పురుషులతో సహవాసము, ఎల్లప్పుడును వారితో సంభాషించుట, వారిని యాశ్రయించుట యిట్టి సద్వ్యాపారములు చేయదగినవని శ్రుతులయందు జెప్పబడెను.

శ్లో॥ సవాగ్విసర్గో జనతాఘ విప్లవో యస్మి న్ప్రతిశ్లోక
మబద్ధవత్యపి । నామా న్యనంతస్య యశోంకితాని
శ్రుణ్వంతి గాయంతి గృణంతి సాధవః ॥ ౪౨

తా॥ ఏ శ్లోకమందైనను తప్పులుండినను విష్ణునామములు గూర్చబడియుండెనేని సత్పురుషులు అట్టి నామములు గల శ్లోకములను వినుచు గానముచేయుచు తలచుచుందురు కాబట్టి విష్ణుసంబంధమగు సంభాషణములే సమస్తజనుల పాపములను బోగొట్టును.

శ్లో॥ యః కష్టసేవాం నచ కాంక్షతే విభుర్న వాధనం భూరి నరూపయౌవనే। స్మృత స్సకృద్గచ్ఛతి ధామ భాస్వరం కంవా దయాళుం శరణం వ్రజేత॥ ౪౩

తా॥ ఏ ప్రభువు అతికష్టమైన సేవనుగాని, విశేషధనమునుగాని, ఆకారమునుగాని, యౌవనమునుగాని కోరక తన నామస్మరణమునే కోరుచుండునో అట్టి భగవంతుని నామస్మరణము ఒక్క పర్యాయము చేసినను ప్రకాశించుచును వైకుంఠమును బొందును. కాబట్టి అట్టివానిని విడిచి మరియొక యే దైవమును రక్షకునిగా పొందును ?

శ్లో॥ తమేవశరణం యాహినారాయణమనామయం।
భక్తవత్సలమవ్యక్తం చేతోగమ్యం దయానిధిమ్॥ ౪౪

తా॥ నాశనరహితుడును, భక్తులయందు ప్రేమగలవాడును, గోచరుడు కానివాడును, జ్ఞానమువలననే తెలియదగినవాడును దయాసముద్రుండు నగు ఆ నారాయణమూర్తినే రక్షకునిగా పొందుము.

శ్లో॥ కురుసర్వానిమాం ధర్మాన్వైశాఖోక్తాన్మహామతే।
తేనతుష్టోజగన్నాథ శ్శర్మతేచవిధాస్యతి॥ ౪౫

తా॥ విశేషబుద్ధిగలవాడా ! వైశాఖమాసమును గురించి జెప్పబడిన సమస్త ధర్మములను జేసితివేని జగత్ప్రభువగు ఆ నారాయణమూర్తి సంతసించి నీకుసుఖము నియ్యగలడు.

శ్లో॥ ఇత్యుక్త్వావిరరామాథ వ్యాధంద్రష్ట్వాసువిస్మితః।
సదివ్యఃపురుషఃప్రాహ పునస్తం మునిపుంగవమ్॥ ౪౬

తా॥ ఈ ప్రకారము శంఖమునీశ్వరుడు పలికి చాలించెను. అనంతరము యా దివ్యపురుషుడు కిరాతుని జూచి యాశ్చర్యమును బొంది తిరిగి యా మునీశ్వరునితో నిట్లు నిట్లు పలుకుచున్నాడు.

దివ్యపురుషః॥శ్లో॥ ధన్యోస్మ్యనుగృహీతోస్మిత్వయా శంఖదయాళునా। దిష్ట్యాగతామేదుర్యోని ర్యామిచైవపరాంగతిమ్॥

తా॥ దివ్యపురుషుడు పలుకుచున్నాడు. ఓ శంఖమునీశ్వరా ! దైవవశమున

దయాస్వభావముగల నీవు నన్ను అనుగ్రహించుటచే నే ధన్యుఁడనైతిని. నా హీన జన్మము తొలగిపోయెను. ఉత్తమలోకమును బొందగలను.

శ్లో॥ ఇతితంచపరిక్రమ్య హ్యానుజ్ఞాతో దినంయయౌ ।
తతస్సాయమభూద్రాజన్ శంఖోవ్యాధేనతోషితః॥ ౨౮

తా॥ ఈ ప్రకార మా దివ్యపురుషుఁడు పలికి యా మునీశ్వరునిచుట్టు దిక్కి ప్రదక్షిణముజేసి యా మునీశ్వరునివలన యనుజ్ఞవడసి స్వర్గలోకమునకు వెళ్ళెను. ఓ రాజా! అనంతరము సాయంకాలమాయెను. అప్పుడు కిరాతుడు శంఖమునీశ్వరునకనేక యుపకారములను జేసి సంతోషపెట్టెను.

శ్లో॥ సంధ్యాంసాయంతనీంకృత్వా రాత్రిశేషంనినాయచ । నానా
ఖ్యానైశ్చభూపానాం దేవానాంచమహాత్మనామ్ ॥ లీలాభిరవ
తారాణాం దృష్టగోష్ఠిభిరేవచ । బ్రాహ్మేముహూర్తేచో
త్థాయ పాదౌప్రక్షాళ్యవాగ్యతః । ధ్యాయేచ్ఛ తారకం
బ్రహ్మ కృత్వాశౌచాది సత్క్రియాః ॥

తా॥ ఆ మునీశ్వరుడు సాయంకాల సంధ్యావందనముజేసి రాజులయొక్కయు దేవతలయొక్కయు, మహానుభావులయొక్కయు కథలను భగవంతుని దశావతార విలాసములను, మరియు తాముజూచిన యితర చరిత్రములను జెప్పుకొనుచు వారిద్దరును యా రాత్రిని గడిపిరి. పిమ్మట ఆ మునీశ్వరుఁడరుణోదయకాలంబున లేచి పాదప్రక్షాళనము జేసికొని శుచిగానుండి సమస్తక్రియలనుజేసి మౌనము నవలంబించి తారకబ్రహ్మమును ధ్యానించెను.

శ్లో॥ వైశాఖేమేషగేసూర్యే స్నాత్వాప్రాక్చభగోదయాత్ ।
కృత్వాసంధ్యాదికంకర్మ తథాసంతర్ప్య చాఖిలాన్ ।
వ్యాధమాహూయహృష్టాత్మా మూర్ధ్నిప్రోక్ష్యనిరీక్ష్యచ॥
రామేతిద్వ్యక్షరంనామ దదౌవేదాధికంశుభమ్ ॥

తా॥ పిమ్మట వైశాఖమాసములో సూర్యుఁడు మేషసంక్రమణమును బొంది యుండఁగా సూర్యోదయముకంటె ముందుగా స్నానసంధ్యావందనాది నిత్యకృత్యముల నెరవేర్చి సమస్తదేవతలను తృప్తినొందించి సంతుష్టాంతరంగుఁడై కిరాతుని పిలిచి మంత్రోదకమును శిరస్సునజల్లి వేదములకంటె నధికమైనదియు, శుభముల నొసఁగునదియునగు <u>“రామ”</u> అను రెండక్షరములు గల మంత్రముపదేశించెను.

శ్లో॥ విష్ణోరేకైకనామాపి సర్వవేదాధికంమతమ్ ॥
తేభ్యశ్చానంతనామభ్యో ధికంనామ్నాం సహస్రకం ।
తాదృశ్నామసహస్రేణ రామనామసమంమతమ్ ॥ ౫౪

తా॥ విష్ణుమూర్తియొక్క నామము ఒకటైనను అన్ని వేదములకంటె నధికమైనది. కాబట్టి విష్ణుమూర్తియొక్క అటువంటి నామములు మతిలేక అనేకములుగానున్నవి, వానిలో సహస్రనామములు మిక్కిలి యధికమైనవి. కాబట్టి అట్టి సహస్రనామములతో ,రామ, అను రెండక్షరములుగల పదము సమానముగా జెప్పఁబడిరది.

శ్లో॥ తస్మాద్రామేతితన్నామ జపవ్యాధ నిరంతరం ।
ధర్మానేతాన్కురువ్యాధ యావదామరణాంతికమ్॥ ౫౫

తా॥ ఓ కిరాతుఁడా! ఇట్టి మహత్తుగలది కాబట్టి యెల్లప్పుడు రామనామ జపింపుము. నీవు మరణింమువరకు వైశాఖధర్మములను జేయుచుండుము.

శ్లో॥ తతస్తేభవితాజన్మ వల్మీకస్య ఋషేఃకులే ।
వాల్మీకిరితినామ్నాచ భూమౌఖ్యాతిమవాప్స్యసి॥ ౫౬

తా॥ అనంతరము నీవు వల్మీక మునీశ్వరునకుఁబుట్టి వాల్మీకుండను మునీశ్వరుడవై భూమిలో ప్రసిద్ధిజెందగలవు.

శ్లో॥ ఇతివ్యాధం సమాదిశ్య ప్రతస్థే దక్షిణాందిశం । వ్యాధోపితం పరిక్రమ్య ప్రణమ్యాచ పునః పునః । కించిద్దూరాత్తుగోభూత్వా సరుదన్విరహాతురః । యావద్దృష్టిపథంతావత్పశ్యన్తస్యగతిం పునః । పునర్నివవృతేకృచ్ఛాచ్చిత్తమేవ వ్యాదిచింతయన్॥ ౫౭

తా॥ ఈప్రకారమా కిరాతునకుపదేశము జేసి యా మునీశ్వరుఁడు దక్షిణదిక్కుగా ప్రయాణమాయెను. అంతట కిరాతుఁడా మునీశ్వరునకు మాటిమాటికి ప్రదక్షిణముజేయుచు నమస్కరించుచు యా మునీశ్వరునితో గూడ కొంచెందూరం వెళ్ళి సాగనంపి యా మునీశ్వరుఁడు వెళ్లుటకు సహింపనివాడై దుఃఖింపుచు కండ్లకు అగుపడునంతవరకు ఆ మునీశ్వరుని జూచుచూ, యా మునీశ్వరుని మనస్సులో తల్లచ్చుకొనుచు అతికష్టప్రయత్నముతో వెనుకకు మరలివచ్చెను.

శ్లో॥ వనంనిర్మాయతన్మార్గే ప్రపాంకృత్వాసు నిర్మలాం।
అతియోగ్యానిమార్గే ధర్మావైశాఖోక్తాంశ్చకారహ॥

తా॥ అనంతర మా కిరాతుఁడు ఆ మార్గములో నొక తోటను వేయించి చలి వేంద్ర నేర్పరచి నిర్మలమగు జలమునిచ్చుచు మిక్కిలి యోగ్యములగు వైశాఖధర్మములను చేయుచుండెను.

శ్లో। వన్యైః కపిత్థపనసైర్జంబూచూతాదిభిఃఫలైః।
మార్గగానాం సమార్తానా మాహారం పరికల్పయన్।

తా॥ అనేక ఫలవృక్షములుగల తోటల నేర్పఱచి వెలగపండ్లుఁ పనసపండ్లు నేరేడుపండ్లు, మామిడిపండ్లు మొదలగువానిని మార్గాయాసముచే నలసియున్న వారలకు నాహారముగా నిచ్చుచుండెను.

శ్లో। ఉపానద్భిశ్చందనైశ్చ ఛత్రైశ్చవ్య జనైరపి।
వాలుకాస్త్రణోపేత ఛాయాభిశ్చ క్వచిత్క్వచిత్ ।
అపాజహార పాంథానాం శ్రమం స్వేదోద్భవం తథా 22

తా॥ పాదుకలను, మంచిగంధములను, గొడుగులను, విసనకఱ్ఱనిచ్చుచుండ యిసుకతిన్నెలయందు అక్కడక్కడ నీడగానుండునట్లు ఆచ్ఛాదనలువేసి క్రింద ఆ స్తరణములనుంచి మార్గస్థులను గూర్చుండబెట్టుచు నిట్లు మార్గాయాసమును, చెమటను బోగొట్టుచుండెను.

శ్లో॥ ప్రాతస్స్నాత్వాది వార్తాం తం జపన్నామేతివై మనుం।
వ్యాధజన్మనినాయాసౌ వల్మీకస్యసుతోభవత్ । 23

తా॥ ఈ ప్రకార మా కిరాతుఁడు పరోపకారము జేయుచు ప్రాతఃకాలంబున స్నానముజేసి రాత్రింబవళ్ళును "రామ" యను మంత్రమును స్మరింపుచు ఆ కిరాతజన్మమును వెళ్ళబుచ్చి, వల్మీకమునీశ్వరునకు తనయుఁడుగా బుట్టెను.

శ్లో॥ కృష్ణనామా మునిఃకశ్చిత్తస్మిన్నేవ సరోవరే।
తపోన్నైదుస్తరంతేపే బాహ్యవ్యాపారవర్జితః॥ 24

తా॥ వల్మీకమునీశ్వరుని వృత్తాంతమేమియనఁగా పూర్వకాలంబున కృష్ణుఁడను యొక మునీశ్వరుఁడు ఇంద్రియవ్యాపారములను విడిచి ఆ సరస్సునందే విశేషకాలము

అతికఠినమగు తపస్సు జేసెను.

శ్లో॥ వల్మీకమభవద్దేహే తస్యకాలేన భూయసా ।
వల్మీకఇతితంప్రాహు రతోవై మునిపుంగవమ్॥ ౬౫

తా॥ అప్పుడు చలింపక విశేషకాలము తపస్సు జేయగా ఆమునీశ్వరుని దేహము చుట్టును పుట్టలుపట్టుటచేత వల్మీకముని యని చెప్పుచుండిరి.

శ్లో॥ పశ్చాత్తపో విరామాంతే కృష్ణే స్మృతిపథంగతే ।
స్త్రీయోవిస్తరతో రాజన్ స్ఖలితంచేంద్రియంమునేః॥ ౬౬

తా॥ పిమ్మట కొంతకాలమునకు తపస్సిద్ధియైన పిమ్మట తపస్సు చాలించెను, అనంతర మా మునీశ్వరుడు లోకవ్యాపారము ననుసరించగా ఇంద్రియములుచలించి స్త్రీలయందు వాంఛగలిగెను.

శ్లో॥ జగ్రాహ శైలూషీకా చిత్తస్యాంజజ్ఞేవనేచరః ।
వాల్మీకిరితివిఖ్యాతో భువనేషుమహాయశాః ॥

తా॥ అనంతరమా మునీశ్వరుని యొక నాట్యకత్తె భ్రమింపగా ఆ స్త్రీయందు యీ కిరాతుడు జన్మించెను. ఇట్లు వల్మీకమునీశ్వరునివలన బుట్టినవాడుగాన వాల్మీకి ముని యీ మూడులోకములయందు విశేషకీర్తిగలవాడై ప్రసిద్ధిజెందెను.

శ్లో॥ యోవై రామకథాందివ్యాం స్వైః ప్రబంధైర్మనోహరాం ।
లోకే ప్రఖ్యాపయామాస కర్మబంధనికృంతనీమ్॥ ౬౮

తా॥ సమస్త కర్మబంధములను నశింపజేయునట్టి శ్రేష్ఠమైన శ్రీరామచరిత్రమును తన కవిత్వముచే శ్రీమద్రామాయణముగాజేసి యీ లోకములో ప్రసిద్ధి జెందునట్లుగా ప్రవర్తించిన మహానుభావుడు వాల్మీకమునియే.

శ్రుతదేవః॥శ్లో॥ పశ్యవైశాఖమాహాత్మ్యం భూపాలాద్యాపిభూతిదం
వ్యాధోప్యపానహాదత్వా ఋషిత్వంప్రాపదుర్లభం॥ ౬౯

తా॥ శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓ రాజా! వైశాఖమాహాత్మ్యము యెటువంటి ఫలముగలనిదైనదో వింటివా ? క్రూరవృత్తిగలవాడయినను యా కిరాతుడు పాదుకలనిచ్చి యెవరును పొందశక్యముగాని జన్మమునుబొందెను. కాబట్టి యీ వైశాఖధర్మము మిక్కిలి యుత్తమమైనది యనుచు నిప్పటికి నైశ్వర్యముల నిచ్చుచున్నది.

శ్లో॥ యఇదంపరమాఖ్యానం పాపఘ్నం రోమహర్షణం ।
శ్రుణుయాచ్ఛ్రావయేద్వాపి నభూయస్తనపోభవేత్ ॥ 20

తా॥ పాపములను పోఁగొట్టునదియు, ఆనందమును గలిగించునదియునగు శ్రేష్ఠమైన యీ చరిత్రమును వినినవారలును, ఇతరులకు వినిపించినవారలును తిరిగి భూలోకమునందు జన్మింపరు.

నారదాంబరీష సంవాదే
వాల్మీకేర్జన్మ కధనం నామ ఏకవింశోధ్యాయ స్సమాప్తః

## అథ ద్వావింశోధ్యాయః

మైధిలేయః॥ శ్లో॥ కాహ్యస్మిన్తిథయఃపుణ్యా మాసేవై శాఖసంజ్ఞకే ।
కానిదానానిశస్తాని తాసుతాసువిశేషతః ॥
కైఃప్రఖ్యాతాశ్చవై లోకే ఏతదాచక్ష్వవిస్తరాత్ ॥

తా॥ హేమాంగుఁడడుగుచున్నాఁడు. ఓ మునీశ్వరా! ఈ వైశాఖమాసములో శ్రేష్ఠములగు తిథులేవి? ఆయాదానములలో శ్రేష్ఠములగు దానములేవి? ఈ ధర్మము లెవరివలన యీ లోకములో ప్రసిద్ధిజెందియున్నవి? దీనినంతయు సవిస్తరముగా జెప్పవలయునని హేమాంగుడడిగెను.

శ్రుతదేవః॥ శ్లో॥ త్రింశచ్ఛతిధయఃపుణ్యా వైశాఖేమేషగేరవౌ॥
ఏకాదశ్యాంకృతంపుణ్యం కోటికోటిగుణంభవేత్ ॥

తా॥ శ్రుతదేవుఁడు చెప్పుచున్నాఁడు. ఓ రాజా! సూర్యుఁడు మేషరాశిని బొందియుండఁగా వైశాఖమాసము ముప్పదిదినములును ప్రశస్తములైనవియే. అయినను వానిలో సూర్యుఁడు మేషరాశియందుండఁగా నందు యేకాదశి మిక్కిలి పుణ్యాకరమయినది. ఆ దినమున జేసిన పుణ్యము అనేక కోట్లకోటులది పుణ్యమును వృద్ధి జేయునది యగును.

శ్లో॥ సర్వదానేషుయత్పుణ్యం సర్వతీర్థేషుయత్ఫలమ్ ।
సమవాప్నోతివైశాఖే ఏకదశ్యాంజలాప్లుతః॥ 3

తా॥ వైశాఖమాసములో ఏకాదశీ దినమునందు ప్రాతఃకాలంబున స్నానము

జేసినయెడల సమస్తదానములయందుండు ఫలమును, సమస్తక్షేత్రములయందుండు పుణ్యమును బొందగలఁడు.

శ్లో॥ స్నానం దానం తపోహోమో దేవతార్చనసత్క్రియాః ।
కథాయాశ్శ్రవణంచైవ సద్యోముక్తివిధాయకమ్॥

తా॥ ఆ దినంబున స్నానమునుజేయుట, దానము నిచ్చుట, తపస్సుజేయుట, హోమముజేయుట, దేవతాపూజ మొదలగు సద్వ్యాపారములను జేయుట, విష్ణుకథలను వినుట వీనిని జేసినయెడల శీఘ్రముగా ముక్తికలుగగలదు.

శ్లో॥ రోగాద్యుపహతోయస్తు దరిద్రేణాపీడితః ।
శ్రుత్వాకథామిమాంపుణ్యాం కృతకృత్యోభవేన్నరః॥

తా॥ రోగాదులచే పీడింపఁబడినవాఁడుగాని, దరిద్రుడుగా నుండువాడుగాని పుణ్యకరమగు యీ విష్ణుకథను వినినయెడల సార్థకమైన జన్మగలవాడగును.

శ్లో॥ అస్నాత్వాచాప్యదత్వాచ యేనసీతా ఇమాశ్శుభాః ।
సగోఘ్నశ్చ కృతఘ్నశ్చ పితృఘ్నశ్చాత్మహాస్మృతః ।
జలాశయాశ్చస్వాధీనా స్వాధీనంచకళేబరమ్॥

తా॥ స్నానముజేయఁదగిన తటాకాదులుండగాను, తన శరీరము స్వస్థతగా నుండగాను యెవఁడు స్నానముజేయకయును, ధర్మముజేయకయును శుభములనొసఁగు వైశాఖమాస దినములను వ్యర్థముగా గడపునో వాఁడు గోహత్యఁ జేసినవాడుగాను, చేసిన మేలును మరచినవాఁడుగాను, పితృహత్యజేసినవాడుగాను, ఆత్మహత్య జేసికొనినవాడుగాను జెప్పఁబడెను.

శ్లో॥ మాధవో మనసాసేవ్యః కాలశ్చసుగుణోత్తమః ।
సాధనశ్చదయావంతః కోనసేవేతమాధవమ్॥ ర

తా॥ శరీరము స్వస్థముగా లేని సమయమునందు సుగుణములుగల యీవైశాఖమాసమును గుఱించి మనస్సులోనైనను స్మరించవలయును. ఆ కాలంబున సత్పురుషులు ప్రాణులయందు దయగలిగియుందురు. మిక్కిలి యుత్తమమగు వైశాఖమాసమును ప్రీతివారును సేవింతురు.

శ్లో॥ దరిద్రైశ్చ ధనాఢ్యైశ్చ పంగుభిశ్చాంధకైస్తథా ।
షండైశ్చవిధవాభిశ్చ నారీభిశ్చ నరైస్తథా॥

కుమార యువ వృద్ధేశ్చ రోగార్తైరపిభూమిప ।
అతీవవికసాధ్యోహి ధర్మోవైశాఖగోచరః॥ ౧౦

తా॥ ఓ రాజా ! దరిద్రులు, ధనముగలవారు, కుంటివారు, గ్రుడ్డివారు, నపుంసకులు, విధవలు, సువాసినులు, పురుషులు, పిల్లలు, యౌవనముగలవారు, ముసలివారు, రోగపీడితులు మొదలగు సమస్తమైనవారికిని వైశాఖధర్మము మిక్కిలి సులభముగా జేయదగియున్నది.

శ్లో॥ మాసమేనమనుప్రాప్య ధర్మాంకురమిమం శుభం॥ ౧౧
కోనుయత్నంచకురుతే తస్మాత్కోఽన్యపరశ్శుభః॥

తా॥ ధర్మములకు కారణమైనదియు శుభప్రదమగు వైశాఖమాసము రాగా నప్పుడు ధర్మము జేయవలయునని యెవఁడు ప్రయత్నించునో వానికంటె మేలును బొందువాడు మఱియొకడు లేడు.

శ్లో॥ యోఽతీవసులభాన్ధర్మాన్నకరోతి నరాధమః ।
తస్యైవసులభాలోకా నరకానాత్రిసంశయః ౧౨

తా॥ మిక్కిలి సులభమగు వైశాఖధర్మములను ఏ నరాధముడు చేయడో అట్టివాడు నరకలోకములను సులభముగానే పొందును. ఈ విషయమైసందేహంలేదు

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి తస్మిన్మాసేచకోత్తమా।
తాంతిథిం సర్వపాపఘ్నీం నధ్యస్సారమివోద్ధృతమ్॥ ౧౩

తా॥ పెరుగును తఱచి వెన్నను తీసినట్లుగా సమస్తపాపములను బోగొట్టునట్టి వైశాఖమాసములో నుత్తమమగు తిథిని చెప్పెదను.

శ్లో॥ చైత్రమాసిమహాపుణ్యే మేషసంస్థే దివాకరే ।
పాపఘ్నీ పితృదేవత్యా గయాకోటిఫలప్రదా॥ ౧౪

తా॥ సూర్యుఁడు మేషరాశియందుండగా పుణ్యకరమైన చైత్రమాసమునందు పితృప్రీతికరమగు తిథియే పాపములను బోగొట్టునదియు గయలో కోటిపిండప్రదానములజేసిన ఫలముగలదియు నగును.

శ్లో॥ అత్రైవశ్రూయతేపుణ్యా పితృగాథాపురాతనీ ।
నరకేపితౄనుద్దిశ్య సావర్ణాశాసతిక్షితిమ్॥ ౧౫

తా॥ సావర్ణికమనువు పూర్వము భూమిని పరిపాలించుకాలములో యీ విషయమై నరలోకమునందు పితృదేవతలను గుఱించి జరిగినదియు పుణ్యకరమైనదియు నగు ప్రాచీన పితృకథ యొకటి తెలియబడుచున్నది.

శ్లో॥ త్రింశత్కలియుగస్యాంతే సర్వధర్మవిసర్జితే ।
ఆనర్తేతుద్విజఃకశ్చి ద్ధర్మవర్ణ ఇతిశ్రుతః ॥ ౧౭

తా॥ ముప్పది కలియుగములు గడచినపిమ్మట సమస్తధర్మములు నశించివుండు కాలములో అనర్తదేశమునందు ధర్మవర్ణుడనెడు నొక బ్రాహ్మణుండెను.

శ్లో॥ దృష్ట్వాకలియుగేరాజన్ జనాన్పాపరతాన్మునిః ।
తస్యైవ ప్రథమేపాదే వర్ణధర్మవివర్జితే ॥
సకదాచిత్సత్రయాగం మునీనాంతు మహాత్మనాం ।
అగమత్పుష్కరక్షేత్రే కుర్వతాం మానధారిణామ్ః ౧౮

తా॥ ఓ రాజా ! అప్పుడా ధర్మవర్ణుఁడను మునీశ్వరుడు కలియుగములో మొదటిపాదములోనే సమస్తధర్మములను విడిచి యక్కడజనులందరు పాపములను జేయుట జూచి యొకప్పుడు పుష్కరక్షేత్రమునందు మహానుభావులగు మునీశ్వరులు మానముగలవారలై సత్రయాగమును జేయుచుండగా నచ్చటికేగెను.

శ్లో॥ తత్రచాసన్పుణ్యకథాం ఋషీణాంశాస్త్రగోచరాం ।
తత్రకేచిత్కలియుగం ప్రశశంసుర్ధృతవ్రతాః॥ ౧౯

తా॥ ఆనంతర మచ్చట మునీశ్వరులు శాస్త్రసిద్ధములగు పుణ్యకథను జెప్పుకొనుచుండగా నచ్చట గూర్చుండెను. వారిలో కొందరు కర్మములయందు శ్రద్ధగలవారలు కలియుగము నుత్తమమైనదానిగా పొగడుచుండిరి.

శ్లో॥ కృతేయద్వత్సరాత్సాధ్యం పుణ్యంమాధవతోషణం ।
త్రేతాయాంమాసతస్సాధ్యం ద్వాపరేపక్షతోన్నృప॥ ౨౦
తస్మాద్దశగుణంపుణ్యం కలౌవిష్ణుస్మృతేర్భవేత్ ।
అత్యల్పమపివైపుణ్యం కలౌకోటిగుణంభవేత్ ॥ ౨౧

తా॥ సమస్తధర్మములు నశించినప్పటికిని కలియుగమేరీతి యుత్తమమయినదనగా, కృతయుగంబున సంవత్సరములో జేసిన విష్ణుప్రీతికరమగు పుణ్యము త్రేతాయుగమునందు మాసములో సంభవించును. ఓ రాజా ! అదియే ద్వాపరయుగంలో

పద్మునైదుదినములలో సంభవించును. కలియుగములో నొక్కసారి విష్ణునామస్మరణము జేసినయెడల నా పుణ్యముకంటె పదిరెట్లు యెక్కువ పుణ్యము సంభవించును. మఱియు కలియుగముకా జేసినపుణ్యము స్వల్పమైనను కోటిగుణములు గలదియగును.

శ్లో॥ దయాపుణ్యవిహీనేతు దానధర్మ వివర్జితే । యదిదానం నకు
రుతే సకృదుచ్చార్యవై వారిమ్ । సఏవచోర్ధ్వగోనూనం దుర్భి
క్షేచాన్నదోయథా । ఏతత్ప్రసంగావసరే నారదోభ్యేత్యవై
మునిః । కరేణై కేన శిశ్నంచ జిహ్వాంచై కేనవై హసన్ ।
ప్రగృహ్యోన్మత్తవత్తత్ర నన ర్తమునిస త్తమః॥ ౨౮

తా॥ దయయు, పుణ్యము, దానము, ధర్మము మొదలగునవి నశియించిన ఈ కలియుగములో నెవఁడు ధర్మము చేయనివాడైనను ఒక్కసారి విష్ణునామస్మరణను జేయునో వాడే దుర్భిక్షకాలములో నన్నమిడినవాఁడువలెనే యుత్కృష్టలోకమును బొందదగినవాడు. కావున కలియుగ ముత్తమమైనదని యచ్చటనుండు మునీశ్వరులు ప్రశంసజేయుచుండఁగా నంతట నారదమునీశ్వరుఁడు వచ్చి యొక హస్తముతో శిశ్నమును, ఒక హస్తముతో నాలుకను పట్టుకొని పిచ్చివానివలెనే యచ్చటనాట్యమును జేయుచుండెను.

శ్లో॥ సభ్యాస్తదాతమత్యూచుః కిమేతదితినారద ।
ప్రత్యువాచసతాంత్సర్వాన్ నృత్యంనృత్యన్ హసన్సుధీః॥ ౨౯

తా॥ ఇట్లు నాట్యముజేయుట నా సభికులు జూచి ఓ నారదా! ఏమిటి ఈ వెఱ్ఱితనమని యడుగఁగా మిక్కిలి బుద్ధిశాలియగు యా నారదుడు నవ్వుచు నాట్యమును జేయుచు ఆ సభికులందరితో నిట్లు చెప్పనారంభించెను,

శ్లో॥ సంతోషాయదిహప్రోక్తం నృత్యర్భిర్భావితాత్మభిః ।
సిద్ధావయంనసందేహః పుణ్యోయంకలిరాగతః ।
తత్సత్యంనచ సందేహో బహుస్వల్పేనసాధ్యతే ।
స్మరణాత్తోషమాయాతి కేశవఃక్లేశనాశనః॥ ౩౦

తా॥ కావ్యమును జేయించునట్టియు, మహానుభావులనగు మీ చేనిప్పుడు చెప్పబడినది సంతోషకరమైనది. మేము ఫలసిద్ధిని పొందితిమి. సంశయములేదు. యీ వచ్చిన కలియుగము పుణ్యప్రదమైనదియే. స్వల్పధర్మముచేసైనను విశేషపుణ్యము

సంభవించుటయు సత్యమే. సందేహము లేదు. పాపములను నశింపజేయు విష్ణుమూర్తియు తన నామస్మరణము నొక్కసారి చేసిన సంతోషించుట నిజమేయగును.

శ్లో॥ తథాపివః ప్రవక్ష్యామి దుర్ఘటంచద్వయం ధ్రువం।
శిశ్నస్య నిగ్రహః పుత్రా జిహ్వాయా అపినిత్యశః।
ద్వయద్ధిభ వేద్యస్య సపవస్యా జ్జనార్దనః।
భవద్భిర్నాత్రస్థాతవ్య తస్మాత్కలియుగాగమే॥ ౨౯

తా॥ పుత్రసదృశులగు యో మునులారా! ఈ ప్రకారమైనప్పటికి మీకు నొక విషయము చెప్పెదవినుడు. నేను నాలుకను శిశ్నమును బట్టుకొనుట కారణమేమియనగా శిశ్నేంద్రియమును జయించుటయును, జిహ్వేంద్రియమును జయించుటయు నీ రెండు కార్యము లీ కలియుగములో జేయుట కష్టసాధ్యము. నిశ్చయము. ఈ రెండు కార్యముల నెల్లపుడు ఎవడు చేయునో వానికే విష్ణుమూర్తి యనుగ్రహము కలవాడగును. కాబట్టి ఈ కలియుగములో నిచ్చట మీకు నుండతగదు.

శ్లో॥ పాషండం భారతంహిత్వా సంచరధ్వం యథాసుఖం।
యత్రకుత్రాపి దేశేషు మనోయత్రప్రసీదతి॥ ౩౦

తా॥ ఈ కలియుగములో వేదబాహ్యమగు నీ భరతఖండమును వదలి మరియొక ప్రదేశమునందెక్కడైనను మీ మనస్సున నిష్టముగానుండు ప్రదేశమునకు వెళ్ళి యచ్చట మీ యిష్టానుసారముగా సంచరింపుడు.

శ్లో॥ ఇతితద్వచనంశ్రుత్వా మునయశ్శంసితవ్రతాః।
సత్రంసమాప్యసహసా యయుస్తేచ యథాసుఖమ్॥ ౩౧

తా॥ ఈ ప్రకారమా నారదమునీశ్వరుడు చెప్పిన వృత్తాంతమునువిని నియమముతో గూడిన వ్రతముగల యా మునీశ్వరులు తాముచేయు సత్రయాగమును సమాప్తినొందించి యా మునులందరు తమకిష్టమైన ప్రదేశములకు క్షిప్రముగా నేగిరి.

శ్లో॥ ధర్మవర్ణో పితచ్ఛ్రుత్వా త్యక్త్వంభూమిం మనోదధే।
సవ్రతశ్చోర్ధ్వ తేజస్కో ధృత్వాద డకమండలూ।
జటావల్కలధారీచ భూత్వాచైవం యయౌపునః।
కలౌయుగేత్వనాచారాన్ ద్రష్టుంవిస్మితమానసః॥ ౩౩

తా॥ అనంతరము ధర్మవర్ణుఁడును ఆ నారదుడు జెప్పిన వృత్తాంతమును విని యాశ్చర్యమును జెంది యా భూమియందు నుండుటకు నిష్టములేనివాడై సద్వ్రతము నవలంబించి ఇంద్రియములను జయించి దండము, కమండలము, జడలు నారచీరలను ధరించి యిప్పుడీ కలియుగములో మనుష్యులానాకహీనులై యెట్టి ప్రవర్తన గలవారలై యుందురో చూడవలయుననియెడు కుతూహలముతో తిరిగి భూప్రదేశము నకు వెళ్ళెను.

శ్లో॥ తత్రాపశ్యజ్జనాన్ ఘోరా న్పాపాచార రతాన్ఖలాన్ ॥
పాషండినోద్విజాస్సర్వే శూద్రాః ప్రవ్రజిన స్తథా॥ 38

తా॥ అక్కడ పాపాచారములయందే యాసక్తిగలవారును, శూద్రులును, దుర్మార్గులునగు మనుష్యులను జూచెను. ఆ పాపాత్ముల ప్రవర్తన ఏలాగునుండెననగా బ్రాహ్మణులందరును వేదబాహ్యులైరి. శూద్రులు సన్యాసమునుబొందువారైరి.

శ్లో॥ భర్తారం ద్వేష్టి భార్యాచ శిష్యోద్వేష్టి గురుంతథా ।
భృత్యశ్చ స్వామిహంతాచ పుత్రఃపితృవధేరతః॥ 38

తా॥ భార్య పెనిమిటిని, శిష్యుడు గురువును నిందించుచుచుండిరి. నౌకరుతన యజమానుని చంపువాడయ్యెను. కుమారుడు తండ్రిని చంపువాడయ్యెను.

శ్లో॥ శూద్రప్రాయాద్విజాస్సర్వే బస్త్రప్రాయాశ్చధేనవః ।
గాథాప్రాయా స్తథా వేదాః క్రియాసామాన్యశ్శుభాక్రియాః ॥

తా॥ బ్రాహ్మణులందరు శూద్రులతో సమానులైరి. ఆవులన్నియు మేకలతో సమానములైనవి. ఆతిపుణ్యమైన నాలుగు వేదములు కథలతో సమానములైనవి. యజ్ఞాది క్రియలన్నియు సామాన్యక్రియలతో సమానములైనవి.

శ్లో॥ భూతప్రేత పిశాచాద్యాః ఫలదా స్తత్ర దేవతాః ।
తాఏవ శ్రద్ధయార్చంతి జనాఃపాపరతాశ్శఠాః॥ 32

తా॥ భూతములు, ప్రేతములు, పిశాచములు మొదలగు క్షుద్రదేవతలే యా ప్రదేశంబున ఫలమునిచ్చునవియగుటచే పాపములందే యాసక్తిగలవారును మూర్ఖులు నగు జనులు అట్టిదేవతలనే శ్రద్ధతో పూజింపుచుండిరి,

శ్లో॥ సర్వేవ్యవాయనిరతా స్తదర్థేత్యక్తజీవితాః ॥
కూటసాక్షిప్రవక్తార స్సదాకైతవమానసాః। 30

తా॥ అందరు సంభోగమునందే యాసక్తిగలిగి యుండిరి. అందువిషయమై తమ ప్రాణములనైనను విడువదలచి యుండిరి. అబద్ధసాక్ష్యమును జెప్పువారై యుండిరి. ఎల్లప్పుడు కపటస్వభావముగలవారై యుండిరి.

శ్లో॥ మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం సదాకలౌ ।
సర్వేషాంహైతుకీవిద్యా సాపూజ్యాన్నృపమందిరే॥ 38

తా॥ కలియుగములో చెప్పడు మనస్సులో నుండునది యొకటి, చెప్పునది మఱియొకటి. చేయునది యింకొకటి. ఇట్లు కపటముగానుండును. అందరికిని విద్య యేదో యొక ప్రయోజనసహితముగానే యుండునుగాని పరమార్థముగా నుండదు. అట్టి ప్రయోజనకారియగు విద్యయే రాజసభలయందు పూజింపబడును.

శ్లో॥ గీతాద్యస్సకలావిద్యా నృపాణాంచ ప్రియావహాః ॥
హీనాశ్చపూజ్యతాంయాంతి నోత్తమాశ్చ కలౌయుగే॥40

తా॥ ఈ కలియుగములో సంగీతము మొదలగు విద్యలు రాజులకుసంతోష కరములుగానుండును. హీనులుగౌరవింపబడుదురు. ఉత్తమపురుషులుగౌరవింపబడరు.

శ్లో॥ శ్రోత్రియాశ్చ ద్విజాస్సర్వే దరిద్రాస్యుః కలౌయుగే ।
విష్ణుభక్తి ర్నరాణాంతు ప్రాయశోనైవవర్తతే॥ 41

తా॥ కలియుగములో శ్రోత్రియులుగానుండు బ్రాహ్మణులు దరిద్రులుగా నుందురు. మనుష్యులకు తరచుగా విష్ణుభక్తియుండదు.

శ్లో॥ ప్రాయఃపాషండభూయిష్ఠం పుణ్యక్షేత్రం భవిష్యతి।
శూద్రాధర్మప్రవక్తారో జటిలాస్తాపసాః కలౌ॥

తా॥ తఱచుగా పుణ్యక్షేత్రములు వేదబాహ్యులుగలవియగును. కలియుగములో శూద్రులు ధర్మములను జెప్పువారును, జడలను ధరించువారును తపస్సుజేయువారునైయుందురు.

శ్లో॥ సర్వేచాల్పాయుషోమర్త్యా దయాహీనా శ్శఠాజనాః ।
సర్వేధర్మ ప్రవక్తార స్సర్వేచగ్రహణోత్సవాః॥ 43

తా॥ మనుష్యులందరును అల్పాయుర్దాయము గలవారును దయలేనివారును, మూర్ఖులు అందరు ధర్మమును జెప్పెడివారును అందరును ధర్మమును గ్రహించినవారు వలెనే యుందురు.

శ్లో॥ స్వార్చనంచాపి హీచ్ఛంతి వృథానిందాపరాయణాః ।
అసూయానిరతాస్సర్వే పరస్త్రాభా గృహంగతే॥ ४४

తా॥ కొందరు తమను పూజించుట కోరుచుందురు. కొందరు వ్యర్థముగా నితరులను దూషింపుచుందురు. కొందరు యితరులు విశేష యున్నతస్థితిలోనుండగా ద్వేషబుద్ధిగలవారగుదురు.

శ్లో॥ భ్రాతాచ భగినీంగంతా పితాపుత్రీంచవైకలౌ ।
సర్వేపిశూద్రీనిరతా స్సర్వే వారాంగనారతాః॥ ४५

తా॥ కలియుగములో సోదరుడు తోబుట్టువుతో సంభోగించువాడగును. తండ్రి కుమార్తెతో సంభోగించువాడగును. అందరును శూద్రస్త్రీలను గోరువారును వేశ్యాస్త్రీలను గోరువారు నగుదురు.

శ్లో॥ సాధూన్నైవానజానంతి బహుపాపాంశ్చమన్యతే ।
వ్యక్తింకుర్వంతి సాధూనాం దోషమేకందురాగ్రహాః॥ ४६

తా॥ సత్పురుషులను యెవరు గౌరవింపరు. పాపాత్ములను మిక్కిలి గౌరవింతురు. దుష్టస్వభావము గలవారు సత్పురుషులకు నొక్క దోషమున్నను ప్రకటింపజేయజూతురు.

శ్లో॥ పాపానాందోషజాతాని గుణత్వేనవహంతిహి ।
దోషమేవ పరిగృహ్ణంతి కలౌతువిగుణాజనాః॥ ४७

తా॥ పాపాత్ములకు ననేక దోషములున్నను గుణములుగానే తలచుచుందురు కాబట్టి కలియుగములో దుర్గుణములుగల మూఢజనులు దోషమునే మంచిదానిగా గ్రహించుచున్నారు।

శ్లో॥ జలూకస్తనసంయుక్తో రక్తంపిబతినోపయః ।
ఔషధ్యస్సత్వహీనాహి ఋతూనాంవ్యత్యయాస్తథా॥ ४८

తా॥ జలగ స్తనములను బట్టుకొని పాలుపీల్చక రక్తము పీల్చునరీతిగా దురాత్ములు దోషములను గ్రహించుచుందురు. మరియు ఓషధులు సారములేనివియై యుండును. ఋతువులు తమకాలముల నతిక్రమించినవి యగును.

శ్లో॥ దుర్భిక్షం సర్వరాష్ట్రేషు కన్యాకాలేనసూయతే ।

నటనర్తకవిద్యాసు ప్రీతిమంతో నరాఃకలౌ॥ ౭౯

తా॥ అన్నిదేశములయందు దుర్భిక్షము సంభవించును. స్త్రీలు తగినవయస్సులో ప్రసవించుటలేదు. కలియుగములో నాట్యముచేయువారియందును నాట్యవిద్యలయందును జనులు కుతూహలముగలవారలై యుందురు.

శ్లో॥ వేదవేదాంతవిద్యాసు నిరతాయేధనాధికాః।
భృత్యాన్పశ్యంతితాన్మూఢా స్తేభ్రష్టాశ్చాఖిలాశిషః॥ ౫౦

తా॥ ధనవంతులగు మూఢులైనవారు వేదములయందు, వేదాంతవిద్యలయందు నాసక్తిగలవారిని నౌకరులనుగా జూచుచుందురు. అట్టి బ్రాహ్మణుల యాశీర్వచనములను ఫలమునీయకుండును.

శ్లో॥ త్యక్తశ్రాద్ధక్రియా స్సర్వే త్యక్తవేదోదితక్రియాః।
జిహ్వాయాం విష్ణునామాని నవర్తంతేకదాచన॥ ౫౧

తా॥ అందరును శ్రాద్ధాదులను విడిచిపెట్టినవారును, వేదములయందు జెప్పబడిన యజ్ఞాదులను విడిచిపెట్టినవారు నగుదురు. ఎవరి నాలుకచేత నొకప్పుడైనను విష్ణునామస్మరణము చేయబడకుండును.

శ్లో॥ శృంగారరసనిర్వాణా స్తద్గీతాన్యేవతేజగుః।

తా॥ శృంగారరసమునందే కుతూహలము గలవారై యా శృంగారసంబంధములగు ప్రబంధములనే పఠించుచుందురు.

శ్లో॥ నవిష్ణుసేవా నచశాస్త్రవార్తా నయాగదీక్షా నవిచారలేశః।
నతీర్థయాత్రా నచదానధర్మాః కలౌజనేక్వాపి బభూవచిత్రం

తా॥ కలియుగములో నొక్కమనుష్యునియందైనను విష్ణుమూర్తి సేవ జేయవలయుననిగాని, శాస్త్రములను పఠింపవలెననిగాని, యజ్ఞములను జేయవలయుననిగాని, వేదాంతవిచారణను జేయవలయుననిగాని, తీర్థయాత్రలను సేవింపవలెననిగాని దానధర్మములను జేయవలయుననిగాని బుద్ధికలిగియుండలేదు. ఆశ్చర్యముగానున్నది.

శ్లో॥ తాంకాదృష్ట్వా ధర్మవర్ణోపి సుభీతోత్యంత విస్మితః।
వంశం పాపాత్మ యంయాంతం దృష్ట్వాద్వీపాంతరంయయౌ॥

తా॥ ఈ ప్రకారము కలియుగములో సమస్తపాపములతో గూడియున్న జనులను జూచి ధర్మవర్ణుఁడు భయమునుబొంది మిక్కిలి యాశ్చర్యముగలవాడై పాపము వలన వంశము నశించుటయును జూచి యక్కడ నుండజాలక మఱియొక ద్వీపమునకు వెళ్ళెను.

శ్లో॥ సంచరంత్సర్వద్వీపేషు లోకేష్వపిచ సర్వశః ।
పితృలోకం యయౌధీమా న్కదాచిత్కౌతుకాన్వితః॥ ౫౮

తా॥ బుద్ధిమంతుడగు అధర్మవర్ణుఁడు కుతూహలముగలవాడై సమస్తద్వీపములయందును సమస్తలోకములయందు నన్నిప్రదేశములయందును సంచరింపుచు నొకప్పుడు పితృలోకమునకు వెళ్ళెను.

శ్లో॥ తత్రాపశ్యన్ మహాఘోరాన్ భ్రామ్యమాణాంశ్చకర్మభిః ।
తాడ్యమానాంశ్చ రుదమానాంశ్చ పతతఃపతితానపి॥ ౫౯

తా॥ ఆ పితృలోకములో భయంకరులుగా నున్నట్టివారిని వారు చేసికొనిన కర్మములచే యమభటులు బాధపెట్టుచుండగా నేడ్చుచున్న వారిని నరకకూపములో పడుచున్న వారిని పడినవారిని జూచుచుండెను.

శ్లో॥ తత్రాపశ్యచ్చాంధకూపే పతితాంస్తాన్ పితౄనధః ।
దూర్వాగ్రాలంబినోదీనాన్ దూర్వాచ్ఛేదేహిశంకితాన్ ।

తా॥ ఆ నరకప్రదేశమునందు గాఢాంధకారముగు కూపములో పడినవారును గరికయొక్క చివర పట్టుకొని వ్రేలాడుచుండువారును, ఆ గరిక యీ తెగిన యెడల యీ కూపములో పడిపోదుమని శంకగలవారును దీనులునగు తన పితృదేవతలను జూచెను.

శ్లో॥ తదాఖుఃఖాదయత్యద్ధా దూర్వామూలం తదాశ్రయం ।
తేనభాగత్రయంచాత్త మేకోభాగావశేషితః । తందృష్ట్వా
తేక్షీయమాణం మ్లానాలందుఃఖేనకర్శితాః । అధోదృష్ట్వాచాంధ
కూపం తటపాతాదిభీషణమ్ । దురుత్తారం మహాఘోరం కర్మ
ణాప్తం సుదుఃఖితాః । అగ్రేచాపిదురుత్తార మవలంబవివర్జితం
తాన్దృష్ట్వావిస్మితోభూత్వా దయాళుర్వాక్యమబ్రవీత్ ॥౬౦

తా॥ అప్పుడు వారు పట్టుకొనిన గరికయొక్క మొదటిభాగము నొకయెలుక

భక్షింపుచుండుటచేత మూడుభాగములు నశించి యొకభాగమే మిగిలియుండి క్షీణించి యున్న యా మొదలును జూచి యదికూడ నశించి పడిపోదుమేమో యని దుఃఖపడు చుండువారును, మరియు నీ కూపము దట్టమగు చీకటిచే నిండియున్నది. ఒడ్లు కూడ విఱిగి పడుచున్నవి కాబట్టి భయంకరముగానున్నదియు, బయటకువచ్చుటకు వీలు గాని ఈ గొప్పకూపము మన పాపకర్మముచే సంభవింపబడినదని దుఃఖించుచున్న వారును, మరియు పై భాగమును జూడగా పట్టుకొనుటకేమియు నాధారములేదు. బయటికి యేలాగు రాగలుగుదుమని యేడ్చుచున్న యా పితృదేవతలను జూచి యాశ్చర్యము జెంది దయగలవాఁడై వారితో నిట్లు పలుక నుపక్రమించెను.

శ్లో॥ కేయూయంపతితాహ్యస్మిన్ కేనదుస్తరకర్మణా ।
కస్యగోత్రే సముత్పన్నాః కథంవోముక్తిరూర్జితాః। ౬౧

తా॥ ఓ జీవులారా! మీ రెవరు? ఏమిపాపము జేయుటచే మీరీకూపములో బడితిరి? ఎవనికంశంలో బుట్టినవారలు? మీ కెట్లు ముక్తి కలుగును?

శ్లో॥ ఏతద్బ్రూయంవదధ్వంమే శర్మవోథభవిష్యతి ।
ఇత్యేవముదితాస్తేన పితరోథసు దుఃఖితాః ।
తమూచుః కరుణాంవాచం ధర్మశ్రుతిపురస్సరాః। ౬౨

తా॥ దీనినంతయును సవిస్తరముగా నాకు జెప్పినయెడల మీకు మేలుకలుగును. అని ఈ ప్రకారము ధర్మవర్ణుఁడు పలుకఁగా నా పితృదేవతలు విని దుఃఖించినవారలై ధర్మమునకు శ్రుతులకు వ్యతిరేకముకాని వాక్యములను దీనస్వభావముతో నిటుల చెప్ప మొదలిడిరి.

పితరః॥శ్లో॥ వయం శ్రీవత్సగోత్రియా భువి సంతానవర్జితాః ।
పిండశ్రాద్ధ విహీనాశ్చ తేనపచ్యామహేవయం ।
నిస్సంతానోపినో వంశో జాతఃపాపైః కలౌయుగే॥ ౬౩

తా॥ పితృదేవతలు చెప్పుచున్నారు. మేము శ్రీవత్సగోత్రమునందు బుట్టిన వారము. భూమిలో మా వంశమునందు తిరిగి సంతానము కలిగియుండలేదు. అందు వలన శ్రాద్ధాదులు జేయకుండుటచే మాకు పిండములు లభింపకపోవుటవలన నిట్టి దుఃఖమనుభవించుచుంటిమి. కలియుగములో నిట్టి పాపాత్ములగుటచే మావంశము సంతానవిహీనమై యున్నది.

శ్లో॥ నాస్మాకంపిండదశ్చాస్తి వంశే పాపక్షయంకరే।
తేనాంధకూప పతనం నిస్తంతూనాం దురాత్మనామ్॥ ౬౫

తా॥ మా వంశము నాశనముపొందినయెడల మాకు పిండమిచ్చువాడును లేడు కాబట్టి ఆధారములేనట్టియు దుర్మార్గులమగు మాకు నిట్లుకూపమునబడుటసంభవించెను

శ్లో॥ ఏకోహివర్తతే వంశే ధర్మవర్ణో మహాయశాః।
సవిరక్తశ్చరన్నేకో నగార్హస్థ్యముపేయివాన్। ౬౬

తా॥ మా వంశములో మిక్కిలి ప్రసిద్ధిగల ధర్మవర్ణుడను నొక పురుషుడు గలడు. ఆతడు సంసారమునం దిష్టములేక వైరాగ్యమును బొంది గృహస్థాశ్రమ మును స్వీకరింపక దేశములలో దిరుగుచున్నాడు.

శ్లో॥ తంతునా తేనబధ్నీమో దూర్వానాలావలంబితాః।
నిస్తంతుత్వాచ్చ తన్మూల మాఖుఃఖాదతి ప్రత్యహమ్ ॥ ౬౭

తా॥ ఆయన యనునట్టి సూత్రముండుటచే మేమిక్కడ గరికయొక్క కాడ నాశ్రయించి తిరుగుచున్నాము. ఆయన యనంతరము సంతానరహిత మగుటవలన మా వంశము నశించునుగాన నిక్కడ మాకు నాధారముగానుండు కాడను నిత్యము యెలుక భక్షింపుచున్నది.

శ్లో॥ ఏకస్యైవా వశిష్టత్వా త్కించిన్మూలావశేషితః।
ఆఖునాఖాద్యమానశ్చ వర్తతే సౌమ్యపశ్యతామ్॥ ౬౮

తా॥ ఓ సజ్జనుడా! మా వంశములో నొక్కడే యుండుటవలన మాకు నాధారముగా నుండు గరికయొక్క మొదలుకూడ ఎలుకచే భక్షింపబడుచు కొంచెము పట్టుతో నున్నది. నీవు యిదిగో దానిని చూడుము.

శ్లో॥ తస్యచాయుఃక్షయేతాత శేషమాఖుర్హరిష్యతి।
పశ్చాత్కూపే పతిష్యామో దురత్తారేంధతామసే॥ ౬౯

తా॥ ఆధర్మవర్ణుని యాయుర్దాయము క్షీణించినపిమ్మట మృతినొందగానే యో తండ్రీ! మిగిలిన మొదలు గూడ యెలుక భక్షింపుటవలన దట్టమైన చీకటిచే నిండియున్నదియు, బయటికి వచ్చుటకు శక్యముకానిదియు నగు యీ గొప్పనరక కూపములో పడిపోగలము.

శ్లో॥ తస్మాత్త్వంచ భువంగత్వా ధర్మవర్ణం ప్రబోధయ ।
అస్మద్వాక్యైర్దయాపాత్రై ర్గార్హస్థ్యే విముఖం మునిమ్॥

తా॥ కాబట్టి నీవు భూలోకమునకు వెళ్ళి దయయుంచి తగిన మా వాక్యములను మేము చెప్పినరీతిగా గృహస్థాశ్రమమునందు నిచ్ఛలేనివాడును, మునీశ్వరుడగు ఆ ధర్మవర్ణునితో నిట్లు చెప్పవలయును.

శ్లో॥ పితరస్తేభృశార్తాహి నరకేపతితామయా ।
అంధకూపేదురుత్తారే దృష్ట్వా దూర్వావలంబితాః॥ ౭౧

తా॥ నీ పితృదేవతలు పైయలు వెడల శక్యముగానిదియు, అంధకారమైన నరక కూపములోబడి గరిక నాధారముగా పట్టుకొనియున్నారు. వారిని నేను జూచితిని.

శ్లో॥ సాదూర్వావంశరూపాహి తన్మూలం సతతంమునే ।
కాలాఖ్యోమూషకస్తస్య మూలంఖాదతి ప్రత్యహమ్॥ ౭౨

తా॥ ఓ మునీశ్వరా! ఆ గరిక ఏమిటిఅనఁగా, ఎల్లప్పుడు అవిచ్ఛిన్నముగా వచ్చుచున్న వంశస్వరూపమే అయినది. కాలమనెడు యెలుక వంశస్వరూపమగు నా మాత్రమును వంశము క్షీణించినకొలదిని నిత్యము కొట్టివేయుచుండును.

శ్లో॥ వంశనాశోనుక్రమతో ఏకస్త్వమవశేషితః ।
తేనమూలేస్మిన్ దూర్వాయా నష్టే భాగత్రయం మునే॥

తా॥ క్రమముగా వంశమంతయు నశించినది. నీవొక్కడవుమిగిలితివి. ఓ మునీశ్వరా! ఆకారణమువలన నీ గరికయొక్క మొదలు మూడుభాగములవరకు నశించినది.

శ్లో॥ ఏకోభాగోవశిష్టాత్ర యత స్త్వం వర్తసేభువి ।
కించిత్ ఖాదతివైత్వాఖు స్తవచాయుః క్షయక్రమాత్॥ ౭౪

తా॥ నీవొక్కడవు నింకా భూమియందు జీవించియుండుటవలన నొకభాగం మిగిలియున్నది. ఆ భాగమును కూడ నీ యాయుర్దాయము నశించినకొలది యెలుక కొంచెము కొంచెముగా తిని వేయుచున్నది.

శ్లో॥ మ్రియతేత్వయిచాస్మాకం తవాసిపతనంభవేత్ ।
కూపపవాంధతామిస్రే సంతానేపిక్షయంగతే॥ ౭౫

తా॥ నీవును మరణమును పొందినవాడవగుచుండగా సంతానమేమియు లేక

వంశము నశించిపోవుటచే గాఢాంధకారముగల యీ నరకకూపంలో మేమును నీవును గూడ పడపోవుదుము.

శ్లో॥ తస్మాద్గార్హస్థ్య మాసాద్య కురుసంతతివర్ధనం।
తేనాస్మాకంత వాపిస్యా ద్గతిరూర్ధ్వా నసంశయః॥ ౭౬

తా॥ ఆ కారణమువలన నీవు గృహస్థాశ్రమమును స్వీకరించి సంతానమును వృద్ధిపొందించితివేని నీకును మాకును పుణ్యాకరమగు నూర్ధ్వలోకము కలుగుటను సందేహము లేదు.

శ్లో॥ యష్టవ్యాబహవఃపుత్రా యద్యేకోపిగయాంవ్రజేత్ ।
యజేతవాశ్వమేధంచ నీలంవా వృషముత్సృజేత్॥ ౭౭

తా॥ అనేకపుత్రులను జనింపజేసినయెడల వారిలో నొకఁడైనను కాశీ గయ మొదలగు పుణ్యక్షేత్రములను గురించి యాత్రనైనను జేసికొనును. అశ్వమేధాది యజ్ఞములనైనను జేయును. నల్లని వృషభమునైనను ఉత్సర్జనము జేయును.

శ్లో॥ యద్యేకోపిచ వైశాఖే మాఘేవా కార్తికేపివా ।
అస్మానుద్దిశ్యవై స్నానం శ్రాద్ధందానం కరిష్యతి॥ ౭౮

తా॥ మఱియు వారిలో నొక్కఁడైనను వైశాఖమాసములోగాని, మాఘ మాసములోగాని, కార్తికమాసములోగాని మమ్ములనుద్దేశించి దానమునుగాని, శ్రాద్ధమునుగాని జేయుచుండును.

శ్లో॥ తేనచోర్ధ్వగతిర్భూయా న్నరకాదుద్ధృతిశ్చనః ।
ఏకోవావిష్ణుభక్తస్స్యా దేకోవాహరివాసరీ॥

తా॥ కావున నట్టి శుభకార్యములను జేయుటవలన నరకములోనుండి బయలు వెడలి యూర్ధ్వలోకమును బొందువారమగుదుము. మరియు వారిలో నొక్కఁడైనను విష్ణుభక్తిగలవాఁడు కాదగును. ఒక్కఁడైనను నేకాదశీదినంబున నుపవాసముజేయు వాఁడు కావచ్చును.

శ్లో॥ ఏకోవాశృణుయాద్విష్ణోః కథాంపాపవిధాశినీం।
తేనోత్థితం కులశతం భావిచాపికులం శతమ్॥ ౮౦

తా॥ మఱియు నొక్కఁడయినను పాపములను నశింపజేయునట్టి విష్ణుకథలను

వినినయెడల వానిచే గడచినవి నూరుతరములు, రాబోవునవి నూరు తరములు తరింప జేయఁబడుచుండును.

శ్లో॥ అపిపాపవృతః క్వాపినరకం నైవపశ్యతి ।
కిమన్యైర్బహుభిః పుత్రైర్దయాధర్మవివర్జితైః ।
యేజాతానార్చయం త్యద్ధా విష్ణుం నారాయణంవరే ।
నాపుత్రస్యహిలోకోస్తి సర్వమేతజ్జనావిదుః ॥ ౮౩

తా॥ తాను పాపప్రవర్తనగలవాడైనను కుమారుఁడు భగవద్భక్తుడగునేని తండ్రి నరకమును జూచుటయును సంభవింపదు, కాబట్టి ఎందరు సుతులుకలిగినను సమస్తప్రపంచమునందు వ్యాపించియుండు నారాయణమూర్తిని ఎవరు పూజింపరో దయాధర్మరహితులగు అట్టి తనయులనేకులు కలిగినను ప్రయోజనములేదు. వంశములో తనకు కుమారుడుకలుగనియెడల సుగతిలేదనియున్నది. కాబట్టి సుగుణవంతుడగు తనయుడేకలుగవలెను. ఈ విషయమందరికి తెలిసినవిషయమే.

శ్లో॥ తత్రాపిచ దయాయుక్తం తత్సంతానంచ దుర్లభం ।
ఇతితంబోధయిత్వాతు వాక్యైరేతైశ్చ సూనృతైః॥
విరక్తస్యాధ్వరేతస్య గార్హస్థ్యం మతింకురు॥

తా॥ కాబట్టి దయాదానధర్మబుద్ధిగల సంతానముగలుగుట మిక్కిలి దుర్లభము. ఓ మునీశ్వరా! ఈ ప్రకారము మేముచెప్పిన యదార్థమైన వాక్యముల నా ధర్మవర్ణునితో చెప్పి బోధించి యా ధర్మవర్ణుని వివాహము జేసికొనుటయందును, యాగాదులను జేయుటయందును వాంచగలవానిగా జేయుము.

శ్లో॥ పితౄణాంవచనం శ్రుత్వా ధర్మవర్ణోతి విస్మితః ।
ప్రణమ్యప్రాంజలిః ప్రాహరుదన్వై జాతవేపథుః ।
నామ్నాహం ధర్మవర్ణశ్చ యుష్మద్వంశ్యో దురాగ్రహీ॥౮౫

తా॥ ఇట్లు చెప్పిన పితృదేవతల వాక్యములను విని యా ధర్మవర్ణుడు మిక్కిలి యాశ్చర్యముగలవాడై వారికి నమస్కరించి దోసిలిపట్టి శరీరముకంపమునొందుచుఁ యేడ్చుచు వారితో నిట్లు పలుకుచున్నాడు. ఓ పితరులారా! మీ వంశములోబుట్టి నట్టియు వ్యర్థమగు పట్టుదలగల ధర్మవర్ణుఁడు నేనైయున్నాను.

శ్లో॥ సత్రేతుశ్రుత్వావచనం నారదస్య మహాత్మనః।
జిహ్వోదార్ధ్యం గుహ్యాదార్ఢ్యం నకస్యాపి కలౌయుగే ।

దృష్ట్వాభువిచ పాపిష్ఠాన్ జనానపిచశంకితః ।
భీతోదుర్జనసంగత్యా చరన్ ద్వీపాంతరేవసన్ ॥ ౮౭

తా॥ కలియుగమున నెవరికిని జిహ్వేంద్రియమును జయించుటయు! శిశ్నేంద్రియమును జయించుటయు సాధ్యముకాదని మునిశ్వరులచే జేయబడు సత్రియాగములో జెప్పిన నారదమహాముని మాటను వినియు, పిమ్మట భూలోకంబున పాపాత్ములగు మనుష్యులను జూచియు సందేహించి దుర్మార్గుల సహావాసము జేయుటకు భయపడియు నితరద్వీపములయందు సంచరించుచుంటిని.

శ్లో॥ పాదాస్త్రయోగతాహ్యస్య కలేఃపాదేంత్య మేపిచ ।
గతాస్సార్ధత్రయోభాగా ఇదానీంజనకాఇమే ॥ ౮౮

తా॥ ఓ తండ్రులారా! ఈ కలియుగములో మూడుపాదములుగడచి ఒక్కపాదము మిగిలియున్నది. ఆ పాదమునగూడ మూడుభాగములనగము గడచినది.

శ్లో॥ నాహంవేద్మి భవద్దుఃఖం వృదాజన్మగతంమమ ।
యస్మిన్ కులేత్వహంజాతే ఋణంపితోర్నసైహ్యృతమ్॥

తా॥ మీరిట్లు దుఃఖపడుట నేనెరుగనైతిని. నా జీవితమంతయు వ్యర్థముంగా గడుపఁబడెను. మీ వంశమునందు బుట్టి మీ ఋణమును దీర్చుకొనకపోతిని.

శ్లో॥ కింతేనజాతమాత్రేణ భూభారేణాన్న శత్రుణా ।
యోజాతోనార్చ యేద్విష్ణుం పితౄన్దేవాన్మహీం స్తథా॥ ౯౦

తా॥ ఎవఁడు విష్ణుమూర్తిని, పితృదేవతలను, దేవతలను, మునీశ్వరులను పూజింపడో వానివలన భూభారముకొఱకును, అన్నమును భుజించుటకును గాక యేమి ప్రయోజనమున్నది.

శ్లో॥ యుష్మదాజ్ఞాం కరిష్యామి మమాజ్ఞాపయతక్షితౌ ॥
యథానకలిబాధాస్యా త్తతస్సంసారతోపివా॥
కర్తవ్యాన్యపికృత్యాని మయాపుత్రేణ భూతలే ।
ఇత్యుక్తాస్తేనవం శ్యేన ధర్మవర్ణేన ధీమతా॥ ౯౧

తా॥ ఓ పితరులారా! మీ యాజ్ఞనుజేసెదను. ఏమి యాజ్ఞాపింతురో జెప్పుడు మరియు భూలోకమునకు వెళ్ళి అక్కడ సంసారములోనున్నప్పటికి కలిబాధ నాకు

కలుగకుండునట్లు నన్ను అనుగ్రహింపవలెను. మీకు పుత్రుడనగు నేను భూలోక ములో మిమ్ములనుద్దేశించి చేయదగిన కార్యములన్నియు జేసెదను. అని వారి వంశ మందు బుట్టినవాడును బుద్ధిమంతుడును నగు ధర్మవర్ణుడు చెప్పి చాలించెను.

శ్లో॥ కించిదాశ్వస్తమనస ఇదమూచుర్మహీపతే ।
పుత్రపశ్యదశామేతాం పితౄణాంతే మహాత్మనాం॥ ౯౩

తా॥ ఓ రాజా! అనంతర మా పితృదేవతలు కొంచెమాలోచించి యిట్లు పలుకుచున్నారు. ఓ పుత్రుడా! మహానుభావులగు నీ పితృదేవతలస్థితి ఏ తీరుగా నున్నదో జూచితివా?

శ్లో॥ సంతత్యభావా త్పతతాం దూర్వామాత్రావలంబినాం ॥
త్వంగార్హస్థ్యముపాలభ్య సంతత్యాస్మాత్సముద్ధర। ౯౪

తా॥ వంశము నశించిపోవుచుండుటచే గరికయే నాధారముగా గలిగి యీ మహా నరకకూపములో బడుటకు సంసిద్ధులముగానున్న మమ్ములను నీవు గృహస్థాశ్ర మము నవలంబించి సంతానమువడసి యీ కూపములోనుండి మమ్ములను బయటికి వచ్చులాగున జేయుము.

శ్లో॥ యేచవిష్ణుకథారక్తా యేస్మరంత్య నిశంహరిం ।
యేసదాచారనిరతా నతాన్బాధతే కలిః॥ ౯౫

తా॥ ఎవరు విష్ణుకథలయందు ఆసక్తి కలిగి యెల్లప్పుడు విష్ణుమూర్తినే ధ్యా నము జేయుచుందురో, ఎవరు యెల్లప్పుడాచారము గలిగియుందురో వారికి కలిబాధ గలుగ నేరదు.

శ్లో॥ సాలగ్రామశిలాయస్య గృహేతిష్ఠతిమానద ।
అథవా భారతంగేహే నతంవై బాధతే కలిః॥ ౯౬

తా॥ ఓ పూజ్యుడా! గృహమునందు సాలగ్రామము గలవారిని లేక భారతము గలవారిని యీ కలిపురుషుడు బాధింపడు.

శ్లో॥ యశ్చవైశాఖనిరతో మాఘస్నానపరశ్చయః।
కార్తికేదీపదాతాయో నతంసాబాధతే కలిః। ౯౭

తా॥ వైశాఖమాస ధర్మముల యందాసక్తి గలవానిని, మాఘస్నానమందా

సక్తిగలవానిని కార్తికమాసములో విష్ణుసన్నిధిని దీపములనుంచువానిని కలి బాధింపడు.

శ్లో॥ ప్రత్యహం శృణుయాద్యస్తు కథాంవిష్ణోర్మహాత్మన।
పాపఘ్నీం మోక్షదాం దివ్యాం నతంవై బాధతే కలిః॥ ౯౭

తా॥ పాపములను బోగొట్టునదియు, మోక్షము నిచ్చునదియు, శ్రేష్ఠమగు మహానుభావుఁడైన విష్ణుమూర్తియొక్క కథను నిత్యము వినినవానిని కలిపురుషుఁడు బాధింపఁడు.

శ్లో॥ యద్గృహే వైశ్వదేవశ్చ యద్గృహేతులసీశుభా।
యదంగణేశుభాగాశ్చ నతంవై బాధతే కలిః॥ ౯౮

తా॥ గృహమునందు వైశ్వదేవము జేయుచున్నవానిని, దొడ్డిలో తులసిచెట్టు గలవానిని యింటిముందర ఆవుగలవానిని కలిపురుషుఁడు బాధింపడు.

శ్లో॥ తస్మాన్నావస తత్రత్వం యుగే పాపాత్మకేపిచ।
శీఘ్రంగచ్ఛ భువంపుత్ర మాసోయం మాధవాహ్వయః॥

తా॥ ఈ కారణమువలన కలియుగము పాపాచారభూయిష్ఠముయినను నీవు యక్కడ నుండవలదు. శీఘ్రముగా భూలోకమునకు వెళ్ళవలయును. ఇప్పుడు ఉత్తమమగు వైశాఖమాసము వచ్చియున్నది.

శ్లో॥ సర్వేషాముపకారాయ మేషసంస్థే దివాకరే।
త్రింశచ్ఛతిథయఃపుణ్యా మేషసంస్థేదివాకరే॥ ౧౦౧

తా॥ మేషములో సూర్యుఁడుండగా ముప్పదిదినము లుత్తములైన వగుచు సర్వజనులకు నుపకారము జేయదగియున్నవి.

శ్లో॥ ఏకైకస్మిన్ కృతంపుణ్యం కోటికోటిగుణం భవేత్।
తత్రాపిచైత్రబహులో దర్శోన్యాణాంచ ముక్తిదః॥ ౧౦౨

తా॥ సూర్యుఁడు మేషరాశియందుండు దినములలో నొక్కొక్క దినమందు జేసిన పుణ్యము అనేకకోట్ల గుణములు గలదియగును. వానిలోను చైత్ర బహుళామావాస్య మనుష్యులకు ముక్తినిచ్చును.

శ్లో॥ ప్రియాచపితృదేవానాం సద్యోముక్తివిధాయినీ।

యేవై పితౄంత్సముద్దిశ్య శ్రాద్ధంకుర్వంతి తద్దినే॥ ౧౦౩

తా॥ పితృదేవతలకు అమావాస్యాతిథి ప్రీతికరమైనది. కాబట్టి ఆ తిథియందు పితృదేవతలనుగురించి శ్రాద్ధముచేయువారు శీఘ్రముగా ముక్తినొందగలరు.

శ్లో॥ సోదకుంభం పిండదానం తదక్షయ్య ఫలంభవేత్ ।
యేచకుర్వంతివై శ్రాద్ధ మమాయాంచమధౌసుత॥ ౧౦౪

తా॥ ఓ పుత్రుడా! చైత్రబహుళామావాస్య దినమందు శ్రాద్ధముజేసి ఉదకసహితమగు కుంభదానమును పిండప్రదానమును జేయువారు నాశనరహితమగు ఫలమును పొందగలరు.

శ్లో॥ తైఃకృతంతు గయాక్షేత్రే శ్రాద్ధం కోటిగుణంభవేత్ ।
యదిశ్రాద్ధం మధౌదర్శే శాకేనాపిచ శ్రాద్ధకృత్॥
కోటిశ్రాద్ధం గయాయాంతు కృతంతేన నసంశయః ।

తా॥ ఆ యమావాస్యదినమందు గయాక్షేత్రమునందు శ్రాద్ధము జేసినయెడల కోటిరెట్లు ఫలముగలదియగును. ఆ యమావాస్య తిథియందు శ్రాద్ధముజేయుటకు శక్తిలేనివారు ఏదైన నొక కూరతోగాని శ్రాద్ధమును గయాక్షేత్రమునందు జేసిన యెడల కోటిరెట్లు ఫలముగలదియగును. సందేహములేదు.

శ్లో॥ కుంభంచపానకైః పూర్ణం కర్పూరాగరువాసితమ్।
యోనదద్యాన్మధౌ దర్శే నపితృఘ్నో నసంశయః॥

తా॥ చైత్రబహుళామావాస్య దినమందు కర్పూరము అగరు మొదలగుపరిమళద్రవ్యములచే పరిమళించునదియు, పానకముతో నిండియున్న కలశమును యెవఁడు దానమియ్యఁడో వాడు పితృహత్య జేసినవాడగును. సందేహములేదు.

శ్లో॥ యోదద్యాచ్చ మధౌ దర్శే సపానీయం సశీతలం ।
శ్రాద్ధంచ భక్తిసంయుక్తః కురుతేచ కులోద్ధృతిం ।
పితౄణాంచ తదాలోకే నదీచామృతవర్షిణీ॥ ౧౦౫

తా॥ చైత్రబహుళామావాస్య దినమందు మిక్కిలి చల్లనిదియగు జలముతో నిండియున్న పాత్రమును దానమిచ్చుటవలనను, భక్తిగలవాడై పితృదేవతలనుతరింపజేయు దానమునిచ్చుటవలనను పితృలోకములో పితృదేవతలపై నమృతము వర్షించునది యొకటి కలుగును.

శ్లో॥ కుంభదానాత్ప్రీరసతి శ్రాద్ధదానాద్ధిదాయినీ ।
అన్నసూపఘృతాపూప లేహ్యపాయ సకర్దమాః॥ ౧౦౯

తా॥ చైత్రబహుళామావాస్య తిథియందు జలసహితమగు కుంభదానమును జేయుటవలనను శ్రాద్ధము జేయుటవలనను పితృదేవతలకు అన్నము, సూపము, ఘృతము, అపూపములు, పాయసము, లేహ్యము మొదలగు పదార్థములను పితృదేవతలకు సమృద్ధముగా కలుగజేయును.

శ్లో॥ తస్మాచ్ఛీఘ్రం ఇతిగచ్ఛత్వం యదావామా భవిష్యతి ।
కురుశ్రాద్ధం పిండదానం సోదకుంభం మహామతే॥ ౧౧౦

తా॥ ఓ బుద్ధిశాలీ! ఈ వైశాఖమాస మిట్టిఫలము కలిగినదగుటచే నీవు భూలోకమునకు శీఘ్రముగా వెళ్ళి శ్రాద్ధమునుజేసి ఉదకుంభదానమును పిండప్రదానమును జేయుము. లేక ఆలస్యం చేసినయెడల మా సుగతికి వ్యతిరేకం సంభవించును.

శ్లో॥ సర్వేషాముపకారాయ గార్హస్థ్యంచ సమాశ్రితా ।
ధర్మార్థకామై స్సంతుష్టః ప్రాప్యసంతాన ముత్తమమ్॥౧౧౧

తా॥ మాఅందరికి నుపకారముకొరకు నీవు గృహస్థాశ్రమమునుబొంది ఉత్తమమగు సంతానమునుబొందియు ధర్మార్థకామములనుబొందియు సంతసించుము.

శ్లో॥ పునశ్చమునివృత్తిస్త్వం సుఖంద్వీపేసుసంచర ।
ఇత్యాదిష్టఃపితృభిశ్చ తూర్ణంభూమిం యయౌమునిః॥ ౧౧౨

తా॥ అనంతరము తిరిగి మునివృత్తి నవలంబించి యీ ద్వీపములలో నీవు స్వేచ్ఛగా సంచరింపుము. అని యీ ప్రకారము పితృదేవత లాజ్ఞాపింపగా సాధర్మవర్ణుడను మునీశ్వరుడు శీఘ్రముగా భూలోకమునకు వెళ్ళెను.

శ్లో॥ చైత్రేమాసిమేషసంస్థే పుణ్యేమాసిదివాకరే । ప్రాతస్నాత్వా సంతర్ప్య పితౄన్దేవానృషీ స్తథా । సోదకుంభం తథా శ్రాద్ధం కృత్వా పాపవినాశనం । తేనదత్వా పితౄణాంచ ముక్తిమావృత్తివర్జితాం । స్వయంవివాహమకరో త్సంతతిం ప్రాప్యసై సతీం । లోకేప్రఖ్యాత యామాసతాం తిథింపాపనాశనమ్ । స్వయంపునర్ముదాభక్త్యా గంధమాదనమాయయౌ॥

తా॥ అనంతరము మేషరాశియందు సూర్యుడుండగా చైత్రమాసములో ప్రాతః కాలంబున స్నానముజేసి పితృదేవతలను, దేవతలను, మునీశ్వరులను తర్పణాదులచే తృప్తినొందించి పాపమును నశింపజేయు జలసహితమగు కుంభమును దానమిచ్చి అమావాస్యయందు శ్రాద్ధమునుజేసి పితృదేవతలకు పునరావృత్తిరహితమగు ముక్తిని కలుగజేసి తాను వివాహముజేసికొని యోగ్యమైన సంతానమును బొంది పాపమును నశింపజేయు చైత్రబహుళ అమావాస్య తిధియొక్క ప్రభావమును భూమిలో వ్యాపింపజేసి సంతోషముతోడను, భక్తితోడను గూడినవాడై తాను తిరిగి తపస్సు జేయుటకొరకు గంధమాదనపర్వతమును గురించి వెళ్ళెను.

శ్లో॥ తస్మాత్పుణ్యతమాచైషా మధోర్దర్శాశుభావహా।
నానయా సదృశీలోకే తిధిర్దృష్టా శ్రుతాపివా॥ ౧౧౬

తా॥ ఆ కారణమువలన చైత్రబహుళ అమావాస్యతిధి పుణ్యకరమైనదియు, శుభముల నొసగునదియైయున్నది. దీనితో సమానమైన తిధిని లోకములో నెక్కడను జూడలేదు. వినలేదు.

నారదాంబరీష సంవాదే కలిధర్మనిరూపణే పితృముక్తిర్నామ
ద్వావింశోధ్యాయ స్సమాప్తః

---

## అథ త్రయోవింశోధ్యాయః

శ్రుతదేవః॥ శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి మాహాత్మ్యం పాపనాశనం।
అక్షయ్యాయా స్తృతీయాయా సితేపక్షేచ మాధవే ।
యేకుర్వంతిచతస్యాంవై ప్రాతస్స్నానం భగోదయే ।
తేసర్వేపాపనిర్ముక్తా యాంతివిష్ణోః పరంపదమ్॥ ౧

తా॥ శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓ రాజా! వైశాఖధర్మములు శ్రేష్ఠములైనవి. కాబట్టి పాపములను నశింపజేయు వైశాఖమహత్తును చెప్పుచున్నాను. వినుము. వైశాఖశుద్ధ తదియ అక్షయతదియ యని చెప్పబడును. ఆ దినమందు సూర్యోదయకాల మందెవరు స్నానముజేయుదురో వారందరు పాపరహితులై విష్ణుమూర్తియొక్క ఉత్తమస్థానమగు వైకుంఠమును బొందుచున్నారు.

శ్లో॥ దేవాన్పితౄన్మునీన్యస్తు కుర్యాదుద్దిశ్యతర్పణం ।
తేనాధీతంచ తేనేష్టం తేనశ్రాద్ధ శతంకృతమ్॥

తా॥ దేవతలు, మునీశ్వరులు, పితృదేవతలు మొదలగువారిని గూర్చి యెవడు తర్పణచేయునో వాఁడు మిక్కిలి చదువుకొనినవాడును, యజ్ఞములను జేసినవాడును అనేక శ్రాద్ధములను జేసినవాఁడునగును.

శ్లో॥ మధుసూదనమభ్యర్చ్య కథాం శృణ్వంతి యేనరాః ।
అక్షయ్యాయాం తృతీయాయాం తేనరాముక్తిభాగినః॥

తా॥ అక్షయ తదియయందు విష్ణుమూర్తిని పూజించి యా భగవంతుని కథను వినినవారు ముక్తిని పొందువారగుదురు.

శ్లో॥ యేదానం తత్రకుర్వంతి మధుద్విట్ప్రీతయే శుభం ।
తదక్షయ్యం ఫలంత్వేవ మధుసూదనశాసనాత్॥ 7

తా॥ ఆ దినమందు విష్ణుమూర్తి ప్రీతికొరకు శుభప్రదమగు దానమును జేసిన వారు విష్ణుమూర్తి యనుగ్రహమువలన నాశరహితమగు ఫలమునుబొందుచున్నారు.

శ్లో॥ దేవర్షి పితృదైవత్యా తిథిరేషామహాశుభా ।
త్రయాణాం తృప్తిదాత్రీచ కృతేధర్మే సనాతనే॥ 8

తా॥ ఈ అక్షయతదియ యను తిథి దేవతలకు, మునీశ్వరులకు, పితృదేవతలకు ప్రీతికరమైనదియై మిక్కిలి శుభప్రదమైనది. కాఁబట్టి ఈ దినమందు పూర్వమునుండియు నాచరింపఁ డుచుండు వైశాఖధర్మములను జేసినయెడల దేవతలకు, మునులకు పితృదేవతలకు తృప్తిని గలుగజేసినది యగును.

శ్లో॥ ప్రఖ్యాతిశ్చ తిథేస్తస్యాః కేనచాసీత్తదవ్యహం ।
వక్ష్యామి నృపశార్దూల సావధానమనాశృణు॥ 9

తా॥ ఓ రాజోత్తమా! ఈ అక్షయతిథికి ప్రసిద్ధి ఎవనివలన కలిగినది జెప్పెదను. సావధాన మనస్సుగలవాడవై వినుము.

శ్లో॥ పురాపురందరస్యాసీ ద్యుద్ధంచబలినాసహ ।
దేవానాంచైవ దైత్యానాం ద్వంద్వయుద్ధ మభూత్తతః 10

తా॥ పూర్వకాలమందు దేవేంద్రునకు బలిచక్రవర్తికి యుద్ధము జరుగుకాలమునందు దేవతలు రాక్షసులు ద్వంద్వయుద్ధము జేసికొనిరి.

శ్లో॥ సవిజిత్య బలిం దైత్యం పాతాళతలవాసినం ।
పునర్భువం సమాసాద్య చోతథ్యస్యాశ్రమం యయౌ॥ ౯

తా॥ ఆ యుద్ధమునందు పాతాళలోక నివాసియు, రాక్షసుడునగు బలిచక్రవర్తిని ఇంద్రుడు జయించి భూలోకమును జూచుటయందు కుతూహలుడై భూమిని గురించి వెళ్ళి ఉతథ్యమునీశ్వరుని యాశ్రమమునకు వెళ్ళెను.

శ్లో॥ తత్రాపశ్యచ్చ తత్పత్నీం గుర్విణీం మందగామినీం । చలచ్ఛ్రోణితటాబద్ధ కాంచీదామ్నాం సుమండితామ్ । క్వణత్కంకణనిర్ఘోష జితమత్తాళికోకిలాం । వల్గుచిత్రాంబరాం రామాం మంజువాచాంశుచిస్మితామ్ । లసత్కుంభస్థలాభ్యాంచ కుచాభ్యాముపశోభితాం । హసత్పద్మముఖాం దివ్యాం నీలోత్పలసులోచనాం । క్ష్వేతక్ష్యుదకపాండుభ్యాం గండాభ్యాంచమనోరమాం । శ్రమోచ్ఛ్వసంతీం మీనాక్షీం పర్ణశాలాముఖేస్థితామ్ । స్వపతీంశయనేక్వాపి తాందృష్ట్వామోహమాగతః బలాత్కారేణబుభుజే గుర్విణీం పాకశాసనః॥ ౧౪

తా॥ అక్కడ మెల్లగా నడచునదియును, గర్భముగలదియును, కదలుచుండెడి పిరుదగులయందు బంగారు వడ్డాణము గలదియు, మరియు ననేక యాభరణములతో నలంకరింపబడినదియు, మదించిన తుమ్మెదలు కోకిలలయొక్క ధ్వనిని తిరస్కరించునట్టి మ్రోగుచుండెడి కంకణములు గలదియు, అందమగు ననేకరంగులు గల వస్త్రమును ధరించినదియు, మనోహరమైనదియు, మృదువుగా మాట్లాడునదియు తెల్లని చిరునగవుగలదియు, యేనుగు కుంభస్థలములవంటి స్తనములతో నందమైనదిగానున్నదియు, వికసించిన పద్మములవంటి ముఖముగలదియు, ప్రకాశించుచున్నదియు నల్లగలువలవంటి నేత్రములు గలదియు, మొగలిపువ్వులు జలముతో సమానముగా తెల్లగానుండు చెక్కిళ్లుగలదియు, ఆయాసముచే నిట్టూర్పులు విడుచుచున్నదియు, చేపలవంటి నేత్రములు గలదియు, మనస్సునకు నింపుగానున్నదియు, ఆ పర్ణశాలయొక్క వాకిట నొక శయ్యయందు పరుండిన ఉతథ్యమునీశ్వరుని భార్యను జూచి యా దేవేంద్రుడు మోహముజెంది బలవంతముగా నామెతో సంభోగించెను.

శ్లో॥ గర్భస్థస్తుతదాపిండ స్స్వస్యపాతనిశంకయా ।
ఛాదయామాసవై యోనిం ద్వారేపాదే నదుఃఖితః॥

తా॥ అప్పుడు గర్భములోనుండు పిండము దేవేంద్రుడు మైధునము జేయుట వలన తనకు భంగముకలిగి పడిపోదునేమోయని సందేహము జెంది దుఃఖించినవాడై తన పాదమును యోనిద్వారమునకు నడ్డుపెట్టెను.

శ్లో॥ తతశ్చస్కందవీర్యం తద్భూమావేనబలిద్విషః ।
గర్భస్థాయచుకోపా సౌ భగవాన్పాకశాసనః। ౧౬

తా॥ ఇట్లు యోనిద్వారమునకు పాదము నడ్డుపెట్టుటవలన యా దేవేంద్రుని వీర్యము యామె గర్భములో ప్రవేశింపక భూమియందు జారిపడెను. అప్పుడు దేవేంద్రుడు గర్భమందుండు శిశువునందు కోపముగలవాడాయెను.

శ్లో॥ తంశశాపచగర్భస్థం రుషాతామ్రాంతలోచనః ।
జాత్యంధో భవదుర్బుద్ధే మామవంస్థాయతఃపదా ।
ప్రచ్ఛాద్యయోని ద్వారంచ తతోదీర్ఘతసాహ్వయః ।
పదాత్ప్రస్కందితాద్వీర్యా జ్జ్వలంతస్సమజాయత॥ ౧౭

తా॥ ఇట్లు దేవేంద్రుడు ఆ శిశువునందు కోపముచే నెఱ్ఱని నేత్రములు కలవాడై ఓ దుర్మార్గుడా! యోనిద్వారమునకు నీ పాదము నడ్డుపెట్టి నా కోర్కెకు భంగము కలిగించి నన్ను తిరస్కరించితివిగాన నీవు పుట్టినప్పటినుండియు గ్రుడ్డివాఁడవై యుండుమని శాపమిచ్చెను. అనంతరము ఆ పాదమునుండి ప్రవించిన వీర్యమువలన దీర్ఘతపుఁడు కాంతిగలవాడగుచు నుద్భవించెను.

శ్లో॥ పస్చాదింద్రోయయౌ శీఘ్రి మృషేస్శాపనిశంకితః ।
పలాయంతం హరిందృష్ట్వా జహాసుర్వటవోఖిలాః॥

తా॥ అనంతరము దేవేంద్రుడు ఉతథ్యముని వచ్చి శపించునేమోయని మనముచే పరుగెత్తుచుండఁగా నా మునీశ్వరుని శిష్యులు జూచి నవ్విరి.

శ్లో॥ తతస్సవ్రీడితో భూత్వా యయౌమేరోర్గుహాం తదా ।
తత్రైలీనశ్చచారాసౌ దుస్తరం వైతపోమహత్॥

తా॥ అనంతరము ఆ యవమానముచే సిగ్గుపడి మేరుపర్వతమునకు వెళ్లి గుహలో దాగియుండి దేవేంద్రుఁడు కఠినముగ నతిశయతపస్సును జేసెను.

శ్లో॥ మేరౌ విలీయవసతి దేవేంద్రే లజ్జయాన్వితే।
గూఢైర్విజ్ఞాయతాం వార్తాం దైతేయా బలిపూర్వకాః॥
సురానాక్రమ్యబుభుజు ర్బలీంద్రశ్చామరావతీం ।
దిక్పాలానాం విభూతించ శంబరాద్యా బలీయసః॥ ౨౨

తా॥ దేవేంద్రుడు సిగ్గుతో గూడినవాడై మేరుపర్వతమునందు దాగియుండగా నా వార్తను గూఢచారులవలన విని బలిచక్రవర్తి మొదలగు రాక్షసులు దేవతల నాటంకపరచి దేవేంద్రుని రాజ్యవైభవమును బలిచక్రవర్తియు, నితరులగుదేవతల యైశ్వర్యమును బలవంతులగు శంబరుఁడు మొదలగు రాక్షసులు నపహరించి యనుభవించుచుండిరి.

శ్లో॥ బలాద్బుభుజిరేహీన నాథేరాష్ట్రేదివౌకసాం ।
రక్షితారమజానంతో దేవాశ్చాగ్ని పురోగమా ।
ప్రపచ్ఛుర్ధిషణం దేవం దేవాచార్యమకల్మషమ్॥

తా॥ ఇట్లు రాక్షసులు బలవంతముగా రాజ్యమపహరించి యనుభవించుటచే దేవతారాజ్యము దేవేంద్రుని యాధిపత్యము లేనిదగుటవలన నగ్ని మొదలగు దేవతలందరును తమకు నధిపతియగు నింద్రుని వృత్తాంతము తెలియఁగనివారై దేవతలకు గురువును దోషరహితుఁడు నగు బృహస్పతులవారి నడిగిరి.

శ్లో॥ ప్రపచ్ఛురింద్ర వృత్తాంతం క్వచతిష్ఠతినః ప్రభుః ।
దైత్యాక్రాంతమిదం రాష్ట్రం హీననాథం దివౌకసాం ।
కుతోనాయాతి దేవోసౌ భూయాన్కాలోగతో విభోః॥ ౨౪

తా॥ దేవతలిట్లడిగిరి. ఓ స్వామీ! దేవేంద్రుని వృత్తాంతము మాకుతెలియకుండెను, మాప్రభువగు నింద్రుడెక్కడుండెను. దేవతల ఈ రాజ్యము దేవేంద్రుని యధికారములేక రాక్షసులచే నాక్రమింపబడి యనుభవింపబడుచుండెను. ఆ దేవేంద్రుఁడు వెళ్ళి చాలాకాలమాయెను. ఎప్పటికి వెళ్ళెనో తెలియదు.

శ్లో॥ తంయామో యత్రధీషణః ప్రార్థయామశ్చతం విభుః।
ఇతిపృష్ట స్తదాదేవై ర్ధిషణస్తానువాచసా॥ ౨౬

తా॥ ఆ దేవేంద్రుఁ డెక్కడుండెనో చెప్పినయెడల మేము అచ్చటికి వెళ్ళి ఆ యింద్రుని ప్రార్థించి తీసికొనివత్తుమని యా దేవతలు చెప్పఁగా బృహస్పతి వారితో నిట్లనెను.

శ్లో॥ రసాతలే బలింజిత్వా చోతథ్యస్యాశ్రమం యయౌ ।
భుక్త్వాపత్నీంచ దార్ఢ్యేన తచ్ఛిష్యైరేవ నిందితః ।
వ్రీడితస్తుదివంయాతుం గుహాంమేరోర్వివేశహ ।
తత్రైవాస్తే శచీయుక్త స్స్వకృతం చింతయన్విభుః॥ ౨౫

తా॥ దేవేంద్రుఁడు పూర్వము పాతాళలోకమునకు వెళ్ళి బలిచక్రవర్తిని జయించి భూలోకమునకువచ్చి ఉతథ్యమహాముని యాశ్రమమునకు వెళ్లి యామునీశ్వరుని భార్యతో బలవంతముగా సంభోగించి యా మునీశ్వరుని శిష్యులచే నిందింపబడిన వాఁడై సిగ్గుపడి స్వర్గలోకమునకు తిరిగి రానొల్లక మేరుపర్వతముయొక్క గుహాలో ప్రవేశించి అక్కడనే భార్యతోగూడ యుండి తన దుష్కృతముయొక్క నివారణమును గురించి విచారించుచుండెను.

శ్లో॥ ఇతితస్యవచశ్శ్రుత్వా దేవాఅగ్నిపురోగమాః ।
గుహాంమేరోర్యయుశ్శీఘ్రం ద్రష్ట్వాప్రార్థయితుంవిభుమ్॥

తా॥ ఇట్లు బృహస్పతి చెప్పిన వాక్యమును అగ్ని మొదలగు దేవతలందరు విని తమకు నధిపతియగు నింద్రుని జూచి ప్రార్థించి తీసికొనివచ్చుటకు శీఘ్రముగా మేరుపర్వత గుహకు వెళ్ళిరి.

శ్లో॥ తత్రతద్రష్ట్వాగుహాలీనం దేవేంద్రం పాకశాసనం ।
తుష్టువుర్వివిధైస్తోత్రై స్తద్వీర్యైర్లోకవిశ్రుతైః॥

తా॥ ఆ మేరుపర్వతమునందు గుహాలో దాగియున్న వాఁడును, దేవతలకు నధిపతియగు యింద్రునిజూచి యా దేవతలు దేవేంద్రుని ప్రతాపముగలవియు లోకములో ప్రసిద్ధికెక్కినవియు ననేకవిధములగు స్తోత్రములచే స్తుతించిరి.

శ్లో॥ ఇంద్రతుభ్యం నమస్తేస్తు సర్వదేవాధిపాయతే ।
వయం దైత్యైరర్దితాశ్చ త్వయాహీనా భృశార్దితాః॥ ౩౧

తా॥ ఓ యింద్రుఁడా ! సమస్తదేవతలకు నధిపతివగు నీకు నమస్కారము. నీవు ప్రభువుగా నుండకుండుటచే రాక్షసులచే మిక్కిలి పీడింపబడినవారమై విశేషముగా దుఃఖించుచున్నాము.

శ్లో॥ స్థానభ్రష్టాశ్చ రామోంగ నానాదేశేషు దుఃఖితాః ।

తస్మాదాగత్య దేవేంద్ర జహిశత్రూ న్నరిందమ। 32

తా॥ శత్రువులను నశింపజేయునట్టి యో దేవేంద్రుడా! ఇట్లు దుఃఖించుచు మా నివాసములను వదలి అనేక దేశములలో దిరుగుచుంటిమి. కాఁబట్టి నీవు వచ్చి శత్రువులను సంహరింపుము.

శ్లో॥ ఇతిస్తుత స్తదా దేవై రిన్ద్రశ్చ గ్రామగుహాముఖాత్ ।
లజ్జయావనతో భూత్వా పశ్యన్భూమించచక్షుషా॥ 33

తా॥ ఇట్లు దేవతలచే నుతింపఁబడి అప్పుడు దేవేంద్రుడు ఆ గుహలోనుండి బయటికి వచ్చి సిగ్గుచే ముఖమువంచుకొని నేలను జూచుచుండెను.

శ్లో॥ నకించిదపిచో వాచ దుఃఖాద్గద్గదభాషణః ।
తద్జ్ఞాత్వాధిషణః ప్రాహతం సురేంద్రం భయానకమ్॥ 34

తా॥ ఇట్లు సిగ్గుచే కొంచెమైనను మాట్లాడక దుఃఖమువలన గద్గదస్వరముతో మాటాడసాగెను. ఇట్లు దేవేంద్రుని భయముగలవానిగా నెరిగి బృహస్పతి యాతనితో నిట్లు చెప్పెను.

శ్లో॥ మాశంకా తే సురపతే కర్మాధీన మిదంజగత్ ।
మానావమానౌ సుఖందుఃఖం లాభాలాభౌ జయాజయౌ।
పూర్వకర్మానురోధేన భవంత్యే తేనసంశయః ।
జీవఃకర్మానుగో దుఃఖం దిష్టందైవేనకారతః॥ 35

తా॥ ఓ యిందుడ్రుడా! నీవేమియు సందేహింపపనిలేదు. ఈ ప్రపంచమంతయు కర్మలకు స్వాధీనమైయున్నది. గౌరవము, అవమానము, సుఖము, దుఃఖము లాభము, నష్టము గెలుపు, ఓటమి ఈ మొదలగునవి పూర్వజన్మంబున జేయఁబడిన పుణ్య-పాపకర్మముల ననుసరించి పొందుచున్నారు. సందేహము లేదు. జీవుఁడు కర్మల ననుసరించి దుఃఖమును బొందును. కాబట్టి అది ఆయాకాలమునకు నిశ్వరునిచే నిర్ణయింపఁబడియే యున్నది.

శ్లో॥ ప్రాజ్ఞాఃప్రాయోనశోచంతి నప్రహృష్యంతివై సుఖాత్ ।
తస్మాత్త్వారబ్ధతః ప్రాప్తం దుఃఖంచేద్ధంతవప్రభో॥ 36

తా॥ ఓ యిందుడ్రుడా! మిక్కిలి తెలిసిన విద్వాంసులు ప్రారబ్ధవశమువలన

సంభవించిన సుఖదుఃఖములను బొంది సంతోషింపరు. విచారపడరు. కాబట్టి నీవు నిట్టి దుఃఖము ప్రారబ్ధమువలన సంభవించినది.

శ్లో॥ తత్రాప్యమఘవన్ దుఃఖం నైవశోచితుమర్హసి।
ఇత్యుక్త్వాగురుణాచాహ మఘవా సమరాధిపాన్ । ౩౮

తా॥ ఓ యింద్రుడా! అట్టి ప్రారబ్ధమునుబొంది నీవు దుఃఖింపపనిలేదు అని బృహస్పతి చెప్పగా నా దేవేంద్రుడు దేవతలతో నిట్లు పలుకుచున్నాడు.

ఇంద్రః।శ్లో॥ పరస్త్రీసంగదోషేణ బలంవీర్యం యశోబలం।
మంత్రశక్తిశ్శస్త్ర శక్తిర్విద్యాశక్తిశ్చమానద।
అభవన్నష్టవీర్యాశ్చ తూష్ణీం తేనవసామ్యహమ్॥

తా॥ పరస్త్రీ సంభోగపాపమువలన బలము, శౌర్యత్వము, కీర్తియు మంత్ర శక్తి, శస్త్రశక్తి, విద్యాశక్తి మొదలగు శక్తులన్నియు సారవంతములు కానివైయున్నవి. ఆ కారణమువలన నేను అసమర్థుడనై యుంటిని.

శ్లో॥ పాకశాసనవాక్యంతు శ్రుత్వాసాచార్య సంయుతాః।
మంత్రయామాసు రేకాంతే పునస్తస్య బలాప్తయే।
తదాగురుశ్చ తాన్ప్రాహ కరుణాంచవిదుత్తమః॥ ౪౧

తా॥ దేవతలును, బృహస్పతియు ఆ దేవేంద్రుడు చెప్పినమాటను విని తిరిగి దేవేంద్రునకు బలము సంభవించుటకు రహస్యప్రదేశమునకు వెళ్ళి యాలోచింపగా తెలిసినవారలలో నుత్తముడగు ఆ బృహస్పతి దయతో గూడినట్లుగా వారితో నిట్లు చెప్పెను.

బృహస్పతిః।శ్లో॥ మాసోవైశాఖనామాయం ప్రియోవై మధుఘాతినః
సర్వాశ్చతిథయఃపుణ్యా మాసేఽస్మిన్మాధవప్రియే॥ ౪౨

తా॥ బృహస్పతి చెప్పుచున్నాడు. వైశాఖమాసము విష్ణుమూర్తికి ప్రీతికరమైనది. విష్ణుప్రీతికరమైన వైశాఖమాసములో తిథులన్నియు పుణ్యకరము లగును

శ్లో॥ తత్రాపిచసితేపక్షే మాసేస్మిన్నక్షయాహ్వయా।
యస్తస్యాం స్నానదానాది శ్రద్ధయాచకరోతివై।
తస్యపాప సహస్రాణి నశ్యంత్యేవ నసంశయః।

అనవద్యం తథైశ్వర్యం బలంధైర్యం భవంతిచ॥ ४४

తా॥ అట్టి తిథులలోను వైశాఖశుద్ధ తదియ అక్షయతదియయని చెప్పబడును. ఆ తదియదినంబున శ్రద్ధతో స్నానము దానము మొదలగునవి జేసినవానియొక్క పాపము లనేకములున్నను నశించుచున్నవి. సందేహము లేదు. మరియు విపులమగు నైశ్వర్యమును, బలమును, ధైర్యమును బొందుచున్నారు.

శ్లో॥ తస్మాత్తస్యాం తృతీయాయాం హరిణాబలివిద్విషా ।
స్నానదానాది సద్ధర్మాన్కారయామోహితాస్తయే॥ ४५

తా॥ కాబట్టి ఆ యక్షయతదియ దినంబున దేవేంద్రునకు మేలు సంభవించు కొరకు బలిచక్రవర్తికి విరోధియగు ఆ దేవేంద్రునిచే మనమందరము స్నానదానాది సత్కర్మములను జేయింపవలెను.

శ్లో॥ భవిష్యతిచసాశక్తిర్విద్యాయాం మంత్రశస్త్రయోః।
బలంధైర్యం యశశ్చైవ యథాపూర్వం భవిష్యతి॥ ४६

తా॥ అట్లు జేసినయెడల విద్యయందు, మంత్రములయందు, శస్త్రములయం దుండు శక్తియు, బలము, ధైర్యము, కీర్తి మొదలగునవి యన్నియు పూర్వమువలెనే సంభవించియుండును.

శ్లో॥ ఇత్యేవంతు విచార్యాథ గురుర్దేవైస్సమాహితః।
ఇంద్రేణకారయామాస ధర్మానేతాన్ హరిప్రియాన్॥ ४७

తా॥ ఈ ప్రకారము బృహస్పతియు, దేవతలు నాలోచించి సమాహితచిత్తను గలవారై విష్ణుప్రీతికరమగు ధర్మములన్నియు నింద్రునిచే జేయించెను.

శ్లో॥ అక్షయాయాం తృతీయాయాం భుక్తిముక్తి ఫలప్రదాన్।
తేనపూర్వవదేవాసీద్బలం ధైర్యాదికంవిభోః। ४८

తా॥ అక్షయతదియయందు భుక్తిని ముక్తిని నిచ్చునట్టి వైశాఖధర్మములను జేయుటవలన ఆ దేవేంద్రునకు పూర్వమువలెనే బలము ధైర్యము మొదలగునవి కలిగెను.

శ్లో॥ పరస్త్రీ సంగదోషోపి సద్యఏవవిలీయత !

పశ్చాద్గతాశుభశ్శక్రో రాహోర్ముక్త ఇవోడుపః ॥
దేవతానాం తథామధ్యే శుశుభేచహరిర్యథా॥

తా॥ పరస్త్రీ సంభోగమువలన కలిగిన దోషము తత్కాలమునందే నశించిపోయెను. దోషములు నశించిపోవుటచే ఆ దేవేంద్రుడు రాహువువలన విడువబడిన చంద్రునివలె ప్రకాశించి యా దేవతలనడుమ విష్ణుమూర్తివలెనే ప్రకాశించెను.

శ్లో॥ పశ్చాద్దేవై స్సమాయుక్తో వినిర్జిత్య తథాసురాన్ ।
తృతీయాయాశ్చ మాహాత్మ్యా ద్భాగ్యోద్రిక్తోమరావతీం ।
వివేశవిభవై స్సార్థం శంఖతూర్యాది నిస్వనైః॥ ౫౧

తా॥ అనంతరము దేవేంద్రుడు దేవతలతో గూడి స్వర్గమునకు వెళ్ళి రాక్షసుల నోడించి అక్షయతదియయొక్క ప్రభావమువలన మిక్కిలి భాగ్యముగలవాడై శంఖము ఢంక మొదలగు వాద్యధ్వనులతో గూడ అమరావతీపట్టణము ప్రవేశించెను.

శ్లో॥ అనుజ్ఞాతాశ్చశక్రేణ స్వధామనిర్యయుస్సురాః।
తతశ్చయజ్ఞభాగాంశ్చ లేభిరేచ యథాపురా॥ ౫౨

తా॥ దేవేంద్రుని యాజ్ఞాప్రకారముగా దేవతలందరును ఎవరి గృహములకు వారు వెళ్ళిరి. అనంతరము పూర్వమువలెనే వారి వారి యజ్ఞభాగములను గూడ పొందుచుండిరి.

శ్లో॥ పిండభాగాంశ్చపితరో యథాపూర్వంప్రపేదిరే ।
స్వాధ్యాయేమునయస్తుష్టా దైత్యానాంచ పరాజయమ్॥ ౫౩

తా॥ పితృదేవతలు పూర్వంవలెనే పిండములను బొందుచుండిరి. మునీశ్వరులు వేదాధ్యయనము జేయుచు సంతోషించుచుండిరి. రాక్షసులకు పరాజయంకలిగెను.

శ్లో॥ తదాప్రభృతిలోకేస్మిన్ తృతీయాచాక్షయాహ్వయా ।
ప్రఖ్యాతాసర్వలోకేషు దేవర్షిపితృతుష్టిదా॥ ౫౪

తా॥ అది మొదలు యీ లోకములో అక్షయతదియ దేవతలకు పితృదేవతలకు మునీశ్వరులకు తృప్తిని గలుగజేయునదియై మూడులోకములలో ప్రసిద్ధికెక్కినది.

శ్లో॥ తస్మాత్పుణ్యతమాహ్యేషా సర్వకర్మనికృంతనీ ।
భుక్తిముక్తిప్రదానృణాం తృతీయాచాక్షయాహ్వయా।

తా॥ ఆ కారణమువలన అక్షయతదియ మనుష్యులకు పుణ్యమునిచ్చునదియు సమస్త కర్మబంధములను నశింపజేయునదియు భుక్తిని ముక్తిని నిచ్చునదియై యున్నది.

నారదాంబరీష సంవాదే అక్షయతృతీయాయాః శ్రేష్ఠత్వకథనం నామత్రయోవింశోఽధ్యాయస్సమాప్తః

---

## అథ చతుర్వింశోఽధ్యాయః

శ్రుతదేవః॥ శ్లో॥ తిథిష్వేతాసుపుణ్యాసు ద్వాదశీసితపక్షిణీ।
వైశాఖమాసే రాజేంద్ర సర్వాఘౌఘ వినాశనీ॥

తా॥ శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓ రాజోత్తమా! మరియు పుణ్యాకరములగు వైశాఖమాసములో ముప్పదిదినములలోను శుద్ధద్వాదశీతిథి సమస్తపాపములను బోగొట్టునదిగా జెప్పజడెను.

శ్లో॥ కిందానైః కింతపోభిశ్చ కిముపోష్యైర్వ్రతైశ్చకిం।
కిమిష్టైశ్చైవ పూర్తైశ్చ ద్వాదశీయైర్న సేవితా॥ ౨

తా॥ ఎవరు ద్వాదశీవ్రతమును జేయరో వారు అనేక దానములు జేసినను, తపస్సులు జేసినను, ఉపవాసములు జేసినను, వ్రతములు జేసినను, యజ్ఞములు జేసినను, చెరువులు మొదలగువానిని త్రవ్వించినను నేమియు ప్రయోజనము లేదు.

శ్లో॥ గంగాయాముపరాగేతు యోదద్యాద్గో సహస్రికం।
తత్ఫలం సమవాప్నోతి ప్రాతస్నాత్వా హరేర్దినే॥

తా॥ గ్రహణదినంబున గంగాతీరమునందు వెయ్యి గోదానములను జేసిన ఏమి ఫలము కలుగునో అట్టిఫలమును విష్ణుప్రీతికరమగు దినమునందు ప్రాతఃకాలంబున స్నానము జేసినవారు బొందుదురు.

శ్లో॥ యద్దత్తంచాన్నమేతేచాన్నం ద్వాదశ్యాంచసితేశుభే।
సిక్థేసిక్థేభవేత్తస్య కోటిబ్రాహ్మణ భోజనమ్॥ ౪

తా॥ శుభముల నొసగు వైశాఖశుద్ధ ద్వాదశియందు యోగ్యుడగు బ్రాహ్మణునకు నన్నమిడినయెడల యొక్కొక్క మెతుకు కోటిబ్రాహ్మణులకు భోజనము పెట్టిన ఫలము నిచ్చును.

శ్లో॥ యోదద్యాత్తిలపాత్రంతు ద్వాదశ్యాం మధుసంయుతం ।
నిర్ధూతాఖిలబంధస్తు విష్ణులోకే మహీయతే॥ ౫

తా॥ ద్వాదశీదినమందు యెవడు తిలలు మధువుగల పాత్రనిచ్చుచున్నాడో వాడు సంసారబంధములన్నియు బోగొట్టుకొని వైకుంఠవాసి యగుచున్నాడు.

శ్లో॥ ఏకాదశ్యాంసితేపక్షే కుర్యాజ్జాగరణం హరేః ।
సజీవన్నేవముక్తస్స్యాత్తుష్టాస్స్యుస్సర్వదేవతాః॥ ౬

తా॥ వైశాఖశుద్ధ ఏకాదశి దినంబున రాత్రియంతయు హరినామకీర్తనముచే జాగరణము జేసినయెడల నట్టిపురుషుడు జీవించియుండగానే ముక్తిజెందినవాడగును. మరియు దేవతలందరును సంతోషింతురు.

శ్లో॥ కోటీందుసూర్యగ్రహణే తీర్థాన్యుత్లాప్య యత్ఫలం ।
తత్ఫలంసమవాప్నోతి ప్రాతస్స్నాత్వాహరేర్దినే॥ ౭

తా॥ కోటి చంద్రగ్రహణములయందును, సూర్యగ్రహణములయందును, సమస్తతీర్థములలో స్నానముజేసి ఏమిఫలము సంభవించునో అట్టిఫలమును విష్ణుదినమందు ప్రాతఃకాలంబున స్నానముజేసినవారు పొందగలరు.

శ్లో॥ తులస్యాః కోమలైః పత్రైర్ద్వాదశ్యాంవిష్ణుమర్చయేత్ ।
సమస్తకులముద్ధృత్య విష్ణులోకాధిపోభవేత్॥ ౮

తా॥ ద్వాదశీదినమందు న్నుగువగు తులసీదళముచే విష్ణుమూర్తిని పూజించినవారు ఏడుతరములవరకు తన వంశమును తరింపజేసి యనంతరము విష్ణులోకమును బొందగలరు.

శ్లో॥ యమంపితౄన్గురూన్దేవా న్విష్ణుముద్దిశ్య మానవాః । మాధవే శుక్ల ద్వాదశ్యాం సోదకుంభం దక్షిణామ్ । దధ్యన్నంచైవయో దద్యాత్తస్య పుణ్యఫలంశృణు । ప్రయాగే ప్రత్యహంచైవ కుర్యాద్యః కోటిభోజనమ్ । యావత్సంవత్సరం పుణ్యం మద్రసాన్నైర్మనోరమైః । తత్ఫలం సమవాప్నోతి మధుశాసన శాసనాత్ । ౧౧

తా॥ వైశాఖశుద్ధ ద్వాదశీదినమందు యమునిగురించియు, పితృదేవతలనుగురిం

చియు, గురువులను గురించియు, దేవతలనుగురించియు, విష్ణునిగురించియు దక్షిణా సహితమగు జలకలశమును పెరుగుతోగూడిన యన్నము నిచ్చినవారి కేమిఫలము కలుగుననగా, ప్రయాగక్షేత్రమందు నిత్యము కోటిమనుష్యులకు షడ్రసోపేతముగా రుచిగల పదార్థములతో సంవత్సరపర్యంతము భోజనము పెట్టినవాడు ఏమిపుణ్యమును బొందునో అట్టిపుణ్యమును బొందును.

శ్లో॥ సాలగ్రామ శిలాదానం యఃకుర్యాద్ద్వాదశీదినే ।
వైశాఖే శుక్లపక్షేతు సర్వపాపైః ప్రముచ్యతే । ౧౨

తా॥ వైశాఖమాసములో శుద్ధ ద్వాదశీదినమందు సాలగ్రామదానమునుజేసిన వానియొక్క సమస్తపాపములు నశించిపోవుచున్నవి.

శ్లో॥ ద్వాదశ్యాం పయసాయస్తు స్నాపయేన్మధుసూదనం ।
రాజసూయాశ్వమేధాభ్యాం యత్ఫలంపరిజాయతే ॥
తత్ఫలం సమవాప్నోతి గంగాయాంనాత్ర సంశయః॥

తా॥ వైశాఖ శుద్ధ ద్వాదశీదినంబున విష్ణుమూర్తికి పాలచే స్నానముజేయించినవాడు గంగాతీరమందు రాజసూయము అశ్వమేధములను జేసిన ఏమిఫలము కలుగునో ఆ ఫలమును బొందగలఁడు.

శ్లో॥ పంచామృతైశ్చయోవిష్ణుం భక్త్యాసంస్నాపయేద్విభుమ్।
ససర్వకులముద్ధృత్య విష్ణులోకేమహీయతే॥

తా॥ పంచామృతములతో విష్ణుమూర్తిని స్నానమును జేయించువాడు తన వంశీకులందరిని తరింపజేసి వైకుంఠమునందు నివసించుచున్నాడు.

శ్లో॥ యోదద్యాత్పానకం వ్యాస్యాం సాయాహ్నేప్రీతయేహరేః।
జీర్ణపాపంజహాత్యాశు జీర్ణాంత్వచమివోరగః॥

తా॥ ఈ ద్వాదశీదినమునందు సాయంకాలంబున విష్ణుమూర్తికి సంతోషము కొరకు పానకమునిచ్చినవాడు శిథిలమైయున్న కూసమును సర్పము విడిచినట్లుగానే శిథిలమైన పాపమును విడిచిపెట్టును.

శ్లో॥ సాయాహ్నేచైవ యోదద్యా దుర్వారుకరసాయనమ్ ।
భవేన్ముక్తః కర్మబంధా దుర్వారుకరసాయనాత్ ।

తా॥ సాయంకాలమందు కోసపండ్లరసము నిచ్చినయెడల ఆ ఫలమువలన సంసారరూపమగు కర్మబంధమునుండి విడువఁబడి ముక్తిని పొందువాఁడగును.

శ్లో॥ ఇక్షుదండం చూతఫలం దద్యాద్రాక్షాఫలానిచ ।
నవిచ్ఛిత్తిస్సంతతేస్స్యాత్తస్యవై శతపూరుషమ్॥

తా॥ చెఱకుగడలను, మామిడిపండ్లను, ద్రాక్షపండ్లను యిచ్చినవానియొక్క వంశము నూరుతరములవరకు నశింపకుండ వృద్ధిపొందును.

శ్లో॥ యోదద్యాద్గంధలేపంతు సాయాహ్నే ద్వాదశీదినే ।
బాహ్యోపఘాతైస్సకలైర్ముచ్యతేనాత్రసంశయః॥

తా॥ వైశాఖశుద్ధ ద్వాదశీదినమందు సాయంకాలంబున మంచిగంధమును బూసినవాఁడు బాహ్యములగు సమస్తదోషములనుండి విడిచిపెట్టబడుచున్నాడు.

శ్లో॥ యత్కించిత్కురుతే పుణ్యం ద్వాదశ్యాం రాజసత్తమ ।
మాధవేతుసితేపక్షే తదక్షయ్యఫలం భవేత్॥ ౧౮

తా॥ ఓ రాజోత్తమా! వైశాఖమాసశుద్ధ ద్వాదశీదినంబున ఏకొంచెమైనను పుణ్యముజేసిన ఆ పుణ్యము యెన్నటికిని నశింపని ఫలమునిచ్చుచున్నది.

శ్లో॥ ప్రఖ్యాతిమస్యాః వక్ష్యామి యేనజాతేతి భూమిప ।
సర్వేషాం సర్వపాపఘ్నీం సర్వమంగళదాయినీమ్॥

తా॥ ఓ రాజా! ఈ ద్వాదశీ తిథి అందరికిని సమస్తపాపములను బోగొట్టునదియు సమస్తసుఖముల నిచ్చునదియు గావున దీనికి నెవనివలన భూమిలో ప్రసిద్ధి కలిగినదియు జెప్పెదను వినుము.

శ్లో॥ పురాకాశ్మీరదేశేతు ద్విజోదేవవ్రతాహ్వయః ॥
తస్యాసీన్మాలినీనామ తనయాచారురూపిణీ ।
తాందదౌసత్యశీలాయ విప్రవర్యాయ ధీమతే॥ ౨౨

తా॥ పూర్వకాలంబున కాశ్మీరదేశములో దేవవ్రతుడను నొక బ్రాహ్మణుడు కలడు. ఆయనకు మాలినియను పేరుగల అందమైన యొక కూతురు గలదు. ఆమెను బుద్ధివంతుడును సత్యశీలుడను నొక బ్రాహ్మణోత్తమున కిచ్చి పెండ్లిచేసెను.

శ్లో॥ తాముద్వాహ్యయయౌధీమాన్ స్వదేశంయవనాహ్వయమ్

రూపయౌవనసంపన్నా తస్యచైవ ప్రియాభవత్॥ ౨౩

తా॥ ఆ చిన్నదానిని వివాహముచేసికొని సత్యశీలుడు తనదేశమగు యవనదేశ మునకు వెళ్ళెను. ఆయన భార్యయును సౌందర్యము యౌవనము కలదై యుండెను.

శ్లో॥ సదావిద్వేషసంయుక్త స్తస్యాంతిష్ఠతినిష్ఠురః
నాన్యస్యకస్యచిద్ద్వేషీ తాంవినానృపతేపతిః॥ ౨౪

తా॥ ఓ రాజా! ఆ బ్రాహ్మణుడు తనభార్య విషయమై యెల్లప్పుడు విరోధముగలవాడగుచు మిక్కిలి కఠినస్వభావము కలవాడుగానుండెను. మరియు నా బ్రాహ్మణుడు తనభార్యతో గాక ఇతరులెవ్వరితోడను విరోధముకలవాడు కాడు.

శ్లో॥ తస్మిన్సాక్రోధ సంయుక్తా వశీకరణలంపటా।
అపృచ్ఛత్ప్రమదారాజన్ యాస్త్యక్తాః పతిభిఃపురా॥ ౨౫

తా॥ ఓ రాజా! ఆతనిభార్యయును పెనిమిటి తనయందు విరోధముగలవాడగుటచే పెనిమిటియందు కోపముగలదై పెనిమిటిని స్వాధీనముజేసికొనదలచి పూర్వమున పెనిమిటిచే విడువబడిన స్త్రీలవద్దకు వెళ్ళి ఉపాయమునడిగెను.

శ్లో॥ తాభిరుక్తాతుసాభూప వశ్యోభర్తాభవిష్యతి।
అస్మాకంప్రత్యయోజాతో భర్తృత్యాగావమానినామ్॥ ౨౬

తా॥ ఓ రాజా! అప్పుడా స్త్రీలు చెప్పినదేమనగా మేము చెప్పినప్రకారము నీవు జేసితివేని పెనిమిటి నీకు స్వాధీనుడైయుండును. మేమును మా భర్తలచే విడువబడినప్పుడు జేసితిమి. మాకు నమ్మకముకలిగియున్నది.

శ్లో॥ ప్రయుజ్య భేషజంవశ్యం నీతాహిపతయఃపురా।
యోగినీంత్వంతు గచ్ఛాద్య దాస్యతే భేషజం శుభమ్॥ ౨౭

తా॥ స్వాధీనమయ్యెడి యౌషధము నుపయోగించగా పూర్వము మా భర్తలు స్వాధీనమైరి. కాబట్టి యొకసన్యాసి స్త్రీగలదు. ఆమెవద్దకు వెళ్ళి యడిగినయెడల పెనిమిటి స్వాధీనమయ్యెడి యౌషధము నీయగలదు.

శ్లో॥ నవికల్పస్త్వయా కార్యో భవితాదానవత్పతిః।
యోగినీమందిరంగత్వా తాసాంవాక్యేనభూపతే। ౨౮
ప్రసాద మతులంలేభే తస్యాదుశ్చారిణీసతీ।
శతస్తంభసమాయుక్తాం కుటీంభేజేతంగ్రామిణీతా॥ ౨౯

తా॥ మేముజెప్పినరీతిగా నీవు జేసితివేని పెనిమిటి నీకు సేవకుడువలెనే విధే యుడై యుండును. దీనికి సందేహింపవలదు. అని యా స్త్రీలుచెప్పగా ఓ రాజా! సుష్టుపవృత్తనగల యాచిన్నదియు వారిమాటలనువిని విశేషమగు నుపాయము సంభ వించెనని సంతోషించి త్వరగా నూరుస్తంభములుగల యా సన్యాసి స్త్రీ గుడిసెకు వెళ్ళెను.

శ్లో॥ సువిస్తృతాం సువర్చస్కాంతదైశాయాతయామికాం।
ప్రావృతాదీర్ఘ వస్త్రేణ సన్నిధీతాంచయోగినీ। 3౮

తా॥ ఆ గుడిసె ఏ తీరుగానుండెననగా విశాలమైనదియు, మిక్కిలి శోభస్కర ముగా నుండినదియు అందరును వచ్చుచు పోవుచుండెడిదియునగు గుడిసెలో కాషాయవస్త్రమును జుట్టుకొనియున్న సన్యాసి స్త్రీని జూచెను.

శ్లో॥ దీర్ఘాభిశ్చసటాభిస్తు ప్రావృతా దీప్తి సంయుతా ।
పరిచారసమోపేతా వీక్షమాణా శనైశ్శనైః
అక్షసూత్రకరాసాతు జపతిప్రార్థితాతయా ।
దదావశ్యకరంమంత్రం క్షోభకంప్రత్యయాత్మకమ్॥ 3౯

తా॥ పొడుగుగల జడలతో వ్యాపించియున్నదియు, ప్రకాశించుచున్నదియు శుశ్రూషచేయు స్త్రీలతోగూడియున్నదియు స్ఫుటముగాకుండ మెల్ల మెల్లగా జూచు చున్నదియు, చేతిలో జపమాలగలదియునగు నాసన్యాసి స్త్రీని జూచి యాచిన్నది ప్రార్థింపగా నా గోసాయి స్వాధీనమగునట్టిదియు, నమ్మకము కలిగించునదియునగు మంత్రమును ఉపదేశించెను.

శ్లో॥ తతస్సాప్రణతాభూత్వా పదాద్భ్యందత్వాంగుళీయకం।
వజ్రమాణిక్యసంయుక్త మతిరక్తప్రభాన్వితమ్।
మృదుకాంచన సంయుక్తం భానురశ్మి సమద్యుతి।
తతోదృష్ట్వాతు సంతుష్టా పాదస్థంచాంగుళీయకమ్॥ 3౮

తా॥ అనంతరమా చిన్నది యా సన్యాసిస్త్రీకి నమస్కరించి వజ్రములు మాణి క్యములతో గూడినదియు, మిక్కిలి ఎర్రనికాంతిగలదియు, మెత్తని బంగారముచే జేయబడినదియు, సూర్యకాంతివలెనే ప్రకాశించునదియునగు ఉంగరమును యా సన్యాసిని పాదములయందు సమర్పింపగా ననంతరము ఆ యోగిని తన పాదముల

యందుంచబడిన ఉంగరమును జూచి సంతోషించెను.

శ్లో॥ హృష్టయాచత యాజ్ఞాతం తత్పతేరవమానజం।
తదోక్తాహితయాభూప తాపస్యాహితయుక్తయా॥ 35

తా॥ ఇట్లు ఆ సన్యాసి స్త్రీ సంతసించి పెనిమిటి యవమానమువలన కలిగిన యామె దుఃఖమును గుర్తెరిఁగి ఓ రాజా! ఆమెకు హితవుగా నుండునట్లు యా సన్యాసి స్త్రీ యిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ చూర్ణోరక్షాస్వతోహ్యేష స్సర్వభూతవశంకరః।
చూర్ణంభర్తరి సంయుజ్య రక్షాంగ్రీవాశ్రియాంకురు॥ 36

తా॥ ఓ చిన్నదానా! యిదిగో సమస్తభూతములు స్వాధీనమయ్యెడి చూర్ణమును యంత్రమునిచ్చుచున్నాను. ఈ చూర్ణమును నీ పెనిమిటిచే తినిపించి ఈ యంత్రమును నీ కంఠమునందు ధరించుకొనుము.

శ్లో॥ భవిష్యతిపతిర్వశ్యో నాన్యాంయాస్యతి సుందరీం।
నాప్రియంవదతిక్వాపి దుశ్చారిణ్యాస్తవాపిచ॥

తా॥ ఈ ప్రకారము నీవుచేసినయెడల పెనిమిటి నీకు స్వాధీనమై యుండును. మరియొక స్త్రీతో సంభోగింపడు. ఎప్పుడును నీతో అయిష్టముగా మాట్లాడడు. నీవు దుర్వృత్తిగా సంచరించినను నీయందే ప్రేమగలవాడుగా నుండును.

శ్లో॥ చూర్ణం రక్షాంగృహీత్వాసా ప్రాప్తాభర్తృగృహంపునః।
ప్రదోషేపయసాయుక్తశ్చూర్ణోభర్తరియోజితః॥ 37

తా॥ అ చిన్నది ఆ సన్యాసి స్త్రీ యిచ్చిన చూర్ణమును యంత్రమును దీసికొని యింటికివెళ్ళి సాయంకాలమా చూర్ణమును పాలలోకలిపి భర్తకు త్రాగుటకిచ్చెను.

శ్లో॥ గ్రీవాయాంహికృతారక్షా నవిచారః కృతస్తయా।
తదాసపీత చూర్ణస్తు భర్తాన్నృపవరోత్తమ॥ 38

తా॥ ఓ రాజశ్రేష్ఠుఁడా! ఆ రక్షాయంత్రమును కంఠమునందు ధరించెను. ఇది కూడనిపని యని ఎంతమాత్రమును సందేహింపలేదు. భర్తయు నామెచే యివ్వబడిన చూర్ణసహితమగు పాలను త్రాగెను.

శ్లో॥ తచ్చూర్ణాత్ క్షయరోగా భూత్పతిః క్షీణో దినేదినే।

గుహ్యాత్‌క్రమయోజాతా ఘోరా దుష్టవ్రణోద్భవాః॥ ౪౦

తా॥ ఆ చూర్ణమును దినుటచే భర్త క్షయరోగపీడితుడై ప్రతిదినము క్షీణించుచుండెను. మరియు నాసనస్థానమందు రణములు కలిన ఘోరములగు పుటుగులు కూడ కలిగెను.

శ్లో॥ దినైఃకతిపయైరాజ న్నత్యురైనవవ్యవస్థితిః ॥
ఉవాసస్వేచ్ఛయాసాపి పుంశ్చలీ దుష్టచారిణీ॥ ౪౧

తా॥ ఓ రాజా! కొన్నిదినములు గడువగా పెనిమిటికి దేహములో స్వస్థత లేకపోయెను. ఆ చిన్నది దుష్టప్రవర్తన కలిగి జారవృత్తితో స్వేచ్ఛగా సంచరించుచుండెను।

శ్లో॥ హతతేజాస్తతో భర్తా తామువాచా కులేంద్రియః ।
క్రిందమానో దివారాత్రం దాసోస్మితవశోభనే ।
త్రాహిమాంశరణం ప్రాప్తం నకామేన్యాం పరస్త్రియం॥

తా॥ అనంతరము ఆమె పెనిమిటియు శక్తి తగ్గిపోయి ఇంద్రియములు చలించుచుండ రాత్రింబవళ్ళు యేడ్చుచు ఓ చిన్నదానా! నీకు దాసుడనైతిని. నన్ను రక్షింపుము. పరస్త్రీని నేను కోరను. అని భార్యతో పలికెను.

శ్లో॥ తత్తస్యవిదితంజ్ఞాత్వా భీతాసామేదినీపతే ।
అలంకారకృతేపత్యు ర్ధ్వనేచ్ఛుర్నవై హితా ।
యోగినీంచ యయౌశీఘ్రం తస్మైసర్వంన్య వేదయత్॥ ౪౪

తా॥ ఓ రాజా! ఇట్లు పెనిమిటి పలుకగా విధేయుడాయెనని భర్తయొక్క ఉద్దేశ్యమును తెలిసికొని పెనిమిటియందు నిష్టములేనిదైనను మృతినొందినయెడల తాను అలంకారహీనురాలు నగుదునని వెడి భయముతో తిరిగి శీఘ్రముగా ఆ సన్యాసి స్త్రీ యొద్దకు వెళ్ళి యిక్కడ జరిగిన వృత్తాంతమంతయు నామెతో చెప్పెను.

శ్లో॥ తయాచభేషజందత్తం ద్వితీయం తాపశాంతయే ।
దత్తేచభేషజే తస్మిన్ స్వస్థోభూత్తత్క్షణాత్పతిః॥ ౪౫

తా॥ అప్పుడా సన్యాసి స్త్రీ యా రోగము తగ్గుటకొరకు రెండవయౌషధము నియ్యగా దానిని తీసికొని యింటికివెళ్ళి పెనిమిటికియ్యగా నాతడు భక్షించి ఆ

క్షణమునందే దేహము స్వస్థతగలవాడయ్యెను.

శ్లో॥ తిష్ఠత్యుపపతిర్గేహే గృహకృత్యాపదేశతః ।
సర్వవర్ణ సముద్భూతా జారాస్తిష్ఠంతివై గృహే॥ ౪౮

తా॥ అనంతరము ఒక జారపురుషుఁడు ఆ గృహములో నేదో యొకపనిని జేయుచుండు మిషనుబొంది ఆ గృహమునందేయుండును. మరియు నెల్లప్పుడు అన్ని వర్ణములవారు నామెను ఓటకొంచుక్రిగానుండి గృహమువకు వస్తూపోతూం డెడివారు.

శ్లో॥ నకించిద్వచనే శక్తి ర్భర్తుర్జాతా కథంచన ।
తతస్తేనైవదోషేణ సర్వాంగేషుచజజ్ఞిరే॥
కృమయశ్చాస్థిభేత్తారః కాలాంతకయమోపమాః॥ ౪౯

తా॥ ఇట్లు ఆమె జారవృత్తినవలంబించి పెనిమిటి జూచుచుండినను స్వేచ్ఛగా సంచరించినప్పటికిని యామె ఉపయోగించిన చూర్ణమహిమచే అతికష్టముగానైనను కొంచెముగానైన మాటలనజాలఁడాయెను. యిట్లు బహుజనులతో సంభోగించుటచే అన్ని యవయవములందు రోగములుపుట్టి కాలయముదువలెనే బాధించునవియు, యెముకలను గూడ భక్షించునట్టి పురుగులు పుట్టెను.

శ్లో॥ నేత్రాన్నజిహ్వయోశ్చాసీ చ్ఛేదఃకర్ణద్వయస్యచ ।
స్తనయోశ్చాంగుళీనాంచ పంగుత్వంచాపిచాగతం ।
తేనపంచత్వమాపన్నా గతానరకయాతనామ్॥ ౪౯

తా॥ ఆ పురుగులవలన ముక్కు నాలుక నశింపజేయబడెను. రెండు చెవులు తినబడెను. స్తనములు వ్రేళ్లు కూడ తినివేయబడెను. యిట్టి యవస్థనొంది .. తుదకు మృతినొంది నరకయాతనల ననుభవించెను.

శ్లో॥ తామ్రభాండేచసాదగ్ధా యమతానిశితపంచచ ।
శ్వానయోనిషు సంజాతా శతవారం పునఃపునః। ౫౦

తా॥ ఆమెను రాగిపాత్రిలోనుంచి యమభటులు అనేకవేల సంవత్సరములు తపింపజేసిరి. పిమ్మట అనేకపర్యాయములు మాటిమాటికి కుక్క జన్మమెత్తుచుండెను

శ్లో॥ ఛిన్ననాసాఛిన్న కర్ణాకృమిపూర్ణా నిరంతరం ।
ఛిన్నపుచ్ఛాభగ్నపాదా తాడితాచ గృహేగృహే ।

పశ్చాత్సౌవీరదేశేషు పద్మబంధోర్ద్విజస్యచ ।
దాస్యాగృహే శునీజాతా బహుదుఃఖసమాకులా ॥ ౫౨

తా॥ ఆ కుక్క జన్మలో చెవులు తెగిపోవుటయు, ముక్కు పూడిపోవుటయు శిరస్సునుండి మెల్లపుడు పురుగులుపడుటయు, తోక పూడిపోవుటయు, కాళ్లువిరిగి పోవుటయు గలిగి పరితిగృహమునందు ప్రవేశించుచు వారిచే కొట్టబడుచు యిట్లు కొంతకాలము గడువగా పిమ్మట సౌవీరదేశములో పద్మబంధువనెడు బ్రాహ్మణు నకు నొకదాసి గలదు. ఆ దాసీగృహమందు ఆడకుక్కగా బుట్టి విశేషదుఃఖ మనుభవించుచుండెను.

శ్లో॥ ఛిన్నకర్ణా ఛిన్ననాసా ఛిన్నపుచ్ఛాంఘ్రిరాతురా ।
కృమిపూర్ణశిరానిత్యం కృమియోనిశ్చతిష్ఠతి॥ ౫౩

తా॥ ఆ జన్మంబున పూడిపోయిన చెవులు ముక్కు తోక పాదములుగలదియై యెప్పుడు శిరస్సునందు యోనియందు పురుగులుండినుండుటచే బాధపడుచుండెను.

శ్లో॥ ఏవం త్రింశద్గతావర్షా అస్మిన్ జన్మని భూమిప । దైవాత్కర్మ విపాకేన వైశాఖే మేషగేరవౌ । శుక్లపక్షేతు ద్వాదశ్యాం పద్మబంధోస్తనూభవః । నద్యాంస్నాత్వా శుచిర్భూత్వా సార్ద్రవస్త్రో గృహంయయౌ॥

తా॥ యిట్లు ఆ కుక్క జన్మంబున ముప్పదిసంవత్సరములు గడచినపిమ్మట ఆ కుక్కల్లపుణ్యవశముచే సూర్యుడు మేషరాశియందుండగా వైశాఖశుద్ధ ద్వాదశిదినంబున పద్మబంధుని కుమారుడు నదికి వెళ్ళి స్నానముజేసి శుచిగా ఆ తడివస్త్రముల తోనే యింటికివచ్చెను.

శ్లో॥ తులసీవేదికాం ప్రాప్య పాదావవనిజేనహా ।
వేదికాయామధోదేశే సాశునీస్వాపమాగతా । ౫౪
ప్రాక్సూర్యోదయవేళాయాం పాదోదకపరిప్లుతా ।
సద్యోభ్యస్తా శుభాజాతా జాతిస్మృతి రభూత్క్షణాత్॥ ౫౫

తా॥ ఇట్లింటికివచ్చి తులసీ యరుగుపట్టకు వెళ్ళి పాదప్రక్షాళనముజేసికొనెను. అంతకుపూర్వము సూర్యోదయము కాకముందు ఆ బ్రాహ్మణునయింట పాచిజేయు

ఆ దాసీ వచ్చుచుండగా దానితోఁగూడ వచ్చి అతులసియరుగుక్రింద ఆకుక్కపండు కొనెను. అప్పుడు ఈ బ్రాహ్మణుడు పాదములను కడిదికొనిన జలము ప్రవహించగా నా కుక్కయును తడిసెను. అందువలన ఆ కుక్కయొక్క పూర్వమందుజేయ బడిన సమస్తదోషములు నశించి పూర్వజన్మజ్ఞానము కలిగెను.

శ్లో॥ స్మృత్వాకర్మకృతం పూర్వం సాశునీతాపసంపదా ।
చుకోశకరుణాదీనా మునేత్రాహీతివై పునః॥ ౫౯

తా॥ అప్పుడాకుక్క పూర్వమందు జేయబడిన పాపములను దెలిసికొనినదగుటచే మిక్కిలి విచారపడి దిక్కులేనిదై ఓ మునీశ్వరా ! నన్ను రక్షింపుమనుచు దయకలుగునట్లుగా రోదనముజేసెను.

శ్లో॥ స్వకర్మచమునీంద్రాయ స్మృత్వాచభ్యాభయాకులా ।
భర్తృర్విషప్రయోగంతు స్వస్యదుశ్చరితంతథా ।
యాన్యాపియువతీబహ్మన్నస్తుర్వశ్యం సమాచరేత్ ।
వృథాధర్మాదురాచారా పచ్యతేతామ్రభాజనే॥ ౬౦

తా॥ అనంతరము తన పూర్వజన్మవృత్తాంతము స్మృతికి దెచ్చుకొని భయముకలదియగుచు తాను పెనిమిటికి విషముపెట్టుటయు తన దుష్టప్రవర్తనము మొదలగు తన కర్మలన్నియు చెప్పి మరియు నిట్లు చెప్పుచున్నది. ఓ బ్రాహ్మణుడా ! ఇతరమగు స్త్రీయైనను పెనిమిటిని స్వాధీనము జేసికొనుటకు నిటువంటి యుపాయములను ప్రయోగించినయెడల అట్టివారు వ్యర్థములగు ధర్మములు కలవారలై దురాచారములు కలవారలగుచు నరకములో రాగిపాత్రయందు వండబడుదురు.

శ్లో॥ భర్తానాథో గురుర్భర్తా భర్తాదైవతముత్తమం ।
విక్రియాంకృత్య సాధ్వీసా కథంసుఖమవాప్నుయాత్॥ ౬౧

తా॥ కాబట్టి పెనిమిటియే స్త్రీలకు అధిపతి. పెనిమిటియే గురువు. పెనిమిటియే యుత్తమమగు దేవత కావున నిటువంటి పూజనీయుడగు పెనిమిటికి నపకారముజేసిన స్త్రీ సుఖమును బొందనేరదు.

శ్లో॥ తిర్యగ్యోనిశతంయాతి కృమికోటిశతానిచ ।
తస్మాద్బ్రాహ్మణసుర కర్తవ్యం స్త్రీభిర్భర్తుర్వచస్సదా॥ ౬౨

తా॥ మృతినొందిన పిమ్మట అనేకపర్యాయములు మృగజన్మ నెత్తుచు పురుగులతో గూడుకొనినదగుచు నుండును. కాబట్టి ఓ బ్రాహ్మణుడా! స్త్రీలు పెనిమిటి యాజ్ఞాప్రకారము ముఖ్యముగా నడచుకొనవలయును.

శ్లో॥ సాహంపశ్యే పునర్యోనిం కుత్సితాం యాతనాన్వితాం।
యదినోద్ధరసే బ్రహ్మన్నద్యత్వద్దృష్టి సంముఖామ్॥ ౬౩

తా॥ ఓ బ్రాహ్మణుడా! నేను పూర్వజన్మనుండు అటువంటి దుష్ప్రవర్తన గలదానిని కాబట్టి నీ సన్నిధానమందున్న యిట్టి నన్ను అనుగ్రహించి తరింపజేయకుంటివేని తిరిగి నింధితమైన నరకయాతనలను బొందగలను.

శ్లో॥ తస్మాదుద్ధరమాం బ్రహ్మన్ దుష్కృతాం పాపచారిణీం॥
సుకృతస్యప్రదానేన వైశాఖే శుక్లపక్షకే॥
యాకృతాతు త్వయాబ్రహ్మన్ ద్వాదశీపుణ్యవర్ధనీ।
తస్యాంత్వయాకృతం పుణ్యం స్నానదానాన్నభోజనైః।
దుశ్చారిణ్యా అపిబ్రహ్మన్ తేనముక్తిర్భవిష్యతి॥ ౬౪

తా॥ కాబట్టి యో బ్రాహ్మణుడా! వైశాఖమాస శుక్లపక్షములో నీవుజేసిన పుణ్యమును నాకొసంగి పాపప్రవర్తన గలిగినట్టియు, దురాచారులనగు నన్ను తరింపజేయుము. మరియు పుణ్యమును వృద్ధిపొందించునట్టి వైశాఖశుద్ధ ద్వాదశీ దినంబున స్నానముజేయుట, దానమిచ్చుట, భోజనము పెట్టుట మొదలగు సత్కార్యములచే నేమిపుణ్యమును సంపాదించితివో ఆ పుణ్యము నాకొసంగితివేని యీపాపము వలన విడుదలబడి ముక్తిని బొందగలను.

శ్లో॥ యస్యాంతుభూసురస్నాతో స్వగృహేమనుజఃకిల।
సర్వతీర్థఫలావాప్తిం లభతేనాత్రసంశయః

తా॥ ఓ బ్రాహ్మణుడా! మనుష్యుడు వైశాఖశుద్ధ ద్వాదశీదినంబున ప్రాతఃకాలమందు తన గృహమునందు స్నానముజేసినను సమస్తక్షేత్రములను సేవించినఫలమును బొందుచున్నాడు. ఇందువిషయమై సందేహములేదు.

శ్లో॥ తత్తద్దత్తం హుతంయత్ర కృతం దేవార్చనాదియత్।
తదక్షయఫలం జ్ఞేయం యత్కృతం ద్వాదశీదినే।
ఏవంవిధిఫలం యత్స్యాత్తద్దేహి సకలంమమ॥ ౬౫

తా॥ వైశాఖశుద్ధ ద్వాదశియందు తపస్సుజేయుట, హోమముజేయుట దాన మిచ్చుట, దేవతలను పూజించుట మొదలగు సత్కార్యములను జేయుటవలన ఫలము నాశనములేక స్థిరముగా నుండునుగాన యట్టి విధిప్రకారము జేసిన యావత్తుఫలము నాకు నొసంగుము.

శ్లో॥ ద్వాదశ్యాముపవాసేన త్రయోదశ్యాంతుపారణాత్ ।
యత్ఫలంస్యాత్తదస్యత్ర తేనముక్తిర్భవిష్యతి॥

తా॥ ద్వాదశీదినంబున యుపవాసముండి త్రయోదశియందు పారణంజేయుట వలన గలిగినఫలము విశేషమైనదగుచు ముక్తిని కలిగించుచున్నది,

శ్లో॥ దయాంకురుమహాభాగ దీనాయాం దీనవత్సల ।
దీననాథో జగన్నాథో యుష్మన్నాథో జనార్దనః॥

తా॥ మహానుభావుడవును అనాథలయందు ప్రేమకలవాడవువగు నోబ్రాహ్మణుడా! దిక్కులేని నాయందు దయనుంచుము. దీనులను రక్షించువాడును ప్రపంచము నకు నధిపతియునగు విష్ణుమూర్తి మీకు ప్రభువుగానుండి ప్రసన్నుడైయుండెను.

శ్లో॥ తదీయాస్త్వాదృశాఏవ యథారాజాతథాప్రజాః ॥
వైవస్వతపదధ్వంసి న్వరితాహి సుఖదుఃఖితామ్॥

తా॥ రాజు యెటువంటివాడుగానుండునో ప్రజలును ఆ విధముగా నేనుండు నట్లు భగవద్భక్తులగు మీబోటివారును భగవంతునితో సమానులుగా యుందురు. పాపమును బోగొట్టి యమలోకమును బొందింపజేయకుండునట్టి శక్తిగలవాడా! నేను దుఃఖించుచుంటినిగాన నన్ను రక్షింపుము.

శ్లో॥ త్వద్ద్వారవాసినీం దీనాం శునీమాం దీనవత్సల ।

తా॥ దీనులయందు ప్రేమగలవాడా! శునకజన్మమెత్తినట్టియు నీ ద్వారము నందు కావలిగాచియున్నట్టియు దీనురాలనగు నన్ను రక్షింపుము.

శ్లో॥ బ్రహ్మహత్యా సహస్రంవా గోహత్యానాం సహస్రకమ్ ।
అగమ్యానాంచ కోటిశ్చ దహత్యేషాశుభాతిథిః॥

తా॥ శుభప్రదమగు వైశాఖశుద్ధ ద్వాదశీతిథి వెయ్యిగోహత్యలవలన కలిగిన పాపమును, వెయ్యి బ్రహ్మహత్యలవలన కలిగిన పాపమును చేయదగనిపనులు కోటి చేసినందువలన గలిగిన పాపమును బోగొట్టుచున్నది.

శ్లో॥ తస్యాంకృతం మహాపుణ్యం మహ్యందత్వా మహామునే।
మాముద్ధరసముద్విగ్నాం దీనాంనాథసముద్ధర।
అంతేతుభ్యం ద్విజేంద్రాయ సమఙ్క్తింవదామ్యహమ్॥ ౭౮

తా॥ ఓ ప్రభువా! అట్టి ద్వాదశీతిథియందు జేయుబడిన విశేషపుణ్యమును నాకునిచ్చి ఆపత్సముద్రములో మునిగియున్న నన్నురక్షించుము. బ్రాహ్మణోత్తముడను నీకొరకు యిదిగో చివరకు నమస్కారమును జేయుచున్నాను. అని పలికి నమస్కారము జేసెను.

శ్లో॥ ఇతితస్యావచశ్శ్రుత్వా శునీమాహామునేస్సుతః।
స్వకృతంజంతవోశ్నంతి సుఖదుఃఖాత్మకంశునిః ౭౯

తా॥ ఈ ప్రకారం చెప్పిన ఆ కుక్కయొక్క వాక్యములను ఆ మునీశ్వరుని కుమారుడు విని యా కుక్కతో నిట్లు చెప్పుచున్నాడు. ఓ శునకమా! ప్రతిజంతువును తన పూర్వజన్మమందు జేయబడిన సుకృత దుష్కృతములచే సుఖదుఃఖముల ననుభవింతురు.

శ్లో। తస్మాత్కిముత్వయా కార్యం క్షుద్రయాపాపశీలయా।
యయాభర్తావశంనీతో రసాచూర్ణాదిభిర్ద్విజః॥

తా॥ ఆ కారణమువలన పాపస్వభావముగలదానవు నీచురాలవగు నీతో నేమిప్రయోజనమున్నది. మరియు యంత్రము ఔషధములచే బ్రాహ్మణుడగు నీ పెనిమిటిని స్వాధీనము జేసికొన్నట్టి దుర్మార్గురాలవు.

శ్లో॥ సాధుభ్యోయత్కృత పాపం తస్యదుఃఖకరం భవేత్।
సాధుభ్యోయత్కృత్యంపుణ్యం స్వస్యదుఃఖవారంభవేత్। ౭౭

తా॥ సత్పురుషులకు పాపకృత్యములు చేసినయెడల తనకు దుఃఖకరమైనదియు సత్పురుషులకు పుణ్యకార్యములను జేసినయెడల తనయొక్క దుఃఖమును బోగొట్టునదియు నగును.

శ్లో॥ ఉభయభ్రంశతామేతి పాపేభ్యోయత్కృతం భవేత్।
శర్కరామిశ్రితం క్షీరం క్షుద్రచేయనివేదితమ్।
విషవృద్ధికరందృష్ట మేవం పాపకరంభవేత్॥

తా॥ పాపాత్ములకు నుపకారము చేసినందువలన నిహలోక పరలోక సుఖములు రెండును నశించును. మరియు పంచదార కలిపి సర్పమునకు త్రాగనిచ్చిన విషమే వృద్ధియగునట్లుగా పాపము నే చేయును.

శ్లో॥ వదత్యేవం మునిసుతే శునీదుఃఖకరూపిణీ ।
పునశ్చుకోశోర్ధ్వముఖీ తత్పితే బహుభాషిణీ ।
పద్మబంధో పరిత్రాహి శునీంత్వద్ద్వారవాసినీమ్ ।
త్వదుచ్ఛిష్టాశనీం నిత్యం త్వం పాహీతి పునః పునః॥ ౮౦

తా॥ ఈ ప్రకారము ఆ మునికుమారుడు దయారహితుండై పలుకగా నా శునకము మిక్కిలి దుఃఖముగలదియగుచు ఊర్ధ్వముగా ముఖముపెట్టి యఱచుచు ఆ మునీశ్వరుని తండ్రినిగురించి మొఱబెట్టినట్లు ఏడ్చుచు పలుకుచున్నది. ఓ పద్మబంధువా! నీ గృహద్వారమునందు నిత్యము కాచియుండి యెల్లపుడు మీ యుచ్ఛిష్టమునే తిని బ్రతుకుచున్నట్టి శునకమునగు నన్ను రక్షింపుము.

శ్లో॥ స్వపోష్యాయేహి వర్తంతే గృహస్థస్య మహాత్మనః ।
తేషాముద్ధరణం కార్యమితి వేదవిదాంమతమ్॥

తా॥ మహానుభావులగు గృహస్థులకు తమ సంరక్షణములో నున్నట్టివారిని తరియింపజేయవలయునని వేదవేత్తలగు మహానుభావుల యభిప్రాయమైయున్నది.

శ్లో॥ చాండాలా వాయసాశ్చైవ సారమేయాశ్చ నిత్యశః।
గృహస్థానాం దయాపాత్రం ప్రత్యహం బలిభోజనః ॥

తా॥ కాకులు కుక్కలు అపరిశుద్ధజంతువులైనను వానికి గృహస్థుడు నిత్యము బలులనిచ్చి భుజింపజేసి దయతో చూడవలయును.

శ్లో॥ అశక్తంనోద్ధరేత్పోష్యం రోగాద్యుపహతంయది ।
సోధఃపతేన్న సందేహ ఇతివేదవిదాంమతమ్ ॥

తా॥ రోగము మొదలగువానిచే నశక్తుడుగా నుండునట్టివానిని రక్షింపనివాడు నరకమునుపొందును. సందేహములేదు. ఈరీతి పెద్దల యభిప్రాయమైయున్నది.

శ్లో॥ కర్తారమేకం జగతాహికర్తా కృత్వాత్మనా పాతి
సమస్త జంతూన్ । దారాదిరూప వ్యపదేశతో
హరిస్తస్మాత్తదాజ్ఞా ఖలుపోష్య రక్షా ॥

తా॥ ప్రపంచసృష్టికర్తయగు విష్ణుమూర్తి భార్యా పుత్రాదులనెడు వ్యవహారముగల్పించి వారిని పోషించుటకు నొక యజమానిని కల్పించి తానే సమస్తజంతువులను రక్షించుచుండును. కాబట్టి ఆ యజమాని యాజ్ఞను పోషింపఁబడువారు ముఖ్యముగా ననుకూలురై యుండవలయును.

శ్లో॥ తాం పోష్యరక్షాం పరిహృత్య జంతుర్దైవేన క్లప్తాం
యది వర్తతే న్యధీః । సదైవదోగ్ధా సకలస్య హంతా
కీనాశలోకం నితరాం ప్రయాతి॥

తా॥ ఆ యజమాని సంరక్షణమును విడిచి యే జంతువులైనను దైవవశమున బుద్ధిచెడిపోయి మఱియొకవిధముగా సంచరించినయెడల అట్టిజంతువు దైవమునకు ద్వేషియై సమస్తసుకృతమును నశింపజేసికొని యమలోకమును ముఖ్యముగాపొందును.

శ్లో॥ కర్తవ్యత్వా ద్దయాళుత్వా ద్దీనాముద్ధర నిర్దయ ।
ఇతితస్యావచశ్శ్రుత్వా దుఃఖార్తాయాగృహే సుతం ।
నిశ్చక్రామ గృహాత్తూర్ణం పద్మబంధు ర్దయానిధిః।

తా॥ దయలేని యో బ్రాహ్మణుడా! నీవు చేయదగినవాడ వగుటవలనను నేను దయచూడదగినదాని నగుటవలనను నిన్ను వేడితిని కాబట్టి నన్ను తరియింపజేయుము. ఇట్లు దుఃఖముకలిగి పలికిన యా శునకముయొక్క వాక్యములను పద్మబంధువు గృహములోనుండి విని దయగలవాడై గృహమునుండి శీఘ్రముగా బయలువెడలి కుమారుడుండు ప్రదేశమునకు వచ్చెను.

శ్లో॥ కిమేతదితి తాంప్రాహ పుత్రిస్సర్వంన్య వేదయత్ ।
సతుపుత్రవచశ్శ్రుత్వా తమేవంప్రాహ విస్మితః॥ ౮౮

తా॥ అప్పుడా శునకమును యీ వృత్తాంతమేమియని పద్మబంధువు యడుగగా ఆయనకుమారుఁడా వృత్తాంతమునంతయు జెప్పెను. ఆ పద్మబంధువు కుమారుడు చెప్పిన ఆవిషయమును విని ఆశ్చర్యముగలవాడై కుమారునితో నిట్లు పలుకుచున్నాడు.

పద్మభంధుః॥ శ్లో॥ మమాత్మజకథంవాక్య మీదృశంవ్యాహృతంత్వయా
నసాధూనామిదంవాక్యం భవతీహ వరానన॥ ౮౯

తా॥ పద్మబంధువు చెప్పుచున్నాడు. శ్రేష్ఠమగు ముఖముగలవాఁడా! నా

యొక్క కుమారుడవై యుండియు నీ విరీతి మాటలను పలుకదగునా? ఇటువంటి సమయములో సత్పురుషులగువారలకు నిది తగినదికాదు.

శ్లో॥ ఆత్మసౌఖ్యకరాఃపాపా భవంతిపరిభావితాః।
పశ్యపుత్రజనాస్సర్వే పరోపకరణాయవై॥ ౯౦

తా॥ పాపాత్ములు తమ సౌఖ్యమును విచారించుకొని సుకృతమును బొంద కుందురు. ఓ కుమారుఃడా! సన్మార్గులగు యితరులందరును పరోపకారమునే జేయుచుందురు. నీవు చూచితివా?

శ్లో॥ శశీ సూర్యోద పవనో మేదినీ హుంతభుగ్జలం।
చందనం పాదపాస్సంతః పరోపకరణేస్థితాః॥ ౯౧

తా॥ చంద్రుడు, సూర్యుడు, వాయువు, భూమి, అగ్నిహోత్రము, జలము, మంచిగంధము, వృక్షములు, సత్పురుషులు యెల్లప్పుడు పరోపకారమును జేయుట యందుండినవి.

శ్లో॥ అస్థిదానం కృతంపుత్ర కృపయాహి దధీచినా।
దేవానాముపకారాయ జ్ఞాత్వా దైత్యాన్మహాబలాన్॥

తా॥ రాక్షసులు మహాబలము కలిగి దేవతలను బాధించుచుండగా నప్పుడు దేవతల యుపకారము నిమిత్తము తన శరీరముందుండు యెముకను దధీచి మహాముని దేవతలకు దయగలవాడై యిచ్చెను.

శ్లో॥ కపోతార్థే స్వమాంసాని శిబినాభూభుజాపురా।
ప్రదత్తాని మహాభాగ శ్యేనాయక్షుధితాయవై॥ ౯౩

తా॥ ఓ భాగ్యవంతుడా! పూర్వకాలమందు శిబిచక్రవర్తి గువ్వపిట్టను సంరక్షించుకొరకు ఆకలితోగూడియున్న డేగకు తన శరీరమాంసమును ఖండించియిచ్చి గువ్వపిట్టను కాపాడెను.

శ్లో॥ జీమూతవాహనో రాజా పురాసీత్క్షితిమండలే।
తేనాపిజీవితం దత్తం గరుడాయ మహాత్మనే।

తా॥ పూర్వమందు భూమండలములో జీమూతవాహనుడను రాజు గలఁడు. ఆ రాజు మహానుభావుడగు గరుత్మంతునకు తన ప్రాణమును సమర్పించెను.

శ్లో॥ తస్మాద్దయాళునా భావ్యం భూసురేణవిపశ్చితా ।
శుద్ధేవర్షతి దేవస్తు కిమశుద్ధే నవర్షతి ॥ ౯౭

తా॥ కాబట్టి విద్వాంసుడగు బ్రాహ్మణుడు దయాస్వభావము గలిగినవాడై యుండవలయును. మనస్సునందు పరిశుద్ధి కలిగినవాడిల భగవంతుడు అనుగ్రహించుచున్నాడు. మనశ్శుద్ధిలేనివారిని భగవంతుడనుగ్రహింపబోడు.

శ్లో॥ కిన్నదీపయతేచంద్ర శ్చండాలానాం గృహేసదా ।
తస్మాదహం శునీమేతాం యాచంతీంచ పునఃపునః ।
ఉద్ధరిష్యేనిజైః పుణ్యైః పంకమగ్నాంచగాం యథా ।
ఇతిపుత్రంనిరాకృత్య ప్రతిజజ్ఞే మహామతిః ॥ ౯౮

తా॥ చండాలురు పరిశుద్ధిలేనివారైనను వారి గృహములయందు చంద్రుడు యెల్లప్పుడు ప్రకాశించుటలేదాయేమి? కాబట్టి మాటిమాటికి యాచింపుచున్న ఈ శునకమునకు నేజేసిన పుణ్యములనిచ్చి బురదలోదిగబడిన ఆవునువలెనే రక్షించెదను అని విశేషబుద్ధిశాలియగు ఆ పద్మబంధువు కుమారుని తిరస్కరించి ప్రతిజ్ఞచేసెను.

శ్లో॥ తదాదత్తం మహాపుణ్యం ద్వాదశీదినసంభవం ।
శునిగచ్ఛ హరేర్ధామ నిర్ధూతాఖిల కల్మషా ॥ ౯౯

తా॥ అప్పుడా పద్మబంధువు ద్వాదశీదినంబున జేసిన సత్కార్యముల వలన గలిగిన విశేషపుణ్యమును దానికిచ్చి ఓ శునకమా! నీ పాపములన్నియు పోగొట్టుకొని విష్ణులోకమునకు వెళ్ళుమని పలికెను.

శ్లో॥ తద్వాక్యాత్సహసాభూప దివ్యాభరణభూషితా ।
విముచ్యజీర్ణం దేహంతు దివ్యరూపధరాశుభా ।
శతాదిత్యప్రభాజాతా సావిత్రీ ప్రతిమాయథా ।
జగామామంత్ర్యతం విప్రం ద్యోతయంతీదిశోదశ ॥ ౧౦౦

తా॥ ఓ రాజా! ఆ బ్రాహ్మణుడు యిట్లుపలికిన వెంటనే యా శునకము తన ప్రాతశరీరమును విడిచి శ్రేష్ఠమగు దేవతారూపములను ధరించి ప్రకాశించుచున్న యాభరణములం గలదియై నూర్గురు సూర్యకాంతులతో సమానముగా ప్రకాశించుచు రెండవ సావిత్రీదేవివలెనే యుండి ఆ బ్రాహ్మణునికడ్డ యనుజ్ఞవడసి పదిదిక్కులను ప్రకాశింపజేయుచు స్వర్గలోకమునకు వెళ్ళెను.

శ్లో॥ భుక్త్వాదివిమహాభోగాన్ పశ్చాజ్జాతా మహీతలే।
నరనారాయణాద్దేవా దూర్వాశీనామ నామతః॥ ౧౦౧

తా॥ ఆమె స్వర్గములో ననేకభోగముల ననుభవించి పిమ్మట భూలోకంలో దేవుడగు నరనారాయణునివలన బుట్టి యూర్వశియను పేరుతో ప్రసిద్ధికెక్కెను.

శ్లో॥ వైశాఖశుద్ధద్వాదశ్యాః ప్రభావేనవరాంగనా।
దేవానాంచప్రియాజాతా అప్సుస్త్వంచసాయయా॥

తా॥ శ్రేష్ఠమగు యీ చిన్నది వైశాఖశుద్ధ ద్వాదశీ మహాత్మ్యముచే దేవతలకు ప్రీతికరమైనదై దేవవేశ్యగా బుట్టెను.

శ్లో॥ యద్యోగిగమ్యం హుతభుక్ప్రకాశం వరంవరేణ్యం
పరమార్థరూపం। యాంప్రాప్య సంతోపిహియాంతి
మోహం తత్ప్రాపరూపంచ శునీహిదేపీ॥ ౧౦౩

తా॥ శునకస్వరూపమును విడిచి దేవతాస్వరూపమును బొందిన యీ చిన్నది యోగీశ్వరులచే పొందదగినదియు, అగ్నిహోత్రునివలెనే ప్రకాశించునదియు శ్రేష్ఠమైనదియు, కోరదగినదియు, జ్ఞానముగలవారైనను చూచినంతనే మోహముపొందదగినదియునగు పరమార్థస్వరూపమునగు సౌందర్యమును బొందెను.

శ్లో॥ పశ్చాత్సపద్మబంధుర్హి తాంతిథింపుణ్యవర్ధనీం।
లోకేప్రఖ్యాపయామాస మధుద్విట్ప్రాణవల్లభామ్॥

తా॥ అనంతర మా పద్మబంధువను మునీశ్వరుడు పుణ్యమును వృద్ధిబొందించునదియు, విష్ణుమూర్తికి ప్రీతికరమైనదియునగు పూర్వోక్తమైన వైశాఖశుద్ధ ద్వాదశియను తిథిని లోకములో ప్రకటింపజేసెను.

శ్లో॥ కోటీందు సూర్యగ్రహణాకాసా సమస్తరూపాధిక
పుణ్యరూపా। యజ్ఞైస్సమస్తై రతిరిచ్యమానా
ద్విజేనఖ్యాతా భువనత్రయేచ॥ ౧౦౪

తా॥ ఆ ద్వాదశీ తిథి కోటి సూర్యగ్రహణములు, చంద్రగ్రహణములకంటె నధికమైనదియగుచు అన్నిరూపములకంటె నధికమగు పుణ్యస్వరూపమగుచు సమస్త

యజ్ఞములకంటె నధికమైనదియగుచు మూడులోకములయందు ప్రకటింపఁజేయఁబడెను.

నారదాంబరీష సంవాదే శనిమోక్షప్రాప్తిర్నామ చతుర్వింశో
ధ్యాయస్సమాప్తః

---

## అథ పంచవింశోధ్యాయః

శ్రుతదేవః॥ శ్లో॥ యాస్తిస్రస్తిథయఃపుణ్యా అంతిమాశ్శుక్లపక్షకే।
వైశాఖమాసిరాజేంద్ర పౌర్ణిమాంతాశ్శుభావః॥

తా॥ శ్రుతదేవుఁడు చెప్పుచున్నాఁడు, ఓ రాజశ్రేష్ఠుఁడా! వైశాఖమాసశుద్ధ పక్షమందు త్రయోదశి, చతుర్దశి, పౌర్ణమి ఈ మూఁడుతిథులును పుణ్యకరములై శుభముల నొసంగును.

శ్లో॥ అంత్యాఃపుష్కరిణీసంజ్ఞా స్సర్వపాపక్షయావహాః।
మాధవేమాసియఃపూర్ణం స్నానంకర్తుం నచక్షమః।
తిథిష్వేతాసుస్నాయాత్పూర్ణ మేవఫలంలభేత్॥

తా॥ పైన చెప్పఁబడిన మూఁడుతిథులును పుష్కరిణియను పేరుగలదియై సమస్త పాపములను బోఁగొట్టుచున్నది మరియు వైశాఖశుద్ధ పూర్ణిమయందు స్నానమును జేయలేనివాఁడు యీ మూఁడుతిథులలో దేనియందు జేసినను సంపూర్ణమగు ఫలమును బొందఁగలఁడు.

శ్లో॥ సర్వేదేవాస్త్రయోదశ్యాం స్థితాజంతూన్పునంతిహి।
పూర్ణాయాస్సర్వతీర్థైశ్చ విష్ణునాసహసంస్థితా।
చతుర్దశ్యాంసయజ్ఞాశ్చ దేవాఏతాన్పునంతిహి॥ ౨

తా॥ సమస్తదేవతలును వైశాఖశుద్ధ త్రయోదశియందుండినవారలై సమస్త ప్రాణులను తరింపఁజేయుదురు. పూర్ణిమయందు సమస్తతీర్థములతోఁడను విష్ణువుతోఁడను గూడి తరింపఁజేయుదురు. ఈ దేవతలు చతుర్దశి తిథియందు యజ్ఞములతోఁగూడి యీ ప్రాణులను తరింపఁజేయుదురు.

శ్లో॥ బ్రహ్మఘ్నం హేసురాపంవా సర్వానేతాన్పునంతిహి।

ఏకాదశ్యాంపురాజజ్ఞే వైశాఖ్యామమృతం శుభమ్॥ ౭

తా॥ వైశాఖస్నానము బ్రహ్మహత్య చేసినవానిని కల్లుత్రాగినవానిని మరియు సమస్త పాపాత్ములను తరింపజేయుచున్నది. పూర్వము వైశాఖశుద్ధ యేకాదశి యందు అమృతము పుట్టింది.

శ్లో॥ ద్వాదశ్యాంపాలితంతచ్చ విష్ణునాప్రభవిష్ణునా।
త్రయోదశ్యాంసుధాం దేవాన్పాయయామాసవై హరిః॥

తా॥ సమర్థుండగు విష్ణుమూర్తిచే ఆ యమృతము సంరక్షింపబడినది. విష్ణుమూర్తి త్రయోదశీదినమందు ఆ యమృతమును దేవతలచే త్రాగించెను.

శ్లో॥ జఘానచచతుర్దశ్యాం దైత్యాన్ దేవవిరోధినః।
పూర్ణాయాం సర్వదేవానాం సామ్రాజ్యాప్తి ర్బభూవహ॥

తా॥ భగవంతుడు దేవతలకు విరోధులగు రాక్షసులను చతుర్దశియందు సంహరించెను. పూర్ణిమయందు దేవతలకు స్వర్గలోకాధిపత్యమును తిరిగి యిప్పించెను.

శ్లో॥ తతో దేవాస్సు సంతుష్టా ఏతాసాంచవరం దదుః।
తిసౄణాంచతిథీనాంవై ప్రీత్యోత్ఫుల్లవిలోచనాః।

తా। అనంతరము దేవతలు సంతోషించినవారలై ఆశ్చర్యమునుబొంది త్రయోదశి చతుర్దశి పూర్ణిమ ఈ మూడుతిథులకు వరములనిచ్చిరి.

శ్లో॥ ఏతావైశాఖమాసస్య తిస్రశ్చతిథయశ్శుభాః।
పుత్రపౌత్రాదిఫలదా నరాణాం పాపహానిదాః॥ ౯

తా॥ వైశాఖమాసములో నీ మూడుతిథులును శుభములనొసంగునవియు నరులకు పుత్రులు పౌత్రులు మొదలగు సంపత్తులను గలుగజేయుననియు పాపములను బోగొట్టునవియునై యున్నవి,

శ్లో॥ యోమాధవేత్వ సంపూర్ణే నస్నాతో మనుజాధమః।
తిథిత్రయేతు సంస్నాత్వా పూర్ణమేవఫలం లభేత్॥ ౧౦

తా॥ ఏ హీనుడైనను వైశాఖమాసములో ముప్పదిదినములయందు స్నానము చేయకపోయినను యీ మూడుదినములయందు స్నానముజేసినయెడల సంపూర్ణ ఫలమును బొందుచున్నాడు.

శ్లో॥ తిథిత్రయేవ్యకుర్వాణ స్నానదానాదికం నరః।
చాండాలీంయోనిమాసాద్య పశ్చాద్రౌరవమశ్నుతే। ౧౧

తా॥ ఏ మనుష్యుడైనను యీ మూడు తిథులయందు స్నానము దానము మొదలగువానిని జేయకుండెనేని అట్టివాడు చండాలజన్మమెత్తి పిమ్మట రౌరవమను నరకమును బొందుచున్నాడు.

శ్లో॥ ఉష్ణోదకేనయస్స్నాతి మాధవేచతిథిత్రయే।
రౌరవంనరకంయాతి యావదింద్రాశ్చతుర్దశ॥ ౧౨

తా॥ వైశాఖమాసములో ఈ మూడుతిథులయందు వేడినీళ్ళతో స్నానము జేసినవాడు ఇంద్రులుండునంత పర్యంతము పదునాలుగుమనువు లుండునంత పర్యంతము నరకమును బొందును!

శ్లో॥ పితౄన్ దేవాన్ సముద్దిశ్య దధ్యన్నంనదదాతియః।
పైశాచీం యోనిమాసాద్యం తిష్ఠత్యాభూతసంప్లవమ్॥

తా॥ ఆ దినములయందు పితృదేవతలఁగూర్చియు, దేవతలగూర్చియు పెరుగుతో గూడిన యన్నము నీయనివాడు పంచభూతములు నశించునంతపర్యంతము పిశాచజన్మమెత్తుచుండును,

శ్లో॥ ప్రివృత్తానాంచకామానాం మాధవేనియమేకృతే।
అవశ్యంవిష్ణుసాయుజ్యం యుజ్యతేనాత్ర సంశయః॥ ౧౪

తా॥ వైశాఖమాస వ్రతమును జేయువాడు కోరినకోర్కెల నిచ్చువాడుగా ముఖ్యముగా విష్ణుమూర్తియందైక్యము నొందుచున్నాడు. సందేహములేదు.

శ్లో॥ అమాసం నియమాసక్తః కుర్యాద్యదిదినత్రయే।
తేనపూర్ణ ఫలంప్రాప్య మోదతేవిష్ణుమందిరే॥

తా॥ వైశాఖమాసము నెలదినములును నియమముగానుండి ఆ మూడుదినములలోను దానములు జేసిన సంపూర్ణఫలమును బొంది జన్మాంతమున విష్ణులోకమును బొందె యానందెదరు.

శ్లో॥ యోవై దేవాన్ పితౄన్విష్ణుం గురుముద్దిశ్యమానవః।
నస్నానాదికరోత్యర్థా ముష్యశాపప్రదావయమ్॥ ౧౬

తా॥ వైశాఖమాసములో నెవఁడు దేవతలు, పితృదేవతలు, విష్ణువు, గురువు వీరిని గూర్చి స్నానము మొదలగు కర్మలను జేయఁడో వానినిగురించి యిట్లు శాపమిచ్చుచున్నాము.

శ్లో॥ నిస్సంతానో నిరాయుష్చ నిశ్శ్రీయస్కోభవేదితి।
ఇతిదేవావరందత్వా స్వధామానియయుఃపురా॥ ౧౭

తా॥ అట్లుచేయనివాఁడు సంతానములేనివాడుగాను, స్వల్పాయుర్దాయము గలవాడుగాను, శ్రీయస్సులేనివాడుగా నగును. అని దేవతలు పూర్వమందు పలికి వారి స్థానములకు వెళ్ళిరి.

శ్లో॥ తస్మాత్తిథిత్రియంపుణ్యాం సర్వాఘౌఘవినాశనం।
అంత్యపుష్కరిణీసంజ్ఞం పుత్రపౌత్రప్రవర్ధనమ్॥ ౧౮

తా॥ ఆ కారణమువలన ఆ మూడుతిథులును అంత్యపుష్కరిణి యను పేరుతో ప్రసిద్ధికెక్కి పుణ్యాకరమై సమస్తపాపములను బోగొట్టునవియై పుత్రులు పౌత్రులు మొదలగువారిని వృద్ధిపొందించునవియై యున్నవి.

శ్లో॥ యానారీసుభగాసూప పాయసం పౌర్ణమీదినే॥
బ్రాహ్మణాయస కృద్దత్వా కీర్తిమంతం సుతంలభేత్॥ ౧౯

తా॥ పౌర్ణమిదినమందు బ్రాహ్మణునకు సూపము పరమాన్నములతో భోజనము పెట్టిన స్త్రీ కీర్తిగల తనయుని గనును.

శ్లో॥ గీతాపాఠం తుయఃకుర్యా దంతిమేచదినత్రయే।
దినేదినేశ్వమేధానాం ఫలమేతి నసంశయః॥ ౨౦

తా॥ త్రయోదశి మొదలు మూడుదినములయందు భగవద్గీతాపారాయణమును జేసినవాడు ప్రతిదినమందు అశ్వమేధమును జేసిన ఫలమును బొందుచున్నాడు. సందేహములేదు!

శ్లో॥ సహస్రనామపఠనం యఃకుర్యాచ్చ దినత్రయే।
తస్యపుణ్యఫలంవక్తుం కశ్శక్తోదివివాభువి॥ ౨౧

తా॥ ఆ మూడుదినములలో సహస్రనామ పారాయణమును జేసినవాని ఫలమును జెప్పుటకు సమర్థులగువారు భూలోకములోను స్వర్గలోకములోను లేరు.

శ్లో॥ సహస్రనామభిర్దేవం పూర్ణాయాం మధుసూదనం।
పయసాస్నాప్యవై యాతి విష్ణులోకమకల్మషమ్॥ ౨౨

తా॥ పూర్ణిమయందు విష్ణుమూర్తిని పాలతో స్నానము జేయించి సహస్ర నామములతో పూజించినయెడల పాపరహితమగు విష్ణులోకమును బొందుచున్నాడు.

శ్లో॥ సమస్తవిభవైర్యస్తు పూజయేన్మధుసూదనం।
నతస్యలోకాఃక్షీయంతే యుగకల్పాదివ్యత్యయే॥ ౨౩

తా॥ ఏ మనుష్యుడు తనకున్నట్టి వైభవముతోలదియు విష్ణుమూర్తిని పూజించునో వానియొక్క పుణ్యలోకములు యుగములు, కల్పములు నశించినప్పటికిని నశింపకుండును.

శ్లో॥ అస్నాత్వాచాప్యదత్వాచ వైశాఖశ్చగతోయది।
సబ్రహ్మహాగురుఘ్నశ్చ పితౄణాంఘాతుకస్తథా॥ ౨౪

తా॥ ఎవఁడు వైశాఖములో స్నానము జేయకయును, దానములనీయకయును వెళ్ళబుచ్చునో వాడు బ్రహ్మహత్యయు, గురుహత్యయు, పితృహత్యయు జేసినవాఁడుగా జెప్పబడుచున్నాడు.

శ్లో॥ శ్లోకార్థం శ్లోకపాదంవా నిత్యం భాగవతోద్భవం।
వైశాఖేచ పఠన్మర్త్యో బ్రహ్మత్వం చోపపద్యతే॥ ౨౫

తా॥ వైశాఖమాసములో నిత్యము భగవత్కథగల శ్లోకమునుగాని అర్ధశ్లోకమునుగాని, పాదశ్లోకమునుగాని పఠించిన మనుష్యుడు బ్రహ్మపదవిని బొందును.

శ్లో॥ యోవై భాగవతంశాస్త్రం శృణోత్యేతద్దినత్రయే।
నపాపైర్లిప్యతేక్వాపి పద్మపత్రమివాంభసా॥ ౨౬

తా॥ ఆ మూడుదినములలోను భగవత్సంబంధమగు శాస్త్రమును వినినవానికి పాపములు తామరాకును జలము అంటనట్లుగానే స్పృశించనేరవు.

శ్లో॥ దేవత్వం మనుజైః ప్రాప్తం కైశ్చిత్సిద్ధత్వమేవవా।
కైశ్చిత్ప్రాప్తో బ్రహ్మభావో దినత్రయనిషేవణాత్॥ ౨౭

తా॥ వైశాఖమాసములో ఆమూడుదినములయందు స్నానాదులచే సేవించుట వలన కొందరు మనుష్యులు దేవత్వమునుబొందిరి! కొందరు అణిమాదిసిద్ధులు గల

వారైరి. మరికొందరు బ్రహ్మస్వరూపమును బొందినవారైరి.

శ్లో॥ బ్రహ్మజ్ఞానేనవైముక్తిః ప్రయాగమరణేనవా ।
అథవామాసివైశాఖే నియమేనజలాప్లుతే॥ ౨౮

తా॥ బ్రహ్మజ్ఞానమువలనను ప్రయాగక్షేత్రమునందు మరణించినను ముక్తి కలుగును. లేక వైశాఖమాసములో వ్రతనియమముకలిగి ప్రాతఃకాలంబున స్నానం చేసినను ముక్తికలుగును.

శ్లో॥ నీలంవృషభం సముత్సృజ్య వైశాఖ్యాంచజలాప్లుతః ।
సమస్తబంధనిర్ముక్తః పుమర్థాన్యాతిసర్వదా॥ ౨౯

తా॥ నల్లని వృషభమును వృషోత్సర్జనము చేసినను వైశాఖమాసంలో స్నానం చేసినను సమస్తకర్మబంధములను విడగొట్టుకొని ధర్మార్థ కామమోక్షములను బొందుచున్నాడు.

శ్లో॥ గాంసవత్సాం ద్విజేంద్రాయ సీదతేచకుటుంబినే ।
ఇహాపమృత్యుర్నిర్ముక్తః పరత్రచపరంవ్రజేత్॥ ౩౦

తా॥ దరిద్రుడగు బ్రాహ్మణునకు దూడతో గూడ గోదానము చేసినయెడల అపమృత్యువును బొట్టుకొని జన్మాంతరము ఉత్కృష్టమగు స్థానమును బొందును.

శ్లో॥ స్నానదానవిహీనస్తు వైశాఖంచైవయోనయేత్ ।
శ్వానయోనిశతం ప్రాప్యవిష్టాయాం జాయతేక్రిమిః॥ ౩౧

తా॥ ఎవడు వైశాఖమాసములో స్నానము చేయకను, దానముల నియ్యకను వెళ్ళబుచ్చునో వాడు నూరుజన్మములపర్యంతము శునకజన్మమెత్తుచు, అపరిశుద్ధ పదార్థములయందు పురుగుగా బుట్టుచుండును.

శ్లో॥ త్రిసకోట్యర్ధకోటీశ్చ తీర్థానిభువనత్రయే ।
సంభూయమంత్రయాంచక్రుః పాపసంఘాతశంకితాః॥ ౩౨

తా॥ భూలోకములో నుండునట్టి మూడుకోట్ల యేబదిలక్షల తీర్థములు కలసి తమను సంభవించెడు పాపమును గూర్చి యిట్లుఆలోచనచేసుకొన్నవి.

శ్లో॥ జనాఅస్మానుపాప్రిష్ఠా విసృజంతిస్వకం మలం ।
తదస్మాకంకథంగచ్ఛే దితిచింతాసమన్వితాః ।

తీర్థపాదం హరింజగ్ముశ్శరణ్యంశరణం విభుం ।
స్తుత్వాచబహుభిస్తోత్రైః ప్రార్థయామాసురంజసా॥ 34

తా॥ ఓ తీర్థములారా! పాపాత్ములగు మనుష్యులు మనయందు స్నానము చేసి తమ సంబంధమగు పాపమును మనకు విడిచిపెట్టుచున్నారు. కాబట్టి అట్టిమనకు సంభవించిన పాపము మనము యెచ్చటికి వెళ్ళి ఏమిపరిహారోక్తి చేసికొనిన నశించు నని విచారముగలవారై సమస్తతీర్థములు పాదమునందు గలవాడును, రక్షకుండును సమస్తుండునగు విష్ణుమూర్తిని శరణుపొంది ననేకస్తోత్రములచే పొగడిరి.

శ్లో॥ దేవదేవ జగన్నాథ సర్వాఘౌఘవినాశన ।
జనాఖస్మాసుపాపిష్ఠా స్నాత్వాపాపాని సర్వశః॥ 35
విసృజ్యత్వత్పదంయాంతి త్వదాజ్ఞాధారిణోభువి ।
అస్మాకంచైవతత్పాపం కథంగచ్ఛేజ్జనార్దన॥ 36

తా॥ దేవతలకందరకును దేవుడవును ప్రపంచమునకధిపతివియు, సమస్త పాపములను నశింపజేయువాడవునగు ఓ విష్ణుమూర్తీ! పాపాత్ములగు జనులు మా యందు స్నానముజేసి వారి పాపమును మాయందు విడిచిపెట్టి నీ యాజ్ఞాప్రకారము నడచుకొనుచు శ్రేష్ఠమగు నీ స్థానమును బొందుచున్నారు. మాకు సంక్రమించిన వారి పాపము మమ్మునే రీతి విడుచును?

శ్లో॥ తదుపాయం వదార్థినాం త్వత్పాదశరణైషిణాం ॥
ఇతితీర్థైః ప్రార్థితస్తు భగవాన్భూతభావనః ।
ప్రహసన్ ప్రాహతీర్థాని మేఘగంభీరయాగిరా।

తా॥ నీ పాదములనే రక్షకములనుగా నమ్మియుండి కోరుచున్న మాకు తగిన యుపాయమును జెప్పుమని ప్రార్థించి తీర్థములడుగగా సమస్తభూతములచే సన్మానింపఁబడువట్టియు భగవంతుఁడగు విష్ణుమూర్తి నవ్వుచు మేఘధ్వనులతో సమానమగు వాక్యములతో నిట్లు చెప్పుచున్నాడు.

శ్రీభగవానుః॥ శ్లో॥ సితేపక్షే మేషసూర్యే వైశాఖాంతే దినత్రయే ॥
సర్వతీర్థమయేపుణ్యే మమాపి ప్రాణవల్లభే ।
యాయంభగోదయాత్పూర్వం బహిస్సంస్థజలాప్లుతాః ।

విముక్తాఘాః పుణ్యరూపా భవంత్యాశువినిర్మలాః॥

తా॥ భగవంతుఁడు చెప్పుచున్నాఁడు. సూర్యుఁడు మేషరాశియందుండగా శుక్లపక్షములో సమస్త తీర్థస్వరూపములగునవియు, నాకు మిక్కిలి ప్రియమైనవియు త్రియోదశి మొదలు మూడు తిథులయందును సూర్యోదయముకంటె ముందుగా గ్రామమునకు వెలుపలనుండు జలములయందు స్నానముచేసిన మీరు శీఘ్రముగా పాపములవలన విడువబడినవారై నిర్మలులగుచు పుణ్యస్వరూపులు కాగలరు.

శ్లో॥ భవద్భిశ్చవిముక్తాఘై ర్యేనస్నాతా దినత్రయే ।
తేషుతిష్ఠతుతత్పాపం జనైర్యుష్మద్వి రేచితం ।
ఇతితీర్థపదోవిష్ణు స్తీర్థానాంచవరందదౌ॥ ४१

తా॥ మీరు పాపములవలన విడువబడినవారగుచుండగా జనులు మీయందు విడువబడిన పాపము మీరు ఆ మూడుదినములయందు ఏ జలములయందు స్నానము చేసిన ఆ జలములయందు మీ పాపము సంక్రమించును. ఈ ప్రకారము చెప్పి పాదములయందు తీర్థములుగల విష్ణుమూర్తి తీర్థములకు వరమునిచ్చెను.

శ్లో॥ అనుజ్ఞాప్యచతాన్యోగా త్తత్రై వాంతరధీయత ।
స్వధామాని పునఃప్రాప్య తానితీర్థాని సర్వశః ।
ప్రతివర్షేతు వైశాఖే తద్వై వాంత్య దినత్రయే ।
తేనాఘౌఘం విముచ్యైవ యాతివర్మలతామహో॥ ४3

తా॥ ఆ భగవంతుడిట్లుపలికి ఆ తీర్థములకు అనుజ్ఞనిచ్చి తాను యోగము నవలంబించి యంతర్ధానమాయెను. ఆ తీర్థములును వారి వారి స్థానములకు వెళ్ళి ప్రతి సంవత్సరము వైశాఖమాసములో ఆ మూడుతిథులలోను స్నానముజేసి మనుష్యుల స్నానములవలన తమకు గలిగిన పాపములను బోగొట్టుకొని నిర్మలస్వరూపులగుచున్నారు. కాబట్టి మిక్కిలి ఆశ్చర్యకరమైనది.

శ్లో॥ యేతుస్నానంకుర్వంతి వైశాఖాంత దినత్రయే ।
తేభవంతు సమస్తానాం జనానాంపాతకాశ్రియాః॥ ४४

తా॥ వైశాఖశుద్ధ త్రయోదశి మొదలు మూడుతిథులలో నే తీర్థములు స్నానము జేయబడవో ఆ తీర్థములు సమస్తజనులయొక్క పాపములను పరిహరించలేవు.

శ్లో॥ ఇతిశాపంచ తీర్థానాం హ్యస్నాతానాం దదాతిచ ।
నతేనసదృశః పాపో యోనస్నాతో దినత్రయే॥ ४४

తా॥ ఈ ప్రకారము ఆ మూడుతిథులలోను స్నానముచేయనివానికి శాపమిచ్చెను. కాబట్టి ఆ మూడుతిథులలో స్నానముచేయనివాని పాపముతో సమానమగు పాపము మరియొకటిలేదు.

శ్లో॥ విచారితేషు శాస్త్రేషు నదృష్టో నచవైశ్రుతః ।
తస్మాద్దినత్రయేకార్యం స్నానదానార్చనాదికమ్॥ ४८

తా॥ శాస్త్రములనన్నియు విచారింపగా దీనితో సమానమైనది యింకొకటి లేదుగాన ఆ మూడుదినములలో స్నానదానములు ముఖ్యముగా చేయవలయును.

శ్లో॥ అన్యథా నరకంయాతి యావదింద్రాశ్చతుర్దశ ।
ఇత్యేతత్సర్వమాఖ్యాతం శ్రుతకీర్తే మహామతే॥ ४२

తా॥ ఈ ప్రకారము చేయనియెడల పదునాలుగు ఇంద్రులుండునంతకాలము నరకములోనుండును. విశేషబుద్ధిశాలివగు ఓ శ్రుతకీర్తిమహారాజా! ఈ ప్రకారము వైశాఖమాహాత్మ్యమునంతయు చెప్పితిని.

శ్లో॥ పృష్టం వైశాఖమాహాత్మ్యం యథాదృష్టం యథాశ్రుతం ।
మాహాత్మ్యస్యచలేశోయం మాధవస్యచవర్ణితః॥ ४౮

తా॥ నీవు అడిగిన వైశాఖధర్మమును నేను చూచినంతలోను వినినంతలోను చెప్పితిని. మఱియు దీనియందు వైశాఖమాహాత్మ్యమును, విష్ణుమూర్తి మాహాత్మ్యమును జెప్పబడెను.

శ్లో॥ కార్త్స్న్యేనవక్తుంబ్రహ్మాణాపి నాలంవర్ష శతైరపి ।
పురాకైలాసశిఖరే పార్వత్యైశంకరస్స్వయమ్॥
ఆహమాధవమాహాత్మ్యం పృచ్ఛత్యై శతవత్సరం ।
తచ్చాపినాంతి మగమదశక్తో విరరామహా॥ ౫౦

తా॥ విష్ణుప్రీతికరమైన వైశాఖమాహాత్మ్యమును బ్రహ్మదేవుడు నూరుసంవత్సరములపర్యంతము చెప్పినను సమర్థుడుకాడు. మరియు పూర్వకాలమందు కైలాసపర్వతనివాసులగు పార్వతీపరమేశ్వరులు విహరించుచుండగా వొకప్పుడు పార్వతీ

దేవి వైశాఖధర్మములను చెప్పమని సాంబమూర్తినడిగెను. అప్పుడు సాంబమూర్తి చెప్ప నారంభించి నూరుసంవత్సరముల పర్యంతము చెప్పినను సంపూర్తి నొందకుండు టచే పిమ్మట విసిగి చాలించెను.

శ్లో॥ కోనువర్ణఇతుంశక్తః కార్త్స్న్యేన్మాహాత్మ్యముత్తమం।
వినావిష్ణుం జగన్నాథం నారాయణమనామయమ్। ౫౧

తా॥ ప్రపంచమునకు నధిపతియును, నాశరహితుఁడునగు విష్ణుమూర్తిగాక మిగిలినమరెవరైనను వైశాఖమహాత్మ్యమును సంపూర్తిగా చెప్పుటకు సమర్థులుకారు.

శ్లో॥ పురాసర్వేపిఋషయో మాహాత్మ్యం పాపనాశనం।
లేశంచలేశం వ్యాచఖ్యుర్జనానాం హితకామ్యయా॥ ౫౨

తా॥ పూర్వమందు సమస్త మునీశ్వరులు జనులకు మేలుచేయ నిశ్చయించి పాపములను నశింపజేయునట్టి వైశాఖమాహాత్మ్యమును యెంత సూక్ష్మముగనున్నను విరళముగా చెప్పి ప్రకటనచేసిరి.

శ్లో॥ నాతఃకేనాపివ్యాఖ్యాతే వ్యాశక్తత్వాన్మహీపతే।
త్వంచమాసేతువైశాఖే కరుదానాది సత్క్రియాః।
తేనభుక్తించ ముక్తించ సంప్రాప్స్యసి నసంశయః॥

తా॥ ఓ రాజా! సమర్థత లేకపోవుటచే యింతకంటె మరెవరిచేతను విస్తరించి చెప్పఁబడలేదు. వైశాఖమాసములో నీవు స్నానదానాది సత్కారములను చేసిన యెడల భుక్తిని ముక్తిని పొందగలవు.

శ్లో॥ ఇతితంబోధయిత్వాచ మైథిలం జనకాహ్వయం।
శ్రుతదేవస్తమామంత్ర్య గంతుంచ క్రేమనోగతిమ్॥

తా॥ ఈ ప్రకారము శ్రుతదేవుడను బ్రాహ్మణుడు మిథిరాధిపతియగు జనక మహారాజునకు వైశాఖధర్మములను చెప్పి యా రాజావలన ననుమతివడసి మనోవేగ ముతో వెళ్ళనిశ్చయించెను

శ్లో॥ జాతాహ్లాదస్సరాజర్షి ర్గళద్బాష్పాకులేక్షణః।
ఉత్సవంకారయామాస స్వామిన్యృద్ధే మనోరమమ్॥

తా॥ అంతట నా రాజోత్తముడు సంతుష్టాంతరంగుడై కండ్లనుండి యానంద

బాష్పములు స్రవించుచుండగ తనకు నధికఫలము సంభవించుటకు సర్వజనులకు నానందకరమైన యుత్సవమును జేయించెను.

శ్లో॥ గ్రామం ప్రదక్షిణీకృత్య శిబికామధిరోపత్యం ।
చతురంగబలై ర్యుక్త స్స్వయంపృష్ఠమధాన్వగాత్ ।

తా॥ పిమ్మట నామునీశ్వరుని సవారీలో గూర్చుండబెట్టి తాను చతురంగబలములతో గూడ ఆయన వెనుక నడచుచు గ్రామంలో ప్రదక్షిణగా నూరేగించెను.

శ్లో॥ పునశ్చాంతఃపురం ప్రాప్య సకలై ర్విభవై రపి ॥
వస్త్రైరాభరణై శ్చైవ గోభూతిలహిరణ్యకైః
ప్రణమ్యచపరిక్రమ్య తస్థౌప్రాంజలింగ్రతః॥ ౫౮

తా॥ తిరిగి తనగృహమునకు తీసికొనివచ్చి సింహాసనమున గూర్చుండబెట్టి యా మునీశ్వరుని పూజించి తన భాగ్యమునను సరించి వస్త్రములు, ఆభరణములు, గోవులు, భూమి, తిలలు, బంగారము మొదలగు దానములను యితర బ్రాహ్మణులకు దానములనిచ్చి యా మునీశ్వరుని చుట్టు తిరిగి నమస్కారమునుచేసి ఆయన యెదుట నిలబడియుండెను.

శ్లో॥ తతస్తుసమహా తేజా శ్శ్రుతదేవో మహాయశాః ।
• సంతుష్టః పరమప్రీతో యయౌ తామస్వాశ్రమం మునిః। ౫౯

తా॥ అనంతరము విశేషకాంతిగలవాడును, విశేష కీర్తిగలవాడును నగు ఆ శ్రుతదేవమహాముని సంతోషించి మిక్కిలి యానందముగలవాడై తన స్వస్థానమునను వెళ్ళెను.

నారదః। శ్లో॥ ఇత్యేతత్పర మాఖ్యాన మంబరీషతపోదితం ।
శ్రవణాత్సర్వపాపఘ్నం సర్వసంపద్వివర్ధాయకం ।
తేనభుక్తించ ముక్తించ జ్ఞానం మోక్షంచవిందతి॥

తా॥ నారదుడు చెప్పుచున్నాడు ఓ అంబరీషమహారాజా! ఈ ప్రకారము వినినంత నే సమస్తపాపములను బోగొట్టునదియు, సమస్త సంపత్తులను వృద్ధిబొందించునదియు శ్రేష్ఠమగు నీ వైశాఖమాహాత్మ్యమును నీకు చెప్పితిని. కాబట్టి యా

వ్రతమును జేసినవాడు భుక్తిని, ముక్తిని, జ్ఞానమును మోక్షమును పొందుచున్నాడు.

శ్లో॥ ఇతితస్యవచశ్శ్రుత్వా అంబరీషో మహాయశాః।
పరిహృష్టాంతరవృత్తిశ్చ బాహ్యావ్యాపార వర్జితః ।
ప్రణనామ తథామూర్ధ్నా దండవత్ప్రతితోభువి।

తా॥ ఈ ప్రకారము నారదుడు చెప్పిన వాక్యములను విశేషకీర్తిశాలియగు అంబరీషమహారాజు విని హృదయమునందు విశేషయానందము గలుగుటచే మైమరచి బాహ్యావ్యాపారములను విడిచి ఆ నారదునిచుట్టు తిరిగి సాష్టాంగ దండప్రణామము జేసెను:

శ్లో॥ విభవైరఖిలైశ్చాపి పూజయామాసతంపునః ।
సంపూజిత స్తమామంత్ర్య నారదోభగవాన్మునిః ।
లోకాంతరంయయాధీమాం చ్ఛాపానైకత్రిసంస్థితిః॥

తా॥ అంబరీషమహారాజు తనకుండు వైభవముతోలది ఆ నారదమునీశ్వరుని పూజింపగా పిమ్మట నారదుడు శాపకారణమున నొక్కప్రదేశమునందును నిలిచియుండువాడు కానందున మరియొకలోకమునకు వెళ్ళెను.

శ్లో॥ అంబరీషోపిరాజర్షి ర్నారదోక్తానిమాంచ్ఛుభాన్ ।
ధర్మాన్కృత్వా విలీనో భూత్పరేబ్రహ్మణి నిర్గుణే॥ • ౬౮

తా॥ శ్రేష్ఠుడగు అంబరీషమహారాజు నారదునిచే చెప్పబడినవియు, శుభముల నొసంగునట్టియునగు వైశాఖధర్మములను జేసి అనంతరము గుణశూన్యమగు పరబ్రహ్మమునందు ఐక్యమునుబొందెను.

సూతః॥శ్లో॥ యఇదంపరమాఖ్యానం పాపఘ్నం పుణ్యవర్ధనం ।
శృణుయాద్వాపఠేద్వాపి సయాతిపరమాంగతిమ్।। ౬౯

తా॥ సూతమునీశ్వరుడు చెప్పుచున్నాడు. పాపములను పోగొట్టునదియు పుణ్యములను వృద్ధిపొందించునదియు నగు యీ యుత్తమ వైశాఖమాహాత్మ్యమును వినినవాడును, చదివినవాడును యుత్కృష్టస్థానమును బొందగలడు.

శ్లో॥ లిఖితంపుస్తకం యేషాం గృహేతిష్ఠతిమానద ।

తేషాంముక్తిఃకరస్థాహి కిముతచ్ఛ్రవణాత్మనామ్॥ ౭౭

తా॥ ఈ వైశాఖమాహాత్మ్యమును వ్రాయబడిన పుస్తకము యెవరి గృహ ములో నుండునో వారికి ముక్తి సులభముగా లభించును. ఈ మాహాత్మ్యమును వినినవారును ముక్తిని సులభముగా బొందుదురని చెప్పనక్కరలేదు.

ఇతిశ్రీ స్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీష
సంవాదే ఫలశ్రుతికథనం నామ
పంచవింశోధ్యాయ స్సమాప్తః

గ్రంథం సంపూర్ణం

—:o:—

ఏతత్ఫలం శ్రీకృష్ణార్పణమస్తు



చ. ల. కు. ను. ల. మ. మ.

# నూతన గ్రంథముల ప్రకటన.

---

1. కార్త్తికపురాణం (పద్మపురాణాంతర్గతము శ్లోక తాత్పర్య సహితము. 2_0_0
2. వైశాఖపురాణం (స్కాందాంతర్గతము శ్లోకతాత్పర్యసహితము ఈ గ్రంథము ఇప్పుడేతయారైనది వెంటనే వ్రాసి తెప్పించుకొనగలరు. 5–0–0
3. శ్రావణమాసపురాణం ... ... ... 1–4–0
4. ధనుర్మాసపురాణం. ... ... ... 0–6–0
5 చైత్రమాసపురాణం ... ... ... 0–12–0
6. శ్రీసత్యనారాయణ వ్రతకల్పము•(9) అ. ఇందులో శ్రీసత్యనారాయణాష్టోత్రము: శ్రీసత్యనారాయణ సహస్రనామములు మొదలగునవి చేర్చి ఇప్పుడే తయారైనది. 1–4–0
7. ఉమామహేశ్వరపూజా 0–5–0
8. నిత్యశివాలయార్చన దేవీపూజా 0–6–0
9. శ్రీసూక్తవిధానము ఇందు లలితా సహస్రనామములు త్రిశతి దేవీఖడ్గమాల వగైరాలుండును. 0–12–0
10. శ్రీ వేంకటేశ్వర దీపారాధనవ్రతము ఇందు వేంకటేశ్వర సహస్రనామములు వగైరాలుండును 0–6–0
11. పాచికప్రశ్న గొప్పగ్రంథము. 0–8–0
12 సస్యానందము (సస్యఫలములుండును) 0–4–0
13. మానసికలకోటా ప్రశ్న చింతామణి ఈ గ్రంథమందు 313 ప్రశ్నలుగల గ్రంథము ఎవరికివారు అతిసులభముగ ప్రశ్నలు చెప్పవచ్చును. 1–4–0
14. స్మార్తశైవాగమ ప్రయోగము ఈ గ్రంథములో రెండు భాగములు చేర్చబడినవి లోగడ ఈ గ్రంథమునకు వ్రాసినప్పుడు మాదగ్గర లేదు ఇప్పుడే తీరియున్నది 2–8–0
15. వ్రతరత్నమహోదధి తా॥ సహితము 6–8–0